*This book sponsered by*



శ్రీ బాణాల ముత్యం రెడ్డి

శ్రీమతి బాణాల రుక్మిణీదేవి

నెర్మట గ్రామం, నల్గొండ జిల్లా



# నివేదిత

ప్రముఖుల ఆధ్యాత్మిక అనుభవాలు

**తిప్పావఝ్ఝుల కుమార్**

రామప్రియ ప్రచురణలు

# NIVEDANA

*SPIRITUAL EXPERIENCES OF 81 CELEBRITIES*

by

TIPPAVAJJHULA KUMAR



FIRST EDITION
APRIL 2014

PUBLISHER
RAMAPRIYA PUBLICATIONS
PLOT: 39, INDRAPURI RLY. COLONY
WEST MARREDPALLI
SECUNDERABAD - 500026
WWW.ASTROLOGYICON.COM
99854 42000

DRAWINGS AND COVER
SRI PINISETTY

LAYOUT
B. SUBRAMANYAM

For Copies :
T. KUMAR
PLOT: 39, INDRAPURI RLY. COLONY
WEST MARREDPALLI
SECUNDERABAD - 500026
9985442000

PRINTED AT
Samhita Graphics
7-1-548, Beside: Hanuman Temple
Ameerpet, Hyderabad-500 016.

PRICE : Rs.$5



ఆంధ్రజ్యోతి మేనేజింగ్ డైరెక్టర్

**శ్రీ వేమూరి రాధాకృష్ణ గారు**

డైరెక్టర్

**శ్రీమతి కనకదుర్గ గారికి**

## అంకితం

# నా నివేదన

తెలుగు పత్రికల్లో భక్తి, ఆధ్యాత్మిక అంశాలకు పెద్దగా స్థానం లేని రోజులవి. ఇన్ని భక్తి ఛానళ్లు వస్తాయనే ఆలోచన కూడా ఎవరూ చేయని రోజులు. ఆ స్థితిలో.. 2004 లోనే.. తెలుగు జర్నలిజంలో తొలిసారిగా, ఆధ్మాత్మిక అంశాలపై ప్రతి శుక్ర వారం రెండు పేజీల ప్రత్యేక ఫీచర్‌కు శ్రీకారం చుట్టారు ఆంధ్రజ్యోతి మేనేజింగ్ డైరెక్టర్ వేమూరి రాధాకృష్ణగారు. వారి సాహసోపేత సంకల్పానికి లక్షలాది మంది తెలుగు పాఠకులు మురిసిపోయారు. ఆత్మానందాన్ని కలిగించే సమాచారం అందు కుని మైమరచిపోయారు. ఆ తరువాత దాదాపు అన్ని పత్రికలూ ఆధ్యాత్మిక శీర్షికలు ప్రారంభించాయి. ప్రత్యేకంగా భక్తి, ఆధ్యాత్మిక ఛానళ్లే వచ్చాయి. అయినా నివేదన నివేదనే. అందుకు కారకులైన వేమూరి రాధాకృష్ణగారికి నమస్సులు.

నా ఛాదస్తం నుంచి నన్ను పక్కకు లాగి, అనుక్షణం వెన్నంటి నడిపించి, భక్తి, ఆధ్యాత్మికతలకు ఆధునిక స్పర్శను అందించారు ఆంధ్రజ్యోతి సంపాదకులు డాక్టర్ కె. శ్రీనివాస్ గారు. నాస్తికులు కూడా ఒక్కక్షణం ఆగి, దీని సంగతేంటో చూద్దాం అను కునేలా ఈ ఫీచర్‌ను మలిచారాయన. ఆయన అందించిన ఆత్మీయ సహకారం చిరస్మరణీయం.

ఆ పరమాత్మ గురించి నాలుగు మాటలు చెప్పండి ... అని ప్రశ్నించగానే ఎన్ని దీర్ఘాలోచనలు.. ఎన్ని అంతర్మథనాలు..ఎన్ని నిర్వచనాలు.. ఎన్ని తాదాత్మ్యాలు... ఎన్ని పరవశాలు.. ఎన్ని కన్నీళ్లు... ఎన్ని నివేదనలు? ఆధ్యాత్మికం, సినిమా, రాజ కీయాలు.. ఇలా విభిన్న రంగాలకు చెందిన ప్రముఖులను పలకరించి, వారి అంతరంగంలోని ఆధ్యాత్మను ఆవిష్కరించే అవకాశం లభించడం నా భాగ్యం. 2004 అక్టోబర్ నుంచి 2008 వరకు, ఆ తరువాత అప్పుడప్పుడు ఆంధ్రజ్యోతి నివేదన ఫీచర్‌లో అంతరంగం శీర్షికన చేసిన ఇంటర్వ్యూలకు పుస్తకరూపం ఇది.

ఇంతమంది ప్రముఖుల్ని కలిసి, వారి ఆధ్యాత్మిక ప్రయాణానికి అక్షరరూపం ఇవ్వ డంలో మిత్రులు ఎన్.సూరి, ఎం. రచన, పి. గిరి అందించిన సహకారం మరువ లేనిది. వీరితోపాటు పలువురు ఆంధ్రజ్యోతి ప్రతినిధులు చేసిన అమూల్యమైన కొన్ని ఇంటర్వ్యూలను కూడా ఈ పుస్తకంలో పొందుపరుస్తున్నాను. ఇంటర్వ్యూలు చేయడంలో, వాటికి పుస్తకరూపం ఇవ్వడంలో సహకరించిన ఆంధ్రజ్యోతి మిత్రులం దరికీ నా కృతజ్ఞతాభివందనాలు.

పుస్తకం వేయాలనగానే నేనున్నానంటూ ముందుకు వచ్చి అన్నివిధాలా సహకరించిన చిరకాల మిత్రుడు, న్యాయవాది బి. అశోక్‌వర్ధన్‌రెడ్డికి కృతజ్ఞతలు.

నివేదనకు పుస్తకరూపం ఇవ్వాలని ఉంది అనగానే పుస్తకం బాగా వేద్దాం అని పెన్సిల్ పట్టుకుని చకచకా లైన్ డ్రాయింగ్‌లు వేసి, కవర్ డిజైన్ చేసిన శ్రీ పినిశెట్టికి కృతజ్ఞతలు.

అక్షరదోషాలను సవరించి, వాక్యాలకు సొగసులద్దిన మిత్రులు మణికుమార్‌కు కృతజ్ఞతాభినందనలు

ఓపికగా అక్షరాలు కూర్చి, పేజీలను అందంగా తీర్చిదిద్దిన బాలసుబ్రహ్మణ్యంకు కృతజ్ఞతాభినందనలు.

**– తిప్పావఝుల కుమార్**

31–3–2014

# ఏ ఇంటర్వ్యూ ఏ పేజీలో...


| | | |
|---|---|---|
| 1. | శ్రీ డా దాశరథి రంగాచార్య | 11 |
| 2. | శ్రీ నారా చంద్రబాబు నాయుడు | 14 |
| 3. | శ్రీ చిరంజీవి | 17 |
| 4. | శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి | 20 |
| 5. | శ్రీమతి జయసుధ | 23 |
| 6. | శ్రీ టి. సుబ్బిరామిరెడ్డి | 26 |
| 7. | స్వామి సుఖబోధానంద | 29 |
| 8. | సద్గురు శివానందమూర్తి | 32 |
| 9. | శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు | 35 |
| 10. | డాక్టర్ బిరుదరాజు రామరాజు | 38 |
| 11. | శ్రీ విద్యారణ్య భారతి | 41 |
| 12. | శ్రీమతి జమున | 44 |
| 13. | రెవరెండ్ డా. బిపి. సుగంధర్ | 47 |
| 14. | శ్రీ మోహన్ కందా | 50 |
| 15. | స్వామి పరమార్ధానంద | 53 |
| 16. | శ్రీమతి అంజలీదేవి | 56 |
| 17. | శ్రీ వి,బి. రాజేంద్రప్రసాద్ | 59 |
| 18. | శ్రీ పి,.వి.ఆర్.కె. ప్రసాద్ | 62 |
| 19. | శ్రీ ఎం. సత్యనారాయణ రావు | 65 |
| 20. | స్వామి సుందరానంద | 68 |
| 21. | శ్రీమతి వాణిశ్రీ | 71 |
| 22. | శ్రీమతి వేదవతీ ప్రభాకర్ | 74 |
| 23. | డి. వెంకటేష్ | 77 |
| 24. | సద్గురు జగ్గీవాసుదేవ్ | 80 |
| 25. | జస్టిస్ తామాడ గోపాలకృష్ణ | 83 |
| 26. | శ్రీమతి పి. విజయలక్ష్మి | 86 |

| | | |
|---|---|---|
| 27. | శ్రీ వేటూరి సుందరరామమూర్తి | 89 |
| 28. | శ్రీ జి. పుల్లారెడ్డి | 92 |
| 29. | జస్టిస్ చలమేశ్వర్ | 95 |
| 30. | స్వామి స్వరూపానంద సరస్వతి | 98 |
| 31. | శ్రీ తనికెళ్ళ భరణి | 101 |
| 32. | శ్రీమతి వాణీ జయరాం | 104 |
| 33. | డాక్టర్ అశోక్‌కుమార్ చటర్జీ | 107 |
| 34. | శ్రీ శార్వరి | 110 |
| 35. | శ్రీ వెంకటరమణ దీక్షితులు | 113 |
| 36. | స్వామిని విమలానంద | 116 |
| 37. | బ్రహ్మచారి లూక్ | 119 |
| 38. | ఆచార్య పుల్లేల శ్రీరామచంద్రుడు | 122 |
| 39. | శ్రీ కె. విశ్వనాథ్ | 125 |
| 40. | స్వామి జ్ఞానానంద | 128 |
| 41. | శ్రీ మఠం రాచెయ్య స్వామి | 131 |
| 42. | డాక్టర్ రావూరి భరద్వాజ | 134 |
| 43. | శ్రీ గాధిరాజు సత్యనారాయణ రాజు | 137 |
| 44. | శ్రీ ముంతాజ్ అలీ | 140 |
| 45. | శ్రీ పి. రాంనారాయణ్ | 143 |
| 46. | శ్రీ మురళీ మోహన్ | 146 |
| 47. | డాక్టర్ కోరాడ సుబ్రహ్మణ్యం | 149 |
| 48. | మంత్రాలయ పీఠాధిపతి స్వామి సుయతీంద్ర | 152 |
| 49. | శ్రీ టి. విజయచందర్ | 155 |
| 50. | శ్రీ పరకాల స్వామి | 158 |
| 51. | మహాయోగి సుధాకర్ జీ | 161 |
| 52. | డాక్టర్ ఆర్.వి.యస్.యస్. అవధానులు | 164 |
| 53. | శ్రీ శృంగారం శింగరాచార్యులు | 167 |
| 54. | బ్రహ్మశ్రీ తంగిరాల బాల గంగాధర శర్మ | 170 |

| | | |
|---|---|---|
| 55. | శ్రీమతి హేమాపాటంకర్ | 173 |
| 56. | స్వామి ఆత్మప్రియానంద | 176 |
| 57. | శ్రీమాన్ కె. వి. రాఘవాచార్యులు | 179 |
| 58. | శ్రీమతి ఎస్. జానకి | 182 |
| 59. | కృష్ణజ్యోతి స్వరూపానంద స్వామి | 185 |
| 60. | బసవ పీఠాధిపతి మాత మహాదేవి | 188 |
| 61. | శ్రీ ఆర్. వెంకట్రామ ఘనాపాఠి | 191 |
| 62. | శ్రీ లక్ష్మీకాంతారావు బాబా | 194 |
| 63. | డాక్టర్ కందాడై రామానుజాచార్యులు | 197 |
| 64. | స్వామి శ్రీకాంతానంద | 200 |
| 65. | వీరబ్రహ్మేంద్రమఠం పీఠాధిపతి వెంకటేశ్వర స్వామి | 203 |
| 66. | శ్రీమతి వీణారావు | 206 |
| 67. | స్వామి వేదానంద సరస్వతి | 209 |
| 68. | శ్రీ సిద్ధేశ్వరానంద భారతి | 212 |
| 69. | డాక్టర్ రతన్ జీ | 215 |
| 70. | డాక్టర్ శలాక రఘునాధ శర్మ | 218 |
| 71. | శ్రీ పురాణపండ రాధాకృష్ణ | 221 |
| 72. | శ్రీ మోపర్తి శివరామకృష్ణయ్య | 224 |
| 73. | శ్రీ రంగరామానుజ జీయర్ స్వామి | 227 |
| 74. | శ్రీ శేషభట్టార్ సుదర్శనాచార్య | 230 |
| 75. | శ్రీ రమణానంద స్వామి | 233 |
| 76. | డాక్టర్ ఎం.వి. సౌందరరాజన్ | 235 |
| 77. | డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్య | 238 |
| 78. | స్వామి పరిపూర్ణానంద సరస్వతి | 241 |
| 79. | శ్రీ రాజేష్ దలాల్ | 244 |
| 80. | మాతా అమృతానందమయి | 247 |
| 81. | శ్రీ శ్రీ రవి శంకర్ | 250 |




**వేదం ఆయన జీవన నాదం. నిజాంపై తుపాకులు ఎక్కుపెట్టిన చేతులతోనే వేదాలను, ఉపనిషత్తులను సరళంగా అనువదించారు. అపురూపమైన వేదవాఙ్మ యాన్ని తెలుగువారికి అందించిన అమృతమూర్తి దాశరథి రంగాచార్యులు. జ్ఞానామృతపానంలోనే నిజమైన ఆనందం ఉందంటున్నారాయన. ధర్మప్రచార శూన్యత, హైటెక్‌గా మారుతున్న ఆశ్రమాల సంగ తులు ఆయన మాటల్లోనే..**



# అన్వేషణతో అమృతానందం



గత 50 ఏళ్ళ కాలంలో సమాజంలో విలువలు దారుణంగా పతనమ య్యాయి. ఒక మిలీని యంలో జరగాల్సిన నష్టం ఈ ఐదు దశాబ్దా ల్లోనే జరిగిపోయింది. లుప్తమైన విలువలు.. జ్ఞాన శూన్యత. జ్ఞాన సముపార్జన కోసం ప్రయత్నం చేద్దామన్నా దాన్ని సరిగా అందించే వారు కరువైన దుస్థితి.



"సత్యపు ముఖాన్ని బంగారుపాత్ర కప్పేసింది... భగవాన్ ఆ బంగారు పాత్రను తొలగించు... సత్య దర్శనం చేసు కుంటాను...'' అంటూ ఉపనిషత్‌లో ఓ భక్తుడు భగవంతుని వేడుకుంటాడు. ఈ రోజున సత్యం ముఖాన్ని ఎవరూ ఆనవాలు పట్టలేని పరిస్థితి. గత 50 ఏళ్ళ కాలంలో సమాజంలో విలు వలు దారుణంగా పతనమయ్యాయి. ఒక మిలీనియంలో జర గాల్సిన నష్టం ఈ ఐదు దశాబ్దాల్లోనే జరిగిపోయింది. ఎవర్ని ఎవరూ నమ్మలేని పరిస్థితి. లుప్తమైన విలువలు.. జ్ఞాన శూన్యత. జ్ఞాన సముపార్జన కోసం ప్రయత్నం చేద్దామన్నా దాన్ని సరిగా అందించేవారు కరువైన దుస్థితి. మనం బతకా ల్సింది ఇలా కాదు అని మాత్రం ప్రతి ఒక్కరికి స్పష్టంగా తెలుసు. ఈ నాగరికత పట్ల మొహం మొత్తిపోతున్నది. కానీ ఎలా బతకాలి? అందుకు అవసరమైన జ్ఞానం ఎలా సంపాదిం చాలనే విషయంలో స్పష్టత లేదు. స్పష్టత చేకూర్చే వారు లేరు. ఇది మరింత దయనీయం. ఇటీవలి కాలంలో ప్రతి ఒక్కరిలో జ్ఞానంపట్ల గొప్ప తృష్ణ కనిపించడం హర్షణీయం. అయితే ప్రపంచ వ్యాప్తంగా కనిపిస్తున్న ఈ తృష్ణను సొమ్ము చేసుకొనే వారే తప్ప తీర్చేవారు కనిపించడం లేదు. జ్ఞాన తృష్ణను తీర్చా ల్సిన ఆశ్రమాలు, పీఠాలు, మఠాలు రాజకీయాలు నడుపుతు న్నాయి. ఆశ్రమం అంటే అపురూపమైన భావం మదిలో మెదులు తుంది. కానీ ఇప్పటి ఆశ్రమాలు హైటెక్‌గా మారాయి. ధర్మప్ర చారం చేయాల్సిన వారు మత రాజకీయాలు చేస్తున్నారు.

నిజానికి జ్ఞానం కానీ, భగవంతుడు కానీ మనల్ని వెతుక్కుంటూ రావు. మనం అన్వేషించి అనుభవంలోకి తెచ్చుకోవాలి.

జ్ఞానాన్ని కూడా రాజకీయం చేస్తున్నారు. తిరుపతి స్వామిని రాజకీయాల్లోకి లాగారు. ప్రతిదీ రాజకీయం, వ్యాపారం అయి పోయింది. చివరకు జ్ఞానాన్ని కూడా వ్యాపారం చేశారు. వ్యక్తిత్వ వికాసాలు, యోగ, కుండలినీ విద్యలకు విశేషంగా ప్రచారం జరుగుతున్నది. వీరిలో ఎంతమందికి నిజమైన జ్ఞానం ఉన్నది? వారి ప్రవచనాలు ఎవరికి సాంత్వన చేకూరుస్తున్నాయి? ఆధ్యాత్మికం పేరిట ఏటా వేలకోట్ల రూపాయల వ్యాపారం జరుగుతున్నది. జ్ఞానమార్గం సూచించాల్సిన ఆశ్రమవాసులే మత రాజకీయాల్లో పడి, రాజకీయాలు మాట్లాడుతుంటే సామాన్యుడు అయోమయంలో పడుతున్నాడు. ఎక్కడ నిజమైన జ్ఞానం లభిస్తుందంటూ అన్వేషణలో పడ్డాడు. నిజానికి జ్ఞానం కానీ, భగవంతుడు కానీ మనల్ని వెతుక్కుంటూ రావు? మనం అన్వేషించి అనుభవంలోకి తెచ్చుకోవాలి.

శ్రద్ధతో జ్ఞానం లభిస్తుందని గీతలో స్వామి చెప్పాడు. కానీ నీ శ్రద్ధాసక్తిని చెడగొట్టేందుకు యాంత్రిక యుగంలో సవాలక్ష అంశాలు సిద్ధంగా ఉంటాయి.

జ్ఞానం బోధించాల్సిన వారు నిస్సారంగా మారారు. ఈ తరుణంలో మనంతట మనమే జ్ఞానాన్వేషణ ప్రారంభించాలి. జ్ఞానం వల్ల లభించే ఆనందం అనిర్వచనీయమైనది. ఆ ఆనందం కోసం ఎంత త్యాగమైనా చేయవచ్చు. అసలు జ్ఞానం అంటే ఏమిటి...? ఇంద్రియాలకు అతీతమైన విషయాల్ని తెలుసుకోవడమే జ్ఞానం. అజ్ఞానం ఎంతగా పెరిగిందంటే మనుషుల్ని వస్తువులతో కొలుస్తున్నారు. మంచి లేదు ఉన్నా దానికి విలువ లేదు. సామాన్యుడు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. బాధల్లో ఉన్న వారిని అక్కున చేర్చుకుని సాంత్వన కలిగించేందుకు గతంలో కొన్ని సంస్థలు ఉండేవి. నిజంగా లోకహితం కోసం ఆలోచించే మహనీయులు ఇప్పుడు అరుదు. సామాజిక సేవ కూడా రాజకీయమైంది... వ్యాపారమైంది. రాజకీయాలు సామాన్యుడికి ఆదర్శం. నేతలు నిజం చెప్పి, ధర్మప్రవర్తన నేర్చుకున్న నాడు సమాజం బాగుపడుతుంది.

ప్రజల్లో జ్ఞాన జ్యోతులను వెలిగించే సాహితీ సృష్టి జరగాలి. దురదృష్టవశాత్తు దక్షణాదిలో అటువంటి సాహిత్యాన్ని ప్రోత్సహించే ధార్మిక సంస్థలు కరువయ్యాయి. ధర్మప్రచారం చేయాల్సిన తిరుమల తిరుపతి దేవస్థానం కూడా వ్యాపార కేంద్రంగా మారడం దురదృష్టకరం. ఉత్తరాదిలో ఇంకా కొన్ని ధర్మ ప్రచార సంస్థలు బతికి ఉండడం హర్షణీయం. మనిషిని ఒక మార్కెట్ వస్తువుగా కాకుండా సాటి మనిషిగా, సానుభూతితో, సహఅను

భూతితో చూడాలనేది మహనీయులందరి ఆకాంక్ష. వారి కల కలగానే మిగిలిపోతున్నది. ఆ కల నిజం కావాలంటే జ్ఞాన సముపార్జనే మార్గం. ఎవరిమీదనో ఆధారపడకుండా జ్ఞానం కోసం మనమే అన్వేషణ ప్రారంభించాలి. అదే సమాజ వికాసానికి, విశ్వకళ్యాణానికి దోహదం చేస్తుంది.

మనిషిని ఒక మార్కెట్ వస్తువుగా కాకుండా సాటి మనిషిగా, సానుభూతితో, సహఅనుభూతితో చూడాలనేది మహనీయులందరి ఆకాంక్ష.

నిజాం పాలనను అంతం చేయాలనే లక్ష్యంతో ఆ నాడు పోరాటం సాగించాను. తుపాకులు పట్టాను. ఆశయం సాధించాను. ఆ తరువాత నా జీవనగతి ఒక్కసారిగా మారిపోయింది. అదో అద్భుతం. తుపాకి పట్టిన చేతితో వేదం రాయించాలని ఆ పైవాడు సంకల్పించాడు. ఏళ్ళ తరబడి రోజూ 20 గంటలు పూనకం వచ్చిన వాడిలా రాశాను. చాలామంది నన్ను నిరుత్సాహ పరిచారు. గేలి చేశారు. కానీ అపురూపమైన వేద వాఙ్మయాన్ని సామాన్యుడికి అందించడమే నా లక్ష్యం. భగవంతుడు రాయించాడు... నేను రాశాను, అంతే. ఆ మధ్య ఓ సారి వరంగల్ వెళ్ళినప్పుడు రైల్వే స్టేషన్‌లో ఓ ఆటో డ్రైవర్ వచ్చి నమస్కారం పెట్టాడు. నా లగేజ్ తీసుకొని గమ్యస్థానం చేర్చాడు. డబ్బు ఇవ్వబోతే తీసుకోలేదు.... నేనెవరినో తెలుసా అని అడిగాను. మీరు తెలియకపోవడం ఏమిటి సార్... మీరు రాసిన వేదం కూడా చదివానన్నాడు. వేద వాఙ్మయాన్ని సామాన్యుడికి కూడా అందించగలిగాను అని మహదానందంగా ఉంది. అనన్యాశ్చింతయంతోమా... అన్నాడు భగవద్గీతలో స్వామి. ఆయన నన్ను అడుగడుగునా ఆదుకున్నాడు. ఆయన చెప్పిన విధంగా అనన్యంగా మాత్రం ఆయనను ఆశ్రయించలేక పోతున్నాను. ఆ స్వామి నాలోనే ఉంటాడు. నాకు కనిపించడు. ఎందుకీ దాగుడు మూతలు స్వామీ అని ప్రశ్నిస్తూ ఉంటాను. రామాయణం చదివాక కమ్యూనిస్టుగా వుండి నేను ఏం కోల్పోయానో తెలిసింది. రామాయణం, భారత, భాగవతాలు అనిర్వచనీయమైన ఆనందం కలిగించాయి. వాటన్నింటినీ తెలుగువారికి అందించాను, వారు చదివి ఆనందిస్తుంటే అదీ చూశాను... ఇంకేం కావాలి. వస్తుప్రపంచం మన కళ్ళకు మాయ పొరలు కప్పుతున్నదంటారాయన. మనలోనుంచి ఉబికి వచ్చే జ్ఞాన జ్యోతులతో ఈ మాయపొరలను ఛేదించినప్పుడే స్పష్టత చేకూరుతుంది. వెలుగులు ప్రసరించి విశ్వకళ్యాణం ఒనగూడుతుంది.

అపురూపమైన వేద వాఙ్మయాన్ని సామాన్యుడికి అందించడమే నా లక్ష్యం. భగవంతుడు రాయించాడు... నేను రాశాను, అంతే.

– అక్టోబర్ 1, 2004

**తొమ్మిదేళ్ల పాటు రాష్ట్రాన్ని పాలించిన తెలుగుదేశం అధినేత చంద్రబాబు నాయుడు శైలి ప్రజాపాలనలోనే కాదు ఆధ్యాత్మిక పథంలోనూ విలక్షణం. ఆర్ట్ఆఫ్ లివింగ్ రవిశంకర్ చేత బోధలు చేయించారు. యోగ పండితుల చేత మంత్రులు, పార్టీ నేతలకు యోగాసనాలు నేర్పించిన ఘనత ఆయనకే దక్కుతుంది. ఆధ్యాత్మికం, భక్తిభావాలపై ఆయన అంతరంగం.**



# జనహితమే పరమానందం

వేంకటేశ్వరస్వామి మా ఇలవేల్పు. మా గ్రామంలో మా ఇంటి నుంచి ఏడుకొండల స్వామి ఆలయ శిఖరం కన్పిస్తుంది. నాకు రోజూ పొద్దున్నే పూజ చేసే అలవాటు లేదు. అయినా ఇంటి నుంచి బయలుదేరేటప్పుడు మాత్రం ఒక్క నిమిషం ఆగి మంచి పనులు చేయటానికి తగిన మంచి ఆలోచనలు ఇమ్మని, మంచి చేయటానికి తగిన శక్తి ఇమ్మని మనస్సాక్షిని వేడుకొంటాను. అంతకు మించిన దైవారాధన చేయను. కష్టపడి పనిచేయాలన్నదే మొదటి నుంచి నా పద్ధతి. అందువల్ల పూజల వంటివి నాకు అలవాటు కాలేదు. స్వల్పకాలిక దీర్ఘకాలిక లక్ష్యాలు పెట్టుకుని వాటి ప్రకారం పని చేస్తూ వెళ్ళేవాడిని. కష్టపడి పనిచేయడం ఒక్కటే ఫలితం ఇస్తుందన్నది నా నమ్మకం. ఒక లక్ష్యాన్ని నిర్ణయించుకుని ఒక క్రమపద్ధతిలో పని చేయటం మనోనిబ్బరాన్ని కూడా ఇస్తుంది.



**ఇంటి నుంచి బయలుదేరేటప్పుడు మాత్రం ఒక్క నిమిషం ఆగి మంచి పనులు చేయటానికి తగిన మంచి ఆలోచనలు ఇమ్మని, మంచి చేయటానికి తగిన శక్తి ఇమ్మని మనస్సాక్షిని వేడుకొంటాను. అంతకు మించిన దైవారాధన చేయను. కష్టపడి పనిచేయాలన్నదే మొదటి నుంచి నా పద్ధతి.**



భక్తి వేరు. ఆధ్యాత్మికత వేరు. ఈ రెండింటినీ మించి మన స్సాక్షి అవసరం చాలా ఉంది. మనిషి తనను తాను తెలుసుకొంటే చాలా సమస్యలు తగ్గుతాయి. డబ్బు, అధికారం తాత్కాలిక ఆనందం ఇచ్చినా దీర్ఘకాలికంగా అనేక సమస్యలు సృష్టిస్తాయి. వాటినుంచి బయటకు రాలేక కొత్త సమస్యలు సృష్టించుకొంటారు. ప్రతివారూ తన జీవిత పరమార్థం తెలుసుకోవాలి. నేను ఎందుకు పుట్టాను, ఏం చేస్తే ఆనందంగా ఉండగలుగుతాను, మనం పోయిన తర్వాత కూడా మనని సమాజం గుర్తుంచుకో

వాలంటే ఏం చేయాలన్నది ప్రతివారూ ఆలోచించి వ్యవహరిస్తే అశాంతిని చాలా వరకూ తగ్గించుకోవచ్చు. సానుకూల దృక్ప థంతో పనిచేయాలి. భక్తి ఒక పరిమితి వరకూ శాంతిని ఇవ్వగ లుగుతుంది. కానీ మనని మనం సమాజానికి కూడా కొంత ఉపయోగపడేలా తీర్చిదిద్దుకొంటే అది మరింత ప్రయోజనకరంగా ఉంటుంది. మనిషికి మంచి వ్యక్తిత్వం ముఖ్యం. వ్యక్తుల వ్యక్తిత్వాలు సంఘాన్ని ప్రభావితం చేస్తాయి. అవి అంతిమంగా ఆ సమాజ గమనాన్ని నిర్దేశిస్తాయి. వ్యక్తుల్లో ఆధ్యాత్మిక భావాలను పెంచడం ద్వారా సంఘంలో మార్పు రావాలని నేను కాంక్షించాను. దానిని ప్రోత్సహించాను. పనిలో ఆనందం పొందాలి. ఇతరులకు చేసే మంచి మనకు ఆనందాన్ని ఇస్తుంది. ఒక మంచి దారిలో నడుస్తూ క్రమశిక్షణతో జీవనం సాగించటం కంటే కావల్సింది లేదు. డబ్బు సంపాదించవచ్చు. కానీ దానిని న్యాయబద్ధంగా సంపాదించాలి. అది మనకు ప్రశాంతతను ఇస్తుంది. దాని వల్ల మనం సమాజంలో మన కర్తవ్యాన్ని నెరవేర్చగలుగుతాం. మన మనసు మనలో అతి బలహీన కేంద్రం. ఆవేశం, ఆగ్రహం, స్త్రీ వ్యామోహం, ధన సంపాదన, పదవీ కాంక్ష వంటి కోరికలు దానిని ప్రభావితం చేస్తూ ఉంటాయి. వాటివైపు మొగ్గకుండా మనసును ఎప్పటికప్పుడు కట్టడి చేస్తూ ఉండాలి. దానికి ఆధ్యాత్మిక భావాలు ఉపయోగపడతాయి.

మనిషికి మంచి వ్యక్తిత్వం ముఖ్యం. వ్యక్తుల వ్యక్తిత్వాలు సంఘాన్ని ప్రభావితం చేస్తాయి. అవి అంతిమంగా ఆ సమాజ గమనాన్ని నిర్దేశిస్తాయి.

భక్తి ఎక్కువగా మతానికి సంబంధించినది. యోగా, ప్రాణాయామం, ధ్యానం వంటివి ఆధ్యాత్మికమైనవి. ఇవి వాస్తవం. భక్తి నమ్మకానికి సంబంధించినది. యోగా, ధ్యానం వంటివి ఆచరణాత్మకంగా మంచి ఆరోగ్యాన్ని ఇచ్చి మానసిక ఒత్తిడిని తగ్గిస్తాయి. దేవుడి దగ్గరకు వెళ్ళి వచ్చి మళ్ళీ తప్పులు చేసి ఆందోళన పెంచుకోవటం ఫలితాన్ని ఇవ్వదు. యోగా, ధ్యానం, ప్రాణాయామం వంటివి ప్రకృతికి సంబంధించినవి. ఆధునిక జీవనంలో ఎదురవుతున్న ఒత్తిడిని తగ్గించుకోవటానికి యోగా వంటివి ఉపయోగపడుతున్నాయి. అందువల్లే వీటికి ప్రపంచ వ్యాప్తంగా ఆదరణ పెరుగుతోంది. గతంలో ధర్మ ప్రచారం చేసిన ఆధ్యాత్మిక సంస్థలు, మఠాలు, పీఠాలు కొన్ని దారి తప్పాయి. వాటిలో కొన్నింటికి స్వలాభం, రాజకీయ ప్రయోజనాలు ముఖ్యం కావటంతో పరస్పర విద్వేషం, అసహనాన్ని పెంచుతున్నాయి. నిజానికి ఏ మతమైనా సామరస్యాన్ని బోధించిందే తప్ప ద్వేష భావాన్ని ప్రబోధించలేదు. అయినా ఇవి తమ

భక్తి నమ్మకానికి సంబంధించినది. యోగా, ధ్యానం వంటివి ఆచరణాత్మకంగా మంచి ఆరోగ్యాన్ని ఇచ్చి మానసిక ఒత్తిడిని తగ్గిస్తాయి.

కోరికలు తీరితే ఆనందం వస్తుందని కొందరు భ్రమ పడుతుంటారు. వాటి కోసం చేసే ప్రయత్నాలు కష్టాలను, బాధలను తెస్తాయి.

స్వార్థం కోసం పనిచేస్తున్నాయి. వాటిలో కొన్నింటికి విలువ తగ్గడానికి అదే కారణం. తాము చెబుతోందే నిజమైందనే మౌఢ్యం వాటిలో తగ్గాలి. విశాల దృక్పథం పెరగాలి. సమాజ కల్యాణమే భక్తి, ఆధ్యాత్మికతల పరమార్థం.

వ్యక్తుల్లో అవగాహనలోపం వల్ల సంఘాల శక్తి క్షీణించి వ్యక్తి వాదం పెరుగుతోంది. స్వార్థం పెరిగినవారు ఇతరుల బాగును భరించలేకపోతున్నారు. మనతోపాటు నలుగురూ బాగుండాలని కోరుకోవడం కాకుండా మనం బాగుంటే చాలన్న వ్యక్తిగత ధోరణి ప్రబలుతోంది. డబ్బు సంపాదిస్తే భౌతిక సుఖాలు కొన్ని అందవచ్చు. మానసిక ఆనందం మాత్రం అందదు. దానిని అర్థం చేసుకోలేక పాకులాడటం పెరుగుతోంది. సమాజం బాగుంటేనే తాను బాగుంటానని, సమాజ హితం కోసం తనవంతు కృషి చేయాలన్న భావన ప్రతివారిలో పెంచటం ఒకటే దీనికి పరిష్కారం. జీవితానికి ఉన్న పరిమితులు తెలుసుకోవాలి. మంచి చేయడానికి అవధులు లేని శక్తి ఉండవచ్చుగాని భౌతిక సుఖాలు అంతు లేకుండా పొందాలన్న కోరికకు పరిమితులు చాలా ఉంటాయి. డబ్బు, పదవి, సెక్స్ వంటి కోరికలు తీరితే ఆనందం వస్తుందని కొందరు భ్రమ పడుతుంటారు. వాటి కోసం చేసే ప్రయత్నాలు కష్టాలను, బాధలను తెస్తాయి. తప్పుడు పద్ధతుల్లో, అన్యాయ మార్గాల్లో కోరికలు తీర్చుకోవాలన్న ప్రయత్నం ఆనందాన్ని దూరం చేసి బాధను పెంచుతుంది. మనం మనస్సాక్షి ప్రకారం మంచి చేయగలిగితే అది ఇచ్చే ఆనందం చాలా ఎక్కువ. మనం ఇతరులకు ఆదర్శంగా ఉండగలగడం కంటే జీవితంలో గొప్ప ఆనందం మరొకటి ఉండదు. న్యాయబద్ధంగా ఏ పని చేసినా అది దేశానికి ఉపయోగపడుతుంది. మనసుకు శాంతిని ఇస్తుంది.

మనం బాగుంటే చాలన్న వ్యక్తిగత ధోరణి ప్రబలుతోంది. డబ్బు సంపాదిస్తే భౌతిక సుఖాలు కొన్ని అందవచ్చుగానీ మానసిక ఆనందం అందదు.

– అక్టోబర్ 8, 2004





**సినీ అభిమానుల గుండెల్లో ఆయన చిరంజీవి. అంజనీసుతుడు ఇచ్చిన సంకల్పబలం వల్లే తాను కోట్లాది హృదయాల్లో స్థానం సంపాదించుకోగలిగా నంటారు మెగాస్టార్ చిరంజీవి. తండ్రిని సైతం భక్తి మార్గం వైపు మళ్లించిన వ్యక్తి చిరంజీవి. భక్తి వల్ల క్రమ శిక్షణ, శక్తి చేకూరతాయని బలంగా నమ్ముతారు. సేవా భావం నిండిన ప్రతి మనిషీ భగవంతుడే అంటున్న ఆయన భక్తి, ధ్యాన తరంగిణి.**

# ప్రపంచహితం కోరే ప్రతి ఒక్కరూ పరమాత్మే

చిన్నతనంలో మా ఇంట్లో పెద్దగా పూజలు, పునస్కారాలు ఉండేవి కావు. మా నాన్నగారు కమ్యూనిస్టు భావాలతో ఉండేవారు. ఒక రకంగా నేనే మా కుటుంబంలో భక్తి అధ్యాయాన్ని ప్రారంభించానేమో అనిపిస్తుంది. 5,6 తరగతులు పొన్నూరులో చదివాను. అక్కడ ఉన్న అతిపెద్ద ఆంజనేయ స్వామి విగ్రహం నా మనసులో నిలిచిపోయింది. ఆ స్వామిని చూస్తే ఏదో తెలియని శక్తి కలిగేది. గుళ్లో ఉన్న ఇసుక మేటల్లో స్నేహితులతో కలిసి గంటల తరబడి ఆడుకొనే వాళ్ళం. నైవేద్యం గంట మోగగానే ఆటను మధ్యలోనే వదిలేసి ప్రసాదం కోసం పరుగులు పెట్టే వాళ్ళం. ప్రసాదం తిని మళ్ళీ ఆటలు మొదలు పెట్టే వాళ్ళం. ఆలయంలో గంటల తరబడి గడపటంతో స్వామితో అనుబంధం మొదలైంది. ఆ తరువాత బాపట్లలో 8వ తరగతి చదువుతున్నప్పుడు అక్కడ వున్న ఆలయంలో పూజారి నాకు రోజూ ఆంజనేయస్వామి గురించిన కథలు చెబుతూ ఉండేవారు. హనుమాన్ చాలీసా నేర్పారు. వేలసార్లు చాలీసా చదివే వాడ్ని. ఆ పూజారి నాకు ఓ ఆంజనేయ స్వామి క్యాలెండర్ ఇచ్చారు. అది ఇప్పటికీ మా పూజగదిలో ఉన్నది. ఆంజనేయస్వామితో నా అనుబంధం అలాంటిది.

ఆలయంలో పూజారి నాకు రోజూ ఆంజనేయ స్వామి గురించిన కథలు చెబుతూ ఉండేవారు. హనుమాన్ చాలీసా నేర్పారు. వేలసార్లు చాలీసా చదివే వాడ్ని. ఆ పూజారి నాకు ఓ ఆంజనేయ స్వామి క్యాలెండర్ ఇచ్చారు. అది ఇప్పటికీ మా పూజగదిలో ఉన్నది.

అప్పుడు మేం మొగల్తూరులో ఉన్నాం. నేను పదోతరగతి చదువుతున్నాను. నాన్నగారికి హఠాత్తుగా శ్రీకాకుళం జిల్లా మాడుగులకు ట్రాన్స్‌ఫర్ అయింది. అక్కడకు వెళ్ళడం ఆయ

‘వీడే నాకు ఆధ్యాత్మిక గురువు’ అని మా నాన్నగారు అప్పుడప్పుడూ ఎవరితో అయినా నా గురించి చెబుతూ ఉండేవారు.

నకు ఇష్టం లేదు. సెలవు పెట్టి ఇంట్లో ఉన్నారు. ఆరోగ్యం కూడా బాగాలేదు. ఓ రోజు పెద్ద గాలివాన. ఇంటి పెంకులన్నీ ఎగిరిపోయాయి. ఒకే గదిలో అందరం ముడుచుకు పడుకున్నాం. అందరి గుండెల్లో బాధ గూడుకట్టుకొని ఉంది. ఒకదాని తరువాత మరొకటి ఏమిటీ కష్టాలు... అని బాధపడ్డాను. భగవంతుడే సాయం చేయాలనిపించింది. నాన్నగారి చేత హనుమాన్ చాలీసా 108 సార్లు చదివించి, వడమాల వేస్తే సమస్యలు తొలగిపోతాయేమో అని మా అమ్మతో చెప్పాను. ఆ మాట మా నాన్నగారు ఎలాగో విన్నారు. ఆయనకు ఏమనిపించిందో ఏమో ఆ మరుసటి రోజు చాలీసా చదవడం ప్రారంభించారు. వడమాల వేశారు... అప్పుడో అద్భుతం జరిగింది. మాడుగుల ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ ఆగిపోయింది. ప్రమోషన్ ఇచ్చి మరీ చీరాలలో రిపోర్ట్ చేయమంటూ ఆర్డర్ వచ్చింది. నాన్న ఆశ్చర్యానికి అంతులేదు. ఆ రోజు నుంచి ఆయన ఆంజనేయ స్వామి భక్తుడై పోయారు. ఇంటిల్లిపాదికీ ఆంజనేయుడే ఇలవేల్పుగా మారాడు. ‘వీడే నాకు ఆధ్యాత్మిక గురువు’ అని మా నాన్నగారు అప్పుడప్పుడూ ఎవరితో అయినా నా గురించి చెబుతూ ఉంటారు. ఇంటర్, డిగ్రీ చదువుతున్నప్పుడు, ఆ తరువాత ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరినప్పుడు కూడా ఆంజనేయుని ధ్యానం మానలేదు. నా కష్టసుఖాలన్నీ ఆయనతో చెప్పుకొనే వాడ్ని. ఓ స్నేహితునిలా స్వామితో అనుబంధం ఏర్పడింది.

నా కష్టసుఖాలన్నీ ఆయనతో చెప్పుకొనే వాడ్ని. ఓ స్నేహితునిలా స్వామితో అనుబంధం ఏర్పడింది.

నా తొలి సినిమాలన్నింటిలో నా మెడలో ఓ ఆంజనేయ స్వామి లాకెట్ వుండేది. అది మెడలో వుంటే నాకు కొండంత బలం వచ్చేది. ఎలాంటి పరిస్థితుల్లో కూడా దాన్ని మెడలో నుంచి తీసేవాడ్నికాదు. ‘తాతయ్య ప్రేమలీలలు’ సినిమా షూటింగ్‌లో అనుకుంటాను అది కాస్తా ఎక్కడో జారి పడిపోయింది. మూడు రోజులు నిద్రపోలేదు. అదే ధ్యాస. హఠాత్తుగా ఆ లాకెట్ మళ్ళీ దొరికింది. అప్పుడు ఎందుకో అనిపించింది... లాకెట్ పోయినా భగవంతుడు నా మనసు నుంచి దూరం కాలేదు. కాదు.... లాకెట్లు, రుద్రాక్షలు పైపై మెరుగులు. భగవంతునికి దగ్గర కావడానికి ఈ పైపై మెరుగులు అవసరమా అనిపించింది. ఆ తరువాత ఆ లాకెట్ వదిలేశాను. నా లక్ష్యాన్ని సాధించేందుకు అవసరమైన శక్తిని, క్రమశిక్షణను ఆంజనేయ స్వామే ఇచ్చారు. బహుశా 1981 నుంచి అనుకుంటాను అయ్యప్ప మాల వేసుకుంటున్నాను. అయ్యప్ప దీక్ష నాలో క్రమ

శిక్షణను ఇంకా పెంచుతున్నది. ప్రస్తుతం రోజూ ఇంట్లో పూజ చేయడం సాధ్యం కావడం లేదు. అవకాశం దొరికినప్పుడల్లా చేస్తాను. ఇంట్లో వాళ్లు పూజలు చేస్తుంటే తప్పనిసరిగా పాల్గొం టాను. పూజ చేస్తున్నప్పుడు నాలో అద్భుతమైన అనుభూతి కలుగుతుంది. భగవంతుని ఎదుట కళ్ళు మూసుకొని కూర్చుంటే చాలు దివ్యానుభూతి కలుగుతుంది. నాకు అన్నీ ఇచ్చావు.... ప్రపంచం కూడా సుఖశాంతులతో ఉండేలా చూడ మని స్వామిని వేడుకుంటూ ఉంటాను. నేను పూజ చేస్తూ కళ్ళు మూసుకుంటే.... స్వామి నా నివేదనను ఆలకించి ప్రపంచానికి అభయముద్ర ఇస్తున్న భావం లీలగా నా కళ్ళముందు కదలా డుతూ ఉంటుంది. ఇది అతిశయోక్తిగా అనిపించవచ్చు... కానీ ఇది నా ఆత్మానుభవం. స్వామి దయ వల్ల ప్రపంచం సుఖమ యంగా ఉండాలన్నదే నా ఆకాంక్ష. ప్రపంచం సుఖయయంగా ఉండాలని కోరుకొనే వాళ్ళంతా నా దృష్టిలో దేవుళ్ళే. ఆఖరిశ్వాస వరకు ప్రపంచహితం కోసం పనిచేసిన మదర్ థెరిస్సా వంటి వారు నా దృష్టిలో దేవుళ్ళే.

**1981 నుంచి అనుకుంటాను అయ్యప్ప మాల వేసుకుంటున్నాను. అయ్యప్ప దీక్ష నాలో క్రమశిక్షణను ఇంకా పెంచుతున్నది.**

క్రమంగా నా మనసు ధ్యానమార్గం వైపు మళ్లుతున్నది. ఇక ధ్యానమే నా మార్గం అవుతుందేమో? అది మనలో దాగివున్న శక్తిని వెలికితీస్తుంది. రోజూ ఉదయం ధ్యానం చేస్తే ఆ రోజంతా శారీరకంగా, మానసికంగా కూడా ప్రశాంతంగా ఉంటుంది. ఆరోజంతా ఆరోగ్యకరమైన నిర్ణయాలు తీసుకొనే వీలుంటుంది. వ్యక్తి వికాసానికి తద్వారా ఆరోగ్యకరమైన సమాజానికి ధ్యానమే సరైన మార్గం అని నా విశ్వాసం. మా కుటుంబ సభ్యులందరి లోనూ భక్తిభావం వుంది. ఒకసారి మా అమ్మాయి ఏదో నోము నోచుకుంటుంటే నేను చూస్తూ కూర్చున్నాను. నిమ్మకాయ బద్దను దొప్పగా చేసి, అందులో నెయ్యితో జ్యోతి వెలిగించి పూజ చేసింది. పసుపువన్నె నిమ్మబద్దలో నెయ్యితో వెలుగు తున్న జ్యోతి కాంతులు ప్రతిఫలిస్తున్నాయి. ఆ జ్యోతులను చూసి మనసంతా ఏదో మధురమైన భావంతో నిండిపోయింది. మనల్ని నడిపించే అతీత శక్తి ఏదో ఉందనే విషయం యువత మనసులో వుండాలి. అప్పుడే వారు ధైర్యంగా లక్ష్య సాధన దిశగా కృషి చేస్తారు.

ప్రపంచం సుఖయయంగా ఉండాలని కోరుకొనే వాళ్ళంతా నా దృష్టిలో దేవుళ్ళే.

– అక్టోబర్ 15, 2004

**శాస్త్రీయ విజ్ఞానం భౌతికమైనది. దివ్యమైనదే ఆధ్యాత్మిక జ్ఞానం అని ప్రబోధించారు దత్తాత్రేయ స్వామి. ప్రేమ నిండిన మనసుతో, బాధలో ఉన్న వారిని అదుకునేందుకు అవతరించిన వారు అవధూతలు. ఆ కోవకు చెంది, వేదానికి, నాదానికి, యోగానికి వారధిగా నిలుస్తున్నారు అవధూత దత్తపీఠాధిపతి శ్రీ గణపతి సచ్చిదానంద స్వామి. భక్తి, ఆధ్యాత్మిక అంశాలపై ఆయన వాణి.**



# అందరి మంచి కోరడంలోనే నిజమైన ఆనందం

నేను ప్రబోధించే భక్తి మార్గం ప్రత్యేకమైందేమి కాదు.. పరమాత్ముడు ఒక్కడే... మానవులంతా ఒక్కటే.. దీనదళితుల్లో భగవంతున్ని చూడండి..భగవంతుని తృప్తి పరచడానికి ఏ బాహ్య పటాటోపమూ అక్కరలేదు. పవిత్రమైన జీవితాన్ని భగవంతుడు ప్రేమిస్తాడు.

ఆధ్యాత్మిక చింతన గల తలిదండ్రులు లభించడంతో భక్తి భావం పుట్టుకతోనే వచ్చింది. మా తాతగారు మంచి ఉపాసకులు. తల్లి గర్భవతిగా ఉన్నపుడే నదీతీరంలోని శిథిలాలయంలో గంటల తరబడి భగవంతుని ధ్యానించేది. పవిత్రమైన దైవ సంకీర్తనలను నిత్యం పాడుతూ ఉండేది.. అమ్మే నాకు ఆది గురువు. భక్తి భావాలను నాకు నేర్పింది ఆమే. చిన్నతనం నుంచే నాకు ఆధ్యాత్మికం కూడా ప్రబోధించేది. అమ్మ ఆదేశంతో నే ఆధ్యాత్మికపరమైన ఈశ్వర గుణానికి అనుసంధానం కలిగించే పనిని మూడేళ్ల వయసు నుంచే సంకల్పించా. తల్లి ఆకాంక్షల మేరకు ఆమె చెప్పినట్లు నడుచుకుంటూ నా కర్తవ్యాన్ని, నా ధర్మాన్ని నిర్వహిస్తున్నాను. అలాగే అందరూ తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తే అందరికీ మేలు జరుగుతుంది. నేను ప్రబోధించే భక్తి మార్గం ప్రత్యేకమైందేమి కాదు.. పరమాత్ముడు ఒక్కడే...మానవులంతా ఒక్కటే.. దీనదళితుల్లో భగవంతున్ని చూడండి..భగవంతుని తృప్తి పరచడానికి ఏ బాహ్య పటాటోపమూ అక్కరలేదు. పవిత్రమైన జీవితాన్ని భగవంతుడు ప్రేమిస్తాడు. భక్తి ప్రవత్తులను సమర్పణ చేస్తే భగవంతుడు ప్రశంసిస్తాడు. ఇదే నా అభిప్రాయం ...లక్ష్యం కూడా...

మతాలు, పీఠాల లక్ష్యం సర్వమానవ హితమే. ధర్మ ప్రచారం వీటి పరమార్థం. ధర్మప్రచారం సమాజహితం కోసమే. ప్రచారం అనంతరం మిగిలిన సమయంలో ఎక్కువ భాగం

సమాజసేవకే వినియోగిస్తే మంచిది. ప్రస్తుతం అధిరోహించిన స్థానాలను కొద్దిగా దిగి అధికారాల కోసం పాకులాడకుండా సమాజ శ్రేయస్సుకే ప్రాధాన్యం ఇవ్వాలి. నేను అలాగే ఆచరిస్తున్నా.. భక్తి, ఆధ్యాత్మికాలు రెండూ ఒక్కటే. ఒక్క నాణానికి గల రెండు రూపాలు. ఇవి రెండూ ఉండాలి. మనిషి తరించటానికి ప్రధాన సాధనంగా భక్తిని పేర్కొన్నారు పెద్దలు. భక్తిని బలవంతంగానైనా అలవాటు చేసుకోవాలి. ఆధ్యాత్మికం అంటే క్రమశిక్షణ. చిత్తశుద్ధితోనే ఆధ్యాత్మికంలోకి ప్రవేశించాలి. చిత్తశుద్ధిని అలవరచుకోవడంలో ఏకాగ్రత, స్నేహం, బోధన, గురుమహిమ, భాషలు ప్రధానం. వీటిని పెంపొందించుకునేందుకు భక్తి అవసరం. మానవునికి రెండూ కావాలి. ఆధ్యాత్మికతతో వచ్చే క్రమశిక్షణతో జీవితం ఆరోగ్యంగా ఉంటుంది. ఆరోగ్యం బాగుండాలి. అప్పుడే సమాజం బాగుంటుంది.

భక్తిని బలవంతంగా నైనా అలవాటు చేసుకోవాలి. ఆధ్యాత్మికం అంటే క్రమశిక్షణ. చిత్తశుద్ధి తోనే ఆధ్యాత్మికంలోకి ప్రవేశించాలి.

జనంలో డబ్బుపై గల మోజు.. ఆధునిక పరికరాల ప్రవేశం.. తదితరాలతో భక్తి కొంత తగ్గినట్లు అనిపించవచ్చు. కాని మరోచోట ఖండితంగా పెరుగుతోంది. ప్రపంచంలో కష్టాలు, ఆపదలు మానవుని స్పృశిస్తూనే ఉంటాయి. ఆపదల్లో, కష్టాల్లో చిక్కుకున్నపుడు స్నేహితుడు భగవంతుడు ఒక్కడే. ఈ సత్యాన్ని గ్రహించినపుడు నిబ్బరం, నిర్భయత్వం, మనశ్శాంతి లభిస్తాయి. భగవంతుడి దరి చేరడానికి మార్గం భక్తిభావమే. అందువల్ల భక్తి ఒక చోట సన్నగిల్లినట్లున్నా మరోచోట పెరగడం అనివార్యం. భక్తి ఆధ్యాత్మిక భావాలు మానవ సేవ చేయడానికి ఉపకరిస్తాయి...జీవితంలో అధికారం, ఐశ్వర్యం లభించినా తోటి మానవులకు సాయం చేయడం తృప్తినిస్తుంది. శాంతిని చేకూరుస్తుంది. అదే నిజమైన సేవంటే.. ఆధ్యాత్మిక మంటే ఇతరులను ఆదుకోవడమే..అదే భగవంతుని ఆజ్ఞ. అది పాటిస్తే మానవులకు సుఖమయ జీవితం లభించినట్లే.

ఆపదల్లో, కష్టాల్లో చిక్కుకున్నపుడు స్నేహితుడు భగవంతుడు ఒక్కడే. ఈ సత్యాన్ని గ్రహించినపుడు నిబ్బరం, నిర్భయత్వం, మనశ్శాంతి లభిస్తాయి.

పాశ్చాత్య ప్రభంజనంలో హిందూ సంప్రదాయ ఉనికి ప్రశ్నార్థకమని మనం అనుకుంటున్నాం..అంతే.. విదేశీయులెందరో మన హిందూ సంప్రదాయాన్ని, మానవ సంప్రదాయాన్ని గౌరవిస్తున్నారు. అన్ని సంప్రదాయాలు ఒక్కటే చెబుతున్నాయి. సత్యంగా ఉండండి.. స్నేహంగా.. గౌరవంగా ఉండండి. ధర్మాన్ని వీడకుండా ఆచరించండి. ఇవి అందరూ పాటించవలసినవే. పాశ్చాత్య నాగరికత ప్రభంజనం అంటే గుడ్డివాడికి హఠాత్తుగా కళ్లు వస్తే.. ఏమీ లేని వాడికి నడమంత్రపు

సత్యంగా ఉండండి..
స్నేహంగా ..
గౌరవంగా ఉండండి.
ధర్మాన్ని వీడకుండా
ఆచరించండి. ఇవి
అందరూ పాటించ
వలసినవే.

సిరి వస్తే.. ఎలా ప్రవర్తిస్తారో అలా కొద్ది కాలం దాని ప్రభావం ఉంటుంది. మళ్ళీ చిట్టచివరకు ఆధ్యాత్మిక సంప్రదాయం చేరవలసిందే...ప్రజలందరూ ఆ మార్గం అనుసరించ వలసిందే ..తప్పదు.



సామాన్యులు ఆరుబయట చేయగలిగే యోగం, త్యాగం, ప్రాణాయామం, సంప్రదాయ ఆచరణ వంటి వాటికి కొత్తపేర్లు, బోర్డులుపెట్టి అట్టహాసంగా నాలుగు గోడల నడుమ నేర్పుతున్నారు. దీంతో ఆధ్యాత్మిక విషయాలు వ్యాపారంగా మారాయి. కొందరు ధనవంతులు కూడా ఇలాంటి హడావుడి, ఆడంబరాలు ఉంటేనే ఆకర్షితులవుతున్నారు. భక్తి వ్యాపారం కాకూడదు. అది ఒక విశిష్టభావం. మమత నుంచి కోరిక..కోరిక నుంచి దుఃఖం జనిస్తాయి. కోరికలు తీరినంత మాత్రాన ఆనందం కలుగదు. కొత్త కోరికలు పుడుతుంటాయి. కాబట్టి నిజమైన ఆనందం నిజమైన తృప్తిలో ఉంటుంది. సరైన మార్గం ఎంచుకొని, ఆ లక్ష్యాన్ని సరైన పథంలో, సర్వజన హిత భావంతో సాధించడంలోనే నిజమైన ఆనందం లభిస్తుంది. భగవంతుడు నిరూపుడు. అది ఒక కనిపించని చైతన్యం. భగవంతుడు అన్న పదం ఉన్న చోట 'సమాజం' వాడితే ఎవరికి అభ్యంతరం ఉండదు. సమాజమే భగవత్ స్వరూపం. నేను అన్నింటా భగవంతుడ్ని చూస్తుంటాను. ఆయనతో గల అనుబంధం మాటలకందనిది.

మమత నుంచి
కోరిక.. కోరిక నుంచి
దుఃఖం జనిస్తాయి.
కోరికలు తీరినంత
మాత్రాన ఆనందం
కలుగదు. కొత్త కోరిక
లు పుడుతుంటాయి.

– అక్టోబర్ 22, 2004



**తెలుగు సినీ అభిమానులకు దశాబ్దాలుగా ఆమె చిరపరిచితురాలు. తెలుగుతనం మూర్తీభవించినట్టు ఉండే ఆమె పేరే జయసుధ. నాలుగు దశాబ్దాల పాటు హిందువుగా అందరు దేవుళ్లనూ ఆరాధించి ఆ తరువాత బాప్టిజం తీసుకున్నారు. హిందూమతంలో దారి చూపే వ్యవస్థలేకపోవడమే తనను ఏసుక్రీస్తు వైపు నడిపించిందంటున్న జయసుధ మనసులోని మాటలు.**



# సేవాభావంతోనే దైవదర్శనం

మద్రాసులో పుట్టాను. మా అమ్మగారిది విజయనగరం. నాన్నగారిది తమిళనాడు. ఇంట్లో పెద్దగా పూజలు, పునస్కారాలు ఉండేవి కావు. చిన్నతనం నుంచి నాకు ఇష్టమైన దేవుళ్ళు వినాయకుడు, ఆంజనేయుడు. తిరుపతి వెంకటేశ్వరుడు, సాయిబాబాలంటే కూడా ఇష్టమే. కానీ ఎంతమంది దేవుళ్లను ఆరాధించినా చిన్నప్పటి నుంచీ జీసస్ అంటే భక్తి ఉండేది. అది ఎలా ఏర్పడిందో తెలియదు. ఎల్‌కెజి, యుకెజి మాత్రమే క్రిస్టియన్ స్కూల్‌లో చదువుకున్నాను. క్రిస్టియానిటి ప్రభావం అంతగా లేకపోయినా ఎందుకో బాల్యం నుంచి జీసెస్ పట్ల అంతర్లీనంగా ఆరాధన ఉండేది. సినిమా రంగంలోకి అడుగుపెట్టిన తరువాత భక్తిభావం పెరిగింది. సోమవారం శివుడితో మొదలు అన్ని వారాలు అందరు దేవుళ్లకు పూజలు చేసేదాన్ని. పెళ్ళయిన తరువాత భక్తిభావం మరింత పెరిగింది. నా భర్త అందమైన పూజగది కట్టించారు. అందులో అందరు దేవుళ్ళతో పాటు ఏసుప్రభువు కూడా ఉండేవాడు. దేవుళ్లకు పూజ చేసే సమయంలో వాళ్లతో మిత్రులతో మాదిరిగా మాట్లాడే దాన్ని.



**చిన్నతనం నుంచి నాకు ఇష్టమైన దేవుళ్ళు వినాయకుడు, ఆంజనేయుడు. తిరుపతి వెంకటేశ్వరుడు, సాయిబాబా లంటే కూడా ఇష్టమే. కానీ ఎంతమంది దేవుళ్లను ఆరాధించినా చిన్నప్పటి నుంచీ జీసస్ అంటే భక్తి ఉండేది.**



ఒకసారి ఓ అద్భుతం జరిగింది. నాజీవితాన్ని మలుపు తిప్పిన సంఘటన అది. ఒక ఘోరమైన రోడ్డు ప్రమాదం నుంచి బయటపడ్డాను. ఆ ఏసే నన్ను ప్రమాదం నుంచి రక్షించాడనిపించింది. ఏసు ప్రభువే నాకు రక్ష అని ఆ క్షణంలోనే అనుకున్నాను. 42 సంవత్సరాల పాటు హిందువుగా ఉన్న నేను

**హిందూధర్మంలో ప్రేమభావం, ఇతరులను ఆదరించడం, క్రమశిక్షణ వంటి ఖచ్చితమైన నియమాలు అందులో కనిపించలేదు.**

2001లో మార్చి 21న బాప్టిజం తీసుకున్నాను. క్రిస్టియానిటీలో గొప్పతనం ఉందనిపించింది. ఇతరుల పట్ల ప్రేమ, సమ భావం, దానగుణం ఇందులో ఎక్కువగా కనిపిస్తుంది. మనదేశంలో ఉన్న మంచి స్కూల్స్‌కాని, ఆస్పత్రులు కానీ మిషనరీవే కావడం ఇందుకు ఉదాహరణ. సేవాగుణం మూర్తీభవించిన మదర్ థెరిస్సా ఎవరు? మరెక్కడా అంతటి గొప్పవారు ఎందుకు లేరు? నేను చెన్నైలో ఉన్నప్పుడు కాలింగ్ (భగవంతుని పిలుపు) వచ్చింది. సేవచేద్దామనే లక్ష్యంతో హైదరాబాద్‌కు నివాసం మార్చాను. చిన్నతనంలో మా తాతగారు హైదరాబాద్‌లో ఉండేవారు. వేసవి సెలవుల్లో అందరం ఇక్కడకు వచ్చే వాళ్ళం. హైదరాబాద్ వచ్చినా నాకు మద్రాస్ అంటేనే మక్కువగా ఉండేది. అక్కడ అయ్యంగార్ వంటి సంప్రదాయ కుటుంబాలు ఎక్కువగా ఉన్నాయి. వారిలో దేవునిపై భక్తి, భయం కొంచెం కనిపిస్తాయి. హిందూధర్మం ఉన్నతమైనదనడంలో సందేహం లేదు. అయితే ప్రేమభావం, ఇతరులను ఆదరించడం, క్రమశిక్షణ వంటి ఖచ్చితమైన నియమాలు అందులో కనిపించలేదు. మార్గదర్శనం చేసే సంస్థలు కరవయ్యాయి. అందుకే ప్రపంచ వ్యాప్తంగా బౌద్ధం పట్ల ఆదరణ పెరిగిపోతున్నది. క్రిస్టియన్లు ఆదివారం చర్చికి వెళతారు... రంజాన్ నెల వచ్చిందంటే ముస్లింలలో చిన్నపిల్లలు సైతం నమాజ్ చేస్తారు. భగవద్గీతలో ఎన్నో గొప్ప విషయాలు ఉన్నాయి. కానీ వాటి గురించి తెలిసిన వారు చాలా తక్కువ. వాటి గురించి వివరించి మార్గదర్శనం చేసేవారు నేడు కరువయ్యారు. అందుకే చాలా మందిలో భక్తి తగ్గిపోతోంది. ప్రతివారం అందరూ ఆలయానికి తప్పకుండా రావాలని, భగవద్గీత చదవాలని నిబంధన ఉండి ఉంటే పరిస్థితి మరోలా ఉండేదేమో!

**ప్రతివారం అందరూ ఆలయానికి తప్పకుండా రావాలని, భగవద్గీత చదవాలని నిబంధన ఉండి ఉంటే పరిస్థితి మరోలా ఉండేదేమో!**

క్రిస్టియానిటీలో సేవాభావానికి ఆర్భాటం పనికిరాదు. బైబిల్‌లో ఈ విషయం స్పష్టంగా చెప్పారంటూ చకచకా బైబిల్ పేజీలు తిరగేసి నూతన నిబంధనలోని మత్తయ్య ఆరవ అధ్యాయంలో కొన్ని వాక్యాలను చదివి వినిపించారామె. ''ఇతరుల పొగడ్తలు పొందేందుకు దానధర్మాలను ఆర్భాటంగా చేయాల్సిన పని లేదు. నీవు కుడిచేత్తో చేసే దానం ఎడమచేతికి తెలియకుండా రహస్యంగా చేయా''లనేది ఆ వాక్యాలసారం. వైభవంగా పూజలు జరిపించడం, ఉపవాసాలు చేయడం ఆధ్యాత్మికత అనిపించుకోదు. బైబిల్‌ని కంఠతా పట్టేసిన వాళ్లూ, గీతలోని

విషయాలు ఔపోశన పట్టిన వాళ్లూ ఎంతోమంది ఉంటారు. కానీ అది గొప్పవిషయం కాదు. సేవామార్గంలో నడుస్తూ భగవంతుని చేరుకొనే వారు చాలా తక్కువ మంది ఉంటారు. చాలామంది పూజలకోసం ఎంతో ఖర్చు పెడతారు. కానీ అవసరంలో ఉన్నవారికి అయిదు రూపాయలు ఇవ్వడానికి ఆలోచిస్తారు. చెన్నైలో ఒకసారి రోడ్డు మధ్యలో అమ్మవారి ఫోటో పెట్టి, ఆ ఫోటోను 108 బిందెల పాలతో అభిషేకం చేశారు. దీనివల్ల ఒరిగేదేముంది? ఆ పాలు ఎంతోమంది అనాథబాలల కడుపు నింపేవి కదా...

చాలామంది పూజల కోసం ఎంతో ఖర్చు పెడతారు. కానీ అవసరంలో ఉన్నవారికి అయిదు రూపాయలు ఇవ్వడానికి ఆలోచిస్తారు.

మతం పట్ల, భగవంతుని పట్ల అందరికీ నమ్మకం ఉండకపోవచ్చు. ఉదాహరణకు అక్కినేని నాగేశ్వరరావుగారు భగవంతుడ్ని నమ్మరు. కానీ పక్కవారికి అన్యాయం చేయరాదనే వివేచన ఆయనకు ఉంది. తప్పు చేయకూడదనే స్పృహ ఉంది. నిజానికి ఈ స్పృహే వారు నమ్మే దేవుడు. ఆ జ్ఞానమే భగవంతుడు. ఈ మధ్య కాలంలో యోగ, ధ్యానం పట్ల యువతలో సైతం ఆదరణ పెరుగుతున్నది. ఆధ్యాత్మిక భావాలు పెరుగుతున్నాయి. యోగం అనేది వ్యాయామం వంటిది. యువత సైతం తమ ఒత్తిడిని తగ్గించే మాధ్యమంగా వీటిని ఎంచుకుంటోంది. కానీ అవసరంలో ఉన్నవారిని ఆదుకోవడంలో మరింత ప్రశాంతత లభిస్తుంది. యోగ, ధ్యానాలు తప్పని అనను. కానీ వారంలో ఒకరోజు ఏదైనా కష్టంలో ఉన్న వారికి సేవ చేస్తే అనిర్వచనీయమైన ఆనందం లభిస్తుంది.

హైటెక్ సంస్కృతికి అలవాటుపడిన పిల్లల్లో భక్తిభావం తగ్గుతోంది. ఈ తరం బాగుపడాలంటే వారికి ఆధ్యాత్మిక జ్ఞానం కలిగించడం ఒక్కటే మార్గం.

అప్పటికీ ఇప్పటికీ పెద్దవారిలో అంతగా మార్పేమీ లేదు కానీ హైటెక్ సంస్కృతికి అలవాటుపడిన పిల్లల్లో భక్తిభావం తగ్గుతోంది. ఈ తరం బాగుపడాలంటే వారికి ఆధ్యాత్మిక జ్ఞానం కలిగించడం ఒక్కటే మార్గం. మతదురభిమానంతో కొట్టుకోకుండా మతగ్రంథాల్లోని మంచి విషయాలను వారికి బోధించాలి. మన సంస్కృతి ఔన్నత్యాన్ని తెలిపి, మంచిచెడుల విచక్షణ పెంచాలి. వారిలో సేవాతత్పరతను పెంపొందించాలి. సేవామార్గంలో నడిచేవారిలో క్రమశిక్షణ అదే అలవడుతుంది. భగవద్దర్శనం కోసం గుడికి వెళ్లే అవసరం లేదు. సేవలోనే ఆయన్ని దర్శించుకోవచ్చు.

– అక్టోబర్ 29, 2004

**ఆయన ఆహార్యం, హావభావాల్లో భక్తిభావం తొణి కిసలాడుతూ ఉంటుంది. రాజకీయాలు, వ్యాపార రంగం, కళలు.. ఇలా అన్ని రంగాల్లో తనదైన ముద్ర చూపే ఆయనే కళాబంధు టి. సుబ్బిరామిరెడ్డి. సంప్రదాయం, ఆధునికతల మేలిమి మిశ్రమంగా కని పించే ఆయన, సేవాభావమే భక్తికి పరమార్థం, సమా జానికి సేవచేసే నక్సలైట్లు కూడా భక్తులే అంటున్నారు.**



# సేవాభావమే భక్తిసారం

భక్తి అంటే కేవలం భగవంతుడిని ఆరాధించడమే కాదు. ఆపదలో ఉన్న వారికి సహాయం చేయాలి. మానవత్వం, దయ, క్రమశిక్షణ ఉండాలి. ఇవన్నీ ఏమి లేకుండా ఆలయాలకు వెళ్లి పూజలు చేస్తే ప్రయోజనం ఉండదు. ఒక విధంగా చూస్తే కమ్యూనిస్టులు కూడా భక్తిపరులే. వారు ఈ మార్గాన్ని నమ్మక పోవచ్చు. అయితే పది మందికి సాయం చేయాలనుకోవడమే భక్తి. భక్తి శక్తి అనంతమైనది. ఆ మాధుర్యం రుచి తెలిసిన వారికి ప్రపంచంలో మరేదీ రుచించదు. రాజకీయాల్లో వున్నా, సిని మాల్లో ఉన్నా, వ్యాపారాల్లో ఉన్నా భగవత్ ధ్యానం నాకు అని ర్వచనీయమైన అనుభూతి కలిగిస్తుంది. మా కుటుంబంలో మొదటి నుంచి భక్తి, ఆచార వ్యవహారాలు ఉండేవి. నాకు ఐదేళ్ళ వయసు నుంచి భక్తితత్వం అలవడింది. మూల మంత్రాన్ని ఏకాగ్రతతో ఉపాసన చేయడం ప్రారంభించాను. అందులో ఉన్న అనుభూతిని మెల్లమెల్లగా అనుభవిస్తూ వచ్చాను. ఆ పరంపరలోనే నాకు తపస్సారాధన అలవాటైంది. నేను రాజకీయం, కళారంగాల్లో ఉన్నప్పటికీ భక్తితత్వంలో ఎంతో సాధించుకోవడానికి మూల కారణం ఏకాగ్రత.



భక్తి అంటే కేవలం భగవంతుడిని ఆరాధించడమే కాదు. ఆపదలో ఉన్న వారికి సహాయం చేయాలి. మానవత్వం, దయ, క్రమశిక్షణ ఉండాలి. ఇవన్నీ ఏమి లేకుండా ఆలయాలకు పోయి పూజలు చేస్తే ప్రయో జనం ఉండదు.



చిన్నతనంలో నేను చూసిన భూకైలాస్, భక్తప్రహ్లాద లాంటి పౌరాణిక చిత్రాలు నాలో భక్తి భావాన్ని మరింత పెంచాయి. తపస్సు ద్వారా భగవంతుడి అనుగ్రహం పొంది మానసిక శాంతి సంపాదించవచ్చనే నిజం తెలుసుకున్నాను. అప్పటి

నుంచే తపస్సు చేయడం ప్రారంభించాను. కళ్ళతో కాకుండా మనసుతో దైవాన్ని ఆస్వాదించాలని దైవ చింతనకు అలవాటు పడ్డాను. నేను ఎక్కడున్నా ఉదయమే నిద్రలేచి రెండు గంటల సేపు తపస్సు చేస్తాను. కార్తీక మాసంలో అయితే మూడు గంటలు కొనసాగిస్తాను. జీవన విధానాన్ని ఒక పద్ధతికి అనుగుణంగా అలవాటు చేసుకోవడం వల్ల టూర్స్‌లో ఉన్నా ఈ నియమ నిష్టలను పాటించగలుగుతున్నాను. నేను శ్రీ శైలం మల్లికార్జున ఆలయానికి వెళితే శ్రీ వేంకటేశ్వరస్వామి జపం చేస్తాను. తిరుమల ఆలయానికి వచ్చినపుడు శివనామస్మరణ చేస్తాను. నాఫిలాసఫీ అయితే శివకేశవులకే కాదు. అల్లా, జీసస్‌కు కూడా తేడా లేదు. మంచి మార్గాన్ని ప్రబోధించిన వీరంతా దేవుళ్ళే. నేను భక్తి మార్గంలో ప్రయాణం ప్రారంభించినప్పటి నుంచి ఏనాడు ఎలాంటి సమస్యలు తలెత్తలేదు. ఇంతకు మించిన అనుభవం అక్కర్లేదనుకుంటాను. ఇక భగవంతుడితో అనుబంధం గురించి అంటారా? నాలో కలిగే దివ్య అనుభూతే ఆయనతో ఉన్న అనుబంధం. భగవత్ సాన్నిధ్యం పొందడానికి మార్గాలు అనేకం ఉన్నాయి. దేని ప్రాధాన్యం దానికి ఉంటుంది. నాకైతే తపస్సు, ప్రాణాయామం, మానవత్వంతో కూడుకున్న మనస్సు ముఖ్యమైనవిగా భావిస్తాను.

**నాఫిలాసఫీ అయితే శివకేశవులకే కాదు. అల్లా, జీసస్‌కు కూడా తేడా లేదు. మంచి మార్గాన్ని ప్రబోధించిన వీరంతా దేవుళ్ళే.**

భక్తి అంటే కేవలం మోక్ష సాధనే కాదు. పది మందికి సహాయం చేయడం. మానవత్వంతో మెలగడం. అసలు భక్తికి పునాది మానవత్వమేనని నేను నమ్ముతాను. పదిమందికి మేలు చేయగలిగితే అదే జీవితానికి పరమార్థంగా భావించవచ్చు. భక్తి క్రమశిక్షణను నేర్పుతుంది. అయితే భక్తి లేని వారంతా చెడ్డ వారు కాదని, భక్తి పరులంతా మంచి వారని కూడా చెప్పలేం. భక్తి అనేది చేసే పనిలో ఉండాలి. దాని ద్వారా ఆపదలో ఉన్న వారికి సహాయం అందాలి. ఒక విధంగా చూస్తే కమ్యూనిస్టులు కూడా భక్తి మార్గంలోకే వస్తారు. వారు దేవుణ్ణి వ్యతిరేకించవచ్చు. కానీ వారి సిద్ధాంతాల్లో పేదలకు న్యాయం జరగాలనే త్యాగం ఉంది. అందుకే వీరు భక్తి కిందకే వస్తారు. భక్తి అంటే భక్తిగానే ఉండాలి. నాకు భక్తి ఉన్నందువల్ల కోరుకున్న పనులు ఊరకే కూర్చుంటే అవుతాయా? ఇలాంటి మూఢ భక్తిని నమ్ముకుని మన ధర్మాన్ని మనం నిర్వర్తించకపోతే తప్పు. అంతే కానీ భక్తి వల్ల జాతి నిర్వీర్యం అయ్యిందని, మనం వెనుకపడ్డామని అనడంలో అర్థం లేదు. నిజంగా భక్తికి ఆ పవర్ లేకపోతే

**భక్తి అనేది చేసే పనిలో ఉండాలి. దాని ద్వారా ఆపదలో ఉన్న వారికి సహాయం అందాలి. ఒక విధంగా చూస్తే కమ్యూనిస్టులు కూడా భక్తి పరులే.**

**భక్తికి పవర్ లేకపోతే ప్రపంచ జనాభాలో 70 శాతం మంది ఆలయాలు, ఆరాధన మందిరాలకు ఎందుకు వెళతారు?**

ప్రపంచ జనాభాలో 70 శాతం మంది ఆలయాలు, ఆరాధన మందిరాలకు ఎందుకు వెళతారు? వాళ్ళంతా పిచ్చోళ్ళా? ఎవరి విశ్వాసం వారిది. ఒకరి విశ్వాసాలను మరొకరు దెబ్బతీయకూడదు? పీఠాధిపతులు సన్యాసులకు ఏది సొంతం అనేది ఉండదు. వారు నిత్యం ధర్మప్రచారమే చేయాలి. అయితే వీరిలో కూడా ఒక్కొక్కరు ఒక్కో విధంగా తమ ధర్మాన్ని నిర్వర్తిస్తుంటారు. అయితే కొన్ని సందర్భాల్లో అనుకోకుండా జరుగుతున్న సంఘటనల వల్ల కొంత మంది మఠాధిపతులు, పీఠాధిపతులు రాజకీయాల్లో జోక్యం చేసుకుంటున్నారు.

భక్తిని ప్రభోధించే ఆదిశంకరాచార్య, భారతీయ తత్వాన్ని తెలిపే వివేకానందలాంటి చిత్రాలు తీశాను. భవిష్యత్‌లో ఇలాంటివి మరేమైనా చిత్రాలు నిర్మించే ఆలోచన ఉందా అనే ప్రశ్నకు ఆలోచన అయితే ఉంది. అయితే మంచి సబ్జక్ట్ దొరకాలి అంతే.

**ఈ ప్రపంచంలో ఏవైనా అశాశ్వతమైనవే. అందుకే మానవాతీతమైన ఆ శక్తి (భగవంతుడు)ని ఆరాధించాలి.**

మానవాతీతమైన శక్తి ఒకటుంది. మనిషి ప్రధానమంత్రి కావచ్చు. కోటీశ్వరుడు కావచ్చు. ఈ ప్రపంచంలో ఏవైనా అశాశ్వతమైనవే. అందుకే మానవాతీతమైన ఆ శక్తి(భగవంతుడు)ని ఆరాధించాలి. యువత ఆ మార్గం అలవరచుకుని ప్రపంచాన్ని సన్మార్గంలో నడిపించడానికి ముందుకు రావాలి.

– నవంబర్ 5, 2004



**ఆయన 'మేనేజ్‌మెంట్ గురు'... సనాతన భారతీయ ఆధ్యాత్మికతను ఆకళింపు చేసుకొని, దానికి ఆధునికత అద్దిన వారిలో ఆయన అగ్రగణ్యులు. ఆయనే స్వామి సుఖబోధానంద. కర్ణాటక నుంచి హిమాలయాల వరకు... ఆపై అంతర్జాతీయ వేదికల వరకు సాగిన ఆధ్యాత్మిక ప్రయాణం గురించి ఆయన చెప్పిన విశేషాలు.**



# అసంతృప్తిపై విజయమే ఆధ్యాత్మికం

మొదటి గురువు చిన్మయానంద. ఆయన వద్ద భగవద్గీత, ఉపనిషత్తులు అభ్యసించాను. తర్వాత హిమాలయాలకు వెళ్ళి స్వామి బుద్ధానంద వద్ద బ్రహ్మసూత్రాలు నేర్చుకున్నాను. జిడ్డు కృష్ణమూర్తి, ఓషో, రజనీష్ నన్నెంతో ప్రభావితం చేశారు. బికామ్ చేసి, అద్వైత వేదాంతంలో మాస్టర్ ఆఫ్ ఫిలాసఫీ చేశాను. అద్వైత భావాలు కలిగినా నేను శ్రీకృష్ణుని భగవద్గీతకు చాలా ఆకర్షితుడనయ్యాను. ఒక రకంగా కృష్ణుని భక్తుడిన నుకోవచ్చు. అందుకే ఆయన చేసిన జ్ఞానబోధను అర్థం చేసుకోగలిగితే సాధించలేనిది లేదనిపించింది. ఆధ్యాత్మికం పారమార్థిక తత్వం మాత్రమే కాదు. వ్యవహారంలోకి ఈ తత్వాన్ని తీసుకురావాలి. దీన్ని సాధారణ జీవితానికి ఆపాదించినప్పుడు మాత్రమే సరైన ఫలితం ఉంటుంది. అందుకే ఈ దిశగా కృషి ప్రారంభించాను.

> అద్వైత భావాలు కలిగినా నేను శ్రీకృష్ణుని భగవద్గీతకు చాలా ఆకర్షితుడనయ్యాను. ఒక రకంగా కృష్ణుని భక్తుడిననుకోవచ్చు. అందుకే ఆయన చేసిన జ్ఞానబోధను అర్థం చేసుకోగలిగితే సాధించలేనిది లేదనిపించింది.

ఆధ్యాత్మికత రెండు రకాలు. ఆధ్యాత్మిక భావాలు లేనివారు కంటికి కనిపించేవి మాత్రమే సత్యమైనవని విశ్వసిస్తారు. కాని చాలారకాలైన విషయాలను మనం చూడలేం కానీ అనుభవించగలుగుతాం. శరీరంలోని ఇంద్రియాల స్పందన కంటికి కనిపించదు. అంతమాత్రాన ఆ స్పందనలు లేవని అనగలమా? ఆధ్యాత్మిక భావాలు కూడా అలాంటివే. లేని విషయాల పట్ల అసంతృప్తి లేకుండా ఉండటమే నిజమైన ఆధ్యాత్మికత. చైతన్యానికి మరోరూపం ఆధ్యాత్మికత. మనసు చైతన్యమైతే మంచి

శరీరంలోని ఇంద్రియాల స్పందన కంటికి కనిపించదు. అంతమాత్రాన ఆ స్పందనలు లేవని అనగలమా? ఆధ్యాత్మిక భావాలు కూడా అలాంటివే.

ఆలోచనలు వస్తాయి. ఫలితంగా ప్రతి విషయాన్నీ సూక్ష్మంగా ఆలోచిస్తాం. దానివల్ల జ్ఞానం పెరుగుతుంది. చైతన్యం పెరుగుతుంది. ఆత్మ అందుకు సాక్ష్యం. అదే ఆత్మసాక్షాత్కారానికి పునాది. చైతన్యం నాలుగు దశల్లో కలుగుతుంది. మొట్టమొదట ఆలోచనలు ప్రారంభమవుతాయి. ఆ తరువాత ఆ ఆలోచనలు ప్రభావం చూపించడం మొదలు పెడతాయి. వచ్చిన ఆలోచనలు మంచివా, చెడ్డవా అని విశ్లేషించుకోవడం మూడో దశలో జరుగుతుంది. నాలుగో దశలో ఆ ఆలోచనలకు మూలం కనుక్కునే దిశగా శోధన సాగుతుంది. ఈ ఆలోచనలను పరివర్తనం చెందేలా చేస్తే మనం చైతన్య దశకు చేరుకుంటాం. ఈ స్థితి శరీరానికి మాత్రమే పరిమితమైంది కాదు. మనం శరీరంలో చైతన్యం ఉందనుకుంటాం. కానీ శరీరం దృష్ట్యా చూస్తే దేహమే చైతన్యంలో ఒక భాగం. పూజలు చేస్తూ, విభూది రాసుకుంటే ఆధ్యాత్మికత కాదు. మేమూ కొబ్బరికాయ కొడతాం. కానీ అహంకార నాశనానికి సంకేతమది.

మనం శరీరంలో చైతన్యం ఉందనుకుంటాం. కానీ శరీరం దృష్ట్యా చూస్తే దేహమే చైతన్యంలో ఒక భాగం.

ఆధ్యాత్మికతను పెంచుకోవడానికి సులువైన మార్గం 'చిన్ముద్ర'. కుడిచేతి చూపుడు వేలు చివరి భాగం, బొటన వేలు అగ్రాన్ని తాకే విధంగా ఉంచడమే చిన్ముద్ర. దీనిలో ఎంతో అర్థం ఉంది. చూపుడువేలు జీవాత్మ, బొటనవేలు పరమాత్మ. జ్ఞానానికి సంకేతం. అంటే చిన్ముద్ర ఉద్దేశం జీవాత్మ పరమాత్మకు శరణాగతి కావాలని. ఇందుకోసం మూడు దారులున్నాయి. వాటిని సూచించేవి మిగిలిన మూడు వేళ్ళు. చిటికెన వేలు శరీర కేంద్రం. ఆనందంగా ఉండడం వల్ల శరీరంలో శక్తి తరంగాలు ప్రవహించి తమ ప్రభావాన్ని చూపిస్తాయి. ఉంగరపు వేలు భావకేంద్రం. మన మనసులోని భక్తి, కృతజ్ఞత వంటి మంచి భావాలను పెంచుకుంటే శక్తి ఉత్పత్తి అవుతుంది. మధ్యవేలు బుద్ధికేంద్రం. దుర్గుణాలు లేని మంచి బుద్ధిని పెంచుకోవాలని ఈ వేలు సూచిస్తుంది. ఈ మూడు కేంద్రాలపైన నియంత్రణ కలిగి ఉండి, మంచి బుద్ధిని, మంచి ఆలోచనలను పెంచుకుంటూ ఏ పనైనా శాంతంగా చేస్తే అత్యధిక జ్ఞానానికి సంకేతమైన పరమాత్మకు జీవాత్మ లొంగిపోతుంది. తద్వారా ఆత్మసాక్షాత్కారం కలుగుతుంది. బొటనవేలు, చూపుడువేలు కలిస్తే కనిపించే వృత్తం శూన్యమైన ఆలోచనలకు చిహ్నం. మనసులో ఏవిధమైన ఆలోచనలూ లేకుండా శూన్యమయమై ఉండడమే ధ్యానం. ఆ అభ్యాసమే మహాసాధనం. మతం, భక్తి, ఆధ్యాత్మి

కత అనేవి ఒకదానికొకటి సంబంధం కలిగి ఉంటాయి. ఆధ్యాత్మిక భావాల వల్ల చైతన్యాభివృద్ధి సాధ్యమవుతుంది. చైతన్యం పెంపొందితే భక్తి భావమూ పెరుగుతుంది. ఈ స్థితిలోకి చేరుకోవడం ఎలాగో తెలియచేసేది మతం.

మనసులో ఏవిధమైన ఆలోచనలూ లేకుండా శూన్యమయమై ఉండడమే ధ్యానం అవుతుంది. ఆ అభ్యాసమే మహా సాధనం.

ప్రతి మనిషికీ ఒక గమ్యం ఉండాలి. చాలామంది సరైన గమ్యం లేకుండా దిక్సూచి లేని నావ మాదిరిగా పయనిస్తుంటారు. అలాంటి వారికి కావలసిన దిక్సూచిని ఇవ్వడమే మేం చేస్తున్న పని. విజయం సాధించడం మాత్రమే నిజమైన సంతృప్తినివ్వదు. నచ్చింది సాధించుకోవడం విజయమైతే, సాధించిన దాన్ని ప్రేమించడమే సంతృప్తి. ఈ సంతృప్తి లేకపోతే విజయం ఆనందాన్ని ఇవ్వదు. ఈ ఆలోచనా విధానం పొందే మార్గాన్నే లైఫ్ కార్యక్రమం ద్వారా వివరిస్తున్నాం. అహంకారం లేకుండా, శాంతంగా, మంచిబుద్ధితో ఇవి సాధించడం చాలా తేలిక. మీ బోధనలు ఫైవ్‌స్టార్ హోటళ్ళకు మాత్రమే పరిమితమైపోతే సామాన్యులు వీటిని తెలుసుకునేదెలా? పూర్వపు ఆచార్యులు ఊరూరా సంచారం చేస్తూ ఆధ్యాత్మిక బోధనలు చేసేవారు కదా...... అని ప్రశ్నించవచ్చు, అందుకే టివి కార్యక్రమాలు ఇస్తున్నాను. గ్రామీణులు కూడా టివి చూస్తారు కాబట్టి అక్కడి వరకు చేరుతుంది. అంతేగాక మా ఆశ్రమంలో ఉచితంగా యోగా శిక్షణ, కౌన్సిలింగ్ ఇస్తున్నాం. ఒకసారి చెన్నైలో ఒక భిక్షగాడు నన్ను చూసి మీరు సుఖబోధానంద స్వాములు కదా అని నన్ను గుర్తు పట్టి అడిగాడు. ఆ స్థాయి వరకూ నేను చేరుకోగలిగానంటే సామాన్యులకు సైతం నా బోధనలు అందుతున్నట్టే కదా! ఆధ్యాత్మిక విషయాలను అందరూ అర్థం చేసుకోలేరు. కాబట్టి విద్యావంతులను జాగృతం చేసి వారి ద్వారా అందరిలోనూ చైతన్యం కలిగిస్తాం. యాజమాన్యంలో మార్పు తీసుకురాగలిగితే పనివారిలో మార్పు తేవడం సులువు. కానీ పనివాళ్లు మంచి మార్గంలో నడిచినా యాజమాన్యంలో ఆ స్పృహ కొరవడితే లాభం ఉండదు కదా? కాబట్టి వివిధ స్థాయులలో మెల్ల మెల్లగా చైతన్యం తేవాలని కృషి చేస్తున్నాం.

నచ్చింది సాధించుకోవడం విజయమైతే, సాధించిన దాన్ని ప్రేమించడమే సంతృప్తి. ఈ సంతృప్తి లేకపోతే విజయం ఆనందాన్ని ఇవ్వదు.

– నవంబర్ 12, 2004



**ఒంటపై కాషాయవస్త్రం లేనప్పటికీ ఆయన ప్రబోధించేది ఆధ్యాత్మికమే. దేశభక్తి లేని దైవభక్తి నిజమైన భక్తి కాదంటారు సద్గురు కందుకూరు శివానందమూర్తి. సాటివారికి సేవలందిస్తే అన్ని సమస్యలూ వాటంతటవే పరిష్కారం అవుతాయని, ఆధ్యాత్మిక జ్ఞానమే ప్రశాంత జీవనానికి పునాది అంటున్నారాయన.**



# పరహితమే పరమాత్మమార్గం

నేను పోలీసు శాఖలో కొంతకాలం పనిచేశాను. కానీ ఆ జీవితం సంతృప్తిని ఇవ్వలేకపోయింది. మనసును ఉత్సాహంగా ఉంచలేకపోయింది. అందుకే ఆ ఉద్యోగం నాకు ఉపయోగకరమైంది కాదనుకున్నాను. 35 ఏళ్ల క్రితం ప్రశాంతతను వెతుక్కుంటూ ప్రయాణం సాగించాను. చివరికి విశాఖపట్టణానికి ముప్ఫయి కిలోమీటర్ల దూరంలో ఉన్న భీమ్లీ(భీమునిపట్నం)లో స్థిరపడ్డాను. 'ఆనందవనం' కేంద్రం ద్వారా ఆధ్యాత్మిక, వైద్య, సేవా కార్యక్రమాలను నిర్వహిస్తున్నాను.



**తన బాగు మాత్రమే కాదు జాతి రక్షణ, దేశ రక్షణ గురించి కూడా అందరూ ఆలోచించాలి. పొరుగు దేశం కారణంగా కాశ్మీర్‌లో హిందువు మృతి చెందినా, ముస్లిం మరణించినా మన దేశ పౌరుడి ప్రాణాలకు నష్టం వాటిల్లిందని మనం బాధపడాలి.**



ప్రపంచానికి వేద విజ్ఞానాన్ని అందించిన భారతీయ సమాజంలో స్పందన కొరవడడం, చలనం లేకపోవడం బాధాకరం. ప్రజల్లో భక్తిభావం పెరిగిన మాట నిజమే. గుళ్లు, గోపురాలకు పెద్ద సంఖ్యలో వెళతారు. పెద్దఎత్తున ఆధ్మాత్మిక కార్యక్రమాలను నిర్వహిస్తారు. కొత్త కొత్త ఆలయాలను కోట్ల రూపాయల ఖర్చుతో నిర్మిస్తారు. వ్యక్తిగతంగా అందరూ భక్తిలో మునిగిపోతున్నారు. అయినా ఫలితం ఏముంది? సమాజానికి స్పందించే గుణం లేకపోవడమన్నది తీవ్రంగా ఆలోచించాల్సిన విషయం. ఇతరుల కష్టాలకు కూడా స్పందించే గుణం అలవర్చుకోవాలి. తన బాగు మాత్రమే కాదు జాతి రక్షణ, దేశ రక్షణ గురించి కూడా అందరూ ఆలోచించాలి. పొరుగు దేశం కారణంగా కాశ్మీర్‌లో హిందువు చనిపోయినా, ముస్లిం మరణించినా మన దేశ పౌరుడి ప్రాణాలకు నష్టం వాటిల్లిందని మనం బాధపడాలి.

మనవాళ్ళు గొప్పవిగా భావిస్తున్న చదువులు, ఉద్యోగాలు మాత్రమే సామాజిక సమస్య లను పరిష్కరించ లేవు.

సమస్య పరిష్కారమై అందరూ ఆనందంగా ఉండాలని పరితపించాలి. అదే హిందూధర్మం. అందుకే ఈ ఆలోచనా దృక్పథానికి నేను 'హిందూ సిటిజన్‌షిప్' అనే పేరు పెట్టాను. కానీ సమాజం మాత్రం మేలుకొనాలి. మేలుకొలుపు పలకాల్సిన బాధ్యత కూడా ఒక్క స్వామీజీలదే కాదు, మేధావులు, విద్యావంతులందరిదీ. పాఠశాలల్లో, కళాశాలల్లో, మఠాల్లో, ఆధ్మాత్మిక, సాంస్కృతిక కేంద్రాల్లో సమాజాన్ని మేలుకొలిపే కార్యక్రమం పెద్దఎత్తున సాగాలి. తాతలు, తల్లిదండ్రులు పిల్లలకు చదువుతో పాటు సమాజంలోని పరిణామాలకు స్పందించే గుణాన్ని నేర్పాల్సిన అవసరం ఎంతైనా ఉంది.దేశ భక్తి లేని దైవ భక్తి వ్యర్థం ఈ తరం విద్యార్థుల్లో భక్తిభావం పెరుగుతున్నప్పటికీ, దేశభక్తి భావం తగ్గుతున్నది. ఎవరికి వారు పూజలు చేస్తూ, ఆలయాలకు వెళుతూ తమకు మంచి జరగాలని కోరుకుంటున్నారే తప్ప సమాజానికి మేలు జరగాలని ఆశించడం లేదు. పోటీ పరీక్షల్లో నెగ్గకపోతే సమాజంలో బతకలేమా? తల్లిదండ్రులు కూడా ఇందుకోసం పిల్లలను అదేపనిగా పోరుతున్నారు. మనవాళ్ళు గొప్పవిగా భావిస్తున్న చదువులు, ఉద్యోగాలు మాత్రమే సామాజిక సమస్యలను పరిష్కరించలేవు. దేశ చరిత్ర, సంస్కృతులు తెలియకుండా ఎంత చదివినా ప్రయోజనం ఏముంటుంది? రామాయణ, భారతాలు సామాజిక సమస్యలను వివిధ సంఘటనల రూపంలో చర్చించాయి. పరిష్కార మార్గా లను చూపించాయి. నేటి సమాజానికి పనికివచ్చే ఎన్నో విషయాలు వీటిలో ఉన్నాయి. దేశ చరిత్రలో జరిగిన సంఘటనలు, పూర్వపు రోజుల్లోని విషయాల పట్ల అవగాహన పెంచుకోవాలి. మన దేశ సంస్కృతిని, పురాణాలు, ఇతిహాసాల విశిష్టతలను తెలుసుకోవాలి. వీటిని తెలిపేవారు కావాలి. వాటి గురించి తెలుసుకోకుండా ఇబ్బందులు పడుతున్న వారిని ఏమీ చేయలేం.

విశాల దృక్పథంతో ఆలోచించి, సంయమనంతో వ్యవహరించినప్పుడే ఎటువంటి సమస్యలు ఉత్పన్నం కాకుండా ఉంటాయి.

కొందరు ఆధ్యాత్మిక గురువులు సైతం మతభేదాలతో గొడవలు పడుతున్నారు. విభేదాలతో వీధికెక్కుతున్నారు. ఇది సమంజసం కాదు. పూర్వం ఈ విభేదాలు లేవన్న విషయాన్ని అందరూ గుర్తుంచుకోవాలి. విశాల దృష్టితో భారతీయ ధర్మ పరిరక్షణకు కృషి చేయాలి. ఏ మతానికి చెందిన వారైనా ముందుగా మనమందరం భారతీయులమనే విషయం గుర్తుంచుకోవాలి. సర్వమానవ సమానత్వానికి ప్రతి ఒక్కరూ ప్రయత్నించాలి.

ధనం వల్లే శత్రుత్వం ఏర్పడుతుంది. చివరకు ఆధ్యాత్మిక సంస్థలు, మఠాలు కూడా ఇందుకు మిన హాయింపులు కావు.

విశాల దృక్పథంతో ఆలోచించి, సంయమనంతో వ్యవహరించి నప్పుడే ఎటువంటి సమస్యలు ఉత్పన్నం కాకుండా ఉంటాయి. మనిషి మనసును కల్మషంగా మారుస్తుంది ధనం. దీనివల్ల స్వార్థబుద్ధి పెరుగుతుంది. స్వసుఖానికి అలవాటు పడి డబ్బు కోసం ఏంచేయడానికైనా వెనుకాడడం లేదు నేటి సమాజం. అందువల్ల ప్రశాంతతత కొరవడి మనుషుల మధ్య సత్సంబం ధాలు నశిస్తున్నాయి. ఎక్కడైనా ధనం వల్లే శత్రుత్వం ఏర్పడు తుంది. చివరకు ఆధ్యాత్మిక సంస్థలు, మఠాలు కూడా ఇందుకు మినహాయింపులు కావు. సంస్థ లేదా పీఠం అనగానే డబ్బు చేరుతుంది. ఆస్తులు, అంతస్థులు ఏర్పడతాయి. అవే సమస్య లకు మూల కారణమవుతాయి. అందుకే ఆధ్యాత్మిక గురువులు, సన్యాసులు సంస్థలను ఏర్పాటు చేయకుండా వ్యక్తిగతంగానే సేవ చేయాలనేది నా అభిప్రాయం. పూరి పాకలో కూర్చుంటే మాత్రం భక్తులు రాకపోతారా? ధర్మ ప్రచారం చేయలేకపో తామా? నేను సంస్థలేమీ ఏర్పాటు చేయకుండానే వేలాది మందికి సేవలందిస్తున్నాను కదా.

మనుషులు పడే కష్టాలకు మనుషులే కారణం. వారిలో మార్పు రావాలి. ఆధ్యాత్మిక చింతన పెరగాలి.

నేటి సమాజంలోని సమస్యలకు వ్యక్తుల్లో పెరిగిన స్వార్థం, ద్వంద్వ ప్రమాణాలే కారణం. తన స్వయం కృతాపరాధాల వల్లనే ఈనాడు మనిషి సమస్యల వలయంలో చిక్కుకుపోతు న్నాడు. దేవుడి నుంచి, ప్రకృతి నుంచి మానవునికి ఎటువంటి ఇబ్బందులు ఎదురు కావడం లేదు. పక్కవాడు బాగుపడకూడ దనే అసూయ, ద్వేషాలు మనిషికి ప్రశాంతతతను దూరం చేస్తు న్నాయి. మనుషులు పడే కష్టాలకు మనుషులే కారణం. వారిలో మార్పు రావాలి. ఆధ్యాత్మిక చింతన పెరగాలి. వీటినుంచి బయటపడి ప్రశాంత జీవనం గడపాలంటే అందుకు తగిన సాధనాలు భక్తి, ఆధ్యాత్మికతలే. మానవత్వం, సేవాతత్పరత, దేశభక్తి మనిషిని పరిపూర్ణ మానవుడిగా తీర్చిదిద్దుతాయి.

– నవంబర్ 19, 2004



**ఐదు దశాబ్దాల పాటు పౌరాణిక, జానపద పాత్ర లెన్నింటికో జీవం పోశారు గుమ్మడి వెంకటేశ్వర రావు. ధర్మరాజు, భీష్ముడు ఏ పాత్ర వేసినా ఆయనకు ఆయనే సాటి. వామపక్ష భావాల మధ్య పెరిగినా పుట్ట పర్తి సాయిబాబాతో ఆయనకు ఆత్మీయ బంధం ఏర్ప డింది. బాబాతో అనుబంధం గురించి, భక్తి ఆధ్యాత్మిక ధోరణుల గురించి గుమ్మడి చెప్పిన మాటలు.**



# నిష్కల్మషత్వమే పరమాత్మ

దేవుడు మనిషిని సృష్టించాడా... మనిషి దేవుడ్ని సృష్టించాడా... అన్నది మూలమైన ప్రశ్న. పరమానందం కలిగించి, తాదాత్మ్యం పొందగలిగే ఒక రూపాన్ని ఎంచుకొని, దానిని భగవంతుడనే పేరుతో భయభక్తులతో ఆరాధిస్తున్నాం. అందుకే మనకు ఇందరు దేవుళ్ళు ఉన్నారేమో అనిపిస్తుంది. సర్వే జనాః సుఖినోభవంతు.... నాతో పాటు నా పక్కవారు, సమాజం కూడా సుఖంగా ఉండాలనే అభిప్రాయంతో ఇతరులకు హాని చేయకుండా జీవించే వారంతా దేవుళ్ళే. అటువంటి వారికి మరే దేవుడూ అవసరం లేదు. మాది గుంటూరు జిల్లా తెనాలికి దగ్గరలోని రావికంపాడు గ్రామం. స్కూలు రోజుల నుంచి పెద్దవాళ్ళతో పరిచయాలు, స్నేహాలు ఉండేవి. ఇంట్లో మా తల్లిదండ్రులు పూజలు చేసేవారు. నేను కూడా అందరితో కలిసి ఆలయానికి వెళ్ళే వాడ్ని. ఆ రోజుల్లో త్రిపురనేని రామస్వామి చౌదరి, ఆయన తనయుడు గోపీచంద్ ప్రభావంతో పాటు వామపక్ష భావాల ప్రభావం నాపై కొంత పడింది. మాది చాలా పెద్ద కుటుంబం. మా అమ్మమ్మ, ముత్తవ్వల ఆప్యాయతలు అందుకున్నాను. వారి అనుభవాల పాఠాలతో పాటు నిరంతరం పెద్దవాళ్ళ సాహచర్యం లభించడం వల్ల నాకు భగవదారాధనపై మనసు పోలేదు. 1950లో సినీరంగంలో ప్రవేశించిన నాటి నుంచి పురాణాల్లో ఎందరో రుషులు, మునుల పాత్రలు ధరించాను. ఆ పాత్రలకు సాధ్యమైనంత న్యాయం చేయాలనే చిత్తశుద్ధితో పనిచేసేవాడిని. అంతే. ప్రత్యేకమైన అనుభూతి ఏమీ ఉండేది కాదు.



నాతో పాటు నా పక్కవారు, సమాజం కూడా సుఖంగా ఉండాలనే అభిప్రాయంతో ఇతరులకు హాని చేయకుండా జీవించే వారంతా దేవుళ్ళే. అటువంటి వారికి మరే దేవుడూ అవసరం లేదు.



**మానవ జీవితంలో ముఖ్యంగా పల్లె సీమలకు ఆలయాలు జీవ నాడి. గ్రామం అంటే ఓ చెరువు, ఆలయం, ఒక ఊర బావి తప్పని సరి.**

ఆస్తికత్వం... నాస్తికత్వం మీమాంసను పక్కన పెడితే మానవ జీవితంలో ముఖ్యంగా పల్లె సీమలకు ఆలయాలు జీవ నాడి. గ్రామం అంటే ఓ చెరువు, ఆలయం, ఒక ఊరబావి తప్పని సరి. ఎన్ని విభేదాలున్నా భగవంతుడి కార్యక్రమం వచ్చే సరికి ఊరంతా ఏకమయ్యేది. పరస్పరం ప్రేమాభిమానాలతో జీవించేందుకు ఆలయాలు తోడ్పడేవి. మన ఆచారాలు, సంప్ర దాయాలు కూడా ప్రేమతత్వాన్ని పెంపొందించేవే. పూర్వం గ్రామంలోని ఒక వీధిలో ఎవరింట్లో ఏ శుభకార్యం ఉన్నా ఊరు ఊరంతా వారిని అన్నివిధాలా ఆదుకొనేది. ఆనందమయ సహ జీవనానికి అవి బాటలు వేసేవి. ఇటువంటి అద్భుతమైన సంప్ర దాయాలకు నెలవు కాబట్టే భారత దేశాన్ని ప్రపంచ దేశాలు వేనోళ్ల కొనియాడేవి. 70వ దశకంలో నేను అమెరికా వెళ్ళిన ప్పుడు మన ఆచార, సంప్రదాయాలను వారు మెచ్చుకుం టుంటే నాకు ఎంతో గర్వంగా అనిపించింది. కానీ ఇప్పుడు పరి స్థితుల్లో క్రమంగా మార్పు వస్తున్నది. హడావుడి జీవనంతో ఆచార, సంప్రదాయాలకు దూరం అవుతున్నాం. పక్కవారి గురించి ఆలోచించే సావకాశం లేకుండా పోతున్నది. ప్రేమ తత్వం సన్నగిల్లుతున్నది. ప్రపంచం నీరాజనాలందుకుంటున్న భారతీయ సంప్రదాయాలను, ప్రేమతత్వాన్ని వదులుకోవడం శ్రేయస్కరం కాదు. ఇటీవల నన్ను ఓ వృద్ధాశ్రమం ప్రారంభోత్స వానికి పిలిచారు. వృద్ధులను ఇంట్లో ఉంచుకొని ప్రేమతో ఆద రించడం మన సంప్రదాయం. కాలంతో పరుగులు పెట్టే నేప థ్యంలో మన దేశంలో కూడా వృద్ధాశ్రమాలు వచ్చినా ప్రేమాభి మానాలు పంచే విషయంలో తక్కువ చేయవద్దు. ఇన్నేళ్ల జీవి తంలో నాకు దేవుడి తోడు అవసరం పడలేదు. అలాగని నేను దేవుడిని ద్వేషించనూ లేదు. నా కుటుంబ సభ్యులతో కలసి తిరు పతి లాంటి పుణ్యక్షేత్రాలను ఎన్నింటినో దర్శించాను. ఇంట్లో మా ఆవిడ పూజ చేస్తే దండం పెట్టుకునే వాణ్ని, కొబ్బరికాయ కొట్టమంటే కొట్టేవాణ్ని. అదీ నా కుటుంబసభ్యుల ఆనందం, నమ్మకం కోసం.

**హడావుడి జీవనంతో ఆచార, సంప్రదా యాలకు దూరం అవుతున్నాం. పక్క వారి గురించి ఆలో చించే సావకాశం లేకుండా పోతున్నది.**

పుట్టపర్తి సత్యసాయి బాబా ప్రజలకోసం చేస్తున్న మంచిప నులు నన్ను బాగా ఆకర్షించాయి. 30 ఏళ్ళ క్రితం అనుకుంటా... నేను భక్త రామదాసు చిత్రం షూటింగ్‌లో ఉండగా పెద్దలు నాగ య్యగారు నాదగ్గరకు వచ్చి రేపు మద్రాసుకు పుట్టపర్తి సాయిబా బా వస్తున్నారు, నీకు ఇష్టమైతే కలుద్దాం అన్నారు. మరుసటి

రోజు ఉదయం బాబా బసకు తీసుకువెళ్ళారు. హాలులో బాబా ఒక్కరే పద్మాసనం వేసుకొని కూర్చొని ఉన్నారు. కాసేపటికి బాబా నా వంక చూసి ఏం వెంకటేశ్వరరావు నా మీద నమ్మకం లేదు కదా? ఇలా వచ్చావేమి అని ప్రశ్నించారు. నమ్మకాల మాట అటుంచి, మిమ్మల్ని చూడాలని వచ్చాను అన్నాను. భక్త రామదాసు షూటింగ్ విశేషాలు ఏమిటని ఆయన అడిగి తెలుసుకున్నారు. నాగయ్యగారి కోరిక మేరకు భక్తరామదాసు సినిమా కూడా చూశారు బాబాగారు. నా వేషం బాగుందని మెచ్చుకున్నారు. అదే ఆయనతో నా మొదటి పరిచయం. పది సంవత్సరాల క్రితం నాకు పక్షవాతం లాంటిది వచ్చింది. నా గొంతు బాగా పాడయింది. చాలా మంది నటించమని అడిగినా ఇష్టంలేక సినిమాలకు దూరంగా ఉంటున్నాను. కొన్నిరోజులకు మద్రాసు నుంచి నటి అంజలిదేవిగారు ఫోన్‌చేసి పుట్టపర్తి సాయిబాబ గారిపై టివి సీరియల్ తీస్తున్నాను... మీరు బాబా గారి తాతగారి వేషం వేయాలని అడిగారు. నా ఆరోగ్యం బాగా లేదు. నేను వేయలేనేమో అన్నాను. కాదు మీరే వేయాలని పట్టుపట్టి నన్ను ఒకసారి బాబాగారి వద్దకు బెంగుళూరు తీసుకువెళ్లారు. వైట్‌ఫీల్డ్‌లో బాబాగారి దర్శనం కోసం మొదటి వరుసలో కూర్చున్నాను. బాబాగారు నేరుగా నా వద్దకు వచ్చి ఏం బంగారు బాగున్నావా? ఆరోగ్యం ఎలా ఉంది అని ప్రశ్నించారు. నేను ఏమి చెప్పకుండానే నీ ఆరోగ్యం బాగుపడుతుంది. షూటింగ్‌లో పాల్గొనమని చెప్పారు. రెండురోజుల తర్వాత నన్ను తన గదిలోకి పిలిచి ఆయన సంకల్పంతో ఒక వస్తువును తన చేతిలోకి తెచ్చారు. అందులోని లేహ్యాన్ని నా గొంతుకు పూశారు. కోలుకుంటావులే అన్నారు. ఆ షూటింగ్ పూర్తయ్యే లోపు నా గొంతు కొంత వరకు మెరుగయింది. ధైర్యంగా నా డబ్బింగ్ నేనే చెప్పుకున్నాను. నా సంకల్ప బలమో, బాబా ఆశీస్సులో తెలియదు కానీ నా ఆరోగ్యం అలా మెరుగుపడడం అద్భుతం అనిపించింది. నిష్కల్మషంగా జీవిస్తూ, సాధ్యమైతే ఇతరులకు సాయపడుతూ జీవనం సాగించడంలోనే నిజమైన ప్రశాంతత, ఆనందం లభిస్తుంది.

– నవంబర్ 26, 2004

**నాకు దేవుడి తోడు అవసరం పడలేదు. అలాగని నేను దేవుడిని ద్వేషించనూ లేదు. నా కుటుంబ సభ్యులతో కలసి పుణ్యక్షేత్రాలను దర్శించాను.**

**నిష్కల్మషంగా జీవిస్తూ, సాధ్యమైతే ఇతరులకు సాయపడుతూ జీవనం సాగించడంలోనే నిజమైన ప్రశాంతత, ఆనందం లభిస్తుంది.**

**వందలాది మంది యోగుల జీవితాలను దగ్గరగా చూసి, ఆ అనుభూతికి అక్షర రూపం ఇచ్చిన వ్యక్తి డాక్టర్ బిరుదురాజు రామరాజు. విద్యారంగానికి ఎనలేని సేవలు చేయడంతో పాటు జానపద సాహిత్యంపై అపురూపమైన పరిశోధనలు చేశారు. ఆంధ్ర యోగుల పేరిట నాలుగు సంపుటాలు వెలువరించడంతో పాటు పలు ఆధ్యాత్మిక గ్రంథాలు రచించిన బిరుదురాజు వారి అభిప్రాయ మాలిక.**



# ధార్మికభారతం - ఆధ్యాత్మిక తరంగం

ఏ దారి వచ్చితివో ఆ దారినే పోవ
ఇక జన్మమే లేదు చిలుకా
ఆ దారి తెలియకే గోదారిలోన బడి
అల్లాడి పోవకే చిలుకా ....

ఎందరో యోగుల పాదధూళితో పునీతమైన నేల మనది. వారి తాత్వికచింతన ఫలమే ఈ రోజు మనల్ని నడిపిస్తున్నది. యావత్ ప్రపంచం భారతీయ తత్వ, ఆధ్యాత్మిక వైభవాలను వేనోళ్ళ కొనియాడుతున్నారంటే ఆ ఘనత ఆ మహనీయులదే.

రిక్షాలో కళ్ళు మూసుకొని ఆలోచిస్తున్న నేను రిక్షావాలా నోటి నుంచి వినిపించిన ఈ పాట విని పరవశించిపోయాను. ఉపనిషత్తుల సారం మొత్తాన్ని సరళమైన పదాలతో కూర్చి, ఓ రిక్షావాలా శ్రావ్యంగా పాడడం మహాద్భుతం. అతనిలోని జ్ఞాన వాహిని ముందు నేను మోకరిల్లాను. అతనే కాదు... మన ఇళ్ళలో కూడా జీవిత సత్యాలు, తత్వం నిండిన పాటలు ఎన్నో పెద్దల నుంచి పిల్లలకు, వారి పిల్లలకు వారసత్వంగా అందుతూ ఉండేవి. ఆ పాటలు మానవ జీవితాలను ఎంతగానో ప్రభావితం చేసేవి. ఇప్పటి పరిస్థితి వేరు. కానీ ఎందరో యోగుల పాదధూళితో పునీతమైన నేల మనది. వారి తాత్వికచింతన ఫలమే ఈ రోజు మనల్ని నడిపిస్తున్నది. యావత్ ప్రపంచం భారతీయ తత్వ, ఆధ్యాత్మిక వైభవాలను వేనోళ్ళ కొనియాడుతున్నారంటే ఆ ఘనత ఆ మహనీయులదే . కాలప్రభావంతో మనం ఇప్పుడు కాస్త వెనుకబడినా ప్రపంచమనే రైలుబండిని ఏరోజుకైనా భారతదేశమే నడిపిస్తుంది.

మాది వరంగల్ జిల్లా దేవునూరు గ్రామం. సనాతన ధర్మం

పాటించే, విశిష్టాద్వైతుల కుటుంబం మాది. స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నాను. జైలుకు వెళ్లాను. 1952 ఎన్నికల సమయంలో తెలంగాణ విద్యార్థి సంఘ నేతగా పనిచేశాను. సురవరం ప్రతాపరెడ్డిగారు నాకు గురుతుల్యుడు. రాజకీయాలు నీకు పడవంటూ ఆయన నన్ను విద్యా రంగంవైపు మళ్ళించారు. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో మూడు దశాబ్దాల పాటు పనిచేశాను. పదేళ్ల పాటు తెలుగుశాఖకు అధిపతిగా ఉన్నాను. వరంగల్ పీజీ సెంటర్ ప్రిన్సిపాల్‌గా బాధ్యతలు నిర్వర్తించాను. జానపద సాహిత్యంపై దక్షిణ భారతదేశంలోనే తొలి సిద్ధాంత వ్యాసం సమర్పించాను. యోగుల జీవితాల గురించి కూడా అధ్యయనం చేశాను. మూడున్నర దశాబ్దాలుగా నేను సత్యసాయి భక్తుడ్ని. ఆయన షిర్డీ సాయి అంశ. ఏటా షిర్డి వెళ్ళేవాడిని. షిర్డీ సమీపంలోని సాకూర్‌లో ఉపాసిని బాబా అని గొప్పయోగి ఉండేవారు. మహిళలు వేదం చదవకూడదు, యజ్ఞయాగాలు చే యకూడదనే వాదనలను కొట్టిపారేసే వ్యక్తి ఆయన. మహిళలకు వేదశాస్త్రాలు చెప్పించారాయన. వారి చేత యజ్ఞాలు చేయించే వారు. మహిళలపై అటువంటి ఆంక్షలు మధ్యలో ఎవరో కల్పించినవే. వేదంలో 21 మంది గృహస్థులైన యోగినులు మనకు కనిపిస్తారు. ఉపాసిని బాబా ఆశ్రమంపై డాక్టర్ టిప్నిస్ కూడా పరిశోధనలు చేశారు. నేను ఏటా అక్కడకు వెళుతూ ఉండే వాడిని. అక్కడ తమిళనాడు, కేరళ, మహారాష్ట్ర ఇలా అన్ని రాష్ట్రాలకు చెందిన యోగుల జీవిత చరిత్రలు కనిపించాయి. వాటిని ఆసక్తిగా చదివాను. ఆంధ్రలో ఉన్న యోగుల గురించి ఎందుకు గ్రంథస్తం చేయకూడదనిపించింది. వెంటనే యోగులను సందర్శించడం ప్రారంభించాను. మన రాష్ట్రంలో పుట్టి, ఇతర రాష్ట్రాలకు వెళ్ళి యోగులుగా మారిన వారు, ఇతర రాష్ట్రాలనుంచి వచ్చి మన రాష్ట్రంలో యోగులుగా ధార్మిక భావాలను పంచిన వారందరి జీవిత చరిత్రలు సేకరించాను.

> నేను యోగుల జీవితాల గురించి కూడా అధ్యయనం చేశాను. మూడున్నర దశాబ్దాలుగా సత్యసాయి భక్తుడ్ని. ఆయన షిర్డీ సాయి అంశ.

> త్యాగం యోగానికి మూలం. అణువులో సైతం జీవాన్ని దర్శించి, పరమాత్మను చేరుకొనేందుకు నిరంతరం తపన పడే వారు యోగులు.

ఒక్కొక్క యోగి చరిత్ర... ఒక్కో మహాద్భుతం! పశ్చిమ బెంగాల్‌లో త్రిలింగ స్వామి అని ఓ మహాయోగి ఉండేవారు. రామకృష్ణ పరమహంస ఆయనను గురువుగా భావించే వారు. ఈ త్రిలింగ స్వామిని కాశీలో ఇంటింటా ఆరాధిస్తారు. ఆ మహాయోగి పుట్టింది కరీంనగర్ జిల్లా మంథనిలో అని ఇటీవల ఆధారం లభించింది. ఎందరో యోగులు మన రాష్ట్రం నుంచి

భగవంతుడు రూప రహితుడు. ఎవరికి తోచిన విధంగా వారు ఓ రూపాన్ని ఎంచుకొని ఆయన్ని ఆరాధిస్తున్నారు. దారులు ఏవైనా ఆ పరమాత్మను చేరడమే లక్ష్యం.

ఇతర రాష్ట్రాలకు వెళ్ళి స్థిరపడ్డారు. మన రాష్ట్రానికి చెందిన 210 మంది మహనీయులైన యోగుల జీవితాలను నాలుగు సంపుటాలుగా గ్రంథస్తం చేశాను. త్యాగం యోగానికి మూలం. అణువులో సైతం జీవాన్ని దర్శించి, పరమాత్మను చేరుకొనేందుకు నిరంతరం తపన పడేవారు యోగులు. ప్రేమ, కరుణ, సేవా భావం వారి ప్రతి చర్యలో కనిపిస్తాయి. వారి జీవితం అందరికీ ఆదర్శప్రాయంగా ఉండేది. పరమాత్మ తత్వం గ్రహించిన వారికి కులాలు, మతాలు ఉండవు. వారు ప్రతిప్రాణిలోను, పదార్థంలోను పరమాత్మను దర్శించుకోగలరు. అది అందరికీ సాధ్యం కాదు. అలా సాధ్యమైన వారు, వారి సంక్షేమాన్ని సైతం పట్టించుకోకుండా సమాజహితం కోసం పాటుపడేవారు. భగవంతుడు రూపరహితుడు. ఎవరికి తోచిన విధంగా వారు ఓ రూపాన్ని ఎంచుకొని ఆయన్ని ఆరాధిస్తున్నారు. దారులు ఏవైనా ఆ పరమాత్మను చేరడమే లక్ష్యం. భగవంతుడ్ని చేరుకొనేందుకు భక్తి, కర్మ, జ్ఞాన, యోగమార్గాలున్నాయి. వీటిలో యోగమార్గం ద్వారా భగవంతుని చేరుకొనే ప్రయత్నం చేసే వారే యోగులు. ఈ యోగంలో క్రియ, రాజ, లయ, నాద యోగాలంటూ అనేక రకాలున్నాయి. యోగమార్గం ఏదైనా అందరి గమ్యం సమాజహితం కోసం పని చేస్తూ పరమాత్మను చేరడమే. భగవంతుడ్ని చేరేందుకు ఉన్న భక్తి, క్రియా, జ్ఞాన, యోగ మార్గాలు ప్రేమతత్వం లేకుండా ఫలించవు. యోగులందరూ ప్రేమమూర్తులు, సేవాపరాయణులు. ఆ సుగుణాలన్నీ సమాజానికి ఆదర్శాలు. పాతబస్తీలో మహారాష్ట్రకు చెందిన గంగాబాయి అనే మహాయోగిని ఉండేది. ఆమె ఛత్రపతి శివాజీ వంశస్తురాలు. ఆమె పచ్చి మంచినీళ్ళు ముట్టేది కాదు. కానీ చీమల నుంచి సమస్త జీవాల వరకు అన్నింటికీ ఆహారం పెట్టించేది. అలాగే ఆదోనికి చెందిన తిక్క లక్ష్మమ్మ మహాయోగిని. మంగళగిరిలో బాలాంబ మహాయోగిని, పరమభక్తురాలు. తుది శ్వాస వరకు రోజూ వందలాది మందికి అన్నదానం చేసింది. అంతటి వితరణ శీలమే దైవత్వం. ఇలా ఎందరో యోగులు ఆదర్శంగా జీవిస్తూ... మనకు మార్గనిర్దేశం చేశారు. ఆ మార్గమే శిరోధార్యం.

వితరణ శీలమే దైవత్వం. ఇలా ఎందరో యోగులు ఆదర్శంగా జీవిస్తూ... మనకు మార్గనిర్దేశం చేశారు.

– డిసెంబర్ 3, 2004

**ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నత విద్యను అభ్యసించిన ఆయన కర్ణాటకలోని హంపి పీఠాధిపతి అయ్యారు. అచరించడంతో పాటు ఆచరణ మార్గం చూపే వారే ఆచార్యులంటారు హంపి విరూపాక్ష పీఠాధిపతి శ్రీ విద్యారణ్య భారతి. భారతీయ సనాతన ధర్మ వైభవాన్ని, సంప్రదాయాలను పదిలంగా కాపాడి ముందుతరాలకు అందించాల్సిన బాధ్యత మనందరిదీ అంటున్న స్వామీజీ అంతరంగం.**



# దేవాలయం సంస్కారనిలయం

హిందు అనేది ఒక మతం కాదు... మహాద్భుత జీవన విధానం. ఆదర్శవంతమైన జీవనాన్ని అందించడంతో పాటు సత్సంగం ద్వారా ప్రశాంత జీవనానికి భారతీయ సంస్కృతి, సంప్రదాయాలు బాటలు వేశాయి. ఆ అపురూప సంపదను పదిలంగా కాపాడి, భావితరాల వారికి అందించాలి. ఆ బాధ్యత మఠాలు, పీఠాలతో పాటు ప్రతి ఒక్కరిపైనా ఉన్నది. ఆచరిస్తూ ఆచరింప చేసే వాడే ఆచార్యుడు. కానీ ఈ రోజుల్లో ధర్మం గురించి మాట్లాడే వారికి కొదవలేదు కానీ ఆచరించే వారు మాత్రం కరవయ్యారు. ఆచరణ లేకుండా ధర్మపన్నాలు వల్లించడం వల్ల విశ్వాసం కోల్పోతున్నారు. ప్రత్యక్షంగా కనిపించిన వాటిని మాత్రమే నమ్ముతున్న రోజులివి. యువతీ యువకుల్లో సైతం ధ్యానం, యోగం పట్ల ఆసక్తి పెరుగుతున్నది. మన సంస్కృతి, సంప్రదాయాల గొప్పతనాన్ని మెల్లగా తెలుసుకుంటున్నారు. శాస్త్రీయంగా, సహేతుకంగా వివరిస్తే ఆధ్యాత్మిక విషయాలను యువత విశ్వసిస్తోంది. సంప్రదాయాలను శాస్త్రీయంగా, అందరూ ఆమోదించే విధంగా చెప్పాల్సిన బాధ్యత అందరిపైనా ఉన్నది.



**ఆచరిస్తూ ఆచరింప చేసే వాడే ఆచార్యుడు. కానీ ఈ రోజుల్లో ధర్మం గురించి మాట్లాడే వారికి కొదవలేదు కానీ ఆచరించే వారు మాత్రం కరవయ్యారు. ఆచరణ లేకుండా ధర్మపన్నాలు వల్లించడం వల్ల విశ్వాసం కోల్పోతున్నారు.**



మన దేహం అద్భుతమైన నిర్మాణం. 32 కోట్ల దేవతలు మన దేహంలో నివసిస్తారు. శరీరాన్ని పదిలంగా చూసుకోవడం వల్ల మనసుకు ప్రశాంతత లభిస్తుంది. జీవితం ఆనందమయం అవుతుంది. 'ప్రభాతే కరదర్శనం' అన్నారు. ఉదయాన్నే లేవగానే

మన దేహం అద్భుత మైన నిర్మాణం. 32 కోట్ల దేవతలు మన దేహంలో నివసిస్తారు. శరీరాన్ని పదిలంగా ఉంటే మనసుకు ప్రశాంతత లభిస్తుంది.

మన రెండు అరచేతులు చూసుకోవాలని దాని అర్థం. చేతి అగ్ర భాగంలో లక్ష్మీదేవి ఉంటుంది. కరమధ్య భాగంలో సరస్వతి, కరాంతంలో గౌరి ఉంటుంది. ఉదయం లేవగానే అరచేతిని చూసుకోవడం వల్ల భగవత్ దర్శనం చేసుకున్న ఫలితం లభిస్తుం దని పెద్దలు చెప్పారు. బయట తిరిగి ఇంట్లోకివచ్చే ముందు కాళ్ళు కడుక్కోవడం మన సంప్రదాయం. చల్లని నీళ్ళతో కాళ్ళు కడుక్కోవడం వల్ల అరికాళ్ళలో ఉండే నాడులు చైతన్యమవు తాయి. మానసిక ప్రశాంతత లభిస్తుంది. ఇలా ఎన్నో అద్భుత ఆరోగ్య విషయాలు మన సంప్రదాయాల్లో ఇమిడి ఉన్నాయి. వాటిని పాటించకపోవడమే అనారోగ్యాలకు, సకల కష్టాలకు మూలం. ఆలయ సందర్శన మన సంప్రదాయాల్లో ప్రధాన మైంది. కానీ ఈ రోజున ఆలయాలను వ్యాపార కేంద్రాలుగా మారుస్తున్నారు. ప్రభుత్వ అజమాయిషీ వల్ల ఈ అనర్థం జరుగు తున్నది. మఠాలు, పీఠాల పర్యవేక్షణలో, వ్యక్తుల బృందాలకు ఆలయ పర్యవేక్షణ అప్పగించడం తక్షణావసరం. ఆలయాలను సంస్కార కేంద్రాలుగా తీర్చిదిద్దినప్పుడు సమాజం, దేశం, ప్రపంచం బాగుపడతాయి.

ఆలయాలను సంస్కార కేంద్రాలుగా తీర్చిదిద్దినప్పుడు సమాజం, దేశం, ప్రపంచం బాగుపడతాయి.

సాధు, సన్యాసులు ప్రాపంచిక సుఖాలపై మమకారం పెంచుకోవడం వల్ల వారిపై గౌరవం సన్నగిల్లుతున్నదా అంటే.... కొందరు అలా చేస్తున్న మాట నిజం మరి. అరిషడ్వర్గాలను జయించకుండా వాటి గురించి ఇతరులకు హితబోధలు చేస్తే లాభం లేదు. వారు సాధన చేయాలి. ఇతరులకు బోధించి వారి చేత సాధన చేయించాలి. సాధన ద్వారానే జీవితం ఆనంద మయం అవుతుంది. పరోపకారంతో, ప్రేమతత్వంతో జీవిస్తే ప్రతి ఒక్కరి జీవితం సుఖశాంతులతో విలసిల్లుతుంది. సమా జంలో ఒత్తిడి పెరిగింది. యువతీ యువకుల్లో ధార్మిక స్పృహ పెరిగినా శాంతి లేదు. ఏదో అతీత శక్తి ఉన్నదని అందరూ నమ్ము తున్నారు. ప్రత్యక్ష ఆధారం కోసం వారి కళ్ళు వెతుకుతున్నాయి. సత్సంగం ద్వారా మాత్రమే వారిలోని అశాంతి దూరం అవు తుంది. సత్సంగం అంటే ఎక్కడికో వెళ్ళాల్సిన పని లేదు. కుటుంబ సభ్యులంతా రోజూ కనీసం ఒక గంటసేపు కలిసి ఉండటం... మనసు విప్పి మాట్లాడుకోవడం.... ఆలోచనలు కల బోసుకోవడం... ఇదే సత్సంగం. సుఖమయ జీవితానికి ఇదే బాటలు వేస్తుంది.

ఏదో అతీత శక్తి ఉన్నదని అందరూ నమ్ముతున్నారు. కానీ ప్రత్యక్ష ఆధారం కోసం వారి కళ్ళు వెతుకుతున్నాయి.

మాది కర్నూలు. నాన్నగారు జంధ్యాల సత్యనారాయణ, తల్లి అనసూయ. మాది సంప్రదాయ కుటుంబం. నాన్నగారు హైదరాబాద్ బదిలీ అయ్యారు. పంచాయతీ రాజ్‌లో డిప్యూటీ సెక్రటరీగా రిటైర్ అయ్యారు. నాకు తల్లిదండ్రులు పెట్టిన పేరు కాశీవిశ్వనాథుడు. విద్యాభ్యాసం అంతా హైదరాబాద్‌లోనే గడిచింది. 1982లో ఉస్మానియా యూనివర్శిటీలో ఎంఎస్‌సి కంప్యూటర్స్ చేశాను. చదువుకొనే రోజుల నుంచే నాకు యోగ, ఆయుర్వేద రంగాలపై ఆసక్తి ఏర్పడింది. యోగాచార్యుడిగా దేశ వ్యాప్తంగా పలువురికి శిక్షణ ఇచ్చాను. మహనీయులు మన దేశానికి అందించిన అపూరూప సంపదల్లో యోగ, ఆయుర్వేదాలు ముఖ్యమైనవి. ఈ రెండింటిని విస్తృతంగా ప్రచారం చేయడమే జీవిత లక్ష్యంగా పెట్టుకున్నాను. 1989లో అనుకోకుండా హంపి విరూపాక్ష పీఠాధిపతిని కలుసుకున్నాను. అప్పటి నుంచి నా జీవితం అనుకోని మలుపుతిరిగింది. 1995లో గురువుగారి ఆదేశం మేరకు హంపి వెళ్ళి సంస్థానం పనులు చూడడం ప్రారంభించాను. గురువుగారు నాకు సన్యాస దీక్ష ఇచ్చారు. తరువాత సంస్థానం సారథ్యం చేపట్టాను. విజయనగర సామ్రాజ్యాన్ని స్థాపించిన విద్యారణ్య స్వామి హంపి పీఠాన్ని స్థాపించారు. 1380లో శంకరుడు స్థాపించిన శృంగేరీ పీఠానికి కూడా ఆయన ఆధిపత్యం వహించారు. విజయనగరాధీశులు విద్యారణ్యులను రాజయోగిగా ప్రకటించి సత్కరించారు. స్వయంభువుడైన విరూపాక్షుని ఆలయం సమీపంలో హంపి పీఠానికి విద్యారణ్యుల వారు నాంది పలికారు. విరూపాక్షుని ఆలయం ఓ అద్భుత కట్టడం. ఆంధ్రప్రదేశ్‌తో పాటు ఏడు రాష్ట్రాలలో హంపి పీఠానికి ఆస్తులు ఉన్నాయి. క్రమంగా విరూపాక్ష ఆలయం, హంపి సంస్థానం భూములన్నీ ప్రభుత్వ పరం అయ్యాయి. ప్రభుత్వంతో పోరాడి గత ఏడాది హంపి సంస్థానాన్ని ప్రభుత్వం నుంచి స్వాధీనం చేసుకున్నాను. విద్యారణ్య స్వామి ఎన్నో అద్భుతాలు చేశారు. వేదాలకు భాష్యం రాశారు. అనేక కృతులు చేశారు. వాటన్నింటినీ వెలుగులోకి తీసుకురావాలన్నది నా సంకల్పం. విజయనగర సామ్రాజ్యం ఎలా అయితే స్వర్ణకాంతులీనిందో హంపి పీఠానికి కూడా పూర్వవైభవం తీసుకువచ్చి, ధర్మ ప్రచారం చేయడం నా తక్షణ కర్తవ్యం.

– డిసెంబర్ 10, 2004

విద్యారణ్య స్వామి ఎన్నో అద్భుతాలు చేశారు. వేదాలకు భాష్యం రాశారు. అనేక కృతులు చేశారు. వాటిని వెలుగులోకి తీసుకురావాలన్నది నా సంకల్పం.



**సత్యభామ పాత్రకు ఆమె పర్యాయపదం. గ్లామర్ పాత్రల నుంచి పౌరాణిక పాత్రల వరకు సుమారు నాలుగు దశాబ్దాల పాటు తెలుగు ప్రేక్షకులను అలరించి, కవ్వించారు ప్రముఖ సినీనటి జమున. కృష్ణతత్వం నుంచి పుట్టపర్తి సత్యసాయి వరకు సాగిన ఆమె భక్తి ప్రయాణం, నేటితరంలో, ముఖ్యంగా మహిళల్లో సన్నగిల్లుతున్న భక్తి సంప్రదాయాల గురించి ఆమె మనసులోని మాటలు.**

# భక్తిసంప్రదాయాలపై చైతన్యమే శ్రీరామరక్ష

పుట్టింది హంపిలో. ఆరేడేళ్ల వయసు నుంచి దుగ్గిరాలలో ఉన్నాం. అమ్మ కౌసల్యాదేవి, నాన్న శ్రీనివాసరావు గారు. తరతరాల నుంచి మా ఇంట్లో మడి, ఆచారం, దైవభక్తి, పూజలు–పునస్కారాలు చాలానే ఉన్నాయి. మా తాతగారు (అమ్మ వాళ్ళ నాన్నగారు) పీఠాధిపతులుగా ఉండేవారట. మా అమ్మ స్వాతంత్ర్య పోరాటంలో పాలుపంచుకున్నది. దీంతో మహాత్మా గాంధీ ప్రభావం మాపైన చాలా ఉండేది. అమ్మ పెంపకంలో భక్తి, దేవునిపై విశ్వాసం, సంప్రదాయాలు, ఆచారాలు బాగా వంటబట్టాయి. నాకు చాదస్తం కూడా కాస్త ఎక్కువే. దుగ్గిరాలలో ఉన్నప్పుడు రోజూ అక్కడి శివాలయానికి వెళ్ళేదాన్ని. నేను బాగా పాడేదాన్ని. భజనలు, భక్తి గీతాలు పాడడం తన్మయత్వం కలిగించేది. నేను మొదటి నుంచి కృష్ణభక్తురాలిని. ఆయన ఎప్పుడూ కలలో వచ్చేవాడు. రామచిలుకను గడ్డం కింద పెట్టుకుని ఉన్న కృష్ణుని ఫోటో అంటే నాకు చాలా ఇష్టం. నన్ను పెద్ద హీరోయిన్ అయ్యేలా చూడమని ఆయన్ని కోరుకునేదాన్ని. కృష్ణాష్టమి, దసరాకు బొమ్మల కొలువులు బాగా చేసేవాళ్ళం. ఆ తరువాత సినిమాల్లోకి వచ్చాక పూజ, పునస్కారాలు చేసే తీరిక ఉండేది కాదు. అయితే మా అమ్మగారు ఇంట్లో ఎప్పుడూ పూజలు చేస్తూ ఉండేది. తెల్లవారుజామున నాలుగు గంటలకు లేచి మా అమ్మ ధనుర్మాస వ్రతం చేస్తే నేను తీర్థ ప్రసాదాలు తీసుకుని షూటింగుకి వెళ్ళిపోయేదాన్ని. మద్రాసు వచ్చాక 1965 జనవరి నుంచి ప్రతి నెలా మొదటి తేదీన తప్పనిసరిగా తిరుపతికి



**దుగ్గిరాలలో ఉన్నప్పుడు రోజూ అక్కడి శివాలయానికి వెళ్ళేదాన్ని. నేను బాగా పాడేదాన్ని. భజనలు, భక్తి గీతాలు పాడడం తన్మయత్వం కలిగించేది. నేను మొదటి నుంచి కృష్ణ భక్తురాలిని. ఆయన ఎప్పుడూ కలలో వచ్చేవాడు.**



వెళ్ళేదాన్ని. అలా ఎందుకు అనిపించిందో ఏమో ఎంత ముఖ్యమైన షూటింగ్ వున్నా ఆ రోజున మాత్రం వెంకటరమణుడి దర్శనం చేసుకొనే దాన్ని. అప్పటి నుంచి ఆరు నెలలు తిరగకుండానే అనుకోకుండా రమణారావుగారితో వివాహం జరిగిపోయింది. దైవబలం అంటే ఇదేనేమో అనిపించింది.

నేను హిందూపూర్ పబ్లిక్ మీటింగ్‌కు వెళ్తున్నప్పుడు మావారు అక్కడ నుంచి పుట్టపర్తికి తీసుకెళ్లారు. శ్రీ సత్యసాయి యూనివర్సిటీలో ఆయన అకడమిక్ కౌన్సిల్ మెంబర్. నాకు కాలేయంలో రాళ్ల వల్ల పులుపు, కారం తింటే మంటగా ఉండేది. ఆ బాధతో ఏడ్చేసేదాన్నికూడా. బాబా నేను చెప్పకుండానే నా బాధ తెలుసుకుని, ఒక శివలింగాన్ని సృష్టించి ఇచ్చి దాన్ని నీళ్ళలో వేసి ఆ తీర్థాన్ని రోజూ తీసుకోమన్నారు. ఇప్పటికీ నా కడుపులో రాళ్లు ఉన్నా , కడుపులో మంటగా మాత్రం లేదు. అప్పటి నుంచి ఆయనంటే భక్తి కలిగింది. స్వామి చేపట్టిన సేవా కార్యక్రమాల పట్ల కూడా ఆకర్షితురాలినయ్యాను. ఆ రోజు నుంచి ఈ రోజు వరకు.... సుమారు రెండు దశాబ్దాలుగా నేను సత్యసాయి భక్తురాలిని. నెలలో ఒకరోజైనా ఇంట్లో సత్యసాయి భక్త బృందం వచ్చి భజనలు చేస్తారు. ఏడాదిలో రెండు మూడు రోజులు సత్యసాయి సన్నిధికి వెళతాను. ఐహిక విషయాలన్నింటికీ అతీతమైన ఆనందం నాకక్కడ లభిస్తుంది. నా భక్తిలో ఇదివరకు, ఇప్పటికి చాలా తేడా వచ్చింది. గతంలో అయితే పరిపూర్ణంగా భక్తిలో లీనమయ్యేదాన్ని. నాకు అడక్కుండానే అన్నీ ప్రసాదించిన భగవంతుని ఏమీ కోరేదాన్ని కాదు. చాలా తృప్తిగా ఉండేది. ఇట్లాగే సుఖసంతోషాలతో, ఏ పాపం చేయనివ్వకుండా, మోక్షాన్ని ప్రసాదించమని అడిగేదాన్ని. భగవంతుడితో ఇలా బేరం పెట్టడం సరికాదు. కోరికలకు అతీతంగా ఉండి అన్నీ ఆయనకే అర్పించాలి. పూజ, పునస్కారాల విషయంలో మొదటి నుంచి మా ఇంట్లో ఢోకా లేదు. నేను లేకపోతే మావారు ప్రతి రోజూ రెండుమూడు గంటలు పూజ చేస్తారు. ఆయన యూనివర్సిటీ ప్రొఫెసర్‌గా ఉన్నప్పుడు ఈ అవకాశం ఉండేది కాదు. రిటైరయ్యాక క్రమం తప్పకుండా పూజలు చేస్తున్నారు.

భక్తి సంప్రదాయాల విషయంలో ఈ తరంలో అంతా అయోమయ పరిస్థితి కనిపిస్తున్నది. పాశ్చాత్య ప్రభావం ఎక్కువై దైవ చింతన తగ్గిపోయింది. వినాయక చవితి వేడుకలు భక్తితో చేస్తు

**రెండు దశాబ్దాలుగా నేను సత్యసాయి భక్తురాలిని. నెలలో ఒకరోజైనా ఇంట్లో సత్యసాయి భక్త బృందం వచ్చి భజనలు చేస్తారు.**

**భగవంతుడితో బేరం పెట్టడం సరి కాదు. కోరికలకు అతీతంగా ఉండి అన్నీ ఆయనకే అర్పించాలి.**

అప్పట్లో మోక్షం కోసం, జీవితం సాఫీగా వెళ్ళాలని మాత్రం ఆశించే వారు. కాని ఇప్పుడు కోరికలు ఎక్కు వయ్యాయి.

న్నారా, రక్తితోనా అనే విషయం నాకు అర్థం కాదు. ఆలయాల సంఖ్య పెరుగుతున్నది ఆ స్థాయిలో భక్తితత్వం పెరుగుతున్నట్టు అనిపించడం లేదు. భక్తి ఉన్న చోట పాపభీతి ఉంటుంది. దేవు నిపై భక్తి ఉంటే వీళ్ళలో ఈ హింసాతత్వం ఎందుకు పెరుగు తోంది. భక్తి, హింసా మార్గాలు ఈనాటి సమాజంలో సమాంత రంగా వెళ్తున్నాయనిపిస్తోంది. అప్పట్లో మోక్షం కోసం, జీవితం సాఫీగా వెళ్ళాలని మాత్రం ఆశించేవారు. కాని ఇప్పుడు కోరికలు ఎక్కువయ్యాయి. భగవంతుని విషయంలో కూడా ఎవరూ నిష్కామంగా ప్రవర్తించడం లేదు. భక్తి కూడా ఒక వ్యాపార వ్యవ హారంలాగా మారిపోవడం దురదృష్టకరం. ఈ తరం వారికి మన సంస్కృతి, సంప్రదాయాలు, భక్తి పట్ల అవగాహన లేకుండా పోతున్నది. సినిమాలు, టివిల వల్ల పిల్లలు విషపూరితమైపోతు న్నారు. భక్తి, సంప్రదాయం అంటే ఏ మాత్రం తెలియని దుస్థితి. ఇందుకు తల్లిదండ్రులనే తప్పు పట్టాలి. అద్భుతమైన భారతీయ సంస్కృతీ సంప్రదాయ ఫలాలను వారు ఆచరించి, వచ్చే తరా లకు అందించడంలో విఫలం అవుతున్నారు. దీంతో పిల్లలు దారీ తెన్నూ లేకుండా ప్రయాణిస్తున్నారు. ఆరాటం, అశాంతి పెరుగు తున్నాయి. యువకుల్లో చాలా మంది యోగ ధ్యానాలపై ధ్యాస పెడుతున్నా అవి వారికి పూర్తి స్థాయిలో మనశ్శాంతి ఇవ్వలేకపో తున్నాయి. అందుకే వారిలో గందరగోళం పెరిగిపోతున్నది.

గతంలో మహిళలు ఇంట్లో ఉండేవారు. భక్తి ప్రపత్తులతో గృహసౌభాగ్యం కోసం తపించేవారు. ఫలితంగా ఇల్లు, సమాజం కూడా సుభిక్షంగా ఉండేది.

పిల్లల తెలివి వక్రమార్గం పడుతున్నది. అందుకు తల్లిదం డ్రులు కూడా బాధ్యులే. పిల్లల చేత అసభ్యమైన పాటలకు డ్యాన్సులు, సినిమాల్లోని అసభ్యకరమైన నాట్యరీతులు చేయ డాన్ని తల్లిదండ్రులే ప్రోత్సహిస్తున్నారు. ఇలాంటి పిల్లలనా మనం ఈ దేశానికి ఇచ్చేది? పది మంది మహిళలు ఎక్కడైనా కని పిస్తే నేను వారితో ఈ విషయంపై గట్టిగా హితవు చెబుతు న్నాను. గతంలో మహిళలు ఇంట్లో ఉండేవారు. సంప్రదాయాన్ని పాటిస్తూ... భక్తి ప్రపత్తులతో ఇంటి కోసం తపించేవారు. ఫలి తంగా ఇల్లు, సమాజం కూడా సుభిక్షంగా ఉండేది. కానీ రోజులు మారాయి. మహిళలు కూడా ఆర్జించాల్సిన పరిస్థితులు వచ్చాయి. అయితే పూర్తిగా సంపాదన ధోరణిలో పడి ఇంటిని, పిల్లలను చక్కదిద్దుకోక పోవడం మనకేకాదు..... సమాజానికి కూడా మంచిది కాదని మహిళలు గ్రహించాలి.

– డిసెంబర్ 17, 2004



**దక్షిణాది రాష్ట్రాల్లో ఉన్న 32 క్రైస్తవ పీఠాలకు అయన సారథి. ప్రపంచ దేశాల్లో క్రీస్తు బోధనలను ప్రచారం చేస్తూ ఉంటారు వందేళ్ల చరిత్రగల మెదక్ చర్చి బిషప్ రెవరెండ్ డాక్టర్ బి.పి.సుగంధర్. ద్వేషించే వారిని సైతం ప్రేమించాలని, అందుకు ప్రతి ఒక్కరూ సాధన చేయాలంటారాయన. ఆ స్థాయిని చేరుకుంటే మనతో పాటు, ప్రపంచం యావత్తు శాంతి మయం అవుతుందంటున్న సుగంధర్ భావధార.**

# స్వార్థం విడితే విశ్వం శాంతినిలయం



లోకం పాపపంకిలం కాకుండా రక్షించడానికి ప్రభువు అవతరించాడు. ఆయన దారిలో మనం కూడా శత్రువులను సైతం ప్రేమించే మనస్తత్వాన్ని అలవరచుకుంటే విశ్వం శాంతి సౌధంగా మారుతుంది. హింసా ప్రవృత్తి పెరిగిపోతున్న ప్రస్తుత తరుణంలో ప్రేమభావాన్ని పెంపొందించడమే పరిష్కార మార్గం. మెదక్ జిల్లా రామాయంపేటలో పుట్టాను. నిజామాబాద్ స్కూల్‌లో చదువుకున్నాను. బెంగుళూరు లోని యునైటెడ్ థియోలాజికల్ కళాశాలలో నా వేదాంత విద్య కొనసాగింది. తల్లిదండ్రులు నన్ను ఇంజనీరింగ్ చదివించాలని అనుకున్నారు. కానీ పరిస్థితులు అనుకూలించనందున ఇంజనీరుని కాలేకపోయాను. నాన్నగారు నా చిన్నప్పుడే మరణించారు. ఆ సంఘటనే.. నన్ను దేవుడికి దగ్గర చేసింది. అమ్మ అందించిన ప్రోత్సాహం, ఆ దేవుడు అందించిన సహకారంతో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకోగలిగాను. నేను తండ్రిని కోల్పోవచ్చు. ఆయన అనురాగాన్ని చవిచూడలేకపోవచ్చు. కానీ.. లోకానికంతటికీ తండ్రి అయిన ప్రభువుకు బిడ్డగా, ఆయన కరుణ పొందాను. ఆ దేవుని అనుగ్రహం వల్ల ఆయన సేవ చేసుకునే భాగ్యం కలిగింది. ఏసుతో నా అనుబంధం మాటలకందనిది. ప్రార్థన ద్వారా ఆయనతో బంధం పెంచుకుంటా. ఆయన సందేశాలు, సూచనలు పాటించడం ద్వారా ఆయనకు మరింత దగ్గరయ్యే ప్రయత్నం చేస్తా. ప్రభువే నాకు రక్షకుడని సదా నేను నమ్ముతాను.



**లోకానికంతటికీ తండ్రి అయిన ప్రభువుకు బిడ్డగా, ఆయన కరుణతో దైవసన్నిధికి చేరుకోగలిగాను. ఆ దేవుని అనుగ్రహం వల్ల ఆయన సేవ చేసుకునే భాగ్యం కలిగింది. ఏసుతో నా అనుబంధం మాటలకందనిది.**



మానవులను పాపాల నుంచి రక్షించడానికి దైవ కుమారుడు ఈ లోకాన అవతరిస్తాడని ముందే తెలిపాడు భగవంతుడు.

మొదటి శతాబ్దంలోనే క్రైస్తవ మతం మన దేశంలోకి వచ్చింది. క్రీస్తు జననాన్ని ఆధారం చేసుకునే కదా మనం కాలని ర్ణయం చేసేది. కాబట్టి జీసస్ పుట్టుక కూడా ఒక చారిత్రక నేపథ్యం ఉన్న విషయమే. మానవులను పాపాల నుంచి రక్షించ డానికి దైవ కుమారుడు ఈ లోకాన అవతరిస్తాడని ముందే తెలి పాడు భగవంతుడు. చరిత్ర చెబుతున్న సత్యం ఇది. పాపాల కూపంలాగా మారిన ఈ లోకాన్ని ఉద్ధరించాలని కొందరు సెయింట్స్ (మునులు) ఆ దేవుడిని వేడుకున్నారు. మృత్యువు నుంచి జీవంలోకి, అసత్యం నుంచి సత్యం వైపు, హింసా మార్గం నుంచి అహింసా పథానికి మనుషుల్ని నడిపించాలని ఆ సెయింట్స్ దేవుడిని ప్రార్థించారు. వారి ప్రార్థనలు విన్న ప్రభువు జీసస్‌ని ఈ భూమిపైకి పంపించాడు. ఆ విధంగా దుష్టులను కూడా వారి పాపాల నుంచి రక్షించడానికి, తన ప్రేమపరిమళాలు పంచడానికి ఏసుక్రీస్తు ఈ లోకంలో అవతరించాడు.

మన దేశంలో క్రైస్తవులు మైనారిటీలుగా ఉన్నారు. కాని క్రైస్తవం మాత్రం చాలా బలంగా వేళ్ళూనుకుపోయి ఉంది.

1968 నుంచి నేను ఈ రంగంలో ఉన్నాను. 1993లో మెదక్ చర్చికి బిషప్‌గా బాధ్యతలు నిర్వహించడానికి ప్రభువు అను గ్రహం పొందాను. మెదక్‌లోని చర్చి ఆగ్నేయాసియా దేశాల్లో కెల్లా అతి పెద్దది. దాదాపు అయిదు వందల మందికి పైగా ప్రార్థ నలు చేసుకోవడానికి అనువుగా ఉంటుంది. మొదటి ప్రపంచ యుద్ధం పూర్తయిన తరువాత పనికి ఆహారం పథకంలో భాగంగా ఈ చర్చి నిర్మించారు. యుద్ధంలో ఎంతోమంది ప్రాణాలు కోల్పోవడం వల్ల అనాథలైన వారి పరిస్థితి చాలా దయ నీయంగా ఉండేది. అప్పుడే ప్లేగు వ్యాధి మహమ్మారిలా వ్యాపిం చింది. అందుకే వారికి సేవలందించడానికి ప్రభువు దయ వల్ల ఈ మెదక్ చర్చి రూపుదిద్దుకుంది.

ప్రస్తుతం దక్షిణ భారత చర్చిల సంస్థ (సిఎస్ఐ)లో మాడరే టర్ గా ఉన్నాను. 1947 సెప్టెంబరు 27న ఈ సంస్థను స్థాపిం చారు. సిఎస్ఐ శాఖలు అన్ని దక్షిణాది రాష్ట్రాలతో పాటు శ్రీలం కలో కూడా ఉన్నాయి. దీని ఆధ్వర్యంలో అనేక సామాజిక సేవా కార్యక్రమాలను చేపట్టాం. జీసస్ ప్రేమతత్వాన్ని బోధించే అనేక సెమినార్లను నిర్వహించాం. ప్రజల్లో భక్తి, తద్వారా ప్రేమభావన లను పెంచడానికి ఈ సంస్థ కృషి చేస్తున్నది. ఈ రకంగా భగవం తుని సేవలో గడిపే అవకాశం ఇచ్చిన ప్రభువుకు కృతజ్ఞుణ్ణి.

మన దేశంలో జీసస్ బోధనల ప్రభావం గురించి వివరిస్తూ ఇక్కడ క్రైస్తవులు మైనారిటీలుగా ఉన్నారు. కాని క్రైస్తవం మాత్రం చాలా బలంగా వేళ్ళూనుకుపోయి ఉంది. వందల సంవత్సరాల నుంచి ఈ మతం ఇక్కడ వ్యాపించి ఉంది. అనాథలకు, అభాగ్యులకు అండదండలుగా నిలిచాయి ఎన్నో మిషనరీలు. అంగవికలాంగులకు, రోగులకు, భర్త చనిపోయిన స్త్రీలకు చేయూతనిచ్చాయి. సేవాదృక్పథానికి పర్యాయపదంగా నిలిచాయి. ఆ దేవుడు చెప్పిందీ ఇదే. తోటి మానవుని ప్రేమించాలి. భగవంతునికి మనపైన ఉన్న ప్రేమ మన తోటివారిని ప్రేమించగలిగేలాగా మనపైన ప్రభావం చూపగలగాలి. ప్రభువందించిన ప్రేమను నలుగురికీ పంచాలన్నదే క్రైస్తవ మతసారం. దుష్టులను కూడా శిక్షించకూడదంటాడు జీసస్. దుర్మార్గులను సైతం ప్రేమతత్వంతో చేరదీయాలన్నదే క్రైస్తవుల ధర్మం. ఆయన బిడ్డలు కాదలచుకున్న వారందరూ ఆయన ప్రేమతత్వాన్ని ఆకళింపు చేసుకుని ఆచరించాలి. అలాంటివారే నిజమైన క్రైస్తవులు. ఈ తత్వం ఇక్కడి వారికి బాగా అర్థమైంది. పాశ్చాత్య సంస్కృతి ఆకర్షణలో స్వార్థం పెరిగి నేటి యువత ప్రేమైక జీవనానికి స్వస్తి పలుకుతున్నది. దుష్టసాహిత్యం, టివి, సినిమాలు యువతను హింసామార్గం వైపు ప్రేరేపిస్తున్నాయి. వాటి మాయాజాలంలో చిక్కుకుని మనశ్శాంతికి దూరమవుతున్నారు. వారిలో ఆధ్యాత్మిక భావాలు పెంపొందేలా చూడవలసిన బాధ్యత ముఖ్యంగా తల్లిదండ్రులదే.

ప్రభువందించిన ప్రేమను నలుగురికీ పంచాలన్నదే క్రైస్తవ మత సారం. దుష్టులను కూడా శిక్షించకూడదంటాడు జీసస్.

నేటి యువత ప్రేమైక జీవనానికి స్వస్తి పలుకుతున్నది. దుష్ట సాహిత్యం, టివి, సినిమాలు యువతను హింసామార్గం వైపు ప్రేరేపిస్తున్నాయి.

క్రిస్మస్ పండుగ సార్వత్రికం. జీసస్ పుట్టిన రోజు సందర్భంగానైనా మనం ఆయన బోధనలను అర్థంచేసుకుని ఆచరించే ప్రయత్నం చేయాలి. ఏసుప్రభువు ఇచ్చిన శాంతి సందేశాన్ని పాటించాలని నిర్ణయం తీసుకోవాలి. ఆయన జీవితమే ఒక సందేశంగా ప్రేమతత్వాన్ని ప్రచారం చేయాలి. మానవ విలువల గురించి దేవుడు ఇచ్చిన సందేశాన్ని అనుసరించాలి. పొరుగువాడు నీ శత్రువైనా సరే ప్రేమించే తత్వాన్ని అలవరచుకోవాలి. హింసించే వారు బాగుపడేలా కరుణించాలని ప్రభువును ప్రార్థించాలి. ద్వేషాన్ని నీ ప్రేమతో జయించు. ప్రేమతత్వంతో దుష్టత్వానిపై గెలుపు సాధించాలి.

– డిసెంబర్ 24, 2004

**అచ్చతెలుగు అత్యున్నత అధికారి ఆయన. మాటల మృదుత్వం, భావంలో సూటిదనం ఆయన సొందం. గణిత, తర్క, తత్వ, సాహిత్యాలు ఆయన మాటల్లో పరిమళిస్తూ ఉంటాయి. పక్కవారిని నొప్పించకుండా, మితమైన కోర్కెలతో సాగే జీవనం ఆనందమయం అవుతుందంటారు మన రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన మోహన్‌కందా. భక్తి, ఆధ్యాత్మికాలపై ఆయన మనోభావ మాలిక.**



# విశ్వాసమే ఆనందమార్గం

మా ది సంప్రదాయ కుటుంబమే కానీ పెద్దగా చాదస్తాలు ఉండేవి కావు. నాన్నగారు న్యాయవాదిగా పనిచేసి హైకోర్టు జడ్జిగా రిటైర్ అయ్యారు. దేవుడు, భయం, భక్తి నేర్పారు. కుటుంబ సభ్యులందరం కలిసి ఆలయాలు సందర్శించే వాళ్ళం. 9వ ఏట వరకు మద్రాసులో పెరిగాను. మా వీధి చివర్లో వినాయకుడి గుడి ఉండేది. రోజూ ఆ గుడికి వెళ్ళి కారు కొనిపెట్టమని దేవుడ్ని కోరుకునే వాడ్ని. ఇప్పుడు ఆ సంగతి గుర్తుకు వస్తే నవ్వొస్తుంది. 10వ ఏట గుంటూరులో ఉన్నాను. ఆ తరువాత హైదరాబాద్, ఢిల్లీలో విద్యాభ్యాసం. ఉస్మానియా యూనివర్శిటీలో మేథమెటిక్స్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశాను. 19వ ఏట వరకు భగవంతుడు ఉన్నాడా అనే సందేహంతో బతికాను. అప్పుడు అనుకోని సంఘటన ఒకటి జరిగింది. ఢిల్లీలో బిఎస్‌సి ఆనర్స్ చదువుతున్నాను. ప్రాక్టికల్స్ జరుగుతున్నాయి. నా తప్పేమీ లేకుండానే చిన్నపొరపాటు దొర్లింది. కెమిస్ట్రీ ప్రాక్టికల్స్‌లో ఫెయిల్ అయ్యాను. మొత్తంమీద డిగ్రీ సెంకడ్ క్లాస్‌లో పాసయ్యాను. సెకండ్ క్లాస్ వచ్చిందనే బాధ.... బంధుమిత్రుల అవహేళనలు... బాగా మథన పడ్డాను. తిరుమల కొండపైకి నడిచి వెళ్ళాను. దేవుడికి తలనీలాలు సమర్పించాను. మనసుకు సాంత్వన లభించినట్టయింది. ఆ తరువాత నుంచి కొంత వరకు భక్తి, ఆధ్యాత్మిక ధోరణి పెరగసాగింది. 40వ ఏట నుంచి నిత్యం దీపారాధన చేసి, స్తోత్రాలు చదువుతున్నాను. తరచు పుణ్యక్షేత్రాలు సందర్శిస్తూ ఉంటాను. ఇంద్రకీలాద్రి వెళ్ళినా, యాదగిరి



**నిత్యం దీపారాధన చేసి, స్తోత్రాలు చదువుతుంటాను. తరచు పుణ్యక్షేత్రాలు సందర్శిస్తూ ఉంటాను. ఇంద్రకీలాద్రి వెళ్ళినా, యాదగిరి గుట్టకైనా నడిచే వెళుతూ ఉంటాను.**



గుట్టకైనా నడిచే వెళుతూ ఉంటాను.

నేను దేవుడ్ని ఎప్పుడూ ఏమీ కోరలేదు. నేను అనుకున్న వన్నీ కాస్త వెనకా ముందూ జరుగుతూ వచ్చాయి. కోరుకున్న వన్నీ జరగడం వల్లనే కావచ్చు నా కోర్కెలు తీర్చేందుకు భగవం తుడు ఓ సాధన అని ఎన్నడూ భావించలేదంటారు.

కనిపించని శక్తి ఏదో నడిపిస్తున్నది. అంతర్యామి... ఓ అతీత మైన శక్తి ఈ విశ్వాన్ని నడిపిస్తున్నదని నేను విశ్వసిస్తాను. ఐన్ స్టీన్ వంటి మేధావులు కూడా అతీతశక్తిని నమ్మినవారే. దేవుడు ఉన్నాడా లేడా అనే అన్వేషణ వ్యర్థం అనిపిస్తుంది. నాకు దేవుడు అంటే నమ్మకం లేదు. అటువంటి నమ్మకాలకు అతీ తుడ్ని అని చెప్పుకుంటారు కొందరు. కనిపించే వాటిని మాత్రమే నమ్ముతాం అనడం సరికాదు. కనిపించనివి ఎన్నో ఉన్నాయి. వాటిని అన్వేషించడంపై దృష్టి సారించడం కంటే అతీతమైన ఆ శక్తిపై విశ్వాసం ఉంచడం వల్ల జీవితంలో లక్ష్య సాధన సుగమం అవుతుందని నా అభిప్రాయం. అలా అని భక్తి, సంప్రదాయాలే సర్వస్వం కాదు. అవి మనల్ని సన్మార్గంలో నడి పించే సాధనాలు మాత్రమే. భగవంతుడున్నాడనిపించే సంఘ టనలు నా జీవితంలో ఏమైనా జరిగాయా అంటే, నిద్రలే వడం... సూర్యోదయం.. సూర్యాస్తమయం... ఇవ్వన్నీ భగవం తుని ఉనికికి నిదర్శనాలు కావా అని ప్రశ్నిస్తా. ఓంకార పరి వృతం విశ్వం, సంకల్ప పరిమితం దృశ్యం అన్నారు రజనీకాంత రావు గారు. విశ్వమంతా ఓంకార మయం. ఇటీవలే ఓంకారం ఉనికి లభించిందని పరిశోధకులు చెప్పారు. ఓంకార తరంగాలు సాంత్వన చేకూరుస్తాయి. అందరు దేవుళ్ళనూ ఆరాధిస్తాను... కానీ వేంకటేశ్వరుడంటే కాస్త ఎక్కువ ఆరాధన ఉందేమో అని పిస్తుందన్నారాయన సాలోచనగా. వివేకానందుడు, ప్రహ్లా దుడు, భక్త కన్నప్ప... వీరు భగవంతుడ్ని భిన్న రూపాల్లో సంద ర్శించుకున్నారు.

ఓ అతీతమైన శక్తి ఈ విశ్వాన్ని నడిపి స్తున్నదని నేను విశ్వ సిస్తాను. ఐన్‌స్టీన్ వంటి మేధావులు కూడా అతీతశక్తిని నమ్మినవారే.

భక్తి, సంప్రదాయాలే సర్వస్వం కాదు. అవి మనల్ని సన్మార్గంలో నడిపించే సాధనాలు మాత్రమే.

మా తల్లిగారి దగ్గర నుంచి మాట, మంచి, కలివిడి తనం నేర్చుకుంటే తండ్రిగారు ప్రాపంచిక సత్యాలను నేర్పిన మార్గ దర్శి. సివిల్స్ పాసై, వివాహం చేసుకొని జీవిత ప్రయాణాన్ని ప్రారంభించే ముందు మా తండ్రిగారి ఆశీస్సులు అడిగాను. జీవితంలో ఎప్పుడూ ఆనందంగా ఉండు. అంతకు మించిన పరమార్థం మరొకటిలేదనే ఆయన మాటలు ఇప్పటికీ నా

సాధ్యమైనంత వరకు ఎవరినీ నొప్పించ కుండా ఆనందంగా ఉండడమే జీవిత పర మార్థం.

చెవుల్లో మారుమోగుతూ ఉంటాయి. నా జీవితంలో చిన్న చిన్న ఇబ్బందులు ఎదుర్కొన్నానేమో కానీ బాధ మాత్రం ఎన్నడూ లేదు. సాధ్యమైనంత వరకు ఎవరినీ నొప్పించకుండా ఆనందంగా ఉండడమే జీవిత పరమార్థం. ఇతరులను నొప్పించక పోవడం, పరిమితమైన కోర్కెలు ఆనంద మార్గాలని నా నమ్మకం.

జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, కుటుంబ సభ్యులకు, సమాజానికి మనం చాలా రుణపడి ఉంటాం. ప్రతి ఒక్కరూ ఆ రుణాన్ని తీర్చుకోవాలి. అప్పుడే కుటుంబసభ్యుల పట్ల, సమాజం పట్ల ప్రేమతో వ్యవహరించ గలుగుతాం. ఆ ఆలోచన ఉన్నప్పుడే ప్రాణికోటి పట్ల కృతజ్ఞతతో ఉంటాం. ఆ చింతన మదిలో ఉన్నంత వరకు వృత్తి, ఉద్యోగం, జీవితంలో ధర్మంతో వ్యవహరిస్తాం. అప్పుడే వ్యక్తి జీవితంతో పాటు సమాజం కూడా సుఖమయం అవుతుంది. యువతలో భక్తి ధోరణి గురించి మాట్లాడుతూ ఈ రోజుల్లో యువతకు బాల్యమే లేదు. ఆటలు, పాటలు, కుటుంబ సభ్యులతో సరదాగా గడపడం వంటివి నానాటికీ తగ్గిపోతున్నాయి. చిరుప్రాయం నుంచి యుక్తవయసులోకి దూకేస్తున్నారు. తల్లిదండ్రులు వారిని పరుగులు తీయిస్తున్నారు. దాంతో వారికి జీవితం గురించి అవగాహన లేకుండా పోతున్నది. భక్తి, సంప్రదాయాలు వంటబట్టడం లేదు. వస్తువాదం యువతను మింగేస్తున్నది. ఆ తరువాత వేలు, లక్షలు సంపాదించినా వాటి నుంచి ఏం పొందాలో తెలియని స్థితిలో పడిపోతున్నది యువత. చిన్నారులకు సంప్రదాయ పరిమళాలను పంచాల్సిన బాధ్యత తల్లిదండ్రులదే, అప్పుడే కుటుంబం, సమాజం కూడా సుసంపన్నమవుతాయి. ముఖ్యంగా ఈ తరం వారిలో వేగం ఎక్కువైంది. వేగం... ఆరాటం తప్పు కాదు. కానీ పట్టాలపై ఉన్నంత వరకు బండి ఎంత వేగంగా వెళ్ళినా ఫరవాలేదు. పట్టాలు తప్పితేనే ప్రమాదం. కొందరు ఉద్యోగం లేదా వృత్తే సర్వస్వం అనుకుంటారు. అవే జీవితం కాదు. కేవలం అవి జీవితంలో ఒక భాగమేనని గ్రహించాలి. అప్పుడే జీవితం ఆనందమయం అవుతుంది.

వస్తువాదం యువతను మింగేస్తున్నది. ఆ తరువాత వేలు, లక్షలు సంపాదించినా వాటి నుంచి ఏం పొందాలో తెలియని స్థితిలో పడిపోతున్నది యువత.

– డిసెంబర్ 31, 2004

**మూర్తీభవించిన సేవారూపం ఆయనది. సమాజానికి మూలస్థంభాలైన యువతను చైతన్యమూర్తులుగా తీర్చిదిద్దేందుకు అయన అహరంహం కృషి చేస్తున్నారు. అన్నార్తులకు ఆ చేయి రోజూ అన్నం పెడుతుంది. జ్ఞానార్తులకు జ్ఞానం బోధిస్తుంది. ఇతరులకు మేలు చేయడమే అసలైన ఆధ్యాత్మికత అనే తత్త్వాన్ని బోధిస్తూ, ఆచరించి చూపిన ఆయనే స్వామి పరమార్థానంద.**



# సేవాభావంతో జీవితం సార్ధకం

"ఇతరుల కోసం జీవించేవాళ్ళు తప్ప మిగిలిన వారంతా మరణించినవారితో సమానం'' అన్న వివేకానందుని మాటలే చిన్నప్పటి నుంచీ నాకు మార్గదర్శకాలు. అందుకే ఆఖరి క్షణం వరకు ఇతరులకు ఉపయోగపడే పనులు చేయాలన్నదే నా లక్ష్యం 'శివభావే జీవసేవ' అన్నది ప్రతి మానవుడి కర్తవ్యం కావాలి. అప్పుడే జగమంతా శాంతిమయం అవుతుంది. నా బాల్యం, విద్యాభ్యాసం అంతా బెంగుళూరులోనే గడిచింది. పది సంవత్సరాల ప్రాయం నుంచే రామకృష్ణ పరమహంస, వివేకానందుల భావజాలం నాలో ప్రవేశించింది. వారి సాహిత్యం ఎంతో ఆసక్తిగా, నిద్రాహారాలు లేకుండా చదివేవాడిని. అవి చదువుతున్నంత సేపూ మనసు పరమానంద భరితంగా ఉండేది. బెంగుళూరు రామకృష్ణ మఠంతో క్రమంగా అనుబంధం పెరిగింది. నా తల్లిదండ్రులు కూడా నా ఆధ్యాత్మిక ప్రస్థానానికి ఎంతగానో తోడ్పడ్డారు. స్వామి యతీశ్వరానంద ఆ మఠానికి అధ్యక్షులుగా ఉండేవారు. నిజమైన బ్రహ్మజ్ఞాని అంటే ఆయనే. నాకు మంత్రోపదేశాన్ని చేసిన ఆయన స్ఫూర్తితోనే ఆధ్యాత్మిక దృక్పథం పెరిగింది. గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాను. సంగీతం అంటే మక్కువతో పద్దెనిమిది సంవత్సరాలు కర్ణాటక సంగీతాన్ని నేర్చుకున్నాను. వీణావాదనం కూడా తెలుసు. ఈ సంగీతసాధన, వివేకానందుని సాహిత్యం, స్వామి యతీశ్వరానంద వద్ద శిష్యరికం... ఇవన్నీ నా ఆధ్యాత్మిక జీవనానికి మార్గదర్శకత్వం చేశాయి.

**ఆఖరి క్షణం వరకు ఇతరులకు ఉపయోగపడే పనులు చేయాలన్నదే నా లక్ష్యం 'శివభావే జీవసేవ' అన్నది ప్రతి మానవుడి కర్తవ్యం కావాలి. అప్పుడే జగమంతా శాంతిమయం అవుతుంది.**

సంగీతసాధన, వివేకా నందుని సాహిత్యం, స్వామి యతీశ్వరా నంద వద్ద శిష్యరికం.. ఇవన్నీ నా ఆధ్యాత్మిక జీవనానికి మార్గదర్శ కత్వం చేశాయి.

ఇరవైరెండో ఏట అంటే 1966లో రామకృష్ణ సంఘంలో చేరాను. అప్పటి నుంచి ఆరేళ్ళ పాటు అక్కడే ఆధ్యాత్మిక శిక్షణ పొందాను. ఆ తరువాత బేలూరులో ఆధ్యాత్మిక విషయాల్లో ఉన్నత విద్యను అభ్యసించాను. నా ఆధ్యాత్మిక ప్రస్థానం ప్రారంభదశలో రామకృష్ణ సంఘం అధ్యక్షులుగా ఉన్న స్వామి ప్రబుద్ధానంద సహాయం మరువలేనిది.

రామకృష్ణ మఠానికి సర్వాధ్యక్షులైన స్వామి రంగనాథానంద వారికి సహాయకులుగా1974లో హైదరాబాదు వచ్చాను. 1977లో త్రికరణశుద్ధిగా సేవలందించడానికి సన్యాసదీక్షతో స్వామి పరమార్థానందగా మారాను. 1997 నుంచి ఈ మఠానికి అధ్యక్షునిగా ఎన్నో సేవా కార్యక్రమాలను చేపట్టాను. నిత్యాన్నదానం, విద్యాదానం, బాలనారాయణసేవ, గ్రామీణుల్లో చైతన్యం కలిగించే దిశలో కార్యక్రమాలు రూపొందించడం వంటి సేవలను ఈ మఠం అందిస్తోంది. యువత కోసం ప్రత్యేకంగా 'వివేకానంద ఇనిస్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్సీ' పేరిట విద్యాసేవలందిస్తోంది. దీనిలో యాభైవేలకు పైగా విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు.... చైతన్యమైన యువతే ప్రపంచానికి చక్కని దిశానిర్దేశం చేస్తుందనే వివేకానందుని ఆదర్శాలకు కార్యరూపం ఇచ్చేందుకు శక్తిపంచనలేకుండా ప్రయత్నిస్తున్నాం. యువతలో ఆధ్యాత్మిక ధోరణుల గురించి చెప్పాల్సి వస్తే, అంతా హైటెక్‌గా మారింది. శాస్త్రీయంగా చెబితే ఆధ్యాత్మిక అంశాలను సైతం వారు చక్కగా అర్థం చేసుకుంటున్నారు. మన పురాణాలు, భగవద్గీత వృద్ధులకు మాత్రమే సంబంధించినవనే అపోహలో ఉంది యువత. కాని జీవితానికి మార్గదర్శనం చేసే గీత ముఖ్యంగా యువతకే ఎక్కువ అవసరం. ఉపన్యాసాల ద్వారా ఎన్ని మంచి విషయాలు బోధించినా అర్థం చేసుకునే ఓపిక ఇప్పుడు ఎవరికీ లేదు. అందుకే పూర్తి దృశ్యరూపకంలో భగవద్గీతను వివరించడానికి హైదరాబాద్‌లోని రామకృష్ణమఠంలో 'గీతాదర్శనం' స్థాపించాం. దీనికి యువత నుంచి మంచి స్పందన లభించడమే వారి దృక్పథంలో వస్తున్న మార్పునకు నిదర్శనం.

మన పురాణాలు, భగవద్గీత వృద్ధులకు మాత్రమే సంబంధించినవనే అపోహలో ఉంది యువత. కాని అవి యువతకే ఎక్కువ అవసరం.

భక్తి, ఆధ్యాత్మికాల మధ్య వ్యత్యాసం ఏమిటంటే భక్తిలో మూఢనమ్మకాలకు ఆస్కారం ఉంది. కాని ఆధ్యాత్మికత అలా

కాదు. జీవిలోని చైతన్యాన్ని గుర్తించి జాగృతపరచడమే ఆధ్యాత్మికత. ప్రతి జీవిలోనూ దేవుడిని దర్శించగలగడమే అసలైన ఆధ్యాత్మికత. ఎంతో భక్తి ప్రదర్శిస్తూ గుడికి వెళ్ళి, బయటకు వచ్చిన తర్వాత మృగంలా ప్రవర్తించకూడదు. వేదాంతాన్ని ఆచరణాత్మక వేదాంతం చేయాలి. చెప్పే విషయాలను ఆచరించి చూపితేనే ఫలితం ఉంటుంది. వివేకానందుడు చెప్పింది, చేసి చూపింది ఇదే. అందుకే ఆయన తత్వం ప్రపంచ నీరాజనాలు అందుకున్నది. ముక్కు మూసుకుని కొండల్లో, అడవుల్లో కూర్చోవడం పాత వేదాంతం. ప్రతి జీవిలోనూ భగవంతుడున్నప్పుడు ఆయన కోసం అడవుల్లో మాత్రమే వెతకడం ఎందుకు..? సేవామార్గంలోనే భగవంతుని దర్శించుకోవచ్చు. ఈ రోజుల్లో పెద్దల్లో కూడా ఆధ్యాత్మిక ధోరణి లేకుండా పోతున్నది. ఉరుకులు, పరుగుల జీవితాలు. గమ్యం తెలియకుండా సాగుతున్నారు. చిన్నారులకు భయభక్తులు నేర్పాలని తల్లిదండ్రులందరికీ ఉంటుంది. పెద్దలు ఎవరైనా కనిపిస్తే నమస్కారం పెట్టమంటూ తల్లిదండ్రులు వారి పిల్లలను బలవంతం చేయడం చూస్తుంటే నవ్వు పుడుతుంది. తల్లిదండ్రులకే తమ బాధ్యతను ఎలా నిర్వర్తించాలో తెలియడం లేదు. అందుకే తమ పిల్లలను ఆధ్యాత్మిక కేంద్రాలకు పంపుతున్నారు. పాటించి చూపిస్తే తప్ప పిల్లలు అర్థం చేసుకోలేరు. కాబట్టి తల్లిదండ్రులు తాము సక్రమమార్గాన్ని ఆచరిస్తూ తమ పిల్లలను సద్గుణసంపన్నులుగా తీర్చిదిద్దాలి. ఆరోగ్యవంతమైన సమాజం ఏర్పడాలంటే ముఖ్యంగా మంచి నడవడికను అలవరచుకోవాలి. మీ జీవితాన్ని చక్కగా నిర్మించుకోగలగాలంటే వివేకానందుని సాహిత్యాన్ని చదవండి. ఆయన అడుగుజాడల్లో నడవండి. ప్రతి ఒక్కరు స్వార్థాన్ని వీడాలి. సాధ్యమైనంత ఇతరులకు సహాయ పడాలి. అప్పుడే మనసుకు సాంత్వన చేకూరుతుంది. అప్పుడే జీవిత పరమార్థం సాధించేందుకు వీలుంటుందన్నారు స్వామి పరమార్థానంద.

– జనవరి 7, 2005

> జీవిలోని చైతన్యాన్ని గుర్తించి జాగృతపరచడమే ఆధ్యాత్మికత. ప్రతి జీవిలోనూ దేవుడిని దర్శించగలగడమే అసలైన ఆధ్యాత్మికత.

> మీ జీవితాన్ని చక్కగా నిర్మించుకోగలగాలంటే వివేకానందుని సాహిత్యాన్ని చదవండి. ఆయన అడుగుజాడల్లో నడవండి.



**ఎన్నో దేవతామూర్తుల పాత్రలకు ఆమె జీవం పోశారు. శాంతరస పోషణ, సాత్వికాభినయాల్లో ఆమె సాటిలేని నటీమణి. సీతమ్మగా, రుక్మిణిగా, భూదేవిగా ఆమె తెలుగు సినీ ప్రేక్షకుల హృదయాల్లో నిలిచిపోయారు. దశాబ్దాల పాటు ప్రేక్షకులను తన నటనతో అలరించిన ఆమే సుప్రసిద్ధ నటి అంజలీదేవీ. పెద్దాపురం ఆంజనేయస్వామి నుంచి పుట్టపర్తి సాయిబాబా వరకు సాగిన ఆమె ఆధ్యాత్మిక ప్రస్థానం ఇది.**



# భక్తి విశ్వాసాలతో మనోబలం



**కుటుంబంలో ఉన్న భక్తి వాతావరణమే నాకు సంస్కారాన్ని నేర్పింది. మా ఇంట్లో పూజలు, వ్రతాలు వంటి సంప్రదాయాలు ఎక్కువగానే ఉండేవి. నాన్నకు కళలు, సంగీతం పట్ల ఎనలేని ప్రీతి.**



భగవంతునిపై నమ్మకం ఉంచి, భక్తిభావాన్ని పెంపొందించుకోవడం శారీరక శక్తిని ఇవ్వకపోవచ్చేమో గాని మానసికంగా ఎంతో బలాన్ని ఇస్తుంది... మనం ఏదైనా చేయగలమనే ఆత్మస్థైర్యాన్ని కలిగిస్తుంది. భగవంతుడంటే ఎక్కడో లేడు.. మానవ రూపంలోనే.. సాటివారికి సాయపడడంలోనే ఆయన మూర్తీభవించి ఉంటాడు. విజయ దశమి రోజున 1928లో పెద్దాపురంలో పుట్టాను. చదువుకుంది కాకినాడలో. పదవతరగతి వరకు మాత్రమే చదువుకున్నా కూడా కుటుంబంలో ఉన్న భక్తి వాతావరణమే నాకు సంస్కారాన్ని నేర్పింది. మా ఇంట్లో పూజలు, వ్రతాలు వంటి సంప్రదాయాలు ఎక్కువగానే ఉండేవి. నాన్నకు కళలు, సంగీతం పట్ల ఎనలేని ప్రీతి. సాధారణ రైతు కుటుంబం నుంచి వచ్చినా తబలా నేర్చుకుని కొంత ప్రావీణ్యం సంపాదించారు. మా ఇంటికి దగ్గరలోనే ఒక ఆంజనేయస్వామి గుడి ఉండేది. సమయం దొరికినప్పుడల్లా ఆ ఆలయానికి వెళ్ళి నా స్నేహితురాళ్ళతో కలిసి ఆడుకునేదాన్ని. చిన్నతనంలోనే ఆంజనేయుడంటే భక్తి అంకురించింది. ఇంట్లో ఏ పూజ జరిగినా నేను కూడా మనస్ఫూర్తిగా పాలుపంచుకునేదాన్ని. తరచుగా తల్లిదండ్రులతో కలిసి గుడికి వెళ్ళడం దేవుణ్ని మొక్కుకోవడం అలవాటై చివరిదాకా కొనసాగుతూనే ఉంది. భగవంతుడి దయవల్ల సినిమాల్లోకి రావడం, ఆదినారాయణ రావు గారితో వివాహం, సినిమాలు తీయడం, అనేక అవార్డులు, అభినందనలు... ఇదంతా మీకు తెలిసిందే

గుడికి వెళ్ళకపోతే
ఏదో వెలితిగా
అనిపించడం వల్ల
మానసిక ప్రశాంతత
కోసం గుడికి వెళ్ళడం
ఒక దినచర్యగా
మారిపోయింది.

చిన్నతనంలో దేవుడికి మొక్కుకునేటప్పుడు కేవలం పెద్ద లను అనుసరించేదాన్ని. పెద్దగా ఫీలింగ్స్ ఏమీ ఉండేవి కాదు. పెద్దయ్యాక భగవంతుని ఆరాధించడంలో ఉన్న మహత్యం ఏమిటో అనుభవపూర్వకంగా తెలిసింది. ఆ అనుభూతి అనిర్వ చనీయం. గుడికి వెళ్ళకపోతే ఏదో వెలితిగా అనిపిస్తుంది. అందువల్ల మానసిక ప్రశాంతత కోసం గుడికి వెళ్ళడం ఒక దిన చర్యగా మారిపోయింది. సీతాదేవి వంటి పౌరాణిక పాత్రలు వేసినప్పుడు ప్రత్యేక భావాలు కలిగాయా అంటే అప్పుడు నా దృష్టంతా ఆయా పాత్రలకు న్యాయం చేయడంపైనే ఉండేది కాని ప్రత్యేకంగా భక్తి భావాలకు లోను కాలేదు. పాత్ర ఔచిత్యా నికి భంగం కలుగకుండా ఆ పాత్రలో లీనమై నటించేదాన్ని అంతే. మా కుటుంబాన్ని కష్టాల ఊబి నుంచి వెలికితీసిన మహ నీయుడు సత్యసాయి. అంజలి పిక్చర్స్ అనే సొంత బ్యానర్‌లో చాలా హిట్ సినిమాలు నిర్మించాం. డిస్ట్రిబ్యూటర్లు మోసగిం చడం వల్ల ఓ హిందీ సినిమా విషయంలో ఆర్థికంగా తీవ్రంగా నష్టపోయాం. దెబ్బ మీద దెబ్బ అన్నట్లుగా అదే సమయంలో నాకు నరాల సమస్యతో తీవ్ర అనారోగ్యం పాలయ్యాను. అలాంటి క్లిష్ట పరిస్థితుల్లో చిత్తూరు నాగయ్యగారి ద్వారా 1963లో పుట్టపర్తి సత్యసాయి భగవాన్ దర్శనమయ్యింది. మానసికంగా బాగా కుంగిపోయి పలకరించడానికి సైతం ఎవరూ లేక అంధకారంలో వున్న మాకు జ్యోతిని ప్రసాదిం చారు బాబా. ''ఎందులో పోగొట్టుకున్నావో దాని ద్వారానే తిరిగి సంపాదించుకోవాలి'' అన్న సత్యసాయి బోధనలతో మాకు ఎంతో సాంత్వన లభించింది. ఆయన కరుణతో అంజలి పిక్చర్స్ మళ్ళీ ఒక వెలుగు వెలిగింది. నా ఆరోగ్య పరిస్థితి కూడా మెరుగుపడింది. కుటుంబమంతా ఒక మంచి స్థితికి వచ్చింది. ఈ సంఘటనతో నా భర్త ఆదినారాయణరావు గారితో పాటు ఇంటిల్లిపాదీ బాబా భక్తులుగా మారిపోయాం. గతంలో ఆంజ నేయస్వామిని ఆరాధించాం. సినీరంగంలోకి వచ్చిన తర్వాత 1943లో తిరుపతికి వెళ్ళాం. వెంకటేశ్వరస్వామిని కూడా పూజించాం. అయితే ఇప్పుడు మాత్రం మా అందరి దేవుడూ సత్యసాయిబాబానే. ఇప్పుడు అందరమూ సంతోషంగా ఉన్నాం. డబ్బుంటేనే అయిన వాళ్ళూ తోడుంటారనే సత్యాన్ని స్వీయానుభవంతో తెలుసుకున్నాను.

''ఎందులో పోగొట్టు
కున్నావో దాని
ద్వారానే తిరిగి సంపా
దించుకోవాలి'' అన్న
సత్యసాయి బోధన
లతో మాకు ఎంతో
సాంత్వన లభించింది.

మా రోజుల్లో శ్రావణ మాసం రాగానే ఎంతో భక్తి విశ్వాసాలతో ప్రత్యేక పూజలు జరిగేవి. ఇప్పుడన్నీ మొక్కుబడిగానే నడుస్తున్నాయి.

అన్నింటికీ దేవుడిపై ఆధారపడకుండా మనవంతు కృషి చేయడం కూడా అవసరం. దేవుడెప్పుడూ మనిషి రూపంలోనే ఉంటాడు.

టివిల రంగప్రవేశం వల్ల సంప్రదాయాలు, ఆచారాలు, ఆధ్యాత్మిక విషయల్లో నేటి తరం శ్రద్ధ చూపడం లేదు. మా రోజుల్లో శ్రావణమాసం రాగానే ఎంతో భక్తి విశ్వాసాలతో ప్రత్యేక పూజలు జరిగేవి. ఇప్పుడన్నీ మొక్కుబడిగానే నడుస్తున్నాయి. కేవలం సమస్యలు వచ్చినప్పుడు మాత్రమే గుడికి వెళుతున్నారు. భక్తి వల్ల పొందగలిగేదేంటో కూడా తెలియకుండా పోతున్నది. పిల్లల గురించి పట్టించుకునే తీరిక, ఓపిక నేటి తల్లిదండ్రులకు ఉండడం లేదు. ఫలితంగా మానవత్వం, నైతిక విలువల కంటే డబ్బుకే ప్రాధాన్యం పెరుగుతున్నది. సమస్యల నుంచి ఉపశమనానికి మనకు అండగా నిలబడి ఉండేదే భక్తి. భారమంతా దేవుడిపైనే వేసినా అనుకున్నది జరుగలేదని నిరుత్సాహపడడం మంచి పద్ధతి కాదు. అన్నింటికీ దేవుడిపై ఆధారపడకుండా మనవంతు కృషి చేయడం కూడా అవసరం. దేవుడెప్పుడూ మనిషి రూపంలోనే ఉంటాడు. భక్తి అనేది మనకు వెన్నుదన్నుగా ఉంటుంది. అంతేతప్ప మనం నిష్క్రియాపరులమై ఉండి అన్నీ దేవుడే చూసుకుంటాడని అనుకోవడం సరైంది కాదు. భక్తి అనేది సోమరితనాన్ని పెంచేదిగా ఉండకూడదు. భగవంతుడిని నమ్ముకుని ప్రయోజనం లేకపోయింది అని నిందించడం అర్థరహితం. భగవంతుడి కన్నా ముందు ఎవరికైన వారికి, తమ అంతరాత్మపైన నమ్మకం ఉండాలి. బాధ్యతల్లోకి వచ్చాక దేవుడి మహిమ ప్రతి ఒక్కరికీ అనుభవంలోకి వస్తుంది. భక్తి, ఆధ్యాత్మికతలు మనిషికి చెప్పలేనంత బలాన్ని ఇస్తాయి. మానవసేవను ప్రోత్సహిస్తాయి. అసూయ, ద్వేషాలను విడిచి ఇతరులకు సాయపడడంలో, గుప్త దానాలు చేయడంలోనూ ఎంతో తృప్తి ఉంటుంది.

– జనవరి 14, 2005



**ఈ ప్రపంచాన్ని నడిపించే భగవంతుడు ఎప్పుడు ఏది అనుగ్రహిస్తాడో చెప్పలేం. మన సంకల్ప బలానికి ఆయన కరుణాకటాక్షాలు తోడైతే మనం సాధించలేనిది ఏదీ లేదు. ఆ రోజుల్లో భక్తిలో చిత్తశుద్ధి ఉండేది. ఈ రోజుల్లో భక్తి కూడా వ్యాపారం అయిపోయింది. పాపాలు పెరిగాయి. ఆలయాల్లో రద్దీ పెరిగింది. ప్రశాంతత తరిగింది. ఈ ధోరణి మారి మళ్లీ మంచిరోజులు వస్తాయంటున్నారు వి.బి. రాజేంద్ర ప్రసాద్**



# త్రికరణశుద్ధితో పాటించే భక్తితోనే ముక్తి

కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా డోకిపర్రు నా స్వగ్రామం. నాన్నగారు వీరమాచనేని జగపతిరావు, అమ్మ లక్ష్మీ నర్సమ్మ. పెద్దకుటుంబం. పండగలు, పబ్బాల సమయంలో త్రికరణ శుద్ధిగా ఆచార సంప్రదాయాలు పాటించేవాళ్ళు. పిల్లలు, పెద్దలు ఎవరి పనులు వారికి ఉండేవి. పండుగ అనేది ఓ అద్భుత విజ్ఞాన, వినోద కేంద్రంగా ఉండేది. ఇప్పుడు పండుగలు మొక్కుబడిగా మారాయి. నేను మచిలీపట్నంలో ఐదో తరగతి చదువుతున్నప్పుడు మేం ఉంటున్న రూమ్ దగ్గరలో సాయిబాబా గుడి ఉండేది. మా అన్నయ్య, నేను, మిత్రులం కలిసి వెళ్ళి రాత్రుళ్ళు రోజూ భజనలు చేసేవాళ్ళం. ఆ సమయంలో ఓ మిత్రుడు నాతో చాలా కటువుగా ప్రవర్తించాడు. చాలా బాధపడ్డాను. ఇంతటి కఠినాత్ములకు బుద్ధి వచ్చేలా చేయి స్వామీ అని ఆ సాయిని వేడుకున్నాను. ఆ రోజు నుంచి నాలో భక్తిభావం నానాటికీ పెరుగుతూ వచ్చింది. దేశంలో ఉన్న ఆలయాన్నీ తిరిగాను. ఇప్పటికి 37 సార్లు అయ్యప్ప మాల వేసుకున్నాను. సినిమాల్లోకి వచ్చాక కూడా నాలో భక్తి తగ్గలేదు. సినిమా ప్రారంభించాక, పూర్తయ్యాక, శతదినోత్సవం పూర్తి చేసుకున్నాక మూడు సార్లూ తిరుమల కొండకు నడిచి వెళ్ళే వాడిని. అయ్యప్ప దీక్ష ముగిశాక తిరుమల వెళ్ళి రావడం ఇప్పటికీ చేస్తున్నాను. 73 ఏళ్ళ వయసులో కూడా కొండ ఎక్కి దిగుతున్నాను. అంతా ఆ ఏడుకొండల వాడి మహిమేనేమో?

**ఇప్పటికి 37 సార్లు అయ్యప్ప మాల వేసుకున్నాను. సినిమాల్లోకి వచ్చాక కూడా నాలో భక్తి తగ్గలేదు. సినిమా ప్రారంభించాక, పూర్తయ్యాక, శతదినోత్సవం పూర్తి చేసుకున్నాక మూడు సార్లూ తిరుమల కొండకు నడిచి వెళ్ళే వాడిని.**

కాలగతిలో సమాజంతో పాటు ఆలయాల్లో కూడా స్వార్థ చింతన ప్రబలింది. భక్తి సైతం కృత్రిమంగా తయారైంది.

నాకు చిన్నతనం నుంచి ఆస్తమా ఉంది. విజయనగరంలో ఒక స్వామీజీ ఉన్నాడని తెలిసి ఆయన దగ్గరకు వెళ్ళాను. డబ్బు, డాబు ఉన్న వారిని పట్టించుకుంటున్నారు తప్ప మరెవరినీ ఆయన కనీసం చూడడం కూడా లేదు. వరసగా నాలుగు రోజులు వెళ్ళినా అదే పరిస్థితి. ఆ మరుసటి రోజు స్వామీజీ శిష్యులు నా బసకు వచ్చి ఓ 500 రూపాయలు విరాళంగా ఇవ్వండి, స్వామీజీ మిమ్మల్ని కలుస్తారు అన్నారు. వారి ఆంతర్యం నాకు అర్థమైంది. ఏదో చెప్పి ఆ ఊరి నుంచి వెనక్కు వచ్చేశాను. ప్రజలకు మార్గదర్శకం చేయాల్సిన స్వామీజీలు ఇలా వ్యవహరించడం భక్తుల్ని గందరగోళ పరుస్తుంది. అలా అని స్వామీజీలంతా అలా ఉండరు. మెహర్‌బాబా వంటి మహిమ లున్న స్వాములూ ఉన్నారు. మరో సంఘటన, కలకత్తాలో ఓ ఆల యానికి వెళ్ళాను. అమ్మవారి పాదుకలపై శిరసు ఉంచి ప్రార్థిస్తు న్నాను. అక్కడ పూజారులు నా శిరసుపై శఠగోపం ఉంచి దక్షిణ వేసే వరకు నా తల పైకి ఎత్తనివ్వలేదు. ఇటువంటి సంఘటనలు మన విశ్వాసాలను దెబ్బతీస్తాయి. కాలగతిలో సమాజంతో పాటు ఆలయాల్లో కూడా స్వార్థ చింతన ప్రబలింది. భక్తి సైతం కృత్రిమంగా తయారైంది. ఈ ధోరణి మారితేనే సమాజానికి ముక్తి లభిస్తుంది. ఆరోగ్యాన్ని ప్రసాదించే పుణ్యక్షేత్రం వేళాంగిణి అని ఎవరో చెప్పగా నేను అక్కడికి వెళ్ళాను. వేళాంగిణిలో మొక్కుకొని అటునుంచి బెంగుళూరులో ఉన్న మిత్రుని ఇంటికి వెళ్ళాను. ఆ మిత్రుడి బంధువు నా పరిస్థితి చూసి వివరాలు అడిగి తెలుసుకున్నారు. హాంకాంగ్ నుంచి ఆస్తమాకు డ్రగ్స్ తెప్పించి ఇచ్చారు. ఆ డ్రగ్ నా పాలిట సంజీవని అయింది. ఆస్తమా చాలా వరకు తగ్గింది. అంత మంచి మందు గురించి తెలియడం వేళాంగిణి సందర్శన ఫలితమే అనిపించింది. అప్పటి నుంచి తరచు వేళాంగిణి వెళ్ళి వస్తున్నాను.

కేవలం ఏడాదిన్నర కాలంలో తొమ్మిది ఆలయాలు, అదీ శాస్త్రబద్ధంగా నిర్మించడం ఆ దైవ కృప మాత్రమే అనిపిస్తుంది.

ఫిల్మ్‌నగర్ దైవసన్నిధానాన్ని అందరి సహకారంతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాం. సకల సదుపాయాలు ఉన్న ఈ ప్రాంతంలో ఓ ఆలయం కూడా ఉంటే బాగుంటుందని కొందరు సూచించారు. ఆ విషయాన్ని కమిటీవారి ఎదుట ఉంచాను. వారు కూడా సరే అన్నారు. ఏ ముహూర్తంలో ఆ సంకల్పం చేశామో కానీ ఒక ఆలయం అనుకున్నది కాస్తా తొమ్మిది ఆల యాల సముదాయంగా రూపుదిద్దుకున్నది. కేవలం ఏడాదిన్నర కాలంలో 9 ఆలయాలు, అదీ శాస్త్రబద్ధంగా నిర్మించడం ఆ దైవ

కృప మాత్రమే అనిపిస్తుంది. రూ. 60 లక్షల ఖర్చుతో చేద్దామను కున్న ఆలయ నిర్మాణం రూ. రెండు కోట్లకు చేరింది. పలువురి సంకల్ప బలంతో ఈ ఆలయ సముదాయం రూపుదిద్దుకున్నది. అందరి సంకల్పానికి మా కమిటీ సహకారంతో కార్యరూపం ఇచ్చాను. అంతకు మించి నా కృషి ఏమీ లేదు.. నేను కేవలం పాత్రధారినే. ఈ రోజుల్లో చిన్నపిల్లలు, యువతలో సైతం భక్తి ఆధ్యాత్మిక రంగాల పట్ల ఆసక్తి పెరుగుతున్నది. దురదృష్టవశాత్తు ఆ భక్తిలో త్రికరణ శుద్ధి లేదు. నగరజీవితంలో ఎన్ని మార్పులు చోటుచేసుకున్నాయో చూడండి. ఈ డిస్కోథెక్‌లు, పబ్‌లు మేం ఊహించ లేదు. గతంలో ఇళ్ళలో గుట్టుమట్టుగా చేసే విష యాలు ఇప్పుడు బాహాటంగా జరుగుతున్నాయి. అంతా కాల ప్రభావం. ఈ ధోరణులు ఇలా కొనసాగడం ఎవరికీ మంచిది కాదు. ఈ పరిస్థితి తప్పక మారుతుంది. ఆ శుభఘడియల కోసం ఎదురు చూడాల్సిందే. చిత్తశుద్ధితో కూడిన భక్తి పెరగాలి. అటు వంటి భక్తి వల్ల మనలో పాపభీతి ఉంటుంది. ధర్మంగా నడుచు కొనేందుకు ప్రయత్నిస్తాం. ఫలితంగా సమాజానికి మేలు చేకూ రుతుంది.

యువతలో సైతం భక్తి ఆధ్యాత్మిక రంగాల పట్ల ఆసక్తి పెరుగుతున్నది. కానీ దురదృష్టవశాత్తు ఆ భక్తిలో త్రికరణ శుద్ధి లేదు.

సుమారు 37 ఏళ్ళుగా నిరాఘాటంగా అయ్యప్ప దీక్ష తీసు కుంటున్నాను. దైనందిన జీవితంలో మనకు తెలియకుండానే శరీ రధర్మాలను తప్పి ఉంటాం. ఆ నలభై రోజుల దీక్ష ద్వారా వచ్చే శక్తి వల్ల శరీరం, మనసు నిష్కల్మషంగా తయారౌతుంది. ఏడా దిలో చేసిన శారీరక, మానసిక దోషాలు తొలగిపోతాయి. అయ్యప్ప స్వామి దీక్షలో మాత్రమే పెద్ద, చిన్న తేడాలు లేవు. దీక్ష తీసుకున్నవారంతా సమానులే. అందుకే అయ్యప్పదీక్షకు ఆదరణ నిరంతరం పెరుగుతున్నది. శబరిమల మొదలుకొని అన్ని క్షేత్రాల్లో రద్దీ పెరిగిపోతున్నది. భక్తిభావం పెరుగుతుందనడానికి ఇంతకు మించి నిదర్శనం ఏమీ అవసరం లేదు. నాలుగు దశా బ్దాల సినీ ప్రస్థానంలో ఎన్నో ఎత్తులు పల్లాలు చూశాను. కోట్లు సంపాదించాను... ఖర్చు చేశాను. మొదటి నుంచి ఉండడానికి గూడు, తిండి, బట్ట ఉంటే చాలనుకొనే తత్వం నాది. చేతనయి నంత వరకు పది మందికి సాయం చేయడం, ఎవరికీ ఇబ్బంది కలిగించకుండా జీవించాలనుకుంటున్నాను. అంతకు మించి పెద్దకోర్కెలు ఏమీ లేవు. ఆపైన అన్నీ పై వాడి లీల.

– జనవరి 21, 2005

అయ్యప్ప దీక్షలో మాత్రమే పెద్ద, చిన్న తేడాలు లేవు. దీక్ష తీసుకున్న వారంతా సమానులే. అందుకే దీనికి ఆదరణ నిరంతరం పెరుగుతున్నది.

**తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిగ్యూటివ్ ఆఫీసర్‌గా ఎన్నో సంచలనాలకు నాంది పలికారు మాజీ ఐఎఎస్ అధికార పి.వి.ఆర్.కె. ప్రసాద్. సంప్రదాయం, ప్రసన్నత రూపుకట్టినట్టు ఉంటుంది ఆయన రూపం. రాష్ట్రంలో వివిధ కీలక స్థానాల్లో నాలుగు దశాబ్దాల పాటు సేవలందించిన ఆయన మాజీ ప్రధాని పి.వి. మీడియా సలహాదారుగా, ఆధ్యాత్మిక వేత్తగా సుపరిచితులు.**



# ప్రతిఫలం కోరనిదే భక్తి

రాయపూర్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకునిగా ప్రారంభమైన నా ఉద్యోగ జీవితం ఆ తరువాత ఐ.ఎ.ఎస్.కు ఎంపిక కావడంతో మరోమలుపు తిరిగింది. నాలుగు దశాబ్దాల పాటు వివిధ హోదాల్లో పనిచేశాను. 1978 నుంచి సుమారు ఐదేళ్ళ పాటు తిరుమల తిరుపతి దేవస్థానం ఎగ్జిక్యుటివ్ అధికారిగా పనిచేశాను. వేంకటేశ్వరుని సన్నిధిలో నాకు లభించిన అనుభవాలు నా జీవితాన్ని మేలిమలుపు తిప్పాయి. జల్సారాయుడిగా ఉండే నేను ఆచార,సంప్రదాయ పరాయణుడిగా మారాను. పరీక్షలకు ముందో... కష్టం వచ్చినప్పుడో దేవుడ్ని తలచుకొనే నేను నిత్యం రెండు, మూడు గంటలు భగవత్ ధ్యానంలో గడుపుతానని ఎన్నడూ ఊహించలేదు. నాలో వచ్చిన మార్పు ఆ పరమాత్మ కరుణే. గూడూరులో 1941 ఆగస్టు 22న జన్మించాను.

**వేంకటేశ్వరుని సన్నిధిలో నాకు లభించిన అనుభవాలు నా జీవితాన్ని మేలిమలుపు తిప్పాయి. జల్సా రాయుడిగా ఉండే నేను ఆచార, సంప్రదాయ పరాయణుడిగా మారాను.**

తండ్రి పత్రి కృష్ణారావు స్కూల్ టీచర్. తల్లి సుభద్రాదేవి. మాది సంప్రదాయ కుటుంబం. సిరిపురంలో ప్రాథమిక విద్య, గుంటూరు హిందూకాలేజీలో డిగ్రీ చదివే రోజుల్లో కూడా భక్తి విలువ తెలిసి అనే కంటే యథాలాపంగా ఆలయానికి వెళుతూ ఉండేవాడ్ని. నాగపూర్ విశ్వవిద్యాలయంలో పీజీ చేశాను. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ఉన్నతాభ్యాసం చేశాను. అధ్యాపకునిగా ఉద్యోగ జీవితం ప్రారంభించి ఆ తరువాత ఐఎఎస్‌కు ఎంపికై సబ్‌కలెక్టర్‌గా, ఖమ్మంజిల్లా కలెక్టర్‌గా, ముఖ్యమంత్రి కార్యదర్శిగా, ప్రధాని మీడియా సలహాదారుగా పనిచేశాను. టిటిడి ఎగ్జిక్యుటివ్ అధికారిగా ఉన్న కాలంలో జరిగిన అద్భుత

మైన సంఘటనలు, ఎందరో పీఠాధిపతులు, జ్ఞానుల సాంగత్యం భగవంతుని పట్ల నాలో ఉన్న నమ్మకాన్ని బలోపేతం చేశాయి. అంతకు ముందు అన్ని ఆధునిక అలవాట్లు ఉండేవి. వేంకటేశ్వ రుని దివ్యమంగళరూపం చూశాక అక్కడ ఉన్నన్నాళ్ళూ వాటికి పూర్తిగా దూరంగా ఉన్నాను. ఆ తరువాత తండ్రిగారు, సతీమణి గోపిక సూచనలు, గురువు సత్యప్రమోదతీర్థస్వామి ప్రబోధాలు నన్ను ఆధ్యాత్మిక పథంలో నడిపించాయి.

టిటిడి ఇవోగా ఉన్న కాలంలో ఎందరో పీఠాధిపతులు, జ్ఞానుల సాంగత్యం భగవంతుని పట్ల నాలో ఉన్న నమ్మకాన్ని బలోపేతం చేశాయి.

తిరుమలలో ప్రశాంతత లభిస్తుంది. నిజానికి అది మన మనసు ప్రశాంతత మీద ఆధారపడి ఉంటుంది. గతంలో చెట్టుచేమల అందాలు, భక్తుల గోవింద నామస్మరణల మధ్య అక్కడ ప్రశాంత వాతావరణం ఉండేదనడం వాస్తవమే. భక్తుల సంఖ్య పెరగడంతో భవన నిర్మాణాలు తప్పనిసరిగా మారాయి. ఈ తరుణంలో తిరుమల పట్ల మన దృక్పథంలో మార్పు రావాలి. తిరుమల పవిత్రతను, అక్కడి సంప్రదాయం, సంస్కృతి వారసత్వాన్ని కాపాడే విధానాలను అధికారులు అనుసరించాలి. భక్తులు తిరుమలను ఒక పర్యాటక కేంద్రంగా కాకుండా భక్తి కేంద్రంగా చూడాలి. భగవంతుడు అన్ని చోట్లా ఉన్నాడు. మనం చేసే ప్రతి పనిని గమనిస్తూ ఉంటాడు. మనకు తెలిసిన మేరకు ధర్మంగా నడుచుకుంటే తిరుమల మాత్రమే కాదు సమాజమే ప్రశాంతమందిరం అవుతుంది. భగవంతుని సన్నిధిలో పేద, ధనిక భేదాలు లేకుండా చూడాలి. ఆ లక్ష్యంతోనే అక్కడ నిత్యాన్నదాన పథకం ప్రారంభించాం. కానీ ఆ పథకం కింద పెట్టే ప్రసాదాన్ని తినడాన్ని కొందరు భక్తులు చిన్నతనంగా భావించడం దురదృష్టకరం. ఆ పథకానికి డబ్బు ఇచ్చే వారు చాలా మంది ఉన్నారు. మరింత రుచిగా, శుచిగా ఉచితభోజనం పెట్టి, అక్కడ మినహా తిరుమలలో మరెక్కడా భోజనం లభించకుండా చర్య తీసుకుంటే కనీసం భగవంతుని సన్నిధిలో అయినా పేద ధనిక భావం లేకుండా పోయే అవకాశం ఉంటుంది.

భక్తులు తిరుమలను ఒక పర్యాటక కేంద్రంగా కాకుండా భక్తి కేంద్రంగా చూడాలి. భగవంతుడు అన్ని చోట్లా ఉన్నాడు.

మఠాలు, పీఠాలు ఆర్థిక లావాదేవీలు నిర్వహించే కేంద్రాలుగా మారడం దురదృష్టకరం. మంచి పనులు చేయాలనుకొనే వారిని ప్రోత్సహించాలి తప్ప ఆ బాధ్యతను వారే నెత్తిన వేసుకొని ఎగ్జిక్యుటివ్‌లుగా మారాల్సిన అవసరంలేదు. స్వామీజీలు ధర్మప్రచారం సంగతి మరచిపోయి విషయలాలసలో పడడం అన్ని విషాదాలకు మూలం. నేను టిటిడిలో ఉన్న సమయంలో అన్న

**ధర్మప్రచారానికి, భక్తి, ఆధ్యాత్మిక గ్రంథాల ప్రచురణకు టిటిడి మాత్రమే కాదు ప్రతి ఒక్కరూ నడుం కట్టాల్సిన అవసరం ఉంది.**

మాచార్య ప్రాజెక్టు, వేద రికార్డింగ్, హిందూధర్మ రక్షణసమితి, ఆధ్యాత్మిక, భక్తి గ్రంథాల ముద్రణ వంటి పలు ప్రాజెక్టులు చేపట్టాం. వేదాలను అనువదించి నామమాత్ర ధరకు భక్తులకు అందజేశాం. ప్రజల్లో జ్ఞాన జిజ్ఞాసను పెంచేందుకు అవి ఎంత గానో తోడ్పడ్డాయి. భక్తులు వేసే కానుకలు వారికే ఉపయోగప డాలనే సంకల్పంతో ఆ పనులన్నీ చేపట్టాం. అయితే మతప్ర చారం చేస్తున్నానంటూ నాకు సంజాయిషీ నోటీసు ఇచ్చారు. నేను చేస్తున్న పని ఎలా సమంజసమో అప్పటి ముఖ్యమంత్రికి వివరించాను. ధర్మప్రచారానికి, భక్తి, ఆధ్యాత్మిక గ్రంథాల ప్రచుర ణకు టిటిడి మాత్రమే కాదు ప్రతి ఒక్కరూ నడుం కట్టాల్సిన అవ సరం ఉంది. అనాదిగా ఆలయాలే మన సంస్కృతీ సంప్రదా యాలకు కేంద్రబిందువులు. ఆలయాలు కళతప్పడంతో సంస్కృతీ సంప్రదాయాలు కూడా వెలవెలపోతున్నాయి. లౌకిక ప్రభుత్వాలు ఆలయాల మీద అజమాయిషీ చేయడం విచిత్రం. భక్తులే ఆలయ పాలన చేసుకొనేలా చర్యలు తీసుకోవాలి. అవసర మైతే తప్ప ప్రభుత్వ జోక్యం తగదు. భక్తులకు సౌకర్యాలు కల్పిం చడం, ధార్మిక ప్రచారం వంటి బాధ్యతలను భక్తులే నిర్వహించు కుంటారు. అప్పుడే ఆలయాలు, వాటితో పాటు మన సంస్కృతీ సంప్రదాయాలు పూర్వవైభవాన్ని సంతరించుకుంటాయి. ప్రస్తుత సమాజంలో భక్తి భావం బాగా పెరుగుతున్నది. బహుశా ఆందోళనలు పెరగడం, అపరాధ భావం ఎక్కువ మందిని భగవంతుడివైపు నడిపిస్తున్నాయనిపిస్తున్నది. చాలా మందికి ఆలయానికి ఎందుకు వెళుతున్నామో తెలియదు. భగ వంతుడితో కూడా లావాదేవీలు నిర్వహిస్తున్నారు. లాభాల్లో పర్సంటేజీలు ఇస్తున్నారు. నిజానికి ఈ రోజుల్లో ఆలయానికి వెళ్ళి ఎవరూ మోక్షాన్ని కోరుకోవడం లేదు. అనంతమైన కోర్కెలు, వస్తువ్యామోహాలు, భగవంతుని ఎదుట బేరసా రాలు... ఇటువంటి భక్తి పెరగడం వల్ల ఫలితం ఉండదు. మనకు తెలిసిన జ్ఞానంతో, సాధన ద్వారా ప్రతిఫలాపేక్ష లేని భక్తిభావం పెరగాలి. ప్రస్తుత సమాజంలో జిజ్ఞాస పెరుగుతున్నది. ప్రశ్నలు మొదలౌతున్నాయి. ధర్మో రక్షతి రక్షితః అనే సత్యాన్ని గ్రహించి, ఆచరించ గలగడమే ఆనందమార్గం.

**చాలా మందికి ఆలయానికి ఎందుకు వెళుతు న్నామో తెలియదు. భగవంతుడితో కూడా లావాదేవీలు నిర్వహిస్తున్నారు.**

– జనవరి 28, 2005

**నిష్కర్షకు, నిర్భీతి నిండిన వ్యాఖ్యలకు ఆయన పర్యాయపదం. విద్యార్థిదశ నుంచే రాజకీయాల్లో మునిగిపోయి భక్తికి దూరమైనా భక్తిసంగీతం ఆత్మా నందం కలిగిస్తుందన్నారు దేవాదాయశాఖమంత్రిగా పనిచేసిన ఎం. సత్యనారాయణరావు. ప్రస్తుతం సమాజం దారితప్పుతున్నదని, భక్తి ఒక్కటే సమాజాన్ని కాపాడగలదని ఎమ్మెస్సార్ భావిస్తున్నారు.**



# సమాజ సంక్షేమం.. భక్తే శరణ్యం

కరీంనగర్ జిల్లా వెదిర గ్రామంలో 1934లో సంక్రాంతి రోజున పుట్టాను. నాన్నగారు హనుమంతరావు పరమభక్తులు. మాగ్రామంలో వెంకటేశ్వరాలయం కట్టించారు. నిరంతరం పురాణ కాలక్షేపాలు, ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించే వారు. విష్ణు సహస్రనామపారాయణ చేయనిదే ఆయన భోజనం చేసేవారు కాదు. చిన్నతనంలో నేను కూడా ఆధ్యాత్మిక కార్యక్రమాల్లో పాల్గొనే వాడ్ని. రామాయణ, భారతాలు ఆసక్తిగా వినేవాడ్ని. ముఖ్యంగా హరికథలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. ఇంటర్ నుంచే విద్యార్థి రాజకీయాల్లో అడుగుపెట్టాను. ఆ తరువాత హైదరాబాద్‌లో డిగ్రీ, బిఎల్ చేశాను. చిన్నతనం నుంచే రాజకీయాల్లో చురుకుగా పాల్గొనడం వల్లనో ఏమో ఆ తరువాత భక్తి, ఆధ్యాత్మిక విషయాలకు ఎప్పుడూ సమయం కేటాయించలేక పోయాను. పండుగల సమయంలో పూజలు చేయడం మినహా ఇంట్లో నిత్యం పూజలు చేయడం వంటివి లేవు. ఆరోజుల్లో గ్రామంలో ఆలయం ఉన్నా లేకున్నా సాయంత్రం అయితే చాలు... ప్రజలంతా మందిరాల్లో చేరి భజనలు చేసే వారు. భక్తి అనేది ఆ రోజుల్లో గ్రామాలను ఒక తాటి మీద నడిపించేందుకు తోడ్పడేది. రోజూ భజనలు చేయడం, పండుగల సమయంలో మినహా భక్తి కార్యక్రమాలకు పెద్దగా సమయం కేటాయించేవారు కాదు. కానీ ఈ రోజుల్లో పరిస్థితి వేరు. అంతా భక్తి మయం. సంవత్సరం పొడవునా ఆలయాలన్నీ కిటకిటలాడుతున్నాయి. యువత నుంచి పెద్దల వరకు

> **యువత నుంచి పెద్దల వరకు అందరిలోనూ భక్తిభావం పెరిగింది. ప్రస్తుత తరుణంలో ఈ ధోరణి చాలా మంచిది. జీవితంలో వేగం పెరిగింది. అశాంతి పెరిగింది. కేవలం భక్తి, ఆధ్యాత్మికాల ద్వారా మాత్రమే శాంతి లభిస్తుంది.**

ప్రపంచ నీరాజనాలు అందుకున్న మనం కూడా క్రమంగా వస్తువ్యామోహం వలలో పడుతున్నాం.

అందరిలోనూ భక్తిభావం పెరిగింది. మా చిన్నమ్మాయి, చిన్న బ్బాయి చాలా భక్తి పరులు. ప్రస్తుత తరుణంలో ఈ ధోరణి చాలా మంచిది. జీవితంలో వేగం పెరిగింది. అశాంతి పెరిగింది. కేవలం భక్తి, ఆధ్యాత్మికాల ద్వారా మాత్రమే శాంతి లభిస్తుంది.

భక్తి క్రమశిక్షణ నేర్పుతుంది. పాపం.. పుణ్యం అనే తేడా తెలియజేస్తుంది. అందుకే సమాజమంతా అశాంతి అలముకున్న ప్రస్తుత తరుణంలో భక్తి అవసరం చాలా ఉంది. సమాజానికి ఏదైనా మంచి చేయాలంటే త్యాగ నిరతి అవసరం. అది భక్తిశ్రద్ధల ద్వారా మాత్రమే సాధ్యం. నేను 35కు పైగా దేశాలు తిరిగాను. ఎక్కడకు వెళ్ళినా భారతదేశ సంస్కృతి, సంప్రదాయాలను వేనోళ్ళ పొగిడేవారు. మహోన్నతమైన మన ఆచార సంప్రదాయాల కారణంగానే వస్తువ్యామోహంలో పడకుండా భారతీయులు చక్కని జీవన విధానాన్ని సాధించగలిగారనేది వారి నమ్మకం. ప్రపంచ నీరాజనాలు అందుకున్న మనం కూడా క్రమంగా వస్తువ్యామోహం వలలో పడుతున్నాం.

ఆచారాలు, సంప్రదాయాలు విస్మరించడమే ఈ దురవస్థకు కారణం. చిన్నతనం నుంచే ఆచార, సంప్రదాయాల గురించి నేర్పించాలి. పెద్దలు కూడా వాటిని పాటించాలి. సుమతీ శతకం, వేమన శతకంలో ఎంత వేదాంతం ఉన్నదో చూడండి. ఈ కాలం పిల్లల్లో ఎంత మందికి నాలుగు వేమన పద్యాలు అర్థంతో సహా తెలుసు. ఈ పరిస్థితి మారాలి.

ఉన్న ఆస్తులను పదిలంగా కాపాడినా ఆలయాలన్నీ నిత్య కల్యాణం పచ్చతోరణంగా ఉంటాయి.

నాకు మొదటి నుంచి భక్తి సంగీతం అంటే చాలా ఇష్టం. అలాగే హరికథలంటే కూడా ఇష్టం. ఆ విషయాన్ని గ్రహించి నేను ఏ ఆలయానికి వెళ్ళినా చక్కటి కార్యక్రమాలు ఏర్పాటు చేస్తున్నారు. నాకోసం మొక్కుబడిగా కాదు... భక్తులకు రోజూ భక్తిసంగీతం వినిపించండి, చక్కని కార్యక్రమాలు ఏర్పాటు చేయండి అని అధికారులకు చెబుతున్నాను. ఎటువంటి సహాయం చేసేందుకైనా సిద్ధమని, మంచి ప్రతిపాదనలతో ముందుకు రావలసిందిగా ధర్మప్రచార సంస్థ వారికి చెప్పాను. ముఖ్యంగా దేవుడి భూములు కుంచించుకుపోతున్నాయి. వీటిని కాపాడడం ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నాను. దేవుడి మాన్యాల జోలికి రావద్దని ప్రభుత్వానికి, నక్సలైట్లకు ప్రత్యేకంగా విజ్ఞప్తిచేశాను. ఉన్న ఆస్తులను పదిలంగా కాపాడినా ఆల

యాలన్నీ నిత్యకల్యాణం పచ్చతోరణంగా ఉంటాయి. దేవాలయాలు బతికి బట్టకట్టాలంటే ఇదొక్కటే మార్గం. గతంలో దాతలు ఆలయ నిర్వహణకు సరిపోయే నిధులు దానం చేశారు. క్రమంగా అవి దుర్వినియోగం కావడం మొదలైంది. ఈ తరుణంలో ప్రభుత్వ జోక్యం అవసరం అయింది. మఠాధిపతులు, పీఠాధిపతులు కూడా చాలా మంది ఆలయ నిర్వహణలో ప్రభుత్వ జోక్యం ఎందుకని ప్రశ్నిస్తున్నారు. ఆదాయం ఉన్న ఆలయాలన్నింటినీ ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటున్నది... చిన్న ఆలయాలు శిథిలం అవుతున్నాయని వారు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. నిజానికి ప్రభుత్వం ఏ లక్ష్యంతో అయితే ఆలయ నిర్వహణ విషయంలో జోక్యంచేసుకుందో అది నెరవేరడం లేదు. అలాంటప్పుడు ఈ ఆలయ నిర్వహణ గొడవ ప్రభుత్వానికి ఎందుకు? ప్రజలే వాటి నిర్వహణ చూసుకుంటారు. అవసరమైనప్పుడు ప్రభుత్వం జోక్యం చేసుకుంటే సరిపోతుందనేది నా వ్యక్తిగత అభిప్రాయం. బడ్జెట్‌లో దేవాదాయ శాఖకు పైసా కేటాయించడం లేదు.. అలాంటప్పుడు ఆలయాలపై పెత్తనం మనకెందుకని ప్రభుత్వానికి స్పష్టంగా చెప్పాను.

**ఆలయ నిర్వహణ గొడవ ప్రభుత్వానికి ఎందుకు? ప్రజలే వాటి నిర్వహణ చూసుకుంటారు. అవసరమైనప్పుడు ప్రభుత్వం జోక్యం చేసుకోవచ్చు.**

ప్రస్తుత సమాజం దారి తప్పుతున్నది. రాముడు రాజకీయం అయిపోయాడు. మహమ్మద్ ప్రవక్త బోధనలు దారితప్పుతున్నాయి. స్వామీజీల్లో స్వార్థ చింతన పెరుగుతున్నది. బాబాల సంగతి సరేసరి. గతంలో కూడా ధర్మం దారితప్పినప్పుడు ఆధ్యాత్మిక ఉద్యమాలు పుట్టాయి. కొత్త ఆలోచనలకు నాంది జరిగింది. అలాగే ఇప్పుడు కూడా మహనీయులు పుట్టాలి. సమాజగతిని మార్చాలి. అప్పుడే సమాజంలో శాంతి నెలకొంటుందన్నారాయన. యువతలో ఆధ్యాత్మిక చింతన పెరగడం సమాజానికి శుభసూచన అంటూ భక్తి అనేది పాపభీతి కలిగిస్తుంది. అదే మనిషిలో సత్‌ప్రవర్తన పెంచుతుంది. అందుకే భక్తిభావం పెంపొందించి, మనకు జ్ఞాన మార్గం బోధించే మహనీయులు మళ్ళీ పుట్టాలి. అప్పుడే సమాజానికి క్షేమం.

**ధర్మం దారి తప్పినప్పుడు ఆధ్యాత్మిక ఉద్యమాలు పుట్టాయి. కొత్త ఆలోచనలకు నాంది జరిగింది.**

– ఫిబ్రవరి 4, 2005



**తెలుగునేలపై పుట్టి పరమాత్ముడి అన్వేషణలో దేశమంతా తిరిగారు. హిమాలయాల్లో ఆయన అన్వేషణ ఫలించింది. ఐదు దశాబ్దాలుగా గంగోత్రి ఆయన నివాసం. యోగం, ధ్యాన, తపోవన్ స్వామి శిష్యరికంలో ఆయన యోగిగా మారారు. 108సార్లు హిమాలయ రహస్యాలను శోధించి పర్వతారోహకుల్ని సైతం ఆశ్చర్య చకితుల్ని చేసిన ఆయనే సుందరానంద. పరమాత్మ నివాసమైన హిమాలయ రహస్యాలు ఆయన మాటల్లో...**



# ఇహపరసాధన మార్గం నిష్కామకర్మ

హిమాలయాలు స్వర్గంలాగా బహు సుందరమైనవి అని భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు చెప్పాడు. హిమాలయాలు సుందరమైనవే కాదు.. అనంత ఆధ్యాత్మిక శిఖరాలు. అవి ఎందరినో మహనీయులుగా మలిచాయి. జీవిత పరమార్థ అన్వేషణలో 1947లో హిమాలయాలు చేరుకున్నాను. అక్కడి ప్రతి మంచు బిందువు ఓ రహస్యాన్ని నాకు విప్పి చెప్పింది. ఆ రోజు నుంచి హిమాలయ పర్వత పాదంలోని గంగోత్రి నాకు నివాసం అయింది. నెల్లూరు జిల్లా అనంతపురం గ్రామంలో 1926లో జన్మించాను. మాది చాలా సామాన్య కుటుంబం. ముగ్గురు అక్కచెల్లెళ్ళు. నేను ఒక్కడినే మగపిల్లవాడిని. స్కూల్ టీచర్ సూరం రామయ్యగారితో మంచి అనుబంధం ఉండేది. ఊళ్ళోని రామమందిరంలోని ఆ నీలమేఘశ్యాముడే నాకు ప్రేరణ. 17 ఏళ్ళలోపే మూడు సార్లు ఇంట్లో నుంచి పారిపోయాను. ఇంట్లో వాళ్ళు ఎంత మురిపెంగా చూసుకున్నా నా ధ్యాస వేరుగా ఉండేది. చివరకు మనకు స్వాతంత్ర్యం వచ్చిన రోజున ఇంట్లో నుంచి బయటకు వచ్చేశాను. నా అన్వేషణ హిమాలయ సందర్శనతో ముగిసింది. 57 ఏళ్ళుగా గంగోత్రిలో నా నివాసం..... హిమాలయంతోనే నా అనుబంధం.

**జీవిత పరమార్థ అన్వేషణలో 1947లో హిమాలయాలు చేరుకున్నాను. అక్కడి ప్రతి మంచు బిందువు ఓ రహస్యాన్ని నాకు విప్పి చెప్పింది. ఆ రోజు నుంచి హిమాలయ పర్వత పాదంలోని గంగోత్రి నాకు నివాసం అయింది.**

గంగోత్రి చేరుకున్న వెంటనే నేను యోగం, ధ్యానంలో నిమగ్నం అయ్యాను. పెద్దగా చదువుసంధ్యలు లేని నన్ను పరమయోగులు తపోవన్ స్వామి చేరదీశారు. స్వామి చిన్మయా

నంద సహాధ్యాయులుగా ఉండేవారు. భక్తి ఆధ్యాత్మిక సారం గ్రహించాను. కాంతులీనే హిమాలయాల రహస్యాలను ఆస్వాదించాలనిపించింది. వీలయితే చిన్న చిన్న పర్వతారోహక బృందాలతో.. లేకుంటే ఒంటరిగా హిమాలయాల్లోని అన్ని శిఖరాలను అధిరోహించాను. హిమాలయ సానువుల్లో సప్త ఓంకారాలను దర్శించాను.... నా జన్మ ధన్యమైందనిపించింది. చేస్తే పర్వతారోహణ లేకుంటే గంగోత్రిలో తపోవన్ స్వామి ఆశ్రమంలో తపస్సు చేసుకోవడం.... ఐదు దశాబ్దాలుగా నా కార్యక్రమం. నేను చూసిన హిమాలయ రహస్యాలను ప్రపంచానికి అందించాలనే ఆలోచన వచ్చింది. అప్పట్లో పాతిక రూపాయలు పెట్టి ఓ కెమెరా కొన్నాను. కనిపించిన అందమైన దృశ్యాలన్నింటినీ క్లిక్‌మనిపించాను. వాటిని స్లైడ్స్‌గా మలిచాను. హిమాలయాల అందాలపై నా దగ్గర వేల సంఖ్యలో అరుదైన స్లైడ్స్ ఉన్నాయి. దుర్భేద్యమైన హిమాలయ సానువుల్లో ఫొటోలు తీసేందుకు రోజుల తరబడి కష్టపడాల్సి వచ్చేది. అందమైన ఫొటోలు తీయడం అలవాటైన నన్ను గంగోత్రిలో ఫ్లాష్ బాబా అని పిలిచేవారు. ప్రస్తుతం అరుదైన హిమాలయ అందాలను దేశం అంతటా ప్రదర్శిస్తున్నాను.

వీలయితే చిన్న చిన్న పర్వతారోహక బృందాలతో.. లేకుంటే ఒంటరిగా హిమాలయాల్లోని అన్ని శిఖరాలను అధిరోహించాను.

రెండు దశాబ్దాల క్రితం హైదరాబాద్‌లో భగవాన్ దాస్ చీఫ్ సెక్రటరీగా ఉన్న కాలంలో రవీంద్రభారతిలో నా ఫొటో ఎగ్జిబిషన్ పెట్టారు. హిమాలయాల్లో తీసిన అరుదైన ఫొటోలకు అందమైన వ్యాఖ్యలతో హిమాలయ అనే పుస్తకాన్ని ప్రచురించాను. ఆ గ్రంథాన్ని 2001లో అప్పటి ప్రధాని వాజపేయి ఆవిష్కరించారు. సహజంగా కవి అయిన ఆయన నా ఫొటోలను చూసి రసానందం పొందారు. తపోవన్ స్వామి భగవంతునిలో లీనం అయ్యాక ఆయన ఆశ్రమంలో స్వామి ఉండే కుటీరమే నాకు నివాసం అయింది. గంగోత్రిలోని ఆశ్రమంలో హిమాలయ అందాలను చూపే ఒక ఆర్ట్ గ్యాలరీ ఏర్పాటు చేసేందుకు ప్రయత్నిస్తున్నాను. గంగోత్రి దాటి హిమాలయాల్లోకి వెళ్ళలేని వారికి ఈ గ్యాలరీ మంచి అనుభూతి మిగులుస్తుంది. గంగోత్రి పవిత్రతను, పర్యావరణాన్ని పరిరక్షించేందుకు స్థానికులతో కలిసి పలు ఉద్యమాలు కూడా చేపడుతున్నాం. ఐదు దశాబ్దాలుగా హిమాలయాలను చూస్తున్నాను. అప్పటికి ఇప్పటికి పర్యావరణంలో చాలా మార్పు వచ్చింది.

అందమైన ఫొటోలు తీయడం అలవాటైన నన్ను గంగోత్రిలో ఫ్లాష్ బాబా అని పిలిచేవారు. అరుదైన హిమాలయ అందాలను దేశం అంతటా ప్రదర్శిస్తున్నాను.

స్వామీజీ ఏమిటి? ఫొటోగ్రఫీ ఏమిటి అనే అనుమానం

ఐదు దశాబ్దాల పాటు నిరంతరం ఆ పరమాత్మ యందు మనసు లగ్నం చేసేందుకు సాధన చేశాను.

రావచ్చు. నాకు ఆ పని చేసినప్పుడు ఆనందం కలిగేది. మనసుకు నచ్చిన ఆ పనిలోనే నేను భగవంతుడ్ని చూశాను. ఇప్పుడు దేశవ్యాప్తంగా ఆధ్యాత్మిక ప్రసంగాలు ఇవ్వడంతో పాటు స్లైడ్ షోలు కూడా పెడుతున్నాను. దేని దారి దానిదే. ఇప్పుడు అన్నీ వ్యాపారం అయిపోయాయి... భక్తి కూడా.

ఐదు దశాబ్దాల పాటు నిరంతరం ఆ పరమాత్మ యందు మనసు లగ్నం చేసేందుకు సాధన చేశాను. ఏ పని చేసినా ఎటువంటి ఫలితాన్ని ఆశించలేదు. నాకే కాదు ఎవరికైనా ముక్తి సాధనే పరమార్థం. అందుకు ఫలాపేక్షలేని జీవనం అవసరం. ఆనంద మార్గం కూడా అదే. దురదృష్టవశాత్తు ఆచార, సంప్రదాయాలు పాటించేవారు తగ్గిపోతున్నారు. ఈ ధోరణి మారాలి. ధోరణి మారే రోజు కోసం ఓపికగా ఎదురుచూడడమే అసలైన యోగం. హైదరాబాద్ రమ్మని చాలామంది ఆధ్యాత్మిక ప్రియులు అడుగుతున్నారు. ఇప్పటికి కుదిరింది. గత వారం తిరుమల వెళ్ళాం. అలాగే మా స్వగ్రామం చూసి వచ్చాను. నా తోబుట్టువులు ఉన్నారక్కడ. వారితో ప్రత్యేకంగా సమయం గడపనందుకు చిన్నబుచ్చుకున్నారు. నాకు ఇప్పుడు అందరూ సమానమే. నాలుగు దశాబ్దాల క్రితం జన్మనిచ్చిన వారు కాలం చేస్తే స్వగ్రామం వెళ్ళాను. మళ్ళీ ఇదే వెళ్ళడం. ఇప్పుడు ప్రపంచమంతా ఒకటిగానే కనిపిస్తున్నది. ఎందరో నా ఆశ్రమానికి వస్తూ ఉంటారు. మరెందరో నన్ను విదేశాలకు ఆహ్వానించారు. ఈ వేదభూమిని వదలాలనిపించలేదు. హిమాలయాలే నాకు మోక్షమార్గం చూపాయి.... వాటితోనే నా జీవితం. తాత్వికత, పరహితం, ఇతరుల పట్ల గౌరవం, నిష్ఠ, భక్తి ఇవే జీవితాన్ని ఆనందమయం చేసేందుకు సాధనాలు.

నాలుగు దశాబ్దాల క్రితం జన్మనిచ్చిన వారు కాలం చేస్తే స్వగ్రామం వెళ్ళాను. మళ్ళీ ఇదే వెళ్ళడం. ఇప్పుడు ప్రపంచమంతా ఒకటిగానే కనిపిస్తున్నది.

– ఫిబ్రవరి 18, 2005



**తెలుగు సినీ అభిమానులందరికీ ఆమె సుపరిచితం. నవరసాలూ పండించి, నవ్యతను చిందించి, కళాభినేత్రిగా నీరాజనాలు అందుకున్నారు. అంచెలంచెలుగా సినీరంగంలో ఉన్నత శిఖరాలను అధిరోహించిన ఆమె వాణిశ్రీ. నిరాకారుడైన భగవంతుడు మన చుట్టూ శక్తి తరంగాల రూపంలో ఆవరించి ఉన్నాడు. ఆ శక్తిలో మనం తేలుతూ ఉన్నాం. ఆ శక్తిని తీసుకోగలిగితే భగవంతుని దర్శనం అయినట్టే అన్నారు వాణిశ్రీ.**



# మన చుట్టూ భగవంతుడు!

పుట్టింది, పెరిగింది నెల్లూరులోని సాహెబ్‌పేట. ఆంధ్రమహిళాసభ విద్యాసంస్థలో మెట్రిక్యులేషన్ చేశాను. ఆరేళ్ల వయసులోనే నాన్నగారు కన్నుమూశారు. అమ్మ వెంకమ్మే మా పొలం నుంచి వచ్చే ఆదాయంతో ఇల్లు నెట్టుకొచ్చేది. సాధారణ రైతుకుటుంబం మాది. కాబట్టి పూజలు, ఆచారాలు అంటూ ఎక్కువగా ఉండేవి కాదు. పూజలు చేయడం కన్నా భగవద్గీత ద్వారా దేవుడు చెప్పిన మంచిని ఆచరించడానికేనేను ప్రాముఖ్యతనిస్తాను. నా భర్త డాక్టర్ ఎవి కరుణాకరన్‌కి కూడా పూజలంటే అంతగా ఆసక్తి లేదు. కాని మా పిల్లలు అనుపమ, అభినయ వెంకటేశ్ కార్తీక్ మాత్రం గుడికి వెళ్ళడం, పూజలు చేయడం ఎక్కువగానే చేస్తుంటారు. వాళ్ళకు కావలసినవి ఇవ్వమని దేవుణ్ని కోరుకుంటుంటారు. అబ్బాయికి ధ్యానం చేయడం, ఆధ్యాత్మిక సాహిత్యం చదవడం అలవాటు. అమ్మాయి మాత్రం వ్యాయామంపై శ్రద్ధ పెడుతుంది. ఎంతైనా డాక్టర్లు కదా. మా ఇంటికి దగ్గరలో ఉండే నిత్యాగ్నిహోత్రులైన మంచు రామయ్య గారి ఇంట్లోంచి ప్రతిరోజూ వేదఘోష వినిపిస్తుండేది. కాబట్టి మా ఇంటి పరిసరాల్లో భక్తివాతావరణం చోటుచేసుకున్నా మాకు అర్థం చేసుకునే సామర్థ్యం లేకపోవడం వల్ల భక్తులం కాలే దేమో అనిపిస్తుంది. మా ఊళ్లోని వీధిబడికి కొంచెం దూరంలో ఒక శివాలయం, రామాలయం ఉండేవి. మా స్నేహితురాళ్లతో కలిసి ఆ గుడిలో పరుగెత్తుతూ.. ఆటలాడుతూ అల్లరి చేసేవారం. దేవుని బొట్టు పెట్టుకోవడానికి, ప్రసాదాలు తీసుకో



నా కోరిక తీరిస్తే ఫలానా పని చేస్తానంటూ దేవునితో బేరసారాలాడడం హాస్యాస్పదం. మనిషి తన అస్తిత్వాన్ని, కర్తవ్యాన్ని తెలుసుకోగలిగినప్పుడే నిజమైన జ్ఞానాన్ని పొందగలుగుతాడు. మనం చేసే ఏ మంచిపనిలోనైనా భగవంతుని దర్శించవచ్చు.



భగవంతుడు అణువణువులోనూ ఒక కాస్మిక్ శక్తి రూపంలో ఉన్నాడని పిస్తుంది. ఆ శక్తిలో మనం తేలియా డుతూ ఉన్నాం.

వడానికి పోటీలు పడేవారం. అంతేగాని దేవుని గురించిన స్మరణ ఉండేది కాదు. మా బళ్లో ప్రార్థన సమయంలో ''జ్ఞానా నందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం..'' అంటూ లీడరు చెప్పేది అప్పచెప్పడమేగాని ఆ శబ్దతరంగాల ప్రభావం, అర్థం తెలిసేది కాదు. తరువాత పుస్తకాల ద్వారా పొందిన ఆధ్యాత్మిక పరిజ్ఞానం దైవనామస్మరణ ప్రభావాన్ని అర్థం చేసుకోవడానికి ఎంతో ఉపయోగపడింది. కొబ్బరికాయలు కొట్టి మొక్కుబడులు తీరిస్తేనే దేవుడు దయచూస్తాడంటే నమ్మను. నా కోరిక తీరిస్తే ఫలానా పని చేస్తానంటూ దేవునితో బేరసారాలాడడం హాస్యా స్పదం. మనిషి తన అస్తిత్వాన్ని, కర్తవ్యాన్ని తెలుసుకోగలిగిన ప్పుడే నిజమైన జ్ఞానాన్ని పొందగలుగుతాడు. మనం చేసే ఏ మంచిపనిలోనైనా భగవంతుని దర్శించవచ్చు. ఆయన్ను విశ్వ సించడానికి జ్ఞానం అవసరం లేదు. కాని సందర్శించడానికి మేధస్సు, ఆచరణ కావాలి. అందుకు మొదటి మెట్టు ప్రాణా యామం అని నా విశ్వాసం.

గోవింద నామ స్మరణతో తిరుపతి మెట్లు ఎక్కడం వల్ల మన మనసును పీడించే పాత ఆలోచ నలు పోయి కొత్త ఆలోచనలకు చోటు దొరుకుతుంది.

ఆధ్యాత్మికత ఒక్కరోజులో వచ్చేది కాదు. నడుస్తున్న కొద్దీ ముళ్ళబాటలో కూడా మంచి దారి ఏర్పడినట్టుగా లోతుగా అధ్యయనం చేస్తూ పరిశోధిస్తున్న కొద్దీ ఆధ్యాత్మిక జ్ఞానం అలవ డుతుంది. ఇందుకు కావలసిన ముఖ్య సాధనం సాహిత్యం. రమణ మహర్షి అన్నట్టుగా నేనెవరిననే ప్రశ్న వేసుకుంటే అందులో నుంచి వెలువడిన ప్రశ్నల పరంపరకు అర్థం వెదు క్కునే దారిలో ఆధ్యాత్మికతకు తలుపులు తెరుచుకుంటాయి. అప్పట్లో పెద్దవాళ్ళందరూ పుస్తకాలు చదవమని చాలా ప్రోత్స హించేవారు. నవలల నుంచి క్రమంగా ఆధ్యాత్మిక పుస్తకాలకు ఆకర్షితురాలినయ్యాను. నిత్యం పూజలు పునస్కారాలు చేయక పోయినా భగవంతుని ధ్యానించుకుంటాను. ఆధ్యాత్మిక గ్రంథా లను అధ్యయనం చేస్తూ..... ఆ పరమాత్మ గురించి తెలుసుకొ నేందుకు ప్రయత్నిస్తున్నాను. భగవంతుడు అణువణువులోనూ ఒక కాస్మిక్ శక్తి రూపంలో ఉన్నాడనిపిస్తుంది. ఆ శక్తిలో మనం తేలియాడుతూ ఉన్నాం. కాని దాన్ని గ్రహించడం లేదు. ఆ శక్తిని తీసుకోగలిగితే భగవంతుని దర్శనం అయినట్టే. మనిషికి మేధస్సు పెరిగింది. తనకన్నా గొప్పవారు లేరని, అన్నీ తన అధీ నంలోనే ఉన్నాయని భావిస్తాడు. క్రమంగా నియంతగా మారి పోతాడు. అతని గర్వాన్ని నియంత్రించడానికి మహాపురుషు లైన మన రుషులు ఒక నియంత్రణ రేఖను ఏర్పరిచారు, ఆ

నియంత్రణ రేఖే భగవంతుడు. మనం భగవంతుని పేరు చెబితే తప్పుడు పనులు చేయలేం. మనకు ఏకాగ్రత కుదరడం కోసం మంత్రాలను పెట్టారు. 'గోవిందా హరి గోవిందా' అంటూ తిరుపతి మెట్లు ఎక్కడం వల్ల మన మనసును పీడించే పాత ఆలోచనలు పోతాయి. కొత్త ఆలోచనలకు చోటు దొరికి భగవంతునిపై ఏకాగ్రత కుదురుతుంది. గ్రహణం ఏర్పడినప్పుడు ఒకచోట కనిపిస్తుంది. మరోచోట కనిపించదు. అంతమాత్రం చేత గ్రహణం రాలేదని చెప్పగలమా..? పరికరం లేకుండా గ్రహణాన్ని పరిశీలించలేం. దేవుడు కూడా అంతే. 'యోగసిద్ధి' అనే పరికరం ఉన్నవారు భగవంతుని దర్శించగలుగుతారు. ఆ సాధనం తమ వద్ద లేనివారు మాత్రమే దేవుడు లేడని వాదిస్తారు. నిజానికి భగవంతుడు, సైన్సు వేర్వేరు కాదు. మన పురాణాల్లో చెప్పే దశావతారాలు మానవ పరిణామక్రమాన్ని సూచిస్తాయి. అంతే కాదు, ప్రతి జీవిలోనూ భగవంతుడున్నాడని వాటిని హింసించకూడదనే గూఢార్థం ఇందులో ఉంది. మన భారతీయ ఆధ్యాత్మిక తత్వంలోనే విజ్ఞాన శాస్త్రం మిళితమై ఉంది.

**భగవంతుడు, సైన్సు వేర్వేరు కాదు. మన పురాణాల్లో చెప్పే దశావతారాలు మానవ పరిణామక్రమాన్ని సూచిస్తాయి.**

నేటి యువతను కొద్దిసేపు ఎవరితోనూ మాట్లాడకుండా, పద్మాసనం వేసుకుని ఒక్క అయిదు నిమిషాలు కూర్చోమనండి.. అస్సలు కూర్చోలేరు. వాళ్లలో కెరీర్ గురించిన ధ్యాస ఎక్కువ అయ్యింది. ఎంతసేపూ ఏదో సాధించాలి, పోటీలో ముందుండాలనే తపన మాత్రమే పెరుగుతోంది. ఒక్క పది నిమిషాలు ఎవరితో మాట్లాడకుండా, కంప్యూటరు, టివి, సెల్ ఫోను లేకుండా నిశ్శబ్దంగా, కదలకుండా కూర్చోగలిగితే చాలు. ఆధ్యాత్మిక పథంలోకి దృష్టి పెట్టినట్లే. ఆత్మ ఉన్న చోటే ఆధ్యాత్మికత ఉంటుంది కాబట్టి ఆత్మ సందర్శనానికి మార్గం ఏర్పరచుకున్నట్టే. సరదాగా గుడికెళ్ళి దండం పెట్టుకుని, బొట్లు పెట్టుకుని బయటికొచ్చి చెడ్డపనులు చేస్తే ఏం లాభం..? మతాన్ని నమ్ముకున్నప్పుడు అందులోని మంచిని ఆచరించినప్పుడే సార్థకత.

**ఆత్మ ఉన్న చోటే ఆధ్యాత్మికత ఉంటుంది కాబట్టి ఆత్మ సందర్శనానికి మార్గం ఏర్పరచుకున్నట్టే.**

– మార్చి 18, 2005





**అమ్మ దొంగా నిన్ను చూడకుంటే నాకు బెంగ.. అంటూ అమ్మల మనసు దోచుకున్నారామె. శివపద మునుంచ నేను శిలనైనను కారాదా అంటూ పరమే శ్వరునితో మమేకం అయ్యారు. భక్తి గానంతో ఆ పర మాత్మను పరవానందభరితుడ్ని చేసిన మధుర గాయని** వేదవతీ ప్రభాకర్. **రేడియో, టీవీల్లో ఆరు వందలకు పైగా భక్తి గీతాల పాడిన ఆమె భగవంతుడి గురించి ఏమంటున్నారో ఆలకించండి.**

# సుమధుర సంగీతమే దైవసన్నిధి

బృందావనంలో కృష్ణుని జాడ కనిపించక వెదికి వేసారిన గోపికలు బాధతో విలపిస్తుంటే, లయబద్ధంగా ఉన్న ఆ దుఃఖంలో సంగీతధ్వని వినిపించి పరుగెత్తుకొచ్చాడట ఆ చిలిపికృష్ణుడు. భక్తి సంగీతంలో ఉన్న గొప్పతనం అంతటిది. మూడు సంవత్సరాలు తపస్సు చేసేకన్నా మూడు గంటలు భక్తితో పాడితే భగవంతుడిని చేరుకోవడం చాలా సులభమంటారు. అందుకేనేమో భక్తిగానం చేస్తున్నప్పుడు దేవుడిలో ఐక్యమవుతున్నానన్న గొప్ప భావన కలుగుతుంది. నేను పుట్టింది కర్ణాటకలో అయినా ఇక్కడికి వచ్చి తెలుగువారి గాయనిగా పేరు తెచ్చుకోగలగడం భగవంతుని కటాక్షమే కదా? మాది బెంగుళూరు. 1942లో సెప్టెంబరు 8న పుట్టాను. డిగ్రీ చేశాను. చిన్నప్పటి నుంచి ఆధ్యాత్మిక వాతావరణంలోనే పెరిగాను. మాది ఉమ్మడి కుటుంబం కాబట్టి పూజలు పునస్కారాలు ఎప్పుడూ ఉంటూనే ఉండేవి. కర్ణాటకలో పీఠాలు ఎక్కువ. ఉడిపి నుంచి తరచుగా పీఠాధిపతులు వచ్చి పూజలు చేయిస్తుండేవారు. ఈ వాతావరణంలో పెరిగిన నాకు బాల్యం నుంచే దేవుడంటే భక్తి పెరిగింది. మా అత్తగారివైపు కూడా భక్తి సంప్రదాయాలెక్కువే. మా వారు ప్రతి సోమవారం రుద్రాభిషేకం చేస్తారు. నేను రోజూ లలిత సహస్రనామాలు చదువుకుంటాను. రోజూ చేసుకునే పూజ ఎలాగూ ఉంటుంది. యోగా కూడా సాధన చేస్తుంటాను. మంత్రాలయం రాఘవేంద్ర స్వామి జపం ప్రతిరోజూ చేసుకుంటాం. శృంగేరీ శంకరమఠానికి సంవత్సరంలో రెండుమూడు



భక్తిగానం చేస్తున్నప్పుడు దేవుడిలో ఐక్యమవుతున్న గొప్ప భావన కలుగుతుంది. నేను పుట్టింది కర్ణాటకలో అయినా ఇక్కడికి వచ్చి తెలుగువారి గాయనిగా పేరు తెచ్చుకోగలగడం భగవంతుని కటాక్షమే కదా?



సార్లయినా వెళతాం. మా వారు డిజిపిగా రిటైరయ్యాక మంత్రాలయంలోని రాఘవేంద్ర మఠానికి సేవలందిస్తున్నారు. నేనూ ఆయనకు సహాయపడుతున్నాను. రాఘవేంద్రుని మహిమలు అమోఘం. మా నాన్నగారు వైమానిక దళంలో పని చేసేవారు కాబట్టి పదే పదే బదిలీలు అవుతుండేవి. నా చదువుకు అంతరాయం కలగకూడదని న్యాయవాది అయిన తాతయ్యగారి వద్ద ఉంచారు. పురంధర దాసు కృతులను నేర్పించిన మా అమ్మమ్మ నా తొలిగురువు. చిన్నప్పుడే దాస సాహిత్యమంతా నేర్చుకున్నాను. బెంగుళూరులో 'గాయని సమాజం' అని ఉండేది. కొత్తగా పాడేవారిని ప్రోత్సహించడానికి ఇది ఏర్పాటు చేశారు. ఇందులో పాడడానికి అవకాశం దొరికితే ఇక వారికి పాడడం వచ్చేసినట్టే. గాయనిగా వారు ఒక స్థానం సంపాదించుకోగలుగుతారు. మా నాన్నగారు ఈ గాయని సమాజంలో సభ్యులు. కాబట్టి నేను చాలాసార్లు ఇందులో పాడి నా ప్రతిభ నిరూపించుకున్నాను. తిరుమల తిరుపతి దేవస్థానం వారి గురుకులంలో అన్నమాచార్య కృతులు, రామదాసు కృతులు నేర్చుకున్నాను. 12 సంవత్సరాలు కర్ణాటక సంగీతంలో శిక్షణ పొందాను.

పురంధర దాసు కృతులను నేర్పించిన మా అమ్మమ్మ నా తొలిగురువు. చిన్నప్పుడే దాస సాహిత్యమంతా నేర్చుకున్నాను.

నా పదిహేడేళ్ల వయసులో ఆంధ్రప్రదేశ్‌కు వచ్చాం. ఇక్కడికి వచ్చాక తెలుగు నేర్చుకున్నాను. తెలుగులో పాటలు పాడటమే కాదు సాహిత్యం కూడా బాగా వంటబట్టించుకున్నాను. ఆకాశవాణిలో అవకాశం చిత్రంగా వచ్చింది. ఓసారి విజయవాడలో ఫంక్షన్‌కి వెళ్ళాం. అక్కడ ప్రార్థనా గీతం పాడవలసిన శ్రీరంగం గోపాలరత్నం గారెందుకో రాలేదు. అప్పుడు అనుకోకుండా నేను పాడవలసి వచ్చింది. అప్పుడే ఆకాశవాణిలో అవకాశం వచ్చింది. వాళ్ళే నాకు తెలుగు నేర్పించి మరీ పాడించుకున్నారు. పెద్దల నుంచి నేర్చుకున్న మన సంస్కృతిని మా ముగ్గురు పిల్లలు మరిచిపోకుండా పెంచాం. వారు కూడా దైవభక్తి కలవారే. విదేశాల్లో ఉన్నా గుడికి వెళతారు. పండుగల సంప్రదాయాలన్నీ పాటిస్తారు. మన సంస్కృతిని మరచిపోని వాళ్ళే ఏదైనా సాధించగలరు. అందుకే మా పిల్లలు సహా నేను ఇప్పటి యువతకి చెప్పేదొకటే. ఏ రంగంలో ఉన్నా మన సంస్కృతి, సంప్రదాయాలకు మాత్రం తిలోదకాలు ఇవ్వకూడదు. మన పునాదులను మరువకూడదు. ఓసారి దసరాకి పరాశక్తి పేరుతో ఆదిశంకరాచార్యుల సౌందర్యలహరి పాడవలసి ఉంది. అందులో పాల్గొన్నవారికి ఏదో ఒక మంచి జరుగుతుందని రేడియోలో సంస్కృతం

ఏ రంగంలో ఉన్నా మన సంస్కృతి, సంప్రదాయాలకు మాత్రం తిలోదకాలు ఇవ్వకూడదు. మన పునాదులను మరువకూడదు.

రూపాలు ఎన్ని ఉన్నా సర్వాంతర్యామి అయిన భగవంతు డొక్కడే అని భావిస్తాను.

నేర్పించే సంతాన గోపాలాచార్యులు అన్నారు. ఆయన అన్నట్టు గానే పాడడం పూర్తవగానే మా అబ్బాయి ఫోన్ చేసి తను గ్రిండ్లేస్ బ్యాంకు ఉద్యోగానికి సెలక్టయ్యానని చెప్పాడు. ఎప్పటి నుంచో ఎదురుచూస్తున్న అవకాశమది. భగవంతుడు నా పాటకు సంతోషించి ఈ వరం ప్రసాదించాడనుకున్నాను. రూపాలు ఎన్ని ఉన్నా సర్వాంతర్యామి అయిన భగవంతుడొక్కడే అని భావిస్తాను. అంతెందుకు.. బెంగుళూరు వెళ్ళినప్పుడల్లా చర్చికి వెళ్ళి కొవ్వొత్తి వెలిగిస్తాం. అందుకే నేను ఒకే దేవుని గానం చేయడానికి పరిమితం కాలేదు. జీసస్ పాటలు కూడా పాడాను.

నేటి పెరుగుతున్న ఒత్తిడి నుంచి బయటపడడానికి ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మికమార్గాన్ని అనుసరిస్తున్నారు. ఇప్పుడు చాలా మంది గురువులొచ్చారు. ప్రతి ఒక్కరూ ఒక గురువును చూసుకుంటూ ఆధ్యాత్మిక పథంలో పడుతున్నారు. సంగీతం విషయానికి వస్తే చాలామందిలో చిత్తశుద్ధి లోపిస్తోంది. అప్పటి వారు భక్తిని స్వయంగా అనుభవిస్తూ పాటలో మమేకమయ్యేవారు. ఫలితంగా ఆ పాటలు ఇప్పటికీ నిలిచిపోయాయి. ఏ పాటైనా శాస్త్రీయ సంగీతం ఆధారంగా రూపొందితేనే ఎక్కువ కాలం రంజింపచేయగలదు. అప్పటికీ ఇప్పటికీ భక్తి సంగీతంలో చాలా మార్పులు, చేర్పులు కనిపిస్తున్నాయి. మొదట్లో లలిత సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యం ఉండేది. తరువాత మెల్లమెల్లగా అన్నమాచార్య పాటలతో భక్తి పాటలు ఆదరణ పొందాయి. ఇప్పుడు అదీ ఇదీ కాకుండా సినిమా పాటల జోరు పెరిగింది. భక్తిపాటలకి కూడా మార్కెట్ బాగా ఉంది. కృష్ణా, గోదావరీ తీర ప్రాంతాలు కర్ణాటక సంగీతానికి ముఖ్య కేంద్రాలు కాబట్టి అక్కడి ప్రజలు లలిత సంగీతమంటే చెవి కోసుకుంటారన్నారు. మరో విషయం 1991లో తానా ఆహ్వానం మేరకు విదేశాల్లో ప్రోగ్రామ్స్ చేశాను. పాశ్చాత్య దేశాల్లో కచేరీలకి తక్కువ మంది హాజరైనా వాళ్ళంతా నిజంగా సంగీతమంటే ఇష్టం ఉన్న వాళ్ళే ఉంటారు. ఇక్కడిలా టైంపాస్ కోసం వచ్చేవారుండరు. పాశ్చాత్యులు కూడా మన సంగీతాన్ని ఆస్వాదిస్తున్నారు. మన సంగీతంలోని ఆధ్యాత్మిక పరిమళం అంత గొప్పది.

ఏ పాటైనా శాస్త్రీయ సంగీతం ఆధారంగా రూపొందితేనే ఎక్కువ కాలం రంజింపచేయగలదు.

– ఏప్రిల్ 1, 2005

**తెలుగు సినీ అభిమానుల మనసులు గెలుచుకుని విక్టరీని ఇంటిపేరు చేసుకున్నారాయన. అమెరికాలో ఉన్నత విద్యాభ్యాసం చేసినా ఆధ్యాత్మిక సంపదకు నెల వైన భారతదేశంలో పుట్టడం తన అదృష్టంగా చెబు తారు ప్రముఖ సినీనటుడు వెంకటేష్. భౌతికంగా ఎంత సాధించినా మానసిక పరిపూర్ణత సాధిస్తేనే నిజ మైన ఆనందం లభిస్తుందంటూ తత్వసారాన్ని సులు వుగా తేల్చిచెప్పే వెంకటేష్ ఆలోచనల మాలిక.**



# నిరంతర సాధనలో ఆనందం

రెండు దశాబ్దాల సినీ జీవితంలో ఎన్నో విజయాలు, పరాజయాలు చూశాను. అవేమీ నా మనసును తాకలేదు. భౌతిక సంపదతో పాటు మానసిక సంపదను పెంచుకున్నప్పుడే జీవితం సార్థకం అవుతుంది. దురదృష్ట వశాత్తు ఈ కాలంలో మానసిక పరిపూర్ణత సాధించేందుకు తగిన ప్రయత్నం జరగడం లేదు. రిటైర్ అయ్యాక ఆధ్యాత్మిక సాధన చేద్దాం అంటే సాధ్యం కాదు. అదో నిరంతర ప్రక్రియ కావాలి. నాకు మూడేళ్ళ వయసు ఉన్నప్పటి నుంచి మద్రాసులో పెరిగాను. చిన్నతనం నుంచి ఇంట్లో భక్తి, ఆధ్యాత్మిక వాతావరణం ఉండేది. నాన్న నేర్పిన క్రమశిక్షణ, అమ్మ నేర్పిన ఆదరణ నాకో గొప్ప వరం. అమ్మతో, స్నేహితులతో కలిసి ఆలయానికి వెళ్ళే వాడిని. పూజలు, పునస్కారాలలో నేనూ పాలుపంచుకొనే వాడిని. పదో తరగతి చదువుతున్నప్పుడు కొన్ని అనుభవాలు ఎదురయ్యాయి. ఆ సమయంలో ఓ ఆధ్యాత్మిక గురువు లభించారు. ఆయన సూచన మేరకు కాళికాదేవి ఆరాధన మొదలు పెట్టాను. ఆ తరువాత పై చదువుల కోసం అమెరికా వెళ్ళాను. అమెరికాలో పూజలు చేయడం కుదిరేది కాదు కానీ నా మనసులో కాళికాదేవి ఉండేది. కానీ ఈ మార్గం సరైనదేనా....ఎందుకని సంతృప్తి లభించడం లేదనే ఆలోచన నిరంతరం నన్ను వెంటాడుతూ ఉండేది. అమెరికా నుంచి తిరిగి వచ్చాను. సినిమా రంగంలో అడుగుపెట్టాను. ఎత్తుపల్లాలు చవి చూడడం ప్రారంభమైంది. అవన్నీ నా మనసును తాకేవి కావు. మనకు అర్థం

**పై చదువుల కోసం అమెరికా వెళ్ళాను. అమెరికాలో పూజలు చేయడం కుదిరేది కాదు కానీ నా మనసులో కాళికాదేవి ఉండేది. కానీ ఈ మార్గం సరైనదేనా.... ఎందుకని సంతృప్తి లభించడం లేదనే ఆలోచన నిరంతరం నన్ను వెంటాడుతూ ఉండేది.**

విజయం – పరా జయం ఒకటే. మనల్ని వేరే శక్తి ఏదో నడిపిస్తున్నది ఆ శక్తి ఏమిటి? ఈ విజయాలు, భౌతిక సౌఖ్యాలే పరమార్థమా...

కానిది ఏదో ఉంది... అదేమిటనే అన్వేషణ నాలో మొదలైంది. ఈ లోగా చిన్నతనంలో నాకు స్ఫూర్తినిచ్చిన నా ఆధ్యాత్మిక గురువు పరమపదించారు. మరో గురువు కోసం అన్వేషణ ప్రారంభించాను. చాలా క్షేత్రాలు తిరిగాను. ఆధ్యాత్మిక ప్రపంచంలో అత్యున్నత శిఖరాలు అధిరోహించిన మహనీయుల గురించి చదివాను. సినీ జీవితంలో బిజీగా మారడం వల్ల ఆ అన్వేషణ కాస్త ఆలస్యం అయింది. కానీ నా మనసు మాత్రం నిరంతరం అన్వేషణలోనే ఉండేది.

‘ప్రేమించుకుందాం....రా!’ సినిమా ఘన విజయం నేపథ్యంలో వేలాది మంది అభిమానులు.. కోలాహలం. నా మనసు మాత్రం మరేదో వెతుకుతోంది. విజయం – పరాజయం ఒకటే. మనల్ని వేరే శక్తి ఏదో నడిపిస్తున్నది ఆ శక్తి ఏమిటి? ఈ విజయాలు, భౌతిక సౌఖ్యాలే పరమార్థమా.... మానసిక పరిణతి సాధించకుండా ఇవన్నీ సాధించి ఏం ప్రయోజనం? అనే ప్రశ్నలు మొదలయ్యాయి. ఆత్మ విశ్లేషణ మరింత తీవ్రం అయింది. ఆత్మవిశ్లేషణా క్రమంలో మొదలైన ప్రశ్నలకు సమాధానం బయట ఎక్కడ నుంచీ లభించదు.... నేను ఎవరిని అనే ప్రశ్న మొదలు కావాలి. మన ప్రశ్నలన్నింటికీ సమాధానాలు మనలోనే ఉంటాయనే విషయం గురువుల సూచనలు, ధ్యాన యోగసాధన, రమణమహర్షి వంటి మహనీయుల గ్రంథాలు చదివాక అర్థం అయింది. ఆ క్షణం నుంచి నా జీవితం పూర్తిగా మారిపోయింది. సుదీర్ఘ అన్వేషణ కొంత వరకు ఫలించినప్పుడు మరో జన్మ ఎత్తినట్టు అనిపించింది. అలా అని సత్యాన్వేషణలో మనకు అర్థమైన విషయమే సర్వస్వం అనే భావన సరి కాదు. మానసిక పరిపూర్ణత సాధించడం అనేది ఒక రోజులో అయ్యే పని కాదు. అందుకు నిరంతర సాధన కావాలి. సినీ రంగంలో, వ్యక్తిగత జీవితంలో ఎన్ని విజయాలు సాధించినా ఎనిమిదేళ్ళ క్రితం వరకు నాకు జీవితంలో స్పష్టమైన లక్ష్యం ఉండేది కాదు. ఆ తరువాత నాకో స్పష్టమైన లక్ష్యం ఏర్పడింది. మానసిక పరిపూర్ణతకు నిరంతర సాధన చేయడమే ఆ లక్ష్యం. భక్తి, తాత్విక చింతన అనగానే అన్ని బంధాలకు దూరంగా, సన్యాసం తీసుకోవడం కాదు. ఈ ప్రపంచంలో మనం కొన్ని బాధ్యతలు నిర్వర్తించేందుక వచ్చాం. వాటిని పూర్తి చేయాలి. మనం చేసే పని ఏమిటి? ఫలితం ఏమిటనేది మన పూర్వజన్మ సుకృతాన్ని బట్టి ఉంటుందని మహనీయులు చెప్పారు. ఆ

తాత్విక చింతన అనగానే అన్ని బంధాలకు దూరంగా, సన్యాసం తీసుకోవడం కాదు. ఈ ప్రపంచంలో మనం కొన్ని బాధ్యతలు నిర్వర్తించేందుకు వచ్చాం.

బాధ్యతలు నిర్వర్తిస్తూ, మానసిక పరిపూర్ణతకు కృషి చేయాలి. నాలో అన్వేషణ మొదలైన నాటి నుంచి నిజానికి గతంలో కంటే ఎక్కువ పనిచేయడం ప్రారంభించాను. ఆధ్యాత్మిక చింతన ... నిత్య జీవితంలో మనం సాధించాల్సినవి వేటి దారి వాటిదే. ఈ రెండింటిలో దేనినీ మనం విస్మరించకూడదు. శ్రీరామ – శ్రీ కృష్ణ తత్వాన్ని ఆశ్రయిస్తున్నాను. దాన్నే (రాయల్ మిడిల్ పాథ్) ఉత్తమ మధ్యే మార్గం అంటారు. నా సతీమణి, కుటుంబ సభ్యుల నుంచి నాకు పూర్తి సహకారం లభిస్తున్నది. వారి అండ తోనే సినీ రంగంలో విజయాలతో పాటు ఆత్మ జ్ఞాన సాధన చేయగలుగుతున్నాను.

**పూర్వం గురుకుల విద్యలో భాగంగా యోగ ధ్యానాలు నేర్పే వారు. చిన్నతనంలోనే మానసిక పరిపూర్ణ తకు ప్రేరణ జరిగేది.**



పూర్వం గురుకుల విద్యలో భాగంగా యోగ ధ్యానాలు నేర్పేవారు. చిన్నతనంలోనే మానసిక పరిపూర్ణతకు ప్రేరణ జరి గేది. కానీ ఈ కాలంలో విద్య భౌతికంగా ఉపయోగపడేదే తప్ప మానసిక పరిపక్వతకు దోహదం చేయడం లేదు. యోగ ధ్యానాలు, మహనీయులు సాధించిన అధ్భుతాలను పాఠ్యాంశా లుగా చేర్చాలి. బాల్యం నుంచి మనో వికాస సాధనకు నాంది జరగాలి. యువకులుగా ఉన్నప్పుడు ఫిలాసఫీ ఎందుకు... ఎప్పుడో రిటైరయ్యాక ఆ గొడవ చూసుకోవచ్చనే ధోరణి పెరు గుతున్నది. నిజానికి ఆత్మ విశ్లేషణ మొదలైతే యువకులు మరింత చొరవతో జీవిత లక్ష్యాన్ని సాధిస్తారు. ఈ కాలంలో యువత అందుకే యోగ, ధ్యానాలవైపు దృష్టి పెడుతున్నది. కేవలం ఒత్తిళ్ళ నుంచి బయటపడడానికి, భౌతిక ఆరోగ్యం కోసమే కాకుండా మానసిక పరిపూర్ణత సాధించేందుకు ఈ యోగధ్యానాలను సాధన చేస్తే యువత ఆనందమయ జీవితం గడిపే వీలుంటుంది. ఒత్తిళ్ళు, ఆశలు, బంధాల మధ్య జీవితం దారీతెన్నూ లేకుండా పోతున్నది. జీవితాన్ని సుఖమయం చేసే విషయం ఏదో ఆలోచించుకోవాలి... గురువులు, సత్సాంగ త్యంలో ఆ మార్గాన్ని సాధన చేయాలి. మన గురించి మనం ఆలోచించుకొనేందుకు కొంత కాలం వెచ్చించాలి. వెసులుబాటు కల్పించుకోవాలి. అప్పుడు నిజంగా జీవితానికి ఉపయోగపడే దేదో అర్థం అవుతుంది. దానికోసం నిరంతరం సాధన చేయ డమే ఆనంద మార్గం.

**ఒత్తిళ్ళు, ఆశలు, బంధాల మధ్య జీవితం దారీతెన్నూ లేకుండా పోతున్నది. జీవితాన్ని సుఖ మయం చేసే విషయం ఏదో ఆలో చించుకోవాలి...**

– ఏప్రిల్ 22, 2005



**మన మనసు గురించి తెలుసుకుని, దాన్ని సరైన దారిలో నడిపించగలిగితే జీవితం సుఖమయం అవుతుంది. అందుకు శాంభవి మహాముద్ర మార్గం చూపుతుందంటూ ప్రపంచవ్యాప్తంగా లక్షలాది మందిని చైతన్య పథంలో నడిపిస్తున్నారు సద్గురు జగ్గీ వాసుదేవ్. యోగవిద్య సాధనగా ప్రపంచ మానవాళికి దివ్యత్వ మార్గాన్ని చూపడమే పరమావధిగా కృషి చేస్తున్న జగ్గీవాసుదేవ్ తత్వవాణి.**

# మనోసౌందర్యమే పరమాత్మ

ప్రపంచంలో ప్రతి ఒక్కరూ పరిపూర్ణ జీవితం గడిపేందుకు అవసరమైన భౌతిక వనరులన్నీ సమకూర్చుకుంటారు. కానీ ప్రశాంతమైన మనసుకు ఏది అవసరమో దాన్ని గురించి క్షణం కూడా ఆలోచించరు. నిజానికి పరిపూర్ణత అనేది ప్రశాంతమైన మనసు ఉంటేనే సాధ్యమౌతుంది. మొదట మనలో మార్పు రావాలి.... అప్పుడే ప్రపంచం మారుతుంది. మన గురించి మనం తెలుసుకొని, మార్పు కోసం ప్రయత్నించకపోతే జీవితంలో ఏం సాధించినా అది నిరర్థకమే.

> బాహ్యమైన సౌకర్యాలతో పరిపూర్ణమైన ఆనందం లభించదు. మనసు కూడా ఆందించగలిగేదే పరిపూర్ణమైన ఆనందం. అంతర్గత ఆనందానికి తోడ్పడే సాధనం యోగ. ఆ యోగాన్ని ఆధునిక అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్ది ఇషా ఫౌండేషన్ ద్వారా యావత్ మానవాళికి అందిస్తున్నాం.

ప్రతి ఒక్కరి జీవితాశయం ఆనందంగా బతకడమే. అందుకోసం ఎంతో ఆలోచిస్తాం. ఎన్నో పనులు చేస్తాం. మనకు బాహ్యమైన ఆనందం కలిగించేందుకు ఎంతో సాంకేతిక పరిజ్ఞానం ఉన్నది. మరెన్నో వసతులు ఉన్నాయి. కానీ మనసుకు ఆనందం కలిగించేందుకు అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం మనదగ్గర ఉన్నదా? ఉంటే దాన్ని మనం ఉపయోగించుకుంటున్నామా అని ఆలోచించాలి. నిజానికి మనకు ఆనందంగా ఉన్నదంటే అందుకు బాహ్యమైన, అంతర్గతమైన కారణాలు రెండూ ఉంటాయి. బాహ్యమైన సౌకర్యాలతో పరిపూర్ణమైన ఆనందం లభించదు. మనసు కూడా ఆందించగలిగేదే పరిపూర్ణమైన ఆనందం. అంతర్గత ఆనందానికి తోడ్పడే సాధనం యోగ. ఆ యోగాన్ని ఆధునిక అవసరాలకు అనుగుణంగా తీర్చిదిద్ది ఇషా ఫౌండేషన్ ద్వారా యావత్ మానవాళికి అందిస్తున్నాం. ఏడాదిలో నాలుగు నెలలు ప్రపంచ వ్యాప్తంగా పర్యటిస్తూ

యోగాన్ని, జీవన మార్గాన్ని బోధిస్తున్నాం. అమెరికాలో 12 కేంద్రాల ద్వారా బోధనలు అందిస్తున్నాం.

భగవంతుడ్ని మనం ఎప్పుడూ చూడలేదు. కానీ ఇంత అద్భుతమైన సృష్టి చేసిన వారు ఎవరో ఉండాలనే నమ్మకం అందరిలో ఉంటుంది.

అందమైన ఊహ మనకు అద్భుతమైన ఆనందం ఇస్తుంది. భగవంతుడ్ని మనం ఎప్పుడూ చూడలేదు. కానీ ఇంత అద్భుతమైన సృష్టి చేసిన వారు ఎవరో ఉండాలనే నమ్మకం అందరిలో ఉంటుంది. కేవలం ఆ నమ్మకానికే పరిమితమైతే అది మనసును జో కొడుతుంది. తెలుసుకోవాలనే జిజ్ఞాస వికాసం కలిగిస్తుంది. అందుకనే భక్తి, జ్ఞాన, కర్మ, యోగ మార్గాల్లో జ్ఞాన మార్గం వికాసానికి తోడ్పడుతుంది. యోగ ప్రక్రియను సాధిస్తే మనం భౌతికంగా మానసికంగా పరిపూర్ణులుగా తయారవుతాం. కమలం బురదలోనే ఉద్భవిస్తుంది. మన మనసుకు కూడా అనేక బురదలు అంటుకుంటూ ఉంటాయి. వాటిని వదిలించేందుకు యోగం తోడ్పడుతుంది. ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యంలో జరిగిన మిలీనియం ప్రపంచ శాంతి సదస్సులో భారతదేశం తరపున ప్రాతినిధ్యం వహించాను. ప్రపంచ మత నేతల కౌన్సిల్‌లో కూడ నేను సభ్యునిగా ఉన్నాను. ప్రపంచం అంతా ఇప్పుడు యోగవిద్యపై దృష్టి సారించడానికి అందులోని పరిపూర్ణత అందించగలిగే శక్తే కారణం. మా పూర్వీకులు తెలుగువారే. మైసూర్‌లో పుట్టి పెరిగాను. తెలుగు కొంచెం కొంచెం మాట్లాడగలను. కొన్నాళ్లు వ్యాపారం చేశాను. అందులో మనసు నిలవలేదు. ప్రతి ఒక్కరిలో కొంత అంతర్మథనం ఉంటుంది. 25 ఏళ్ళ కిందట నాలోని ఆ అంతర్మథనం నన్ను ఈ పథంలో నడిపించింది. కర్ణాటకలో జననం, ఆ తరువాత పరమార్థ అన్వేషణ. తమిళనాడులోని కోయంబత్తూరుకు 40 కిలోమీటర్ల దూరంలో నీలగిరి పర్వత పాదంలో ఇషా ఫౌండేషన్ ఏర్పాటు చేశాం. అందరికీ దివ్యత్వ అనుభూతిని అందించేందుకు సహకరించడమే నా జీవిత లక్ష్యం. అందుకు యోగను సాధనంగా ఎంచుకున్నాను.

ప్రపంచం అంతా ఇప్పుడు యోగ విద్యపై దృష్టి సారించడానికి అందులోని పరిపూర్ణత అందించగలిగే శక్తే కారణం.

పూర్వీకులు ఎంతో శ్రమించి మనకు ప్రసాదించిన యోగ ప్రక్రియలో ఆధునికులకు అవసరమైన కొన్ని మార్పులు చేసి శాంభవి మహాముద్ర యోగాన్ని రూపొందించాం. మానసికంగా ప్రశాంతత కలిగించడంతో పాటు పరిపూర్ణతను సాధించేందుకు ఈ యోగం ఉపయోగపడుతుంది. మనదేశంతో పాటు పలు ప్రపంచ దేశాల్లో ప్రముఖులు సైతం యోగాన్ని అభ్య

యోగం అంటే రోజులో గంటల తర బడి సమయం కేటా యించాల్సిన అవ సరం లేదు.

సించి సత్ఫలితాలు సాధించారు. యోగం అంటే రోజులో గంటల తరబడి సమయం కేటాయించాల్సిన అవసరం లేదు. రోజులో కేవలం 20 నిమిషాల సేపు ఈ మహాముద్రను ఆచ రిస్తే ఆ అనుభూతి మహాద్భుతంగా ఉంటుంది. కేవలం రెండు రోజుల పాటు శిక్షణ ఇవ్వడం వల్ల యోగం అలవడుతుందా అంటే మనలో ప్రేరణ కలగడానికి రెండు రోజులు అవసరం లేదు... రెండు క్షణాలు చాలు. ఈ విద్య వల్ల కేవలం సాంత్వన కలగడంతో పాటు దీర్ఘకాలిక వ్యాధులు కూడా నయమ వుతాయి.

కోయంబత్తూరు సమీపంలో నీలగిరి పర్వత సానువుల్లో ఉన్న ఇషా ఫౌండేషన్‌లో అత్యంత రమణీయమైన ప్రత్యేక ధ్యాన కేంద్రాన్ని నిర్మించాం. అందులో 13 అడుగుల ఎత్తు ఉన్న ధ్యాన లింగాన్ని ఏర్పాటు చేశాం. 17 అడుగుల ఎత్తయిన ఏక శిలా ఫలకం ఆధారంగా డోమ్ ఆకారంలో గర్భగుడి నిర్మించాం. అణువణువునా నిర్మలత్వం ధ్వనించే ఈ ధ్యానకేం ద్రంలో ఆశ్రమానికి వచ్చిన వారికి ధ్యానం నేర్పుతున్నాం. రోజు వారీ జీవితంతో కుస్తీ పడుతున్న వాళ్ళ దగ్గరకు వెళ్ళి మీ మనసు ప్రశాంతంగా ఉంచుకోండి అని చెబితే ఫలితం ఏం ఉంటుంది? ముందుగా వారిని కష్టాల్లో నుంచి బయటపడేయాలి. అందు కోసం కూడా ఇషా ఫౌండేషన్ ఇతోధికంగా కృషి చేస్తున్నది. గ్రామాల్లో యోగశాల, ఔషధ శాలలను ఏర్పాటు చేస్తున్నది. కోయంబత్తూరు సమీపంలోని పలు గ్రామాల ప్రజల జీవన ప్రమాణాలను మెరుగు పరచేందుకు ప్రయత్నిస్తున్నాం. ఆనం దమార్గ ఎవరో చూపితే కనిపించేది కాదు. మన అన్వేషణలో నుంచి నిజమైన ఆనందం లభిస్తుంది.

రోజువారీ జీవితంతో కుస్తీ పడుతున్న వాళ్ళ దగ్గరకు వెళ్ళి మీ మనసు ప్రశాం తంగా ఉంచుకోండి అని చెబితే ఫలితం ఏం ఉంటుంది?

– ఏప్రిల్ 29, 2005



**ఆ ఇంట్లో అడుగడుగునా వేంకటేశ్వరుని రూపాలు కనిపిస్తాయి. ఓం వేంకటేశాయనమః అనే నాదం నిరంతరం ఆధ్యాత్మిక తరంగాలను పంచుతూ ఉంటుంది. సత్సాంగత్యం అంటే ఆయనకు ప్రాణం. అదే ఆయనను జీవితంలో ఉన్నత శిఖరాలకు తీసుకువెళ్లింది. ఆయనే హైకోర్టు న్యాయవాదిగా, హైకోర్టు జడ్జిగా బాధ్యతలు నిర్వర్తించిన జస్టిస్ తామడ గోపాలకృష్ణ. భక్తి, ఆధ్యాత్మికతత్వంపై ఆయన మనోగతం.**



# నిర్మలంగా ఉండటమే నిజమైన భక్తి

ప్రతి ఒక్కరూ తమ గురించి తాము ఆలోచించుకోవాలి. ఇతరులకు ఇబ్బంది కలిగించకుండా తమ పని తాము చేసుకుంటే వ్యక్తులు.. తద్వారా సమాజం సుభిక్షంగా ఉంటుంది. మనల్ని మనం సంస్కరించుకుంటూ, నిర్మలంగా, నిష్కామంగా ఉండడమే నిజమైన భక్తి. అదే జీవితాన్ని ఆనంద మయం చేస్తుంది. విజయం అనేది ఒక రోజులో రాదు. దానికి ఎంతో కృషి కావాలి. ఆనందమయ జీవితమూ అంతే. దానం తట అదే రాదు. నిరంతర సాధన కావాలి. విజయనగరం జిల్లా పార్వతీపురంలో పుట్టాను. మాది సంపన్న కుటుంబం. మా నాన్నగారు తామాడ సూర్యనారాయణ. ఉత్తరాంధ్రలో పేరు మోసిన న్యాయవాది. ఆ కాలంలోనే బెనారస్ విశ్వవిద్యాల యంలో లా చదివారు. మొదటి నుంచీ మా నాన్నగారే నాకు ఆదర్శం. మా నాన్నగారు పెద్దగా భక్తిపరులు కాకపోయినా సంప్రదాయం పాటించే వారు. మా అమ్మగారు మాత్రం రోజూ పూజలు పునస్కారాలు చేసే వారు. చిన్నతనంలో వెంకటేశ్వర స్వామి ఆలయానికి వెళుతూ ఉండే వాడిని. అంతకు మించి భగ వంతునితో పెద్దగా అనుబంధం ఉండేది కాదు. టెన్త్ పాస య్యాక మొదటి సారిగా మా నాన్నగారు నన్ను తిరుపతి పంపారు. అప్పటి నుంచి ఆయనతో నాకు అనుబంధం మొద లైంది. నాన్నగారు నన్ను ఇంజనీరునో డాక్టరునో చేయాలని అనుకొనే వారు. కానీ చదువులో నేను వెనుకబడి ఉండేవాడిని. విజయవాడ లయోలా కాలేజీలో బికాం చదివాను. ఎంకాం

> ఇతరులకు ఇబ్బంది కలిగించకుండా తమ పని తాము చేసుకుంటే వ్యక్తులు.. తద్వారా సమాజం సుభిక్షంగా ఉంటుంది. మనల్ని మనం సంస్కరించు కుంటూ, నిర్మలంగా, నిష్కామంగా ఉండడమే నిజమైన భక్తి. అదే జీవి తాన్ని ఆనందమయం చేస్తుంది.

> తిరుమలేశునితో నా అనుబంధం శాశ్వతమైనది. నేను ఈ స్థితిలో ఉన్నానంటే అంతా ఆయన దయే... నా జీవితం ఆ స్వామికే అంకితం.

చదివి బ్యాంక్ ఆఫీసర్ కావాలని అనుకుంటూ ఉండేవాడిని. డిగ్రీలో సరైన మార్కులు రాకపోవడంతో ఎంకాం సీటు రాలేదు. 1970లో లా డిగ్రీలో చేరాను. లా ఫైనల్ ఇయర్‌లో ఉన్నప్పుడు నాన్నగారు పోయారు. నా చదువు కుంటుపడింది. చివరకు లా పూర్తిచేసి 1975లో బార్ అసోసియేషన్‌లో ఎన్‌రోల్ అయ్యాను. అప్పట్లో నాకు రాజకీయాలంటే ఆసక్తిగా ఉండేది. ఐదేళ్లపాటు రాజకీయాల్లో చురుకుగా తిరిగాను. లాయర్ వృత్తి మూలన పడింది. క్రమంగా రాజకీయాలంటే ఏవగింపు కలగడం మొదలు పెట్టింది. లాయర్ వృత్తి సరిగా సాగడం లేదు... రాజకీయాలపై మనసు నిలవడం లేదు. ఏం చేయాలి.... ఏదీ దారి అనే సంక్షోభంలో పడ్డాను. రెండు నెలల పాటు ఒకటే ఆలోచన. ఆ క్షణంలో భగవంతుడే నాకు దారి చూపించాడు. హైకోర్టులో ప్రాక్టీస్ చేయాలని నిర్ణయించుకున్నాను. ప్రముఖ న్యాయవాది పద్మనాభరెడ్డి వద్ద జూనియర్‌గా చేరాను. ఆ క్షణం నుంచి ఇక వెనక్కు తిరిగి చూసుకోవాల్సిన అవసరం లేకుండా పోయిందంటే అంతా ఆ వేంకటేశ్వరుని చలవే.

> ఈ కాలంలో చిన్న పిల్లల నుంచి పెద్దల వరకు అంతా తీవ్రమైన ఒత్తిడిలో ఉన్నారు. ఒత్తిళ్ళ నుంచి బయటపడేందుకు యోగా అవసరం.

వృత్తిలో స్థిరపడేందుకు ఎంతో కృషి చేశాను. బార్ అసోసియేషన్‌కు సారథ్యం వహించాను. 2001లో న్యాయమూర్తి పదవి చేపట్టాను. న్యాయవాదిగా ఉన్నప్పుడు కానీ, న్యాయమూర్తిగా కానీ మనసా, వాచా , కర్మణా నాకు తెలిసి ఇంతవరకు తప్పు చేయలేదు. ఆ భావనే నాకు కొండంత సాంత్వన కలిగిస్తుంది. నా భార్య వైద్య వృత్తిలో ఉన్నది. ఒక అబ్బాయి. ఒక అమ్మాయి. గతంలో జడ్జి కావాలనే కోరిక ఉండేది. భగవంతుడు ఆ కోరిక కూడా తీర్చాడు. ఇప్పుడు నాకు ఎటువంటి కోరికా లేదు. ఆ తిరుమలేశునితో నా అనుబంధం శాశ్వతమైనది. నేను ఈ స్థితిలో ఉన్నానంటే అంతా ఆయన దయే... నా జీవితం ఆ స్వామికే అంకితం. రోజూ ఉదయం ముందుగా వినాయకుడ్ని ఆ పైన వేంకటేశ్వరస్వామిని పూజిస్తాను. గాయత్రీ మంత్రం పఠిస్తాను. జ్యోతిషంపై నమ్మకం లేకపోయినా ఎవరో చెప్పారని కొద్దిసేపు శని జపం చేస్తాను. ఏ పూజ చేసినా వేంకటేశ్వరుడే నా ఇలవేల్పు.... కళ్ళు మూసుకుంటే చాలు ఆ స్వామి నిండైన రూపం నా కళ్ళ ముందు మెదలాడుతూ ఉంటుంది.

కొంతకాలంగా యోగా చేస్తున్నాను. ఇటీవల రాందేవ్‌జీ క్లాసులకు హాజరయ్యాను. యోగా చేయడం వల్ల మనసు,

శరీరం ఎంతో నిర్మలంగా ఉంటున్నాయి. ఈ కాలంలో చిన్నపిల్లల నుంచి పెద్దల వరకు అంతా తీవ్రమైన ఒత్తిడిలో ఉన్నారు. ఒత్తిళ్ళ నుంచి బయటపడేందుకు, లక్ష్యసాధనకు అవసరమైన చైతన్యం యోగద్వారా లభిస్తుంది. ఈ కాలం యువతకు యోగ చాలా అవసరం. మా తాతగారు యోగ చేసేవారు. ఆ తరువాత కొంతకాలం యోగ చేసే వారి సంఖ్య తగ్గింది. ఇటీవలి కాలంలో మళ్ళీ చాలా మంది యోగాపై దృష్టి సారించడం అభిలషణీయ పరిణామం. మా నాన్నగారు రామాయణ, భారత, భాగవతాలు నా చేత చదివించారు. ఈ తరం వారికి టీవీ, కంప్యూటర్‌ల ముందు కూర్చొని కాలక్షేపం చేయడంతోనే సరిపోతున్నది. ప్రపంచం అంతా వేగంగా మారిపోయింది. కానీ జీవితానికి విలువల పరిమళాలు అద్దే సంప్రదాయాలను విస్మరించకూడదు. ఈ తరం వారిలో కొంత మార్పు కనిపిస్తున్నది. ఉదాహరణకు మా అమ్మాయి అమెరికా యూనివర్సిటీలో మాస్టర్ డిగ్రీ చేసింది. ఓ వైపు చదువుకుంటూనే మరోవైపు అక్కడి వారికి భగవద్గీతపై క్లాసులు చెప్పేది. ప్రపంచం ఎంత పరుగులు పెట్టినా అంతిమంగా ఆనందం మిగిల్చేది ఆత్మజ్ఞానం, ఆధ్యాత్మిక చింతనే.

ప్రపంచం అంతా వేగంగా మారిపోయింది. కానీ జీవితానికి విలువల పరిమళాలు అద్దే సంప్రదాయాలను మాత్రం విస్మరించరాదు.

ప్రతి ఒక్కరూ వారు చేసే పనిలో సంతృప్తి చెందాలి. మనల్ని మనం సంస్కరించుకోవాలి. అప్పుడే సమాజం క్షేమంగా ఉంటుంది. న్యాయం, ధర్మం పదిలంగా ఉంటాయి. ఎవరికీ హాని కలిగించకుండా, నా కర్తవ్యం నేను నెరవేరుస్తున్నాను. ఆ భావనే నాకు ఆనందాన్ని మిగులుస్తున్నది.

ఎవరికీ హాని కలిగించకుండా, నా కర్తవ్యం నేను నెరవేరుస్తున్నాను. ఆ భావనే నాకు ఆనందాన్ని మిగులుస్తున్నది.

– మే 6, 2005





**ఆమె చేతిలోని కుంచె కదిలితే క్షణాల్లో ఓ దేవతా రూపం ప్రత్యక్షం అవుతుంది. రామాయణం, భారతం, భాగవత ఘట్టాలకు రమణీయ చిత్రరూపం ఇచ్చారామె. భర్తతో కలిసి ఈమె చిత్రించిన శ్రీరామపట్టాభిషేకం చిత్రానికి పార్లమెంటు భవనంలో చోటుదక్కింది. ఆమే పిలకా విజయలక్ష్మి. సాహితీ ఉద్దండులు పిలకాగణ పతి శాస్త్రి గారి సోదరుడు లక్ష్మణమూర్తి సతీమణి అయిన విజయలక్ష్మి ఆధ్యాత్మిక ప్రస్థానం ఇది.**

# అంతర్యామికి చిత్రనీరాజనం

పశ్చిమగోదావరి జిల్లా వసంతవాడలో 1928లో పుట్టాను. నా సోదరుడు మొక్కపాటి కృష్ణమూర్తి ప్రముఖ చిత్రకారుడు. ఆయన ప్రోత్సాహం చిత్రకళ పట్ల మక్కువ పెరిగినా, వివాహం అయిన తరువాత భర్త ప్రోత్సాహం వల్ల చిత్రకారిణిగా మారాను. మా వారు పిలకా లక్ష్మీనరసింహ మూర్తి. రామాయణం, భాగవతం, మహాభారతాలను పెయింటింగ్స్ రూపంలో వారు మలిచిన తీరు అందరినీ ఆకట్టుకుంది. వారితో పాటు నేను కూడా ఆ మహాకావ్యాలను చిత్రించాను. మా వారితో పాటు ప్రతి సంవత్సరం వినాయక చవితి రోజు ఇద్దరం వినాయక రూపాన్ని చిత్రించటం ఆనవాయితీ. ఆ తరువాత మేం గీయాలనుకున్న చిత్రాన్ని గీసేవారం. మావారు ఎంతో పేరున్న చిత్రకారులు, అయినా నేను వేసే బొమ్మలకు ఎప్పుడూ సలహాలిచ్చింది లేదు. ఒక్కసారి మాత్రమే అది జరిగింది. రాధ అద్దం చూసుకుంటూ బొట్టుపెట్టుకుంటుంటే అద్దంలో శ్రీకృష్ణుడు కనిపించేలా చిత్రించమని చెప్పారు. అద్భుతమైన ఆలోచన అది. నా పందొమ్మిదో ఏట మాకు అబ్బాయి పుట్టాడు. అప్పటికే నేను చిత్రలేఖనం పట్ల ఆసక్తితో మా అన్నగారి దగ్గరకు వెళ్లి నేను నేర్చుకుంటానని అడిగాను. నేర్చుకోవటం వల్ల ఉపయోగం ఉంటుందంటూనే దానివల్ల ఎదురయ్యే ఇబ్బందులను కూడా వివరించి చెప్పారాయన. ఏదైనా తలపెడితే అది పూర్తి చేసే వరకు వదలని స్వభావం నాది. ఎన్ని ఇబ్బందులెదురైనా చిత్రలేఖనాన్ని వదలని కరాఖండిగా

**వివాహం అయిన తరువాత భర్త ప్రోత్సాహం వల్ల చిత్రకారిణిగా మారాను. మా వారు లక్ష్మీనరసింహమూర్తి రామాయణం, భాగవతం, మహాభారతాలను పెయింటింగ్స్ రూపంలో వారు మలిచిన తీరు అందరినీ ఆకట్టుకుంది. వారితో పాటు నేను కూడా ఆ మహాకావ్యాలను చిత్రించాను.**

చెప్పాను. ఇప్పటికీ అదే మాట మీద నిలబడి ఉన్నాను. అలా మా అన్నయ్య, మావారివద్దనే మెలకువలు నేర్చుకుని, నాదైన శైలిలో చిత్రీకరించటానికి ప్రయత్నం చేశాను. ఆ ప్రయత్నంలో భగవదనుగ్రహం వల్ల విజయం సాధించాను.



నా చిన్నప్పటి నుంచి రామాయణ కావ్యాన్ని చదువుతూ, వింటూ ఉండటం వల్ల దానిపై నాకు ఎంతో మక్కువ. అందుకే నేను గీసిన బొమ్మల్లో రామాయణంపై గీసినవే ఎక్కువ. 'చిన్న పిల్లగా ఉన్నప్పుడు ఒళ్లో కూర్చోపెట్టుకుని మా నాన్నగారు రామకథను చెప్తుండేవారు. దాంతో నాకు తెలియకుండానే రామభక్తి అబ్బింది. మావారు కూడా రామభక్తులే. సంస్కృతం లో ఉన్న రామాయణాన్ని నాకు తెలుగులో వివరించి చెప్తుండే వారు. తెలుగు వచనంలో వచ్చిన రామాయణాలు చదివాను. నా చిత్రకళకు ప్రేరణంతా రామాయణమే ఇచ్చింది. చిన్నప్పటి నుంచీ పాటలంటే ఇష్టం. నేను కూడా పాటలు పాడతాను. ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, ఇతర కీర్తనలు... ఎప్పుడూ ఏదో ఒక ఆలాపన చేస్తూ ఉండడం నా అలవాటు. రామకోటి రాయటం నా దినచర్యలో ఓ భాగం. భగవంతుని ధ్యానంలోనే ఎంతో సంతృప్తి ఉంటుంది. అది ఆచరించినవారికే తెలుస్తుంది. నాకు తెలిసిన చిత్రకళ ద్వారానే భగవంతుడ్ని ఆరాధిస్తున్నాను.' మా వారు కూడా రామాయణ కావ్యాన్ని చిత్రీకరించేవారు. అయితే ఆయన శైలి జానపద, సంప్రదాయ మిశ్రమమైన శైలి. నా పెయింటింగ్స్‌లో లైన్ ఫైన్‌గా ఉండటమే కాక కలర్స్ కూడా డిఫరెంట్‌గా వాడతాను. నేను ఎక్కువగా చిన్నచిన్న పోర్ట్రెయిట్ లను రూపొందిస్తే... మా వారు కాన్వాస్‌ల మీద దేవతా చిత్రాలు రూపొందించేవారు. మా వారితో కలిసి తిరుపతి, సింహాచలం దేవాలయాలకు పెయింటింగ్స్ రూపొందించాను. తిరుమల దేవస్థానం వారు మూల విరాట్టుకు వజ్రకిరీటం పెయింట్ చేయటానికి మరో ఇద్దరు కళాకారులతో పాటు బాపు గారి సూచన మేరకు నన్ను కూడా ఎంపిక చేశారు. మూల విరాట్టును దగ్గరగా చూసే అవకాశం అప్పుడే నాకు కలిగింది. వారం రోజుల పాటు అక్కడ ఉండి నేను రూపొందించిన చిత్రాన్నే దేవస్థానం వారు ఉపయోగించుకోవడం నాకు మరపురాని అనుభూతిని మిగిల్చింది. అలాగే నరసింహావతారాన్ని మావారితో కలిసి సింహాచల దేవస్థానానికి రూపొందించి ఇచ్చాం. అది కూడా మాకు మంచి పేరునే తీసుకువచ్చింది. నా

**'చిన్నపిల్లగా ఉన్నప్పుడు ఒళ్లో కూర్చోపెట్టుకుని మా నాన్న గారు రామకథను చెప్తుండేవారు. దాంతో నాకు తెలియకుండానే రామభక్తి అబ్బింది.**

**ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు, ఇతర కీర్తనలు... ఎప్పుడూ ఏదో ఒక ఆలాపన చేస్తూ ఉండడం నా అలవాటు.**

ప్రతిపాదించిన టీటీడీ వారు మూల విరాట్టుకు వజ్రకిరీటం పెయింట్ చేయటానికి మరో ఇద్దరు కళాకారులతో పాటు నన్ను కూడా ఎంపిక చేశారు.

పెయింటింగ్స్‌లో నాకు బాగా నచ్చింది శ్రీరామ పట్టాభిషేక సన్నివేశం.

నేను తొలిసారిగా మద్రాసు 'కామ్లిన్' వారి నుంచి అవార్డు తీసుకున్నా. ఆల్ ఇండియా ఫైన్ ఆర్ట్స్‌వారు రీసెర్చ్ ఫెలోషిప్ అందుకున్నాను. ఢిల్లీలో ఓసారి మా పెయింటింగ్ ఎగ్జిబిషన్‌ను ప్రభుత్వం ఏర్పాటుచేసింది. నేను గీసిన సీతకు రాముడు బొట్టు పెట్టే చిత్రం అక్కడకు వచ్చిన అప్పటి రాష్ట్రపతి శంకర్ దయాల్ శర్మ గారిని ఎంతగానో ఆకట్టుకుంది. ప్రపంచవ్యాప్తంగా మా చిత్రకళా ప్రదర్శనలు నిర్వహించాం. ఎందరో ప్రముఖులు అలాగే ఇతర దేశాల వారు కూడా మా పెయింటింగ్స్‌ను కొనుక్కున్నారు. స్వవిషయానికి వస్తే నాకు చిన్నతనంలోనే పెళ్లయింది. పిల్లలు కూడా చిన్న వయసులోనే పుట్టారు. వాళ్లను చూసుకుంటూనే చిత్రలేఖనాన్ని కొనసాగించాను. దానికి మా వారి సహకారం ఎంతో ఉంది. మాకు నలుగురు అబ్బాయిలు, ఓ అమ్మాయి. భగవంతుని దయవల్ల అందరూ మంచి స్థాయిలోనే ఉన్నారు. మేం రూపొందించిన చిత్రాలు హైదరాబాద్, మద్రాసు, బెంగుళూరు, ముంబయి మ్యూజియాలలో ఉన్నాయి. లేపాక్షి, చిదంబరం, తిరుపతి దేవాలయాల ప్రాకారాలపై, కుడ్యాలపై ఆయన పెయింటింగ్స్ శాశ్వతంగా ఉంటాయి. భవిష్యత్ తరాల కోసం మావారితో కలిసి నేను గీసిన వందలాది చిత్రాలతో ఒక మ్యూజియం పెట్టాలనుంది. మ్యూజియం ఏర్పాటుకు అవసరమైన వనరుల కోసం చూస్తున్నాం. అరుదైన ఈ చిత్రాలకు ఓ శాశ్వత వేదిక కల్పించే ప్రయత్నం సఫలం అవుతుందనే విశ్వాసం ఉంది.

అప్పటి రాష్ట్రపతి శంకర్ దయాల్ శర్మ గారిని నేను గీసిన సీతకు రాముడు బొట్టుపెట్టే చిత్రం ఎంతగానో ఆకట్టుకుంది.

– జూలై 1, 2005



**'శంకరా నాదశరీరా పరా వేదవిహారా హరా..' అంటూ శివతత్త్వాన్ని అత్యద్భుతంగా ఆవిష్కరించిన కలం ఆయనది. చిన్నతనంలోనే పెద్ద రచనలు, పెద్ద వయసు వచ్చాక కూడా కుర్రపాటలు రాయడం ఆయనకే చెల్లు. ఆయనే సినీ గేయరచయిత వేటూరి సుందర రామమూర్తి. సినీ కవి కుల గురువుగా సంభావించే వేటూరి భక్తి, ఆధ్యాత్మిక భావాల సుమమాల ఇది.**



# పరమాత్మతత్త్వంతో అణువణువూ చైతన్యం

భక్తికి క్రియారూపం అర్చన, పూజ, అభిషేకం. పేరు ఏదైనా అవన్నీ భగవంతుడ్ని ఆరాధించే మార్గాలే. తన తక్కువ తనాన్ని భగవంతుని ముందు వినమ్రంగా ఒప్పుకొ భగవంతుడా.... నాకు సరైన మార్గం చూపించమని వేడుకోవడమే భక్తి. 'భగవంతుడా! సుదూర తీరానికి ప్రయాణించి నీ అనంత విశ్వరూపాన్ని సందర్శించాలనే కోరిక నాకు లేదు. ఈ అడుగు తీసి ఎక్కడ వేయమంటావో చెప్పు చాలు.' అలెగ్జాండర్ సెల్ చెప్పిన ఈ నిర్వచనాన్ని మహాత్మా గాంధీ పదేపదే స్మరించుకునే వారు' కాలానికి గమనశక్తి ఉంటుంది. నేత్రాలు స్థిరమైనవి కదా... మరి కాలాన్ని నేత్రాలతో పోలుస్తూ 'త్రికాలములు నీ నేత్రత్రయమై' అని ఎందుకు రాశావ'ని ఆచార్య ఆత్రేయ ఒకసారి అడిగారు. మనిషి రెండు కళ్లూ భూత, వర్తమాన కాలానికి చెందినవి. కుడినుంచి ఎడమకు లెక్కించినా, ఎడమ నుంచి కుడికి లెక్కించినా మధ్య వచ్చే భవిష్యత్ కాలమే పరమేశ్వరుని ఫాలనేత్రం. ఆ భవిష్యత్తు వర్తమానం అయ్యాకనే మనిషి చూడగలడు. కానీ ఆ కన్ను ముందే భవిష్యత్తును చూసేసింది. అందుకే మూసి ఉంటుంది. ఇకపోతే కాలానికి సంబంధించిన నిమిషం, లిప్త ఈ రెండు పదాలు నేత్రానికి సంబంధించినవే. అంతేకాదు నాట్యానికి ప్రాణం కళ్లే. ఆ కనురెప్పల కదలి కల్లోని లయ సంగీతానికి ఊపిరిపోస్తుందంటూ శివతత్త్వాన్ని ఇంకా ఇలా చెప్పుకొచ్చారు వేటూరి. 'శివుని లయకారక గుణాన్ని గురించి చెబుతూ లయం అంటే ధ్వంసం చేయడం

మనిషి రెండు కళ్లూ భూత, వర్తమాన కాలానికి చెందినవి. కుడినుంచి ఎడమకు లెక్కించినా, ఎడమ నుంచి కుడికి లెక్కించినా మధ్య వచ్చే భవిష్యత్ కాలమే పరమేశ్వరుని ఫాల నేత్రం. ఆ భవిష్యత్తు వర్తమానం అయ్యాకనే మనిషి చూడగలడు. కానీ ఆ కన్ను ముందే భవిష్యత్తును చూసేసింది.

అని తప్పుగా అర్థం చెబుతూ ఉంటారు. నిజానికి లయం అంటే లీనం చేసుకోవడం అని అర్థం. తాను లీనం చేసుకున్నవన్నీ తిరిగి ప్రపంచానికి అందించడమే పరమేశ్వరతత్త్వం. పరమశివుడు జ్ఞానప్రదాత, ఐశ్వర్య ప్రదాత, కళలకు అధిపతి.

**తాను లీనం చేసుకున్నవన్నీ తిరిగి ప్రపంచానికి అందించడమే పరమేశ్వరతత్త్వం. పరమశివుడు జ్ఞాన ప్రదాత, ఐశ్వర్య ప్రదాత, కళలకు అధిపతి.**

శ్రీకృష్ణుడు గొప్ప యోగి. పైకి కనిపించే శృంగారం అంతా మనం ఊహించేది కాదు. మోక్షగామి కావలసిన మానవుడిని భవబంధాలు బాధిస్తాయి. కోరికలను అణిచి మోక్షమార్గం చూపే మంత్రం శ్రీకృష్ణుని వేణుగానంలో ఉంది. సృష్టిపరిపాలకుడైన నారాయణతత్త్వం ఇక్కడే శ్రీకృష్ణునిలో కనిపిస్తుంది. అందుకే కృష్ణునికి గోపికలపై ఉన్నది తండ్రిప్రేమ అని కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ అనేవారు. శ్రీకృష్ణుని ప్రేమతత్త్వానికి రుజుకోణం ఇది. అందుకే భక్తులను సత్యసాయి ప్రేమాస్పదులారా! అని సంబోధిస్తారు. క్రైస్తవంలో కూడా ప్రేమభావానికి అధిక ప్రాధాన్యం ఇవ్వడాన్ని మనం గుర్తుంచుకోవాలి. భక్తిశ్రద్ధలకు పునాదులు కుటుంబంలోనే ఉంటాయి. మన పెద్దవాళ్లు ఎలా చేశారో అలాగే మనం కూడా చేస్తుంటాం. నా విషయంలోనూ అందుకు మినహాయింపు ఏమీ లేదు. మా తండ్రిగారు నుదుట బొట్టుకూడా పెట్టుకునే వారు కాదు. ప్రతి రోజూ ఆలయానికి వెళ్లేవారు కాదు. అయినా ఆయన ఆస్తికుడే. నా వరకు నాకు మొదటి నుంచి ఆధ్యాత్మిక చింతన ఉంది. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ చివరి రోజుల నాటి ఫోటోలు చూస్తే, ఆయన నుదుట విభూతి గమనిస్తాం. అలాగే ఆయన మాటల్లో కూడా వేదాంత ధోరణి ఆ రోజుల్లో ఎక్కువగా కనిపించేది. వృద్ధాప్యంలో పడ్డాక భగవత్ చింతన మరికొంత పెరగడంలో ఆశ్చర్యం ఏమీలేదు. ప్రస్తుతం నేనూ అదే పరిస్థితిలో ఉన్నాను.

**కోరికలను అణిచి మోక్షమార్గం చూపే మంత్రం శ్రీకృష్ణుని వేణుగానంలో ఉంది. సృష్టిపరిపాలకుడైన నారాయణతత్త్వం ఇక్కడే శ్రీకృష్ణునిలో కనిపిస్తుంది.**

మనిషి దేహం పంచభూతాత్మకంగా నిర్మితమైందని అంటారు. అయితే 'గాలి గాలిలో కలిసిపోయింది. నీరు నీరుగా పోయింది అంటూ చివరకు నీలో మిగిలేది మట్టి లక్షణాలే అంటూ వెక్కిరిస్తాడు వేమన. మృణ్మయతత్త్వం కలిగిన మనిషి పరమాత్మ చిన్మయ తత్త్వాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. 'అందమె ఆనందం' పాటలో మనిషి జీవితం 'సుడిగాలిలో ఎగిరే పతంగం' అని నిర్వచించారు మల్లాది రామకృష్ణశాస్త్రి గారు. పైకి సరదాగా పాడుకునే పాటల్లా కనిపిస్తున్నా దానిలో

ఎంతో లోతైన భావాలను గుప్పించేవారు. 'గురువుగారూ! ఇవి సామాన్యులకు ఏం అర్థమౌతాయి' అని అడిగితే, 'అలాగని ఊరుకుంటే మనిషిలో తెలుసుకోవాలనే కోరిక పోతుంది. అభివృద్ధి నిలిచిపోతుంది. చైతన్యం అంతరిస్తుంది. అర్థం అయిన వారికి అర్థమౌతుంది. అర్థం కానివారు అడిగి తెలుసుకుంటారు' అని చెప్పేవారు. ఇది అందరికీ అనుసరణీయ మార్గం కదా!'

మృణ్మయతత్త్వం కలిగిన మనిషి పరమాత్మ చిన్మయతత్త్వాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి.

నేటి తరంలో భక్తిలో కూడా ఫాస్ట్‌ఫుడ్ కల్చర్ చోటు చేసుకుంటోంది. మొక్కినంత వేగంగా భగవంతుడు వరాలిచ్చెయ్యాలనే ఆరాటం పెరిగిపోతోంది. ఈనాటి కంప్యూటర్ ప్రపంచంలో మానవ సంబంధాలకి, భక్తిశ్రద్ధలకు కూడా చోటు దొరకడం లేదు. మరోపక్క సినిమాలు, టివిలు, నాటకాలు ఆఖరికి పత్రికలు కూడా హిందూ దేవతల్ని అగౌరవ పరిచే విధంగా ప్రవర్తిస్తున్నాయి. మోటు శృంగార సన్నివేశాల్లో పురాణపురుషుల్ని, దైవాల్ని, మహాత్ముల్ని అప్రతిష్ఠ పాలుచేయడం సహించరానిది. ఆ విధమైన రచనలను, సన్నివేశాలను సమాజం బహిష్కరించాలి.

దైవాల్ని, మహాత్ముల్ని అప్రతిష్ఠ పాలుచేయడం సహించరానిది. ఆ విధమైన రచనలను, సన్నివేశాలను సమాజం బహిష్కరించాలి.

'క్షుద్రులెరుగని రుద్రవీణ నిర్నిద్రగానమిది అవధరించరా వినితరించరా శంకరా' అని శంకరశాస్త్రి అన్నారా, వేటూరి సుందరరామమూర్తా అని సరదాగా ఎవరైనా ప్రశ్నిస్తే, 'గోవు, స్త్రీ, చండాలుడు, కుక్కమాంసం తినేవాడు ఈ నలుగురినీ సమాన గౌరవంతో చూసేవాడే పండితుడు' అని వేదం చెబుతోంది. కులమత భేదాలు కళను, కళాకారుడినీ అంటవు. అందుకే శంకరశాస్త్రి తనది క్షుద్రులెరుగని గానం అన్నాడు. పరమేశ్వరుని అవధరించమన్నాడు. 'విని తరించరా' అనే ప్రయోగంలో అహంకారం లేదు. అందులో కనిపించేది ఆయన పడుతున్న వేదన మాత్రమే.' అంటూ శంకరాభరణంలోని ఆ పాట సన్నివేశాన్ని గుర్తుచేస్తారు. 'నేను గాయకుడిని కాను కనుక ఆ మాట నాకు వర్తించదు. నాకు అంతటి స్థాయి లేదు.' అన్నారు వేటూరి వినమ్రంగా.

– జూలై 22, 2005



**అందరికీ మాధుర్యాలు పంచే ఆయన జీవితంలో ఎన్నో చేదు సంఘటనలు ఎదుర్కొన్నారు. టీ అమ్ముతూ జీవితం ప్రారంభించిన ఆయన అంచెలంచెలుగా ఎదిగి ఉన్నతశిఖరాన్ని అధిరోహించారు. అయినా ఆయన ఎంతో నిరాడంబరంగా ఉంటారు. ఆయనే ప్రసిద్ధ వ్యాపార వేత్త జి. పుల్లారెడ్డి. కష్టపడే వాడికి భగవంతుని సహకారం ఉంటుందని నమ్మే ఆయన ఆధ్యాత్మిక ప్రస్థానం.**



# లక్ష్యం మరవకుంటేనే దేవుని కరుణ

లక్ష్యసాధన పట్ల చిత్తశుద్ధి లేనివారికి భగవంతుని కరుణ ఉండదని నా నిశ్చితాభిప్రాయం 'మన పని మనం చేసుకుంటూనే భగవంతుడ్ని ఆరాధించాలి... అంతా భగవంతుడే చూసుకుంటాడులే అనుకోవడం మూర్ఖత్వం. 24 గంటలూ నారాయణ నామస్మరణ చేసే నారదుని ఎదుటే, రోజూ పొద్దున, సాయంత్రం మాత్రమే భగవంతుని నామస్మరణ చేసే ఓ రైతును శ్రీ మహావిష్ణువు అక్కున చేర్చుకుంటాడు. అది చూసి ఓర్వలేని నారదుడు 'ప్రభూ... నిత్యం నీ నామస్మరణతోనే గడిపే నాకు దక్కని అదృష్టం, అతనికివ్వడానికి కారణమేమిటి?' అని అడిగాడు. దానికాయన నవ్వుతూ 'నువ్వు ఏ పనీ చేయకుండా నా నామస్మరణ మాత్రమే చేస్తున్నావు. మరి అతను తన పనులు తాను చేసుకుంటూ నా నామస్మరణ కూడా చేస్తున్నాడు. కాబట్టే అతను గొప్పవాడయ్యాడు' అని చెప్పాడు. ఇంతవరకు నేను నమ్మి ఆచరిస్తున్న సిద్ధాంతం కూడా ఇదే. కర్నూలు పట్టణానికి 70 కిలోమీటర్ల దూరంలో ఉన్న గోకవరంలో 1920లో పుట్టాను. అమ్మ పుల్లమ్మ, నాన్న హుస్సేన్‌రెడ్డి. మాది సాధారణ మధ్యతరగతి వ్యవసాయ కుటుంబం. నాకు చిన్నతనం నుంచి భగవంతుడిపై అచంచలమైన భక్తి ఉంది. అప్పట్లో చదువుపై శ్రద్ధ ఉండేది కాదు. స్కూలులో రౌడీలాగా తిరిగాను... చదువుకూడా పెద్దగా అబ్బలేదు. 5 వ తరగతితోనే చదువుకు మంగళం పాడేశాను. చిన్నతనం నుండే నాకు ఏదైనా సాధించాలన్న తపన ఉండేది. అల్లరి కూడా చాలా ఎక్కువగా

> మా చిన్నమ్మ కొంగు పట్టుకుని వంట గదిలో కూర్చుని ఆమె చేసే పనులను జాగ్రత్తగా గమనిస్తూండేవాడిని. అదే నాకు తరువాత కాలంలో జీవన మార్గం నిర్దేశించింది. పుల్లారెడ్డి స్వీట్స్ ఇంత ఖ్యాతిని గడించడానికి మా చిన్నాన్న సలహాలతో పాటు భగవంతుని కరుణ కూడా కారణం.

చేస్తుండే వాడిని. దాంతో మా అమ్మ నన్ను కర్నూలు పంపించే సింది. అక్కడ మా చిన్నాన్న కసిరెడ్డి వెంకటరెడ్డి, చిన్నమ్మ శాల మ్మల పంచన చేరాను. అక్కడ మా చిన్నమ్మ కొంగు పట్టుకుని వంట గదిలో కూర్చుని ఆమె చేసే పనులను జాగ్రత్తగా గమని స్తూండేవాడిని. అదే నాకు తరువాత కాలంలో జీవన మార్గం నిర్దేశించింది. పుల్లారెడ్డి స్వీట్స్ ఇంత ఖ్యాతిని గడించడానికి మా చిన్నాన్న సలహాలతో పాటు భగవంతుని కరుణ కూడా కారణం అని గట్టిగా నమ్ముతాను.

'మన పని మనం చేసుకుంటూనే భగవంతుడ్ని ఆరాధించాలి... అంతా భగవంతుడే చూసుకుంటాడులే అనుకోవడం మూర్ఖత్వం.

ఉదయం లేవగానే రామరక్షాస్తోత్రం పఠిస్తాను. కొద్దిసేపు భగవంతుడ్ని తనివితీరా ఆరాధించిన తరువాతే నా రోజువారీ కార్యక్రమాలు ప్రారంభమవుతాయి. రాత్రి పడుకునే ముందు కూడా ఈ స్తోత్రం పఠించడం నాకిప్పటికీ అలవాటు. నేను ఎక్కువగా ఆరాధించే దేవుడంటూ ప్రత్యేకంగా లేరు. రామకృష్ణులిద్దరూ నాకు ఇష్టదేవతలే. శ్రీరాముడు సత్యవాక్య పరిపాలకుడు అయితే శ్రీ కృష్ణుడు సత్యాన్వేషి. కర్మలను గురించి రెండు జన్మలలోనూ భగవంతుడు తన ద్వారానే విశీదకరించాడు. శ్రీ కృష్ణుడు మహాయోగి. హోమం చేస్తూండగా వ్యాసమహర్షి శరీరం నుండి జారిన ఓ చెమట బిందువును ఓ చిలక సేవించడం వల్ల గర్భవతి అవుతుంది. అయితే ఎన్నాళ్లకీ ఆ చిలుక ప్రసవించలేకపోతుంది. ప్రసవ వేదనతో తల్లడిల్లుతున్న ఆ చిలుకను ఎవరైనా అస్ఖలిత బ్రహ్మచారులు స్పర్శిస్తే కాన్పు అవుతుందని మహర్షులు చెబుతారు. బ్రహ్మచారులైన ఆంజనేయుడు, నారదుడు లాంటి వారి దగ్గరకు వెళ్లిన ఆ చిలుకకు చుక్కెదురవుతుంది. అప్పుడు శ్రీకృష్ణ పరమాత్మ స్పర్శ చేత శుక మహర్షి జన్మించాడు. శ్రీ కృష్ణుడు బ్రహ్మచారి ఎలాగయ్యాడంటే ఆయన ఎప్పుడూ స్త్రీని కోరుకోలేదు. వారే ఆయన్ని కోరుకున్నారు. అందుకే శ్రీకృష్ణుడు గోపికలపై చూపించింది తండ్రి ప్రేమ అని చెబుతారు. ఆడిన మాట తప్పకపోవడం రాముని నైజం అయితే ఇచ్చిన మాటను తనకు అనుకూలంగా మలచుకోవడం శ్రీకృష్ణుని నేర్పు. ఇద్దరూ గొప్పవారే. ఇద్దరూ ఆదర్శపురుషులే! మా చిన్నాన్నకు కులమత భేదాల పట్టింపు లేదు. ఆయన పెంపకంలో అదేనైజం నాకు కూడా వచ్చింది. అందరు దేవుళ్లనూ నేను ఆరాధిస్తాను. అన్ని కులాల వారినీ గౌరవిస్తాను. మన పిల్లలు మన సంప్రదాయం నుంచి దూరం కాకూడదనే ఉద్దేశంతోనే విద్యాసంస్థలు, సంస్కృత భారతీ ప్రచార సమితులను

ఆడిన మాట తప్పక పోవడం రాముని నైజం అయితే, ఇచ్చిన మాటను తనకు అనుకూలంగా మలచుకోవడం శ్రీకృష్ణుని నేర్పు.

గిన్నెలో అన్నం పెట్టి మూతవేసి ఉంచితే పాచిపోతుంది. అదే పదిమందికి పంచి పెడితే వారి కడుపు నిండుతుంది.

నెలకొల్పాను. విశ్వహిందూ పరిషత్ సభ్యుడుగా నేను కోరుకునే ది అయోధ్యలో రామాలయం, మధురలో కృష్ణ జన్మస్థానం, కాశీ విశ్వేశ్వరుని ఆలయం. సుప్రీంకోర్టు కూడా మాకు అనుకూలంగా తీర్పు ఇస్తుందని భావిస్తున్నాను.

'గిన్నెలో అన్నం పెట్టి మూతవేసి ఉంచితే పాచిపోతుంది. అదే పదిమందికి పంచిపెడితే వారి కడుపు నిండుతుంది. ఇదే సూత్రాన్ని నేను నా జీవితానికి కూడా అన్వయించుకున్నాను. కోట్లు సంపాదించి వారసులకు ఇవ్వడం అనేది మంచి పద్ధతి కాదని నా అభిప్రాయం. దానివల్ల సంతానం సోమరులుగా తయారవ్వడానికే ఎక్కువ అవకాశం ఉంది. వారికి కష్టపడి పని చేయడం అంటే ఏమిటో చెప్పాలి. అప్పుడే వారు కూడా జీవితంలో పైకి రాగలరు. డబ్బు శాశ్వతం కాదు. మనం సంపాదించిన డబ్బుతో పది మంచి పనులు చేస్తే భగవంతుడ్ని చేరుకున్న వాళ్లవుతాం. కీర్తిని ఎవరూ దొంగిలించలేరు కదా! మనం భగవంతుని కృప వల్ల, నేను చేసిన కృషి వల్ల ఎంతో కొంత సంపాదించాను... నేను సంపాదించింది నా దగ్గరే ఉంటే ఫలితం ఏముంటుంది. అందుకే పుల్లారెడ్డి చారిటబుల్ ట్రస్టు స్థాపించి ట్రస్టు ద్వారా కాలేజీలు, స్కూళ్లు, హాస్పిటల్స్ నిర్మించాం. నాకు వీలయినంత వరకూ ప్రజలకు సేవ చేయగలుగుతున్నాను. ఈ జీవితానికి ఇంతకన్నా కావాల్సిందేముంది.'

డబ్బు శాశ్వతం కాదు. మనం సంపాదించిన డబ్బుతో పది మంచి పనులు చేస్తే భగవంతుడ్ని చేరుకున్న వాళ్లవుతాం.

– ఆగస్టు 5, 2005



**నుదుటిపై విభూతి, కనుబొమ్మల మధ్య ఎర్రని కుంకుమ, ఖంగుమనే కంఠం, ఆజానుబాహువు రూపం ఆయనది. పురాణ, ఇతిహాసాలంటే ఆయనకు ప్రాణం. సంప్రదాయ జీవనమే మనిషజకి, మనసుకు మంచి మార్గం చూపుతుందనేది ఆయన నిశ్చితాభి ప్రాయం. ఆయనే దశాబ్దాలుగా న్యాయరంగంలో సేవలు అందిస్తున్న జస్టిస్ చలమేశ్వర్. ఆయన భక్తి, ఆధ్యాత్మిక తత్వ సారం ఇది.**



# సృష్టిని నడిపించే అనంతశక్తి పరమాత్మ

"కలడు కలండను వాడు కలడో లేడో' అనే అనుమానం అనాదిగా మనిషిని పీడిస్తూనే ఉంది. అయితే సృష్టిని నడిపించేవాడు, రక్షించే వాడు, సర్వోన్నత న్యాయస్థానంలో మన తప్పుల్ని శిక్షించేవాడు ఒకడు ఉన్నాడనే భావనే మానవ జాతికి శ్రీరామరక్షగా నిలుస్తున్నది. అందుకే ప్రపంచంలో భగవంతుడిని నమ్మేవారు ఎక్కువగా కనిపిస్తారు. భౌతికమైన వాంఛలకన్నా శాశ్వతమైన బహుమతులు ఇవ్వమంటూ భగవంతుని ప్రార్థించాలని బైబిల్ చెబుతుంది. ఏవేవో కోరికలతో భగవంతుని ప్రార్థించడం కన్నా నిష్కామంగా పూజించాలి. అదే శాశ్వతమైన ఆనందాన్ని ఇస్తుంది.

నా స్వగ్రామం కృష్ణా జిల్లా పెదముత్తేవి. మాది సాధారణ వ్యవసాయ కుటుంబం. పండుగలు, ఉత్సవాల సమయంలో మాత్రం ఇంట్లో పూజలు, పునస్కారాలు చేసేవారు. నా బాల్యం చాలావరకు పెదముత్తేవిలోనే గడిచింది. ఆపైన మచిలీపట్నం హిందూ హైస్కూల్, మద్రాసులలో చదువుకున్నాను. విశాఖపట్నం ఆంధ్రాయూనివర్సిటీ నుంచి లా డిగ్రీ తీసుకున్నాను. 1976లో హైదరాబాద్ చేరుకుని న్యాయవాదిగా ప్రాక్టీసు ప్రారంభించాను. 1997 నుంచి హైకోర్టు న్యాయమూర్తిగా పదవీబాధ్యతలు నిర్వర్తిస్తున్నాను. మా ఇంట్లో భక్తి, ఆధ్యాత్మిక వాతావరణం పెద్దగా లేకపోయినా నాకు మొదటి నుంచి ఎలాగో ఆ ధోరణి అబ్బింది. పురాణాలు, ఇతిహాసాలు నా ఆరో ప్రాణం. యుక్తవయసులో ఉండగా శ్రీకృష్ణుడంటే బాగా ఇష్టప

పురాణాలు, ఇతిహాసాలు నా ఆరోప్రాణం. యుక్త వయసులో ఉండగా శ్రీకృష్ణుడంటే బాగా ఇష్ట పడేవాడిని. ఆ రోజుల్లో భక్తి భావం కంటే ఓ హీరోగా ఆయనను ఆరాధించే వాడిని. ఎలా వచ్చిందో తెలియదు కానీ చిన్నతనం నుంచి నాకు దైవభక్తి ఎక్కువే.

డేవాడిని. ఆ రోజుల్లో భక్తి భావం కంటే ఓ హీరోగా ఆయనను ఆరాధించే వాడిని. ఎలా వచ్చిందో తెలియదు కానీ చిన్నతనం నుంచి నాకు దైవభక్తి ఎక్కువే. వయసు పెరిగేకొద్దీ అది కూడా పెరుగుతూ వస్తోంది. ఆ తరువాత క్రమంగా సత్సాంగత్యం లభించింది. ఆవు కొమ్ము పట్టుకుని పితికితే పాలురావు. ఆ విషయం తెలియని వారికి చక్కని దారి చూపించే వారే గురువు. కంచిపరమాచార్య నుంచి చాలా మంది పీఠాధిపతులను కలిశాను. ప్రతిరోజూ పదినిమిషాలైనా భగవంతుని పూజించడం ఎంత అవసరమో సత్సాంగత్యంలో మసలడం కూడా అంతేనని గట్టిగా నమ్ముతాను. ఆధ్యాత్మిక గురువులను కలిసి వారితో అనేక విషయాలు చర్చించే వాడిని. ప్రత్యేకించి గురువు అంటూ ఎవరూ లేకున్నా అటువంటి పెద్దల సాంగత్యమే నాలో వివేచన పెంచింది.

ప్రతిరోజూ పదినిమిషాలైనా భగవంతుని పూజించడం ఎంత అవసరమో సత్సాంగత్యంలో మసలడం కూడా అంతే అవసరమని గట్టిగా నమ్ముతాను.

నీ చర్యలతో ఇతరుల్ని ఏడిపించడం పాపం... ఇతరుల కోసం నువ్వు ఏడిస్తే పుణ్యం. చేసే ప్రతిపనిలో ఇతరులకు కష్టం కలగకుండా చూసుకోవడమే నేను గ్రహించిన ఆధ్యాత్మికత. న్యాయమూర్తి స్థానంలో ఉండి శిక్షలు విధించినప్పుడు నేరస్థుడి తరపు వారు బాధపడడం సహజం. అయితే అది మా వృత్తి ధర్మం. మాంసం అమ్ముతున్నా నేను జీవహింస చేయడం లేదని చెప్పిన ధర్మవ్యాధునిలా వ్యవహరించవలసి వస్తుంది. సంఘంలో ప్రతి వ్యక్తికి ఎంతోకొంత సామాజిక బాధ్యత ఉండాలి.

ఉదాహరణకు ఒక కథ ఆదిశంకరాచార్య తపస్సు చేసుకుంటూ ఉండగా ఓ కాపాలికుడు ఆయన దగ్గరకు వచ్చాడట. 'పన్నెండు సంవత్సరాలు ఒంటి కాలిపై తపస్సు చేసి ఆకాశయాన విద్యను సొంతం చేసుకున్నాను. మరెన్నో అద్భుతమైన విద్యలు సాధించాను. అయినా నాకు రాని పేరుప్రతిష్ఠలు నీకెలా వచ్చాయ'ని ప్రశ్నించాడట. అందుకు శంకరాచార్య నవ్వి, 'సృష్టి స్థితి గతుల్ని మార్చడం వల్ల మానవుడికి ఒరిగేదేమీ లేదు. పదిమందికీ పనికొచ్చే పనులు చేయమని చెప్పి పంపేశారు.'

గొప్ప పనులు చేయడం అందరికీ సాధ్యంకాకపోవచ్చు. చెడ్డపనులు చేయకుండా ఉండగలగడం మన చేతిలోనే ఉంది. ఇది మంచి ఇది చెడు అని తెలుసుకొని, ఎవరికీ ఇబ్బంది కలగకుండా చేతనైతే సాయం చేయడమే అసలైన ఆధ్యాత్మికత.

ఇది మంచి ఇది చెడు అని తెలుసుకొని, ఎవరికీ ఇబ్బంది కలగకుండా చేతనైతే సాయం చేయడమే అసలైన ఆధ్యాత్మికత.

ఈ కాలం యువతలో విషయానికి వస్తే ‘అనేక వైరుధ్యాల మధ్య వ్యక్తుల్లో తద్వారా సమాజంలో అశాంతి పెరిగిపోతోంది. దీనికి కొంతవరకు విద్యావ్యవస్థ కారణం కావచ్చు. నేను హైస్కూల్ చదువు పూర్తయ్యేనాటికి భాగవతం దశమస్కంధం వరకు చదువుకున్నాను. ఈ రోజుల్లో యువతకు పట్టుమని నాలుగు తెలుగు పద్యాలు కూడా రావు. సంప్రదాయాన్ని, సాహిత్యాన్ని పూర్తిగా పక్కకు నెట్టేయడంవల్లే యువతరంలో కనీసపు విలువలు లేకుండా పోతున్నాయి. విద్యలో మన సంప్ర దాయాన్ని తప్పకుండా నేర్పించాలి. దైవత్వాన్ని అర్థం చేసుకోవ డానికి మానవ ప్రయత్నం కావాలి. సరైన చదువు కావాలి. సన్మార్గం చూపే గురువు కావాలి. ఏది మంచి.. ఏది చెడు అని తర్కించగలిగే విజ్ఞత కావాలి. మంచి కుటుంబం, సాహిత్యాభి లాష, సత్సాంగత్యం ఇలా ఆ భగవంతుడు నాకు అన్నీ ఇచ్చాడు. నా బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తూ, నలుగురికి చేతనైనంత సేవ చేయడమే ఇంతచేసిన ఆ భగవంతునికి నేను చేసే కైంకర్యం అనిపిస్తుంది. మనకు అన్నీ ఉన్నాయను కుంటాం... కానీ కొన్ని సందర్భాల్లో నిజంగా మనం ఎంత నిస్స హాయులమో అనిపిస్తుంది. ఇంత కాలంగా లభిస్తున్న ఈ సత్సాంగత్యం చివరకు సత్యాన్వేషణ వైపు నడిపిస్తుందేమో చూడాలి నన్ను.

– ఆగస్టు 12, 2005

సంప్రదాయాన్ని, సాహిత్యాన్ని పూర్తిగా పక్కకు నెట్టేయడం వల్లే యువతరంలో కనీసపు విలువలు లేకుండా పోతున్నాయి.

బాధ్యతలు సక్ర మంగా నిర్వర్తిస్తూ, నలుగురికి చేతనై నంత సేవ చేయడమే ఇంతచేసిన ఆ భగ వంతునికి నేను చేసే కైంకర్యం అనిపిస్తుంది.



**రెండు దశాబ్దాల సాధన, అకుంఠిత దీక్ష ఆయన్ని ఆధ్యాత్మిక రంగంలో సమున్నత స్థానంలో నిలిపాయి. వేదవేదాంగాలు, యోగ విద్య లోతులు ఆయనకు కరత లామలకాలు. శ్రీకాకుళం జిల్లాలోని కుగ్రామంలో జన్మించిన నరసింహం నిరంతర విజ్ఞాన తృష్ణతో శ్రీ స్వరూపానందేంద్ర సరస్వతిగా ఎదిగారు. మఠాలు, పీఠాలు జ్ఞానాన్ని అందించే కేంద్రాలయితే మానవాళి సుఖశాంతులతో వర్ధిల్లుతుందంటున్నారాయన.**



# అందరిలో దైవం.. అంతులేని ఆనందం

ప్రపంచ గమనం వేగంగా మారింది. ఉరుకులు పరుగుల జీవితంలో తమను గురించి తామే ఆలోచించుకోలేని స్థితి. వస్తువ్యామోహం... గంపెడు కోర్కెలు. అవి తీరకుంటే నిరాశ, నిస్పృహలు. మరోవైపు సమాజంలో భక్తిభావాలు కూడా పెరుగుతున్నాయి. భక్తిలో చిత్తశుద్ధి లోపిస్తున్నది. ఏదో ఒక కోరికతో భగవంతుని దగ్గరకు వెళ్లేవారే అధికం. కానీ ప్రతిఫ లం ఆశించకుండా చేసేదే నిజమైన భక్తి. ప్రతిఫలాపేక్ష లేని పని చేయడమే సుఖమయ జీవనానికి ఏకైక మార్గం.



భక్తిలో చిత్తశుద్ధి లోపిస్తున్నది. ఏదో ఒక కోరికతో భగవంతుని దగ్గరకు వెళ్లేవారే అధికం. కానీ ప్రతిఫలం ఆశించకుండా చేసేదే నిజమైన భక్తి. ప్రతిఫలాపేక్ష లేని పని చేయడమే సుఖమయ జీవనానికి ఏకైక మార్గం.



శ్రీకాకుళం జిల్లా రణస్థలం మండలంలోని ఓ మారుమూల గ్రామం దేరసాంలో 1964లో పుట్టాను. తండ్రి చిన్నయ్యపంతులు. తల్లి కళ్యాణి. ఆచార సంప్రదాయాలున్న కుటుంబం. పూజలు, పునస్కారాలు, సాధు సజ్జన సాంగత్యాలు నిత్య కృత్యాలు. నలుగురు సోదరులు, ఇద్దరు తోబుట్టువు. వారిలో నేను చివరి వాడిని. కుటుంబ వాతావరణం నాలో భక్తి బీజాలు నాటింది. కేదారనాథ్, బదరీనాథ్ నుంచి మా ఇంటికి సాధువులు వస్తూ ఉండే వారు. వారి సాంగత్యమే ఈ మార్గంలోకి వచ్చేందుకు ప్రేరణ. చిన్నతనం నుంచి సుబ్రమణ్యేశ్వర స్వామి భక్తుడ్ని. పాఠశాల విద్య చదివే రోజుల్లో కూడా భక్తిచింతన అధికంగా ఉండేది. విశాఖలో ఇంటర్, డిగ్రీ చదివాను. ఆ తరువాత అక్కడే గ్రీన్‌ల్యాండ్ అనే స్టోర్ నడిపాను. గెట్ అల్లడం అంటే నాకు ప్రాణం. వ్యాపారం చేస్తున్నా నా మనసు మాత్రం ఆధ్యా

త్మిక మార్గంపైనే ఉండేది. చిన్నతనంలోనే దక్షిణాదిలో ఉన్న అన్ని పుణ్యక్షేత్రాలు తిరిగాను. విశాఖలోని ఆశ్రమంలో యోగ విద్య నేర్చుకున్నాను. సాధువులు, పండితులను కలిసి ఆధ్యాత్మిక విషయాలు చర్చించే వాడిని. వేదాంత విజ్ఞాన సముపార్జనే జీవిత పరమార్థం అని అర్థం అయింది. ప్రయాణం మొదలైంది. హరిద్వార్ చేరుకున్నాను. ఆ తరువాత హృషీకేశ్, గంగోత్రి... ఇలా దేవభూమిలో సంచారం మొదలైంది. ఆశ్రమ జీవితం, భిక్షాటన, వందలమైళ్లు కాలినడకన ప్రయాణం, మహనీయుల సాంగత్యం, నిరంతర జ్ఞాన అన్వేషణ కొనసాగింది. యోగవిద్య నేర్పిన గంగాధరం గారికి ఆరోగ్యం బాగోకపోవడంతో మళ్లీ విశాఖ వచ్చాను. చినముషివాడలో ఓ పెంకుటి కుటీరం ఏర్పాటు చేసుకొని సన్యాస జీవితం కొనసాగించాను. నా దగ్గరకు వచ్చే వారికి వేదాంత బోధలు చేస్తుండే వాడిని. ఓ సారి హిమాలయాలకు వెళ్లి వచ్చినా లోపల అలజడి తగ్గలేదు. కొందరు మిత్రులు వెంటరాగా మరోసారి హిమాలయాలకు బయలుదేరాను. నెలలతరబడి సంచారం సాగింది. జ్ఞానసముపార్జన జరుగుతున్నా ఏదో తెలియని ఆవేదన. ఆ ఆవేదన సాంద్రమైంది. ఈ శరీరాన్ని అలకనందలో వదిలేందుకు సిద్ధపడ్డాను. అద్భుతం జరిగింది. వైరాగ్యానంద సరస్వతి రూపంలో దివ్యజ్ఞానానందం లభించింది. కర్ణాటకలోని హూలే నర్సిపూర్ వెళ్లమని ఆదేశించారాయన. అక్కడ సచ్చిదానందేంద్ర సరస్వతి వద్ద వేదభాష్యాలు, శంకరభాష్యం నేర్చుకున్నాను. సన్యాస స్వీకారానికి పీఠాధిపతుల అనుమతి లభించింది. వేదమూర్తుల సమక్షంలో స్వరూపానందేంద్ర సరస్వతిగా మారాను. విశాఖలో చినముషివాడలో ఆశ్రమం ఏర్పాటైంది. ఆ రోజు నుంచి యథాశక్తి జ్ఞానప్రచారం చేస్తున్నాను.

మతాలు, పీఠాలు ప్రజల్లో జ్ఞానజ్యోతుల్ని వెలిగించి, వారి జీవితాలకు మార్గదర్శకంగా ఉండాలి. కానీ కొంతవరకు అందుకు భిన్నంగా జరుగుతున్నది. పీఠాలు వ్యక్తి ప్రధానంగా, భక్తి ప్రచార సాధనాలుగా మారాయి. నిజానికి అవి భక్తిని ప్రచారం చేయాల్సిన పని లేదు. ప్రజలకు జ్ఞానాన్ని పంచాలి. అప్పుడే సమాజం సుఖశాంతులతో ఉంటుంది. ప్రస్తుతం సమాజంలో ఉన్న అలజడికి అజ్ఞానమే కారణం. ఆ అజ్ఞానాన్ని తరిమేయాల్సిన బాధ్యత పీఠాలదే. కానీ కొన్ని పీఠాలు రాజకీయాల్లో జోక్యం చేసుకుంటూ లౌకిక విషయాల వ్యామోహంలో పడి

**భిక్షాటన, వందల మైళ్లు కాలినడకన ప్రయాణం, మహనీయుల సాంగత్యం, నిరంతర జ్ఞాన అన్వేషణ కొనసాగింది.**

ప్రస్తుతం సమాజంలో ఉన్న అలజడికి అజ్ఞానమే కారణం. ఆ అజ్ఞానాన్ని తరిమేయాల్సిన బాధ్యత పీఠాలదే.

నేటి యువతలో భక్తి భావం పెరుగుతున్నది కానీ ధర్మాచరణ మరింత పెరగాల్సిన అవసరం ఉంది.

పోతున్నాయి. పీఠాల మధ్య పొరపొచ్చాలు పెరగడం మరీ విచారకరం. మఠాలు, పీఠాలన్నీ ఏకతాటిపై నడవాలి. ప్రజల్లో జ్ఞానచైతన్యం కలిగించే లక్ష్యానికే పరిమితం కావాలి. మా పీఠం ఆధ్వర్యంలో వేద పాఠశాలలు, సంస్కృత పాఠశాలల ఏర్పాటు చేస్తున్నాం. చిన్నారులతో పాటు పెద్దలకు కూడా నిరంతరం సత్సాంగత్యం, శిక్షణ ఇవ్వాలన్నది సంకల్పం. ముఖ్యంగా శంకరాచార్య నిజతత్త్వాన్ని అందరికీ అందించేందుకు ప్రయత్నం చేస్తున్నాం.

నేటి యువతలో భక్తి భావం పెరుగుతున్నది కానీ ధర్మాచరణ మరింత పెరగాల్సిన అవసరం ఉంది. చాలామందిలో భక్తికి కోర్కెల సాధనే పరమార్థం. నిస్వార్థమైన భక్తి శాశ్వత ఆనందాన్ని ఇస్తుంది. మనం భగవంతుడ్ని అడిగినంత మాత్రాన ఏదీ ఇవ్వడు. మనకు ఏమివ్వాలో ఆయన ఎప్పుడో నిర్ణయించేసి ఉంటాడు. లేనిదాన్ని గురించి చింతించి జీవితాన్ని కష్టాలపాలు చేసుకోవడం కంటే ఫలాపేక్ష లేని భక్తి, పనులు చేయడం ద్వారా శాంతిని పొందే వీలుంటుంది. ఇందుకు నిరంతర సాధన అవసరం. ఆలయానికి వెళితే ఏదో ఒక రూపంలో భగవంతుడు కనిపిస్తాడు. ధర్మాచరణ, జ్ఞానసముపార్జన వల్ల అందరిలో భగవంతుడ్ని చూడగలుగుతాం. అందరినీ ప్రేమించే శక్తి కలుగుతుంది. అది అనంత ఆనందాన్ని మిగులుస్తుంది. నిజానికి భౌతిక ప్రపంచంలో ఆనందం లేదు. మరి ఆనందం ఎక్కడ ఉందంటే.. అది మనలోనే ఉంటుంది. దాన్ని గుర్తించేందుకు జ్ఞానం కావాలి. సాధన చేయాలి. మనలో ఉన్న ఆ ఆనందపు సెలయేటిని గుర్తించగలిగితే ఆ స్థితి పరమానందం కలిగిస్తుంది.

ఆలయానికి వెళితే ఏదో ఒక రూపంలో భగవంతుడు కనిపిస్తాడు. ధర్మాచరణ, జ్ఞానసముపార్జన వల్ల అందరిలో భగవంతుడ్ని చూడగలుగుతాం.

– సెప్టెంబర్ 2, 2005





**'నాలోన శివుడు గలడు... నీలోన శివుడు గలడు..' అంటూనే ఆ పరమేశ్వరుని కోసం నిరంతరం అన్వేషిస్తున్నానన్నారు తనికెళ్ల భరణి. కవిత్వం, నాటకాలు, తరువాత సినీనటుడిగా, దర్శకుడిగా రాణిస్తున్న ఆయన ఇటీవల అనేక శివతత్వాలు రచించారు. ఆ తత్వాలను పుణ్యక్షేత్రాల్లో స్వయంగా గానం చేస్తున్నారు. ప్రపంచమంతా నిండి ఉన్న పరతత్వాన్ని అన్వేషిస్తూ చేసిన ప్రయాణంలో ఎదురైన అనుభవాలను ఇలా చెప్పారు.**

# నాలో... నీలో... శివుడు

అదో మారుమూల పల్లెటూరు... అక్కడో చిన్న శివాలయం. షూటింగ్ కోసం అక్కడికి వెళ్లిన నేనూ, బ్రహ్మానందం ఆలయంలోకి వెళ్లేసరికి ఆ ఆలయ పూజారి జపం చేసుకుంటున్నాడు. 'అభిషేకం చేస్తారా?' అని అడిగాం. ఆయన జపం పూర్తికానట్లు ఉంది. ఒక్క నిముషం కూర్చోమని సైగ చేశాడు. మాకు కాస్త అసహనంగా అనిపించి, 'ఎక్కువ టైం లేదు... కాస్త త్వరగా కానిస్తారా' అన్నాం దర్పంగా. ఆయన మాత్రం చాలా ప్రశాంతంగా 'అలా టైం పెట్టుకుని ఎప్పుడూ భగవంతుడి దగ్గరకు రాకూడదు. మీకు సమయం ఉన్నప్పుడే రండి' అని చెప్పేసి మళ్లా జపంలో పడ్డాడు. పట్టుదలగా మర్నాడు పొద్దున్నే ఇద్దరం మళ్లీ ఆలయానికి వెళ్లాం. దాదాపు గంటసేపు అభిషేకం చేయించుకున్నాక నా మెళ్లోని రుద్రాక్ష తీసి, 'ఓసారి స్వామికి తాకించి ఇవ్వండి' అని ఆ పూజారిని అడిగాను. 'పాంచభౌతికమైన నీ శరీరం మీది రుద్రాక్ష పరమేశ్వరుణ్ణి తాకిస్తావా?' అంటూ మందలింపుగా అన్నాడాయన. నిజమే కదా అని పశ్చాత్తాపపడి దక్షిణలు వెయ్యబోతే హుండీలో వెయ్యమన్నాడు. 'అదేం మీకు డబ్బు అక్కర్లేదా?' అని కాస్త వ్యంగ్యంగా అడిగేసరికి.... 'నాకు శివుడున్నాడు... ఒక ఎకరం పొలం ఇచ్చాడు. ఇంకేం కావాలి' అంటూ నిర్మలంగా చెప్పి వెళ్లిపోయాడు. ఆ క్షణంలో అనిపించింది.... నిజంగా ఇటువంటి చోట, ఇటువంటి మనుషుల మధ్యే పరమాత్మ ఉంటాడు అని. ఎన్ని పుణ్యక్షేత్రాలు తిరిగినా రాని ప్రశాంతత ఆ

**'నాకు శివుడున్నాడు... ఒక ఎకరం పొలం ఇచ్చాడు. ఇంకేంకావాలి' అంటూ నిర్మలంగా చెప్పి వెళ్లిపోయాడు. ఆ క్షణంలో అనిపించింది.. నిజంగా ఇటువంటిచోట, ఇటువంటి మనుషుల మధ్యే పరమాత్మ ఉంటాడు అని. ఎన్ని పుణ్యక్షేత్రాలు తిరిగినా రాని ప్రశాంతత ఆ ఆలయంలో నాకు లభించింది.**

> విభక్తము కానిది మాత్రమే భక్తి అవుతుంది. పరమాత్మతో జీవాత్మ విడదీయలేనంతగా కలిసిపోవడమే భక్తి.

ఆలయంలో నాకు లభించింది. ఇప్పటికీ ఆ ఆలయం, ఆ పూజారి నా కళ్లముందు కదలాడుతూనే ఉన్నారు'.

మాది పశ్చిమగోదావరి జిల్లా దశికవారి జగన్నాథపురం. తెలంగాణతో ప్రత్యేకమైన అనుబంధం ఉంది. విభిన్న సంస్కృతీ సంప్రదాయాలను అధ్యయనం చేయడం నాకు ఇష్టమైన వ్యాపకాల్లో ఒకటి. తమిళులు అమావాస్యనాడే అన్ని శుభ కార్యాలు చేస్తారు. మనవాళ్లు పనికిరాదంటారు. తిథులు, వారాలు ఎప్పుడూ మంచిపనులకు అడ్డంకాకూడదు. మూఢవిశ్వాసాలు పెంచుకోకూడదు. మనలో వందశాతం ఆస్తికులు లేరు. అలాగే నాస్తికులూను. పరిపూర్ణంగా మనం భగవంతుడ్ని నమ్మనప్పుడు ఆయన ఉనికి మనకు ఎలా తెలుస్తుంది? స్థిరమైన చిత్తంతో భగవంతుని ఆరాధించడమే సిసలైన భక్తి అని నమ్ముతాను. విభక్తము అంటే విడిపోయేది. అలా విడిపోలేనిది, విభక్తము కానిది మాత్రమే భక్తి అవుతుంది. పరమాత్మతో జీవాత్మ విడదీయలేనంతగా కలిసిపోవడమే భక్తి. దాన్ని సాధించడానికి నిరంతర చింతన, ఆధ్యాత్మిక జీవనం మార్గం చూపుతాయి. పూజసామగ్రి సిద్ధం చేసుకుని దేవుని ముందు కూర్చోవడం యూనిఫాం వేసుకుని డ్రైవర్ బస్సెక్కి కూచోడం లాంటిది. అక్కడితో డ్యూటీ అయిపోలేదు. యాక్సిలేటర్, బ్రేక్, గేర్ ఇవన్నీ అధీనంలో ఉంచుకుంటూ యాక్సిడెంట్లు కాకుండా అతిజాగ్రత్తగా బస్సు నడపాలి. పూజ అయినా అంతే..... ఏకాగ్రతతో, నిర్మలచిత్తంతో నిర్వహించాలి. రుద్రాక్షమాల తిప్పేయడంతోనో, నీళ్లు పోసి, పువ్వులు వేయడంతో పూర్తయిపోదు. నా మటుకు నేను రోజూ పూజ, ధ్యానం చేసినా ఒక్కోసారి కుదరకపోతే, భగవంతునికి నమస్కరించకుండానే అలాగే బైటికి వెళ్లిపోయిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. హడావుడి పూజలు చేయను.... ముఖ్యంగా ఆ పూజారి సంఘటన తర్వాత.

> సామాన్య మానవునికి సైతం అర్థమయ్యేలా శివతత్త్వాన్ని ప్రచారం చేసేందుకే 'ఆటగదరా శివా'ను శైవక్షేత్రాలన్నింటిలో గానం చేస్తున్నాను.

భగవంతుడు, తత్త్వం చాలా సులభమైనవే. కానీ మతగ్రంథాలు, వేదాంతులు దాన్ని సంక్లిష్టం చేసేశారు. ఫలితంగా అవి సామాన్యునికి అందటం లేదు. సామాన్య మానవునికి సైతం అర్థమయ్యేలా, అందరూ అనుభవించగలిగేలా శివతత్త్వాన్ని ప్రచారం చేసేందుకే 'ఆటగదరా శివా'ను శైవక్షేత్రాలన్నింటిలో గానం చేస్తున్నాను. మహానందిలో మొదలుపెట్టి ఇప్పటివరకు విదేశాలు సహా 40 పైచిలుకు శైవక్షేత్రాల్లో శివతత్త్వ సంకీర్తనం

చేశాను. 'నేను శివతత్త్వాలు పాడుతూండగా విన్న ఒకతను, 'మీకు శివుడు కనిపిస్తున్నాడా?' అంటూ ప్రశ్నించాడు. నీలాంటి అమాయకులకు కనిపిస్తాడు కానీ నాకెందుకు కనిపిస్తాడు అను కున్నాను నేను. నిజంగా ఎన్ని క్షేత్రాలు తిరిగినా వ్యాపారం కని పించిందే తప్ప పరమేశ్వరుడు కనిపించలేదు నాకు. మానవరూ పంలో ఉండే ఏ బోధకుడు అంటే ఈ స్వాములు, బాబాలు, అమ్మలు, అవధూతలు నాకు శాంతిని ఇవ్వట్లేదు. అందుకే ఆ పరతత్త్వాన్ని అన్వేషిస్తూ భారతదేశంలోని ఆలయాలన్నీ వెతి కాను. లాభం లేదు. అన్నింటినీ మించినది ధ్యానమార్గం అని భగవద్గీతలో ఉంది. నేనూ చాలాకాలంగా ధ్యానం చేస్తున్నాను. నాకెప్పుడూ అంతంత గొప్ప అనుభూతులు కలగలేదు. మనసు పరవశించిన క్షణంలో ఓ పులకరింత, ఓ జలదరింపు, ఓ క్షణం తన్మయత్వం.... అంతే. కానీ దీన్ని మించినది ఏదో ఉంద నిపిస్తుంది. దాన్ని పొందాలనిపిస్తుంది. వర్ణనలకు అందని అటు వంటి స్థితిని అందుకోవాలనేదే నా తాపత్రయం... సాధ్యమా... ఏమో? నాదృష్టిలో భూతదయ ఒక్కటే అద్భుతమైన మతం. మతం అంటే విధానం... ఇష్టం. ఎవరి ఇష్టం వారిది. విత్తనం పాతేవరకే ఎవరికైనా హక్కు. అది అలా పెరగాలి... ఇటే విస్తరిం చాలి అంటే అది అజ్ఞానం. దీని ప్రభావమే సమాజంలో అభ ద్రత, అశాంతి పెరగడానికి కారణం. వీటిని తగ్గించడం సాధ్యం కాకపోవచ్చు. మానసిక అశాంతిని తప్పించుకోవడానికి తెలి విగా భక్తి కవచం కప్పుకొన్న వారున్నారు. యాంత్రిక జీవనం బోర్‌కొట్టి ఈ దారి పట్టినవాళ్లూ ఉన్నారు. మొక్కులు చెల్లిస్తూ కోరికలు కోరేవారున్నారు. భగవంతునికి వస్తు సమర్పణం కాదు... ఆత్మనివేదన కావాలి. ఆయన ముందు ఇంటెలిజెన్స్ కాదు... ఇన్నోసెన్స్ కావాలి. 'నేను అనే అహంకారాన్ని వదిలి పెట్టి అమాయకంగా, నిష్కల్మషంగా ఆయన్ను ఆరాధించు. ఆయన కోసం తపించు. అప్పుడే ఆయన నీలో ప్రవేశిస్తాడు' అంటారు రమణ మహర్షి. అంతకు మించిన తత్వం ఏముంది?.

– జనవరి 27, 2006

నిజంగా ఎన్ని క్షేత్రాలు తిరిగినా వ్యాపారం కనిపించిందే తప్ప పరమేశ్వరుడు కని పించలేదు నాకు.

నాదృష్టిలో భూతదయ ఒక్కటే అద్భుతమైన మతం. మతం అంటే విధానం... ఇష్టం. ఎవరి ఇష్టం వారిది.



**ఆసేతుహిమాచలం ఆమె గానం వినిపించని చోటు ఉండదు. ఫక్తు సినీ గాయనిగాపేరు తెచ్చుకున్నా శాస్త్రీయ సంగీత కళాకారిణిగా ఆమె పలుకుబడి తక్కువ లేదు. తెలుగు సినిమా పాటకు రెండు జాతీయ అవార్డులు తెచ్చిపెట్టారామె. ఉత్తరాదివారి భజన గీతాలు, దక్షిణాది వారి కీర్తనలు, భక్తిగీతాలు రెండిటినీ సమాన మాధుర్యంలో పాడి మెప్పించే శక్తి ఉన్న మేటి గాయని వాణీజయరాం. ఆమె భక్తి, ఆధ్యాత్మిక మధురగీతిక విందాం.**



# దొరకునా ఇటువంటి సేవా...

అప్పటికి నేను పుట్టి పదిరోజులే అయ్యింది. మానాన్నగారు ఆరోజే నా జాతకం రాయించారట. జాతకచక్రం వేసిన జ్యోతిష్కుడు, 'ఈ అమ్మాయి గత జన్మలో కార్తికేయుని భక్తురాలు. ప్రతిదినం ఆ స్వామిని తేనెతో అభిషేకించింది. అందుకే ఈ జన్మలో ఈమెకు కమ్మని కంఠం ఇచ్చాడాయన. మంచి గాయని అవుతుంది. ఈమెకు కలైవాణి అని పేరుపెట్టండి' అని జ్యోతిష్కుడు చెప్పారుట. మా అయ్యర్ల కుటుంబాల్లో సరస్వతీ దేవి పేరు పెట్టాలనుకుంటే వాణి, సరస్వతిలాంటివే కానీ కలై అని చేర్చే ఆనవాయితీ లేదు. ఈ విషయమే ఆలోచిస్తూ నాన్నగారు ఇంటికి వచ్చేసరికి అమ్మకు విపరీతమైన జ్వరం. పాలు లేక గుక్కపట్టి ఏడుస్తున్న నన్ను చూసి నాన్నగారికి ఆ జ్యోతిష్కుని జోస్యం గుర్తుకువచ్చి ఈ పిల్ల పాటగత్తె కావడం ఏమిటని నవ్వు వచ్చిందట. ఆ తర్వాత ఏమనుకున్నారో ఏమో నాకు కలైవాణి అనేపేరే పెట్టారు. చిన్నతనం నుంచి ఈ కథ నా మనసులో బలంగా నాటుకుపోవడం వల్లనే కార్తికేయుడు నా ఇష్టదైవం అయ్యాడు. ఆయనొక్కడే కాదు. ఇంకా అనేకమంది దేవతల్ని ఆరాధిస్తాను. నేనెక్కడికి వెళ్లినా దేవతామూర్తుల ఫోటోలన్నీ నాతో పాటు తీసుకువెళతాను. ఎంత బిజీగా ఉన్నా, ఏ ప్రదేశంలో ఉన్నా ఉదయాన్నే పూజ చేయడం మానను.

**'ఈ అమ్మాయి గత జన్మలో కార్తికేయుని భక్తురాలు. ప్రతిదినం ఆ స్వామిని తేనెతో అభిషేకించింది. అందుకే ఈ జన్మలో ఈమెకు కమ్మని కంఠం ఇచ్చాడాయన. మంచి గాయని అవుతుంది. ఈమెకు కలైవాణి అని పేరుపెట్టండి' అని జ్యోతిష్కుడు చెప్పారుట.**

మనసు పరవశించి పాడేదే సిసలైన పాట. అది గొంతుద్వారా వ్యక్తమవుతుందంతే. భక్తి గీతాలు పాడేటప్పుడు నా హృదయం

మరింతగా స్పందిస్తుంది. అందుకేనేమో నేను పాడిన భక్తి గీతాలు ఎక్కువ పాపులర్ అయ్యాయి. మాది తమిళనాడులోని వేలూరు. చిన్నవయసు నుంచే కర్ణాటక సంగీతాన్ని అభ్యసించాను. జయరాంతో వివాహం అయిన తర్వాత బొంబాయిలో స్థిరపడి హిందూస్థానీ సంగీతం నేర్చుకున్నాను. హిందీ భజన గీతాలతో చేసిన ఓ కచేరీ నాకు సినిమాల్లో అవకాశం కల్పించింది. శంకరాభరణంలోని 'దొరకునా ఇటువంటి సేవ' తెలుగులో మంచి పేరు తెచ్చిపెట్టింది. అదే సినిమాలోని 'మానస సంచరరే' పాటకు తొలిసారి, స్వాతికిరణంలోని ఆనతినీయరా హరా పాటకు మలిసారి తెలుగు సినిమాల ద్వారా జాతీయ గాయనిగా ఆమె అవార్డులు లభించాయి. ఎనిమిది వేలకు పైచిలుకు పాటలు పాడాను. 14 భాషల్లో అనేక హిట్ గీతాలకు ప్రాణం పోశాను. 'గీత్ బినా సంగీత్ బినా జీవన్ నహీ' అంటూ భక్తిగీతాలు రచించాను. తమిళ, హిందీ భాషల్లో పాటలు రాయడం, బొమ్మలు గీయడం నా హాబీలు. మాయాగోవింద్ రాసిన 'ప్రభుజీ మై అనాథ్ హూ' అనే గీతంలో 'కట్‌పుత్లీ హు మై తేరీ హాథ్‌మే' (నీ చేతిలో బొమ్మను నేను) అనే ప్రయోగం అద్భుతం. 'మనమంతా దేవుని చేతిలో బొమ్మలమే. మనల్ని ఆడించే తాళ్లు ఆయన చేతిలో ఉన్నాయి. రాబోయే క్షణంలో మన అడుగు ఎటువైపు పడుతుందనేది కూడా మన చేతిలో లేదుకదా! అందుకే భగవంతుని పట్ల సంపూర్ణ విశ్వాసం ఉంచి, మన తక్కువ తనాన్ని నిజాయితీగా ఒప్పుకోవాలి. అహంకారాన్ని త్యాగం చేసినప్పుడే అది నిజమైన అర్చన అవుతుంది. నాకు గర్వం లేదు అనుకోవడం కూడా గర్వంతో సమానమే. కార్పొరేట్ సమాజంలో నీ స్థానాన్ని నిలబెట్టుకోవడానికి ఎంతోకొంత ఇగోను ప్రదర్శించాల్సి రావచ్చు. అటువంటి సందర్భాల్లో తెలివిగా తప్పుకుపోవడం నేర్చుకోవాలే కానీ దానికి అలవాటు పడకూడదు. మానవులంతా సమానమే. వృత్తిపేరుతో, మతం పేరుతో, కులం పేరుతో ఎవ్వరినీ తక్కువ చేసి చూడకూడదు. కులమత భేదాలు లేని స్వర్గంలో నివసించాలని నా కల.

'మనమంతా దేవుని చేతిలో బొమ్మలమే. మనల్ని ఆడించే తాళ్లు ఆయన చేతిలో ఉన్నాయి.

నాకు గర్వం లేదు అనుకోవడం కూడా గర్వంతో సమానమే. కార్పొరేట్ సమాజంలో నీ స్థానాన్ని నిలబెట్టుకోవడానికి ఎంతో కొంత ఇగోను ప్రదర్శించాల్సి రావచ్చు.

---

విలువైన మన సంస్కృతీ సంప్రదాయాలను పదిలంగా కాపాడుకుంటూ ముందు తరాలకు అందించాల్సిన బాధ్యత మనందరిపై ఉంది. మాది సంప్రదాయ కుటుంబం. సంగీతం, సాహిత్యం రెండూ మా ఇంట్లో మాతో పాటే పెరిగాయి. మా అక్కచెల్లెళ్లు మొత్తం ఆరుగురం. అందరం శాస్త్రీయ సంగీతం

ఎన్నో క్రైస్తవ భక్తిగీ
తాలు పాడాను.
నాకెందరో ముస్లిం
స్నేహితులున్నారు.
కులమత భేదాలు
లేని స్వర్గంలో నివసిం
చాలని నా కల.

నేర్చుకున్నాం. ఇప్పటికీ మన సంస్కృతిని గౌరవిస్తూనే ఉన్నాం. వివాదాలకు అతీతంగా ప్రశాంత జీవనం గడపడమే నా అభిమతం. ఎంతటి భక్తులకైనా ఏదో ఒక సమయంలో భగవంతుని పై విశ్వా సం సన్నగిల్లే సందర్భం ఏదో ఒకటి ఉంటుందని అంటారు. నా విషయంలో మాత్రం అలాంటి క్షణం ఒక్కటి కూడా లేదు. దేశవ్యాప్తంగా అన్ని సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాల్లో కచేరీలు చేసే అవకాశం రావడం నా అదృష్టం.

అది 1993వ సంవత్సరం మే 31. ముంబైలోని బిర్లా క్రీడా కేంద్రంలో నా భజన్ సోలో కార్యక్రమం మరికొద్ది సేపట్లో ప్రారంభం కాబోతోంది. ఇంతలో ఎనభై ఏళ్ల ముసలి వ్యక్తి స్టేజ్ పైకి వచ్చాడు. 'అమ్మా.. మీ తాన్‌పురా నేనొక్కసారి శృతి చేసి ఇస్తాను' అంటూ అడిగాడాయన. కొత్త వ్యక్తుల్ని మా వాయిద్యాలను శృతి చేయడానికి ఎప్పుడూ అనుమతించం. కానీ మావారు సైగ చేయడంతో సరే అన్నాను. ఆయన తాన్‌పురాను కొద్దిసేపు శృతిచేసి పక్కన పెట్టేశాడు. నేను మర్యాదకోసం థాంక్యూ దాదా అన్నాను. ఆయన మాత్రం 'నీతో ఒక్కనిమిషం మాట్లాడాలి' అన్నాడు. ఏమిటో అనుకుంటూ వెళ్తే, 'ఆరేళ్ల కిందట బదరీనాథ్‌లో ఓ కచేరీ చేశావు గుర్తుందా?' అని అడిగాడు. ఉందన్నాను. ''అక్కడికి నారద మహర్షి వచ్చారు. నిన్ను అభినందించారు.' అన్నాడాయన హఠాత్తుగా. ఈయనేకేమైనా పిచ్చేమో అనుకున్నాను నేను. 'ఇప్పుడు కూడా నీ పాట వినడానికి మళ్లీ వస్తున్నారు. చక్కగా పాడు' అని చెప్పేసి వెళ్లిపోబోయాడాయన. ఎందుకులే అనుకుంటూనే మీరెవరు దాదా అని అడిగాను. అప్పుడాయన నా చేతిలో ఓ ఫోటో ఉంచారు. షిర్డీ సాయిబాబా రియల్ లైఫ్ ఫోటోగ్రాఫ్ అది. 'బాబా కాళ్ల దగ్గర కనిపిస్తున్న పిల్లాడ్ని నేనే. సాయి భక్తుడు నానా మా తాతయ్య. ఈ ఫోటో ఉంచు. నీకు సాయి ఆశీస్సులు ఉంటాయి' అని చెప్పి వెళ్లిపోయాడాయన. షిర్డీ సాయిని నేరుగా చూసిన వ్యక్తిని నేను చూడగలగడం ఆనందదాయకమైన విషయం అయితే... ఆయన చెప్పినదంతా నిజమేనని నమ్మితే.... సభలో నాకు తెలియకుండా నా ఎదురుగా సంగీత కళానిధి అయిన నారద మహర్షి కూర్చుని ఉండి ఉండవచ్చనే భావం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. అతి కష్టం మీద ఆరోజు బాగానే పాడగలిగాను. ఆ పరమేశ్వరుని ఆనతి ఉన్నంతవరకు ఇలాగే పాడుతూ ఉంటాను....

– ఫిబ్రవరి 20, 2006

విలువైన మన
సంస్కృతీ సంప్రదా
యాలను పదిలంగా
కాపాడుకుంటూ
ముందు తరాలకు
అందించాల్సిన
బాధ్యత మనందరిపై
ఉంది.



**ఆనందం ఎక్కడో లేదు. అది మనలోనే ఉంది. దుఃఖాల తెరలు తొలగించి, కోరికల గుర్రాలకు కళ్లెం వేసి, ప్రాణధర్మాన్ని పరమోన్నతంగా భావించి యోగ సాధన చేయగలిగితే అద్భుతమైన ఆనందం లభిస్తుంది అన్నారు డాక్టర్ అశోక్ కుమార్ చటర్జీ. అయిదు దశాబ్దాలుగా క్రియా యోగాని ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం చేస్తున్న ఆయన పశ్చిమబెంగాల్‌లోని ఆశ్రమం కేంద్రగా యోగాని బోధిస్తున్నారు. ఆయన అనుగ్రహించిన యోగలహరి.**

# యోగసాధనం... ఆనందశిఖరం

మనిషి తనలోనే ఉన్న అద్భుత శక్తులను ఆవిష్కరించుకునేందుకు యోగశాస్త్రం తోడ్పడుతుంది. నీలోనే భగవంతుడ్ని చూసుకోగలిగినప్పుడు, కొలుచుకోగలిగినప్పుడు వ్యక్తి... తద్వారా సమాజం శాంతిమయం అవుతుంది. ఇదే విషయాన్ని ఫ్రాన్స్‌లో జరిగిన ప్రపంచ మతాధిపతుల సదస్సులో స్పష్టం చేశాను. భారతీయ సనాతన ధర్మం మహోన్నతమైనది. ప్రస్తుతం ఆధునికత వెంట పరుగులు తీస్తున్నాం. ఇది శాశ్వతం కాదు. మళ్లీ సనాతన ధర్మాన్ని భారతీయులంతా ఆదరిస్తారు. ఆ రోజున భారత దేశం తిరుగులేని దేశం అవుతుంది. భారతీయ సనాతన ధర్మం యావత్ ప్రపంచానికి శిరోధార్యం అవుతుంది. ఆ రోజు ఎంతో దూరంలో లేదు.



**భారతీయ సనాతన ధర్మం మహోన్నతమైనది. ప్రస్తుతం ఆధునికత వెంట పరుగులు తీస్తున్నాం. ఇది శాశ్వతం కాదు. మళ్లీ సనాతన ధర్మాన్ని భారతీయులంతా ఆదరిస్తారు. ఆరోజున భారత దేశం తిరుగులేని దేశం అవుతుంది.**



భారతీయ సనాతన ధర్మం కాలక్రమంలో ఇతర ధర్మాలను కూడా కలుపుకొంటూ ముందుకు సాగుతోంది. ఇతర ధర్మాల కెరటాల తాకిడికి సనాతన ధర్మం కాస్త మరుగున పడిందే కానీ మాయం కాలేదు. పుట్టినవన్నీ గిట్టక తప్పదు... కానీ శాశ్వతమైనది ఏదైనా శాశ్వతంగానే ఉంటుందంటాడు బెంగాలీలో ఓ మహనీయుడు. ఎక్కువ మంది అనుసరిస్తున్నంత మాత్రాన అది గొప్ప ధర్మం కానవసరం లేదు. మూలాలు బలంగా ఉన్న ధర్మం మాత్రమే శాశ్వతంగా ఉంటుంది. కొత్తగా వచ్చిన ఎన్నో ధర్మాలు కనుమరుగయ్యాయి. అవుతున్నాయి కూడా... ధర్మం ఒక్కటే... అది సనాతన ధర్మం. అదే శాశ్వతం. చలన రహిత

మైన అద్భుత స్థితే యోగం. యోగవిద్య మనిషిని అనంత స్థితికి తీసుకువెళుతుంది. అనిర్వచనీయమైన ఆనందాన్నిస్తుంది. కొంతకాలంగా యోగవిద్య తెరమరుగైంది. మళ్లీ ఇప్పుడు పూర్వవైభవం పొందుతోంది. ఇదంతా యుగప్రభావం. యోగ శాస్త్రం మనదేశంలోనే పుట్టింది. భారతీయ సనాతన ధర్మంలో యోగవిద్య ఓ జీవనశైలిగా ఉండేది. దేహాన్ని దేవాలయంగా భావించి, ఆరాధించే వారు. ప్రాణాన్ని పరమోన్నతంగా భావించేవారు. అదే ప్రాణధర్మం. ఆ ధర్మసూక్ష్మం తెలుసుకుని, యోగాన్ని సాధన చేసి... సుఖశాంతులతో ఉండేవారు. సనాతన ధర్మాన్ని ఎప్పుడైతే విస్మరించడం ప్రారంభించామో ఆ క్షణం నుంచి మనకు కష్టాలు మొదలయ్యాయి.

దేహాన్ని దేవాలయంగా భావించి, ఆరాధించే వారు. ప్రాణాన్ని పరమోన్నతంగా భావించేవారు. అదే ప్రాణధర్మం.

భారతీయుల మనస్తత్వం, వారి జీవనం, మన దేశ పరిసరాలు యోగసాధనకు ఎంతో అనుకూలంగా ఉంటాయి. మన సనాతన ధర్మం నిరాడంబర జీవనశైలిని బోధించింది. ప్రస్తుతం మన పరిస్థితి అందుకు పూర్తిగా భిన్నం. యుగప్రభావంతో కొంతకాలంగా మనం పైపై మెరుగుల వెంట పరుగులు తీస్తున్నాం. ఆధునిక జీవనశైలి, అనంతమైన కోర్కెలు అశాంతిని మిగులుస్తున్నాయి. పది అంతస్తుల మీద నుంచి ఓ రాయిని కింద వేస్తే అది దబ్బున కిందపడి ప్రకంపనం సృష్టిస్తుంది. ఆ ప్రకంపనాలు తట్టుకునేందుకు ఆధునికులు చుట్టూ కలయచూస్తున్నారు. యోగవిద్య ఆ ప్రకంపనాలను తట్టుకొనే శక్తిని అందించడంతో పాటు అనంతమైన శాంతినిస్తున్నది. యోగ శాస్త్రం తిరిగి పూర్వవైభవం పొందడానికి ఇదే కారణం. యోగ విద్య మనలో ఉండే శక్తిని మనకు తెలియజెబుతుంది. ఆనంద స్థితికి తీసుకువెళుతుంది. ఆనందం ఎక్కడో లేదు. అది మనలోనే ఉంటుంది. దుఃఖానికి కారణాలు కనుగొని, ఆ చీకటి తెరలను తొలగించాలి. ఇంద్రియాలను అదుపులో ఉంచుకుని సాధన చేయాలి. ఇంతవరకు మనంతట మనమే సాధించే వీలుంటుంది. ఆ తరువాత అనంతమైన ఆనందమార్గ సాధనకు గురువు అవసరం. యోగ పరమార్థాన్ని సాధించేందుకు మనం చేయగలిగేది ఒకశాతం మాత్రమే. గురువు సూచించిన మార్గంలో నడిచినప్పుడే మిగిలిన 99శాతం ఆనందపథాన్ని చేరుకోగలుగుతాం.

మనం పైపై మెరుగుల వెంట పరుగులు తీస్తున్నాం. ఆధునిక జీవనశైలి, అనంతమైన కోర్కెలు అశాంతిని మిగులుస్తున్నాయి.

ప్రాచీన యోగశాస్త్రం ఒకటే. కానీ దానికి ఆధునికులు తలో

విధంగా భాష్యం చెబుతున్నారు. ఆడంబరం కోసం కాకుండా నిశ్చలానందం కలిగించే యోగవిద్యే శాశ్వతం. అటువంటి సనాతన యోగం ఏదో... వ్యాపారీకరణ చెందిన యోగం ఏదో ప్రజలు త్వరలోనే గ్రహిస్తారు. ఉరుకులు పరుగుల జీవితంలో నిశ్చలంగా కూర్చుని యోగసాధన చేయడం ఎంత వరకు సాధ్యం అని ప్రశ్నించుకుంటే, యోగశాస్త్రం కొద్దికాలం కనుమరుగు కావడం ఎలా యుగధర్మం అనుకున్నామో, మళ్లీ అందరూ యోగమార్గాన్ని అనుసరించడం కూడా యుగధర్మమే. నాది అయిదు దశాబ్దాల యోగసాధన అనుభవం. 1933లో పశ్చిమబెంగాల్‌లో దూర్స్ ప్రాంతంలో బ్రాహ్మణ కుటుంబంలో పుట్టాను. చిన్నతనంలో తల్లిదండ్రులను కోల్పోవడంతో నాలో అలజడి రేగింది. పదేళ్ల పాటు దేశమంతా తిరిగాను. చివరకు హిమాలయాల్లో తేలాను. 18వ శతాబ్దానికి చెందిన మహనీయుడు శ్యాంచరణ్‌లాహిరి అనుయాయిగా మారాను. 1961లో క్రియాయోగ ప్రారంభించి రెండు దశాబ్దాల పాటు సాధన చేశాను. ఆ తరువాత క్రియాయోగ టీచర్‌గా, యోగ గ్రంథాలు రాశాను. లాహిరి మహాశయుని బోధలు ప్రచారం చేయడమే నా జీవిత పరమార్థం. ఇటీవలి కాలంలో మహిళల్లో యోగ పట్ల ఆసక్తి పెరుగుతున్నది. ఇది మంచి పరిణామం. వ్యాయమం లేక, అనారోగ్యాలతో ఇబ్బంది పడే వారికి శారీరకంగా స్వస్థత చేకూర్చడంతో పాటు మానసికంగా అనిర్వచనీయమైన శక్తినిచ్చేది యోగ. యువత కూడా వేగంగా యోగవైపు మొగ్గుచూపు తున్నదన్నారాయన. దక్షిణాది రాష్ట్రాల్లో అద్భుతమైన దేవాలయా లున్నాయి. ఆధ్యాత్మిక వారసత్వం ఉన్నది. ఆధ్యాత్మిక వెలుగులే జీవితానికి శాశ్వత సుఖాన్నిస్తాయని అందరూ గ్రహించాలి.

– ఫిబ్రవరి 24, 2006

**ఆ తరువాత అనంతమైన ఆనందమార్గ సాధనకు గురువు అవసరం. యోగ పరమార్థాన్ని సాధించేందుకు మనం చేయగలిగేది ఒకశాతం మాత్రమే.**

**యోగశాస్త్రం కొద్దికాలం కనుమరుగు కావడం ఎలా యుగధర్మం అనుకున్నామో, మళ్లీ అందరూ యోగమార్గాన్ని అనుసరించడం కూడా యుగధర్మమే.**



**ఆయన కవి, కథకుడు, 50కి పైగా నవలలు రాశారు. సుదీర్ఘ ప్రాత్రికేయ జీవితం గడిపారు. ఎందరో మహనీయుల్ని కలుసుకున్నారు. మాస్టర్ సివివి యోగాతో నాలుగు దశాబ్దాల అనుబంధం. నిరంతర యోగ సాధనతో ఆత్మదర్శనం పొంది, ఆ మార్గాన్ని వేలాది మందికి సూచిస్తున్నారు ప్రముఖ్య ఆధ్యాత్మిక గ్రంధ కర్త, మాస్టర్ యోగాశ్రమ సారథి శ్రీ శార్వరి. భక్తి, ఆధ్యాత్మికం, యోగ ధ్యానాలపై ఆయన అనుభవాలు.. జ్ఞాపకాలు.**



# ప్రతి ఇల్లూ ఓ యోగాలయం



**బయటి వారి మీద ఆధారపడడం మానేసి ప్రతి ఒక్కరు ఆత్మాన్వేషణ ప్రారంభిస్తారు. యోగకు మరింత ప్రాధాన్యత పెరుగుతుంది. ప్రతి ఇల్లు ఒక ఆశ్రమం అవుతుంది. ప్రతి మనిషి ఓ సూపర్ మాన్ అవుతాడు.**



గత శతాబ్ది ప్రారంభంలో రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి, అరవిందుల ప్రభావం ఆంధ్రప్రదేశ్ ప్రజలపై ఎక్కువగా ఉంది. ద్వితీయార్థంలో షిర్డిసాయి ప్రభావం ఎక్కువైంది. అలా ఆ శతాబ్ది తొలిపాదంలో సమాజంలో తాత్విక పునాదులు పడితే మలిపాదంలో అది సామాన్యవర్గాలకు సైతం విస్తరించడం ప్రారంభమైంది. ఇప్పుడు ఈ శతాబ్దిలో తాత్విక చింతనా ధోరణులు మరింతగా విస్తరిస్తున్నాయి. బయటి వారి మీద ఆధారపడడం మానేసి ప్రతి ఒక్కరు ఆత్మాన్వేషణ ప్రారంభిస్తారు. యోగకు మరింత ప్రాధాన్యం పెరుగుతుంది..... ప్రతి ఇల్లు ఒక ఆశ్రమం అవుతుంది.... ప్రతి మనిషి ఓ సూపర్‌మాన్ అవుతాడు.

తెనాలి సమీపంలోని కోపల్లె గ్రామం మాది. సంప్రదాయ కుటుంబం. నా బాల్యంలో వేర్పేడు మళయాల స్వామి, ఆయన శిష్యులు తత్వానంద స్వామి తరచు మా ఇంటికి వస్తూ ఉండే వారు. అప్పుడే యోగ బీజాలు నాలో నాటుకున్నాయని చెప్పాలి. గుంటూరులో విద్యాభ్యాసం.. ఆ తరువాత తెనాలి విఎస్ఆర్ కళాశాలలో ఇంగ్లీషు లెక్చరర్‌గా పనిచేశాను. అప్పటికే కవిత్వం, కథలు, నవలలు రాయడం ప్రారంభించాను. ఆధ్యాత్మిక చింతన ఉన్నా... భక్తి భావం మొదటి నుంచి తక్కువగా ఉండేది. అరవిందుల రచనల పట్ల ఆసక్తి పెరిగింది. యోగం పట్ల నాలో ఉన్న ఆసక్తికి ఆయనే ప్రేరణ అందించారని చెప్పాలి. ఆ తరువాత పాత్రికేయ వృత్తిలో భాగంగా ఎందరో

మహనీయుల్ని కలుసుకున్నాను. 1970లో కుంభకోణంలోని మాస్టర్ సివివి ఆశ్రమంలో యోగాభ్యాసానికి శ్రీకారం చుట్టాను. యోగాభ్యాసం ప్రారంభించిన మరుక్షణం నుంచి నా జీవితం మారిపోయింది. కథలు, నవలలు రాయడం దాదాపు నిలిచిపోయింది. యోగమే నా జీవితం అయింది.

మనలో ఉన్న దేవుడ్ని చూసుకోగలిగితే ఇక వేరే భగవంతుడు అవసరం లేదు. మన లోని శక్తిని తెలుసుకున్నప్పుడు మనపై మనకు శ్రద్ధ పెరుగుతుంది.

కంటికి కనిపించని శక్తి ఏదో మనందరినీ నడిపిస్తూ ఉంది. మనం ఏం చేయాలో, ఏం చేయకూడదో కూడా అదే నిర్దేశిస్తుంది. యోగాభ్యాసానికి ప్రత్యేకంగా అర్హతలు ఏమీ అవసరం లేదు. చదువు సంధ్యలు అవసరం లేదు. మాస్టర్ సివివి గురువు... శిష్యుడు అనే భావనకు కూడా వ్యతిరేకి. మనలోని స్వరమే మన గురువు. మనసు చేసే గొడవను పక్కకు నెట్టి నీలోని ఆత్మ గురించి అన్వేషణ మొదలు పెట్టాలి. మనలో ఉన్న దేవుడ్ని చూసుకోగలిగితే ఇక వేరే భగవంతుడు అవసరం లేదు. మనలోని శక్తిని తెలుసుకున్నప్పుడు మనపై మనకు శ్రద్ధ పెరుగుతుంది. ఎవరికీ హాని చేయకుండా నీతి నిజాయితీలతో ఉంటాం. మనం ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటాం. మనమే కాదు మన చుట్టు పక్కల వారు... తద్వారా సమాజం శాంతిమయం అవుతుంది. అదే యోగ గొప్పదనం. యోగ అంటే అసాధ్యమైన విషయమేమీ కాదు. రోజూ కాసేపు కళ్లు మూసుకు కూర్చోండి. కొద్ది రోజులు ఇతర ఆలోచనలు వస్తే రానివ్వండి. ఆ తరువాత అవే ఆగిపోతాయి. అప్పుడు ఆత్మాన్వేషణ మొదలౌతుంది. మన మీద మనకు బలమైన నమ్మకం కలగడం యోగంలో మొదటి మెట్టు. ఆపైన ఏ మానసిక బంధనాలూ లేని స్వేచ్ఛ అలవడుతుంది. ఆ తరువాత చేసే సాధనను బట్టి యోగలో వివిధ దశలు మన సొంతం అవుతాయి. స్వర్గం ఎక్కడుందో ఎవరికీ తెలియదు అయితే పూర్ణయోగమే నిజమైన స్వర్గం. యోగాభ్యాసం వల్ల ప్రయోజనం ఏమిటని కొందరు అడుగుతారు. అందుకు నేనే సమాధానం. నాకు డెబ్బై ఏడేళ్లు. అనారోగ్యం లేదు.. కంగారు లేదు. చింతలేదు. హాయిగా జీవితం గడుపుతున్నాను. నాకు తెలిసిన విషయాలు నలుగురితో పంచుకుంటున్నాను. ఎవరికైనా ఇంతకు మించి ఏం కావాలి.

సాధనను బట్టి యోగలో వివిధ దశలు మన సొంతం అవుతాయి. స్వర్గం ఎక్కడుందో ఎవరికీ తెలియదు అయితే పూర్ణయోగమే నిజమైన స్వర్గం.

ఈ కాలంలో డబ్బు ఉంది, సౌకర్యాలున్నాయి. కానీ ఎవరికీ సంతృప్తి మాత్రం లేదు. నిరంతరం ఆందోళన... ఉరుకులు,

**రోజూ ఓ గంటసేపు ధ్యానం చేయండి చాలు. ఏమీ చేయాల్సిన పని లేదు. కళ్లుమూసుకు కూర్చోండి. ఈ ఆరాటాలు తగ్గుతాయి.**

పరుగులు. పైగా ఈ అహంకారం మనిషిని పతనానికి తీసుకు వెళుతున్నది. మనచుట్టూ ఉన్న అశాంతికి అదే కారణం. మనం ఎటుపోతున్నాం... ఏం జరుగుతున్నది అని ఓ క్షణం ఆలోచించుకోనేందుకు ధ్యానం...యోగ సాధనాలుగా మారాయి. ఇక్కడ శాంతి లభిస్తుందని క్రమంగా అందరూ తెలుసుకుంటున్నారు. రోజూ ఓ గంటసేపు ధ్యానం చేయండి చాలు. ఏమీ చేయాల్సిన పని లేదు. కళ్లుమూసుకు కూర్చోండి. ఈ ఆరాటాలు తగ్గుతాయి. అలజడి తగ్గుతుంది. మనసు దారి కొచ్చినప్పుడు వ్యామోహాలు తగ్గుతాయి. జీవితంలో సంయమనం లభిస్తుంది. అవధుల్లేని ఆనందానికి అదే మార్గం. కొందరు యోగులు దేశవిదేశాల నుంచి వేలాది మందిని రప్పించి ఆర్భాటాలు చేస్తున్నారు. మరి కొందరు ఎగ్జిబిషన్ తరహాలో వేలాది మందితో యోగా చేయిస్తున్నారు. యోగ, ధ్యానం ప్రస్తుతం మార్కెట్ వస్తువుగా మారాయంటారా అని ప్రశ్నించినప్పుడు, ఇది బాధాకరమైన పరిణామన్నారు. యోగ అనేది వ్యక్తిగతమైనది. నాలుగు గోడల మధ్య ప్రశాంతంగా ఆత్మాన్వేషణ సాగించేందుకు తోడ్పడే ఉపకరణం. నిజమైన యోగాకు హంగులు, ఆర్భాటాలు అవసరం లేదు. అంతగా ఆర్భాటం చేస్తున్న వారు చెబుతున్నది పతంజలి యోగంలోని ప్రాథమిక సూత్రాలు మాత్రమే. ఈ తరహా యోగం ప్రజలకు చిరకాలం సాంత్వన ఇవ్వదు. ఇవన్నీ కనుమరుగై నిజమైన యోగమార్గమే నిలబడుతుంది. శరీరం, మనసు, ఆత్మ... ఈ మూడింటినీ సమాంతరంగా పరిపూర్ణం చేసే శక్తి మాస్టర్ యోగాలో ఉంది. యోగ తరంగాలు మహా శక్తిమంతమైనవి. యోగజీవితం గడిపే వారు స్థిరమైన సంకల్పం చేస్తే అది ఫలిస్తుంది. నాకు ఆరోగ్యం బాగా లేదు మాస్టర్ అంటూ ఎవరో నా దగ్గరకు వస్తారు. వారికి మంచి జరగాలని సంకల్పం చేస్తాను. అదే యోగచికిత్స. యోగకు జ్ఞానం అవసరం లేదు. 45కు పైగా యోగ, ఆధ్యాత్మిక గ్రంథాలు రాశాను. యోగాభ్యాసానికి అవసరమైన సంస్కారం పుస్తకాల వల్ల అలవడుతుంది. అందుకే నాకు తెలిసిన విషయాలు రాయడం మొదలు పెట్టాను. ఇకపోతే మా యోగాశ్రమంలో ధ్యానమందిరం ఉంది. ఎవరైనా ఇక్కడ యోగసాధన చేసుకోవచ్చు. యోగసాధనకు వందలాది మంది వస్తూ ఉంటారు. వారికి నాకు చేతనైన విద్య నేర్పుతున్నాను. యోగం నా ఊపిరి... రచన నా శ్వాస... ఆత్మజ్ఞానం నా ఆశ్వాస.

**శరీరం, మనసు, ఆత్మ... ఈ మూడింటినీ సమాంతరంగా పరిపూర్ణం చేసే శక్తి మాస్టర్ యోగాలో ఉంది.**

– మార్చి 10, 2006



**సామాన్యులకు ఓ క్షణానికి మించి ఆ వేంకటేశ్వరుని చూసే భాగ్యం కలగదు. కానీ ఆయన దశాబ్దాలుగా స్వామి చెంతనే ఉంటూ అనుక్షణం సేవించి, తరిస్తున్నారు. ఉత్తిష్ఠ కమలాకాంతా అని మేలకొలుపుతారు. జోజో ముకుందా అంటూ పవళింపు సేవ చేస్తారు. ఆయనే తిరుమల వేంకటేశుని ఆలయ ప్రధానార్చకులు రమణదీక్షితులు. కణజీవ శాస్త్రంలో డాక్టరేట్ పుచ్చుకున్న ఆయన స్వామి సేవకుడిగా ఎలా మారారో తెలుసుకుందాం.**

# స్వామిని చేర్చే శరణాగతి

ఆస్తి పాస్తులు కోరుకుంటే ఇస్తాను.... సంతానం, విద్య, కార్లు, బంగళాలు ఏవి కోరుకుంటే అవన్నీ ఇస్తాను.... ఏదీ కోరుకోని పక్షంలో మాత్రమే మోక్షం ప్రసాదిస్తాను... అని శ్రీవేంకటేశ్వర స్వామి ఫలశృతిలో చెప్పారు. భగవంతుని వద్దకు వచ్చిన ప్రతి ఒక్కరూ ఏదో ఒక కోరికతోనే వస్తున్నారు. కోట్లు గడించిన వారు కూడా పుట్టెడు దుఃఖంతో స్వామి ముందు భోరుమనడం చూశాను. ఏమీలేని నిరుపేద తిరుమల వీధుల్లో దొరికింది తిని, స్వామి భక్తిగీతాలు వింటూ హాయిగా జీవించడం కూడా చూశాను. ఇదంతా ఆ స్వామి లీలావిలాసం. బహుశా ఆ స్వామి తనకు శాస్త్రవేత్త అయిన అర్చకుడు కావాలనుకున్నారేమో అందుకే డాక్టరేట్ చేసిన నన్ను అర్చకునిగా ఎన్నుకున్నారు. 33 తరాలుగా మా కుటుంబం వారే స్వామికి సేవ చేస్తున్నారు. నాన్నగారికి నేను ఒక్కడినే. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కణజీవ శాస్త్రంలో పిహెచ్.డి చేశాను. యూనివర్సిటీలో చదువుతూనే ఆగమశాస్త్రం క్షుణ్ణంగా చదువుకున్నాను. డాక్టరేట్ కాగానే విదేశాలకు వెళ్లాలని, పరిశోధన చేయాలని అనుకున్నాను. ఎన్నో విదేశీ విశ్వవిద్యాలయాలకు దరఖాస్తు చేసినా వారి నుంచి సరైన స్పందన రాలేదు. 1977లో పిహెచ్.డి అవార్డు అయింది. డాక్టరేట్ వచ్చాక నెలరోజులకు తండ్రిగారు కాలం చేశారు. నేను ఆలయ అర్చకత్వ బాధ్యతలు చేపట్టాల్సి వచ్చింది. ఆ తరువాత కొద్ది రోజులకే ఓ అరుదైన అంశంపై పరిశోధన చేసేందుకు బ్రిటన్‌కు చెందిన

**33 తరాలుగా మా కుటుంబం వారే స్వామికి సేవ చేస్తున్నారు. నాన్నగారికి నేను ఒక్కడినే. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో కణజీవ శాస్త్రంలో పిహెచ్.డి చేశాను. యూనివర్సిటీలో చదువుతూనే ఆగమశాస్త్రం క్షుణ్ణంగా చదువుకున్నాను.**

స్వామి సేవను పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను. ఆయన సంకల్పం తోనే సకల చరాచర జగత్తు నడుస్తున్నది.

ప్రముఖ విశ్వవిద్యాలయం నుంచి ఆహ్వానం వచ్చింది. ఆ స్వామి లీలావిలాసం నాకు అప్పుడు అర్థం అయింది. విదేశాలకు వెళ్లేందుకు అవకాశం రాలేదే అన్న బాధ నాలో మిగలకుండా అక్కడి నుంచి ఆహ్వానం అందేలా చేశారు. మరోవైపు వంశపారంపర్యంగా వస్తున్న అర్చకత్వ బాధ్యతలు చేపట్టేలా చేశారు. స్వామితో బంధం ఈ నాటిదికాదు... ఎన్నో జన్మలది అని నాకు స్పష్టమైంది. ఆ క్షణం నుంచి స్వామికే పూర్తిగా అంకితం అయ్యాను.

అణువులు, పరమాణువులను అధ్యయనం చేసినా ఓ దశ దాటిన తరువాత ఈ సృష్టిక్రమంపై ఏ శాస్త్రం స్పష్టమైన వివరణ ఇవ్వలేకపోయింది. అఖిల విశ్వాన్ని అద్భుత శక్తి ఏదో నడిపిస్తున్నదని ప్రతి ఒక్కరూ అంగీకరిస్తారు. నా వరకు నేను స్వామి సేవను పూర్వజన్మ సుకృతంగా భావిస్తాను. ఆయన సంకల్పంతోనే సకల చరాచర జగత్తు నడుస్తున్నది. పూర్వం జోలీల్లో, నడుచుకుంటూ కొండకు వచ్చే వాళ్లు. ప్రకృతి రమణీయ శోభల మధ్య తిరుమల ప్రశాంత నిలయంగా ఉండేది. వచ్చిన భక్తులు ప్రశాంతంగా దర్శనం చేసుకుని, ఆనందంగా తిరిగి వెళ్లేవారు. ఇప్పుడు పరిస్థితి అలా లేదు. అంతా రద్దీ.. ఉరుకులు... పరుగులు. అందువల్ల అనేక చిక్కులు. చివరకు స్వామికి నిత్యసేవలు కూడా సంపూర్ణంగా చేయలేని పరిస్థితి. మన దేహాన్ని ఎంత జాగ్రత్తగా చూసుకుంటామో, సరిగ్గా అలాగే స్వామిని కూడా అంతే జాగ్రత్తగా పూజించాలి. సుగంధ పుష్పాలతో, ఆభరణాలతో అలంకరించాలి. వేళకు రుచికరమైన నైవేద్యం పెట్టాలి. స్వామికి సేవలైతే జరుగుతున్నాయి కానీ సకాలంలో, సంపూర్ణంగా జరగడం లేదు. ఈ పరిణామాలన్నీ స్వామి సంకల్పమే. ఆయన సంకల్పం లేనిది ఏదీ జరగదు. ప్రయోగం... ఉపసంహారం రెండూ తెలిసిన సర్వ సమర్థుడాయన. ఆయన సంకల్పం ఏమిటో... చూద్దాం.

స్వామికి సేవలైతే జరుగుతున్నాయి కానీ సకాలంలో, సంపూర్ణంగా జరగడం లేదు. ఈ పరిణామాలన్నీ స్వామి సంకల్పమే.

99 శాతం మంది కోర్కెలతోనే కొండకు వస్తున్నారు. లెక్కలేనన్ని కోర్కెలు... అవి తీరాక మరో జాబితాతో వస్తారు. కోర్కెల వెల్లువలో కొట్టుకుపోతూ అనంతమైన కష్టాలు కొనితెచ్చుకుంటున్నారు. అంతులేని కోర్కెలతో దుఃఖపడే ఎందరినో చూశాను. నిజానికి మనకు ఎంత... ఏది ఇవ్వాలని స్వామి అనుకుంటారో అంతే మనకు దక్కుతుంది. మనం ఆరాటపడితే మిగి

లేది ఆవేదనే. ఆ స్వామి శరణాగతితోనే జన్మ సార్థకం అవుతుంది. మనం చేయవలసిందల్లా సాత్విక జీవనాన్ని అలవరచుకోవడమే. సాత్వికమైన ఆలోచనలతో ఉన్నప్పుడు మనం, మన చుట్టూ ఉన్న సమాజం కూడా ప్రశాంతంగా ఉంటుంది. మా ముందు తరాల అర్చకులు విమానంలో వచ్చి స్వామివారికి పూజలు చేసేవారనే అపప్రథ ఉంది. ఎవరో ఒకరు అలా చేసి ఉండవచ్చు. కానీ ఇప్పుడు నా జీతం ఎంత అనుకుంటున్నారు. రోజుకు రెండు వందలు. ప్రధానార్చకుడి పరిస్థితి ఇలా ఉంటే మిగిలిన అర్చకుల పరిస్థితి ఊహించుకోవచ్చు. 1987లో ప్రభుత్వం తెచ్చిన చట్టం రాష్ట్రంలోని అర్చకుల జీవితాలను కష్టాల్లోకి నెట్టింది. రాష్ట్రంలో వేలాది ఆలయాలు శిథిలావస్థకు చేరుతున్నాయి. అర్చకుడు, పురోహితుడు గ్రామం హితవు కోరుతూ, గ్రామ ప్రజలు ఇచ్చిన వాటితో కాలం వెళ్లదీసే వారు. ప్రభుత్వ చట్టం వల్ల అర్చకత్వం చేపట్టే వారి సంఖ్య బాగా తగ్గిపోతోంది. ఆలయాలు అనాథలు కావడం అశుభపరిణామం. నాకు ముగ్గురు అబ్బాయిలు. పెద్దబ్బాయి ఎంబిఎ చదువుకున్నాడు. కంప్యూటర్ కోర్సు చేసి విదేశాలకు వెళ్లమన్నాను... లేదు ఆ స్వామి సేవకే అంకితం అవుతానన్నాడు. మరోతరం కూడా స్వామికి సేవచేసే భాగ్యం పొందుతుందని ఆనందం కలిగింది.

ఆ స్వామి శరణాగతితోనే జన్మ సార్థకం అవుతుంది. మనం చేయవలసిందల్లా సాత్విక జీవనాన్ని అలవరచుకోవడమే.

స్వామి మంగళరూపాన్ని కనులారా చూసే భాగ్యం చాలా మందికి లభించదు. రద్దీ కారణంగా కొన్ని క్షణాలకు మించి సామాన్యులు స్వామిని దర్శించుకోలేరు. మీరు నిత్యం స్వామి చెంతనే ఉంటారు. ఆయన రూపం వర్ణిస్తారా అని ఎవరైనా అడిగితే... ఓ క్షణం కళ్లు మూసుకుని, పులకింత నిండిన స్వరంతో స్వామిని వర్ణిస్తారు. ఆజానుబాహుడైన ముప్ఫై సంవత్సరాల యువకుని నిండైన రూపం స్వామిది. ఆ దివ్యమంగళ రూపాన్ని వర్ణించేందుకు మాటలు చాలవు. ఒకపోగు పక్కకు జారిన ప్రలంభ యజ్ఞోపవీతంతో, కుడివైపు వక్షంపై శ్రీ వత్సంతో ఉండే స్వామిని చూసేందుకు రెండు కళ్లూ చాలవు. ఆరాటం లేకుండా, నిరపేక్షతో ఆ స్వామిని శరణు వేడితే అన్నీ శుభాలే జరుగుతాయి.

ఆజానుబాహుడైన ముప్ఫై సంవత్సరాల యువకుని నిండైన రూపం స్వామిది. ఆ దివ్యమంగళ రూపాన్ని వర్ణించేందుకు మాటలు చాలవు.

– ఏప్రిల్ 14, 2006



**నిత్యనూతనం... శాశ్వతమైన ఆనందానికి మంచితనమే మార్గం అంటారు స్వామిని విమలానంద. గుజరాత్‌కు చెందిన విమలానంద ముంబైలో ఆర్కిటెక్చర్ చదువుకున్నారు. ఆ తరువాత ఆధ్యాత్మిక మార్గం పట్టారు. చిన్మయానంద చేతుల మీదుగా దీక్ష స్వీకరించి అందరిలో జ్ఞాన జ్యోతుల్ని వెలిగిస్తు న్నారు. కోయంబత్తూర్ చిన్మయా ఇంటర్నేషనల్ స్కూల్ సార థిగా పని చేయడంతో పాటు ప్రపంచవ్యాప్తంగా సత్సంగాలు ఇస్తున్న ఆమె ఆధ్యాత్మిక ప్రయాణం ఇది.**

# సత్సాంగత్యంతో జీవితానికి సార్థకత

మానవాళికి నిరంతరం ఆనంద మార్గం చూపడమే చిన్మయామిషన్ లక్ష్యం. పరిపూర్ణమైన విద్యా వ్యవస్థ ఉన్నప్పుడే ఆనందమయ, ప్రశాంత జీవనం సాధ్యమవుతుంది. ఈ రోజుల్లో చదువుల నుంచి వచ్చే విజ్ఞానం పరిధి చాలా స్వల్పం. కంప్యూటర్ నిపుణుడికి అందుకు సంబంధించిన నాలుగు విషయాలు తప్ప మరేమీ తెలియవు. ఎంత చదువుకున్న వారైనా నిత్య జీవితంలో చిన్న సమస్య ఎదురైతే కలవర పడిపోతున్నారు. సాయం కోసం దిక్కులు చూస్తున్నారు. మరి కొందరు సంక్షోభంలో కూరుకుపోతున్నారు. నేటి చదువులు హాయిగా, ప్రశాంతంగా ఎలా బతకాలనే విషయం చెప్పడం లేదు. ఎలా సంపాదించాలి... ఎంత సంపాదించాలనే విషయాలే నేర్పుతున్నాయి. సమస్యలన్నింటికీ ఇదే మూలం. ఆధునిక, సంప్రదాయ విద్యలను మేళవించినప్పుడే ఆ చదువు పరిపూర్ణం అవుతుంది. మన గురుకుల విద్యా విధానమే మనిషిని పరిపూర్ణంగా తీర్చిదిద్దేది. ఆధునిక విద్యావిధానంలో ఆ అవ కాశం లేదు. అందుకే మా సంస్థ దేశవ్యాప్తంగా వందలాది పాఠశాలలు ఏర్పాటు చేసింది. ఆధునిక విద్యతో పాటు అంతకంటే అవసరమైన సంప్రదాయ విద్యను అందిస్తున్నది

ఈ రోజుల్లో చదువుల నుంచి వచ్చే విజ్ఞానం పరిధి చాలా స్వల్పం. కంప్యూటర్ నిపుణుడికి అందుకు సంబంధించిన నాలుగు విషయాలు తప్ప మరేమీ తెలియవు. ఎంత చదువుకున్న వారైనా నిత్య జీవితంలో చిన్న సమస్య ఎదురైతే కలవర పడిపోతున్నారు. సాయం కోసం దిక్కులు చూస్తున్నారు.

ప్రయోజనం లేనిదే ఏ పనీ చేయని ఈ కాలంలో సంప్రదాయ విద్యను ఆదరిస్తారా అనే సందేహం చాలా మందిలో కలుగుతున్నది. మా పాఠశాలలకు లభిస్తున్న ఆదరణే ఆ సందే

హాలకు సమాధానం. ప్రశాంతంగా ....ఆనందంగా జీవించాలన్నదే ప్రతి ఒక్కరి ఆకాంక్ష. సనాతన ధర్మాన్ని ఆచరించడమే అందుకు ఏకైక మార్గం. ఇతర దేశాలు తమదైన ధర్మాన్ని కాపాడుకుంటూ పురోగమిస్తున్నాయి. ధార్మిక దేశంగా ప్రపంచం నీరాజనాలు అందుకున్న మనం మాత్రం పాశ్చాత్యీకరణ మోజులో పడి నానా అవస్థలు పడుతున్నాం. కాలాన్ని బట్టి మారడంలో తప్పు లేదు. అయితే మన మూలాల్ని మరచిపోతే కుప్పకూలిపోవడం ఖాయం. రెండున్నర శతాబ్దాలుగా మనం నేర్చుకుంటున్న విద్య మనది కాదు. పరాయి విద్య, పరాయి సంస్కృతి తెచ్చిపెట్టిన దుష్ఫలితాలు ఇప్పుడు మనం అనుభవిస్తున్నాం. ఆ దుష్ప్రభావాన్ని తగ్గించి, ప్రజలు ఆనందంగా జీవించేందుకు మార్గం చూపడమే మాలక్ష్యం. ఎంతగానో శాస్త్ర వికాసం జరుగుతున్నది... మానవుని మేధపెరుగుతున్నదని భావిస్తున్న తరుణంలో మన చదువుల మూలాల్నే ప్రశ్నిస్తున్నారు...ఇది ఎంతవరకు సమంజసం అని అడిగినప్పుడు మన మేధస్సు ఏమాత్రం పెరగలేదు... మనల్ని మనమే గొప్ప వాళ్లం అనుకుంటున్నాం. ఎంతో అభివృద్ధి సాధించాం అనుకుంటున్నాం. నిజానికి మనకు అవసరమైన మేర మేధస్సు... విజ్ఞానం లేనేలేవు. అవే ఉంటే ఇన్ని కష్టాలు ఎందుకు? దారీతెన్నూ లేకుండా ఎందుకు పయనిస్తున్నాం? మనం ఏమిటో మనకు తెలియదు. ఏదో ఒక శాస్త్రాన్ని తెలుసుకుని, నాకు సర్వం తెలుసు అనుకుంటున్నాం. లౌక్యంగా... తెలివిగా బతుకు వెళ్లదీస్తున్నాం. బుద్ధిని ఉపయోగిస్తాం. కాని శ్రద్ధలేదు... శరణాగతి లేదు. ఈ ధోరణి వల్ల జీవితం వెలితిగా అనిపిస్తుంది. దీంతో కష్టాలు మొదలౌతాయి. ఆందోళన.. ఒత్తిడి జీవితాన్ని అయోమయం పాలు చేస్తుంది. సనాతన ధర్మం ప్రతి ఒక్కరికి వారేంటో వారు తెలుసుకొనే సస్వరూప జ్ఞానం అందిస్తుంది. జీవితాన్ని సుఖమయం చేస్తుంది.

**ప్రశాంతంగా... ఆనందంగా జీవించాలన్నదే ప్రతి ఒక్కరి ఆకాంక్ష. సనాతన ధర్మాన్ని ఆచరించడమే అందుకు ఏకైక మార్గం.**

నిజానికి మనకు అవసరమైన మేర మేధస్సు, విజ్ఞానం లేనేలేవు. అవే వుంటే ఇన్ని కష్టాలు ఎందుకు? దారీతెన్నూ లేకుండా ఎందుకు పయనిస్తున్నాం?

---

మనిషి పరిధి నానాటికీ చిన్నదైపోతున్నది. నేను, నా కుటుంబం అంటూ గిరిగీసుకుంటున్నాడు. తనకు, తన కుటుంబానికి కూడా పూర్తిగా న్యాయం చేయలేకపోతున్నాడు. ఈ తరుణంలో సత్సాంగత్యమే మార్గదర్శకం అవుతుంది. ఈ మధ్య కాలంలో మనవాళ్లకు పక్కవాళ్లతో మాట్లాడే తీరిక కూడా ఉండడం లేదు. నిజానికి తనగురించి తాను ఆలోచించుకొనే తీరికే ఉండడం లేదు. ఈ ధోరణి సరికాదు. సత్సాంగత్యం

నలుగురు మంచి వారితో మనసు విప్పి మాట్లాడడం... మంచిని పెంచుకోవడం. ఇదే సత్సాంగత్యం.

అంటే ఏదో అసాధ్యమైన విషయం కాదు. నలుగురు మంచివారితో మనసు విప్పి మాట్లాడడం... మంచిని పెంచుకోవడం. ఇదే సత్సాంగత్యం. ఇదే జీవితాన్ని ఆనందమయం చేస్తుంది. భక్తి, ఆధ్యాత్మిక రంగాల్లో వ్యాపార ధోరణులు పెరిగిపోతున్నాయనే విమర్శలు పెరుగుతున్నాయి. నిజమే. బయట ప్రపంచంలో వ్యాపార ధోరణులు పెరిగిపోతున్నాయి... మనం ఏది కోరుకుంటే ఎదుటి వారు అదే ఇస్తారు. స్వామీజీల ఆర్భాటాలు, ఆడంబరాలు భక్తుల ప్రమేయం లేకుండానే జరుగుతున్నాయంటారా? అంటే ధర్మంగా ఎవరు ఏపని చేసినా దాన్ని ఆహ్వానించాల్సిందే.



భక్తి, ఆధ్యాత్మిక రంగాల్లో ఆడంబరం విషయానికి వస్తే మన జన్మ సంస్కారాన్ని అనుసరించి అది ఒకొక్కరికి ఒక్కో విధంగా కనిపిస్తుంది.

భక్తి, ఆధ్యాత్మిక రంగాల్లో ఆడంబరం విషయానికి వస్తే మన జన్మ సంస్కారాన్ని అనుసరించి అది ఒకొక్కరికి ఒక్కో విధంగా కనిపిస్తుంది. కొందరు సంగీత ఝరిలో తాదాత్మ్యం పొందితే, మరి కొందరు నృత్యం చేస్తూ తన్మయం చెందుతారు. చిన్మయానంద ఎన్నో సార్లు నృత్యం చేసేవారు. ఆర్కిటెక్చర్ నుంచి స్వామిని దాకా మీ ప్రస్థానం చెప్పాల్సి వస్తే చిన్మయానంద స్వామిని కలుసుకోవడంతో నా జీవితం కొత్తమలుపు తిరిగింది. కొన్ని అలా జరిగిపోతాయి అంతే... వాటికి కారణాలు ఏవీ ఉండవు. నిరంతర జ్ఞానాన్వేషణ... విద్యాబోధ..... సత్సాంగత్యం.... జీవితానికి ఇంతకంటే ఏం కావాలి?

– ఏప్రిల్ 21, 2006



**అమెరికాలోని ఫిజిక్స్ ప్రొఫెసర్ గారి అబ్బాయి ఆయన. బయో ఇన్ఫర్మాటిక్స్‌లో డిగ్రీ చేశారు. విలాసవంతమైన జీవితం, డాలర్లు కురిపించే ఉద్యోగాలపై ఆయన మనసు నిలవలేదు. అమెరికా వదిలేసి వేదభూమి భారతదేశం చేరారు బ్రహ్మచారి లూక్. జగ్గీవాసుదేవ్‌ను కలిశారు. బోధనలు విన్నారు. గ్రామీణ భారతానికి ఆధ్యాత్మిక పరిమళాలు అందించాలనే సద్గురు యజ్ఞంలో ఆయన భాగస్వామి అయ్యారు. ఆయన ఆధ్యాత్మిక ప్రస్థానం.**



# జ్ఞాన శిఖరం భారతీయ తత్వం

ఆరేళ్ల క్రితం మా నాన్నగారు పత్రికలో ప్రకటన చూసి అమెరికాలోని ఒహాయోలో జగ్గీవాసుదేవ్ నిర్వహించిన ఓ శిక్షణ శిబిరంలో పాల్గొన్నారు. ఆ తరువాత నన్ను, మా అమ్మగారిని ఆ శిబిరంలో చేర్చారు. మా తాతగారి రోజుల నుంచి మా కుటుంబానికి యోగాతో అనుబంధం ఉన్నది. భారతీయ ఆధ్యాత్మిక చింతన, జగ్గీవాసుదేవ్ బోధనలు అనిర్వచనీయమైన అనుభూతి కలిగించాయి. కొద్దిరోజుల తరువాత ఇండియా వచ్చాను. కోయంబత్తూర్‌లోని జగ్గీవాసుదేవ్ ఆశ్రమంలో ఉన్నాను. గురూజీ బోధనలు ఆలకించాను. ఆయనతో రెండు వారాల పాటు హిమాలయాల్లో పర్యటించాను. అది నాలో ఆధ్యాత్మిక చింతనకు బీజం వేసింది. ఆరు వారాలు ఉండి తిరిగి అమెరికా వెళ్లిపోయాను. ఉద్యోగరీత్యా మా తండ్రిగారు జర్మనీకి వెళ్లడంతో నేను అక్కడే డిగ్రీ చదువుకున్నాను. జర్మనీలో ఉన్నా.. తిరిగి అమెరికా వచ్చినా నా మనసు అక్కడ లేదు. నేను జగ్గీవాసుదేవ్ ఆశ్రమానికి వెళుతున్నానని ఇంట్లో చెప్పాను. నా తల్లిదండ్రులు ఆవేదన చెందారు. ఓ సోదరి, ఇద్దరు సోదరులు దిగ్భ్రాంతికి లోనయ్యారు. రెండేళ్ల క్రితం కోయంబత్తూర్ వచ్చేశాను. చిన్నతనంలో చర్చికి వెళ్లేవాడిని. ఆ తరువాత ఇంట్లో వాళ్లతో కలిసి యోగసాధన చేసే వాడిని. అమెరికా, జర్మనీ దేశాలు చూశాను. అక్కడ డబ్బు ఉంది... కానీ ప్రశాంతత లేదు. అక్కడి వాళ్ల జీవితాలకు గమ్యం లేదు. వారి గురించి వారు ఆలోచించుకునే తీరికలేదు. వస్తువ్యామోహం కారణంగా

**జగ్గీవాసుదేవ్ బోధనలు అనిర్వచనీయమైన అనుభూతి కలిగించాయి. కోయంబత్తూర్‌లోని ఆయన ఆశ్రమంలో ఉన్నాను. గురూజీ బోధనలు ఆలకించాను. ఆయనతో రెండు వారాల పాటు హిమాలయాల్లో పర్యటించాను. అది నాలో ఆధ్యాత్మిక చింతనకు బీజం వేసింది.**

వేల సంవత్సరాలుగా వెలుగులు చిమ్ము తున్న భారతీయ తత్త్వచింతన అద్భుతం అనిపించింది.

జీవితాలు నిస్సారంగా మారిపోయాయి. వేల సంవత్సరాలుగా వెలుగులు చిమ్ముతున్న భారతీయ తత్త్వచింతన అద్భుతం అని పించింది. ఇవన్నీ కాదు. నా గురించి నేను తెలుసుకోవాలి. నలు గురికీ వారి గురించి వారు తెలుసుకొనేలా తోడ్పడాలి. అదే లక్ష్యం. అందుకే భారతదేశం వచ్చాను. కర్ణాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్‌లో గ్రామీణ ప్రాంతాలు తిరిగాను. యోగలో శిక్షణ ఇస్తున్నాను.

వేదాలు, ఉపనిషత్తుల్లో నిష్ణాతులం కావాలంటే చాలా సమయం కావాలి. గురువు తోడ్పాటు ఉంటే వాటి లోతులు త్వరగానే తెలుస్తాయి. వేదాలు... ఉపనిషత్తులు మహనీయుల దివ్యానుభవం నుంచి వచ్చినివే. వారి అనుభవాన్ని తప్పనిస రిగా చదవాల్సిందే. కానీ గ్రంథాల్లోనే సర్వస్వం ఉండదు. ఉత్తమ గ్రంథాలు మార్గదర్శనం చేస్తాయంతే. ఆ తరువాత మన జిజ్ఞాస, సాధన, ఆత్మజ్ఞానసముపార్జనకు తోడ్పడుతుంది. భార తదేశానికి వస్తున్నప్పుడు కొన్ని ఆలోచనలతో వస్తారు.. రెండే ళ్లుగా ఇక్కడ ఉంటున్నారు. ఇప్పుడు ఈ వేదభూమి గురించి మీ ఆలోచనలు ఎలా ఉన్నాయని ఎవరైనా ప్రశ్నిస్తే... నా సమాధానం ఒక్కటే. వేల సంవత్సరాల అద్భుత ఆధ్యాత్మిక సంపద ఉన్న దేశం ఇది. ఎందరో మహనీయులు తమ తత్త్వ సంపదను ఈ దేశానికి అందించారు... మార్గదర్శకంగా నిలి చారు. ఆ మార్గాన్ని అనుసరించి జీవితాలను సుసంపన్నం చేసు కోవడంలో భారతీయులు తగిన శ్రద్ధ చూపడం లేదేమో అనిపి స్తున్నది. వస్తువ్యామోహంలో పడి తమ గురించి తాము ఆలో చించుకోలేక పాశ్చాత్యులు కష్టాలు పడుతున్నారు. గొప్పయో గులు పుట్టిన ఈ దేశానికి ఆ స్థితి రాకూడదు. అందుకే గ్రామీణ భారతంలో ఆధ్యాత్మిక చైతన్యం తీసుకు వచ్చే మహాయజ్ఞాన్ని సద్గురు జగ్గీ వాసుదేవ్ ప్రారంభించారు. అది నన్ను ఎంతగానో ఆకర్షించింది. ఆ యజ్ఞంలో నేను కూడా పాలుపంచుకుంటు న్నాను. యోగా శిబిరాలు ఏర్పాటు చేస్తున్నాం. గ్రామీణ ప్రాంతాల్లో విద్య, వైద్య సదుపాయాలు ఏర్పాటు చేస్తున్నాం. సునామీ వంటి విపత్తులు సంభవించినప్పుడు కష్టాల్లో వారి చెంత నిలుస్తున్నాం. నా జీవితంలో ఇలాంటి పనులు చేస్తానని నేను ఊహించలేదు. కష్టంలో ఉన్న వారిని ఆదుకుంటున్న ప్పుడు... నాకు తెలిసిన నాలుగు విషయాలు వారితోటి పంచు కుంటున్నప్పుడు ఎంతో సంతృప్తి కలుగుతున్నది.

వస్తువ్యామోహంలో పడి తమ గురించి తాము ఆలోచించుకో లేక పాశ్చాత్యులు కష్టాలు పడుతున్నారు.

చాలా దేశాల్లో యోగాను ఓ వ్యాయామంగా భావిస్తారు. అంతకంటే దురదృష్టం మరొకటి లేదు. యోగా అనేది ఓ అద్భుత మానసిక స్థితి.

పాశ్చాత్య దేశాల్లోకూడా యోగ పట్ల ఆసక్తి పెరుగుతున్నది.. అయితే వారు ఆశించిన ఫలితాలు సాధిస్తున్నారా అంటే చాలా దేశాల్లో యోగాను ఓ వ్యాయామంగా భావిస్తారు. అంతకంటే దురదృష్టం మరొకటి లేదు. యోగా అనేది ఓ అద్భుత మానసిక స్థితి. శారీరకంగా, మానసికంగా ఆనందానుభూతికి అది మనల్ని సిద్ధం చేస్తుంది. శారీరక స్వస్థత విషయానికి వస్తే వారం రోజుల యోగసాధనతో దీర్ఘకాలిక వ్యాధులు నయం అయిన సందర్భాలు ఎన్నో చూశాను. వ్యక్తిగత సాధనను అనుసరించి మానసికంగా అద్భుతాలు చేసి చూపుతుంది యోగ. చిన్నారులకు యోగలో శిక్షణ ఇవ్వడం వల్ల చాలా ప్రయోజనం ఉంది. బాల్యం నుంచి ఈ ధోరణి అలవడాల్సిన అవసరం ఉంది. వీలుంటే యోగను పాఠ్యాంశంగా చేర్చడం వల్ల ఎన్నో ప్రయోజనాలు ఉంటాయి. తన గురించి తాను తెలుసుకొనే మార్గాన్ని బోధించకుండా ఎన్ని విషయాలు చెప్పినా ఏం ప్రయోజనం?

నా గురించి నేను తెలుసుకోవడం.. ఈ అన్వేషణలో నేను తెలుసుకున్న దాన్ని నలుగురితో పంచుకోవడం నా లక్ష్యం.

నా గురించి నేను తెలుసుకోవడం.. ఈ అన్వేషణలో నేను తెలుసుకున్న దాన్ని నలుగురితో పంచుకోవడం నా లక్ష్యం. ఆధ్యాత్మిక మార్గానికి నన్ను నేను సమర్పించుకున్నాను. భారతీయలకు తత్వ సంపద ఉన్నది. అయితే ఎందరో కష్టాల్లో ఉన్నారు. వారికి చేతనైన సాయం చేస్తూ, ఆధ్యాత్మిక సుగంధాలు పంచేందుకు కృషి చేయడమే నా ప్రస్తుత లక్ష్యం. తల్లిదండ్రులను వదిలేసి ఆధ్యాత్మిక మార్గం పట్టారు. వారి పరిస్థితి ఏమిటని అడిగితే జవాబు నా దగ్గర ఉంది. నా సోదరులు ఉన్నారు... పైగా అక్కడ స్వతంత్ర జీవితం ఉంటుంది. గత ఏడాది మా నాన్నగారు ఇక్కడకు వచ్చారు. నన్ను చూసిన తరువాత ఆయన కళ్లలో ఆనందమే తప్ప బాధ కనిపించలేదు... భారతదేశంలో ఆధ్యాత్మిక జీవితం గడపడం నిజంగా నా పూర్వజన్మ సుకృతమే.

– మే 5, 2006





**వాల్మీకి రామాయణం యధాతథానువాదంతో పాటు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు భాషల్లో శతాధిక గ్రంథాలు రచించారు ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు. భాష, అలంకార శాస్త్రాల్లో ఉద్దండపండితునిగా పేరుగడించిన ఆయన పలు భాషల్లో విశేషంగా పరిశోధనలు చేశారు. భారతదేశంలోనే అతి కొద్దిమందికి దక్కిన మహామహో పాధ్యా పీఠాన్ని అధిరోహించారు. పద్మశ్రీ పుల్లెల శ్రీరామ చంద్రుడి భక్తి, ఆధ్యాత్మిక భావ వీచిక ఇది.**

# సన్మార్గంలో నడిపించే దైవారాధన

నువ్వు చేసిన తప్పునకు తగిన శిక్ష విధించగలిగే న్యాయాధీశులు ఈ లోకంలో ఎక్కడపడితే అక్కడే ఉన్నారు. కానీ నీ సత్కార్యాలకు తగిన ప్రతిఫలం ఇవ్వగలిగే దొరలు పుట్ట లేదు. నీవు చేసే ప్రతిపనికి తగిన ప్రతిఫలాన్ని అందించే అధికారం ఉన్నవాడు ఆ పరమాత్ముడు ఒక్కడే. మనిషి కోసమే భగవంతుడు ఈ ప్రపంచాన్ని నిర్మించాడని కొందరి అభిప్రాయం. సమస్త చరాచర జీవరాశికి ఈ నేలపై మనిషితో సమానమైన అధికారం ఉందంటుంది హిందూమతం. సమస్త వస్తుకోటిని సమభావంతో చూడడం ఇందులోని గొప్పదనం. దీనికి పునాదులు కర్మ సిద్ధాంతంలో ఉన్నాయి. నేను కర్మ సిద్ధాంతాన్ని పూర్తిగా నమ్ముతాను. సత్కర్మలకు సత్ఫలితాన్ని, దుష్కర్మలకు దుష్ఫలితాన్ని భగవంతుడే ఇస్తాడని అంగీకరిస్తాను. సత్కర్మాచరణకు ఆయన సహాయపడతాడు. 'యంహి రక్షతు మిచ్ఛంతి బుద్ధ్యా సంయోజయంతి తం' – ఎవరినైతే తాను రక్షించదలుచుకున్నాడో వాడికి మంచి బుద్ధినిస్తానని భగవానుడు స్వయంగా చెప్పాడు. ఆ మంచి బుద్ధి వాడిచేత సత్కర్మలను చేయిస్తుంది. అదే సాయుజ్య సాధకమవుతుంది. 1927లో తూర్పుగోదావరి జిల్లా ఇందుపల్లిలో జన్మించాను. హైస్కూల్‌లో సంస్కృత పండితునిగా మొదలైన నా ఉద్యోగ ప్రయాణం లెక్చరర్, రీడర్, ప్రొఫెసర్‌గా, సంస్కృత అకాడమీ డైరెక్టర్ వరకు సాగింది. 1991 వరకు అనేక గౌరవ పదవుల్లో కొనసాగాను. ప్రస్తుతం సంస్కృత భాషా ప్రచార సమితికి కులపతిగా

**'యంహి రక్షతు మిచ్ఛంతి బుద్ధ్యా సంయోజయంతి తం' – ఎవరినైతే తాను రక్షించదలుచుకున్నాడో వాడికి మంచి బుద్ధి నిస్తానని భగవానుడు స్వయంగా చెప్పాడు. ఆ మంచి బుద్ధి వాడిచేత సత్కర్మలను చేయిస్తుంది. అదే సాయుజ్య సాధకమవుతుంది.**

ఉన్నాను. శతాధిక గ్రంథాలు రచించాను. ఆ పరమాత్మ శక్తి ఇచ్చినంత వరకు ఈ జ్ఞానయజ్ఞాన్ని కొనసాగిస్తాను.

యజ్ఞం అంటే పూజించడం అని లౌకిక అర్థం చెప్పుకోవచ్చు. పత్రం, పుష్పం, ఫలం, తోయం ఏదైనా నిష్కామంగా అర్పిస్తే చాలు. నాకు ఆడంబరాలతో నిమిత్తం లేదన్నాడు భగవంతుడు. ధనవంతుడు చేసే లక్షపత్రి పూజకు సంతృప్తి పడనివాడు ఒక్కొక్కప్పుడు పేదవాడు పోసిన చెంబెడు నీళ్లకు సంబరపడిపోతాడు. ఇక ధ్యానం, యోగం రెండూ చిత్తవృత్తి నిరోధకాలు. చంచలమైన మనసుపై అదుపునకు ధ్యానం, యోగం ఉపకరిస్తాయి. కాగా మూడోది తపస్సు. తాను చేయవలసిన పనిని శ్రద్ధాపూర్వకంగా చేయడమే తపస్సు. ఇంద్రియ నిగ్రహాన్ని సాధించడమే తపస్సు పరమార్థం.

ఇంద్రియాలకు అతీతమైనది, స్వభావతః ఏ శక్తి సమస్త సృష్టిని, అందులోని మనందరినీ నియంత్రిస్తోందో దాన్ని సర్వదా స్మరించుకోవడమే భక్తిలో ప్రథమ లక్షణం... ఇదే భక్తి నిర్వచనం. మతం ఏదైనా, కొలిచే పద్ధతి ఏదైనా మనం భగవంతుడ్ని సర్వశక్తిమంతుడు, అపార తేజోమయుడుగా భావించి ఆరాధిస్తాం. భగవదారాధన వల్ల ఆయన తేజస్సు, మహాశక్తిలో కొంత భాగం మనకు దక్కుతుంది. అదే మనిషిని సన్మార్గంలో నడిపిస్తుంది. రాగద్వేషాలతో నిండిన హృదయానికి మానవత్వాన్ని, క్రమంగా ఆ మనిషిలో దైవత్వాన్ని కూడా అదే నింపుతుంది.

ధ్యానం, యోగం రెండూ చిత్తవృత్తి నిరోధకాలు. చంచలమైన మనసుపై అదుపుకు ధ్యానం, యోగం ఉపకరిస్తాయి.

ప్రాచీనమైన వేదాలు, స్మృతులు మానవులకు ధర్మాలను, నీతిసూత్రాలను బోధిస్తాయి. అవే ధర్మసూత్రాలను రామాయణం కథా రూపంలో మరింత బలంగా చెప్పింది.

అయనం అంటే మార్గం లేదా దారి. రామాయణం అంటే రాముడు నడిచిన దారి. ఉత్తమ మానవుడైన శ్రీరాముడు చూపిన మార్గం మానవులందరికీ ఆదర్శం. ఉత్తమ మానవుల ధర్మాలను తెలిపే కావ్యం రామాయణం. రామాయణం కంటే ప్రాచీనమైన వేదాలు, స్మృతులు మానవులకు ధర్మాలను, నీతిసూత్రాలను బోధిస్తాయి. అవే ధర్మసూత్రాలను రామాయణం కథారూపంలో మరింత బలంగా చెప్పింది. ఆ బలమే రామాయణాన్ని ఆచంద్రతారార్కం మహోన్నతంగా నిలిపి ఉంచుతున్నది. శ్రీరాముడు పరిపూర్ణ మానవుడు. రామాయణం ప్రారంభ శ్లోకంలో వాల్మీకి 'మానవులలోకెల్లా అత్యుత్తమ ధర్మం కలిగిన మానవుడెవరు?' అని నారదుడ్ని ప్రశ్నిస్తాడు. అప్పుడు నారదుడు ఆయనకు చూపించిన ఉత్తమ మానవుడే

శ్రీరాముని ఆదర్శ పురుష లక్షణాలను పదేపదే మననం చేసుకోవడం వల్ల మనకు ఆ లక్షణ సాధన సాధ్యమవు తుంది.

శ్రీరాముడు. ఆయన ఆచరించి చూపినవన్నీ అందరూ ఆచరించే గలిగే సామాన్య ధర్మాలే. పితృవాక్య పరిపాలన, సోదర ప్రేమ, శరణాగతుల్ని రక్షించడం వంటి శ్రీరాముని ఉత్తమ గుణాలన్నీ అందరు మానవులు అనుసరించదగ్గవే. మరి అటువంటి మానవుడు దేవుడెలా అయ్యాడు అనే ప్రశ్నకు చక్కని సమాధానం భగవద్గీతలో ఉంది. సమస్త విశ్వంలో నేనున్నాను అని చెబుతూ భగవానుడు 'లోకంలో ఏదైనా ఒక అసామాన్యమైన విషయం కనిపిస్తే అది నా తేజస్సు వల్ల అక్కడ ఉంది' అనిచెప్పాడు. ఆ దైవికమైన తేజస్సు తనలో ఉన్నందువల్లే శ్రీరాముడు దేవుడయ్యాడు. అదీకాకుండా ముందుగానే అనుకున్నట్లు శ్రీరాముని ఆదర్శ పురుష లక్షణాలను పదేపదే మననం చేసుకోవడం వల్ల మనకు ఆ లక్షణ సాధన సాధ్యమవుతుంది. 'ఏకం సద్విప్రాః బహుధా వదన్తి' –శాశ్వతమైన సత్యం ఒకే ఒక్కటి. సమస్త చరాచర ప్రపంచాన్ని సృష్టించి, దీనిని తన ఇచ్ఛానుసారంగా నడిపిస్తున్న జగద్రష్ట ఒకే ఒక్కడు. ఆయనను రకరకాల పేర్లతో పిలుస్తూ, అనేక రకాలుగా కొలుస్తాం అంతే. ఆ రాముడే నా ఆరాధ్యదైవం. ఆయనతో పాటు మా ఇంట్లో అందరు దేవుళ్లనీ పూజిస్తాం. ఎవరికి నమస్కరించినా అది దక్కేది ఒక్కరికే అని నా నమ్మకం. నేను భగవంతుని నీడలోనే ఉన్నాను.... నన్ను ఆయనే నడుపుతున్నాడు ఈ సత్యం నాకు ఎప్పుడూ మరుపునకు రాదు.

ఇంట్లో అందరు దేవుళ్లనీ పూజిస్తాం. ఎవరికి నమస్కరిం చినా అది దక్కేది ఒక్కరికే అని నా నమ్మకం.

– మే 12, 2006



**నటరాజు పాదసుమరజాలైన నృత్యరీతులకి, ఆలోచనా మృతమైన సాహిత్యానికి, కర్ణపేయమైన సంగీతానికి ఆయన చిత్రాలు చిరునామాలు. తెలుగు సంస్కృతి, సంప్రదాయాలకు దుశ్శాలువా కప్పి చేసిన సత్కారాలు. భావుకత, రసాత్మకత, తాత్విక చింతనలో కళాతపస్వి కె. విశ్వనాథ్ సృష్టించిన చిత్రాలు దృశ్యకవ్యాలు. అజరామరాలు. అద్వైత సిద్ధికి, అమరత్వ లబ్దికి లలితకళలే సోపానాలని నమ్మే ఆయన తత్వగానామృత పానం చేద్దాం.**



# ఆధ్యాత్మిక మార్గంతోనే శాంతి

మనిషి అశాంతితో పుట్టాడనుకుంటాను. అలజడి, అశాంతి, ఒత్తిడి తొలికాలం నుంచి ఉన్నాయి. కాకపోతే మన జీవనశైలిలో వస్తున్న మార్పుల వల్ల అవి మరికాస్త పెరిగాయంతే. వీటన్నింటి నుంచి తప్పించుకునేందుకు, ప్రశాంతతను సాధించుకునేందుకు, శాంతి ఆనందాలను పొందేందుకు అప్పటి నుంచి ఇప్పటివరకు మనిషికి దొరికినది ఆధ్యాత్మిక మార్గమే. అదే అత్యుత్తమమైనది. కేవలం ప్రశాంతత పొందడానికి అయితే మరో మార్గం ఏదీ పనికిరాదా? ఆధ్యాత్మికతే ఎందుకు అనే సందేహం రావచ్చు. ఎందుకు అనే ప్రశ్న వేయడం చాలా సులభం. కానీ అన్నింటికీ సమాధానాలు తెలుసుకోగలగడం కష్టం. హృదయగతమైనవి, స్వీయానుభవంతో గానీ బోధపడని వాటిని యధాతథంగానే స్వీకరించాలి కానీ తర్కాలకు దిగకూడదు. భగవంతుని ఉనికి, ఆయనపై విశ్వాసం గురించి తర్కించడం వల్ల ఏ ప్రయోజనమూ ఉండదు. నీవున్నట్టు నేనుండను. నాలా మరొకరు ఉండరు. కోట్లాది జీవరాశుల్లో ఏ ఒక్కటీ రూప గుణాల్లో మరోదాన్ని పోలి ఉండదు. నేలపై జీవుల ఉత్పత్తి, వాటి మనుగడ మొదలు అనేక సృష్టి రహస్యాలు ఇంకా మనిషికి అర్థం కాకుండానే మిగిలిపోయాయి. వీటన్నింటినీ క్రమబద్ధంగా నడిపిస్తున్న శక్తి ఏదో ఉందని విశ్వసించక తప్పదు. అశాంతితో నిండిన మనసుకు ఆ శక్తి మాత్రమే ప్రశాంతతను ఇస్తుందనే విశ్వాసంలోనూ తప్పులేదు. దానిని శూన్యం నుంచి ఆరాధించలేం కాబట్టి దానికో పేరు, రూపం... అదే భగవంతుడు.

**ప్రశాంతతను, శాంతిని, ఆనందాన్ని పొందడం మినహా మనిషికి కావలసింది ఏదీ లేదు. అది సాధించడానికి ఒక్కొక్కరూ ఒక్కో మార్గం ఎంచుకుంటారు. కాని అన్ని మార్గాల్లో ఆధ్యాత్మిక మార్గమే ఉత్తమమైనది.**

అనేక సృష్టి రహస్యాలు ఇంకా మనిషికి అర్థం కాకుండానే మిగిలిపో యాయి. వీటన్నింటినీ క్రమబద్ధంగా నడిపి స్తున్న శక్తి ఏదో ఉందని విశ్వసించక తప్పదు.

శైవసంప్రదాయ కుటుంబంలో 1930 ఫిబ్రవరి 19వ తేదీన విజయవాడలో జన్మించాను. మా పూర్వీకుల నుంచి శివారాధన చేస్తున్నాం. నేను కూడా మా పెద్దలను అనుసరిస్తున్నాను. అంత మాత్రం చేత శివుడే గొప్పదేవుడు అని నేను చెప్పను. వైష్ణవాల యాలనూ సందర్శిస్తాను. చర్చి, మసీదు, గురుద్వారాలు వెళ్లిన సందర్భాలెన్నో ఉన్నాయి. దేవుని ఏకత్వాన్ని అంగీకరిస్తాను. నిజ మైన భక్తికి కొలబద్ద ఏమిటి? అని కొందరు అడుగుతారు. ఆప్ర శ్నలోనే సమాధానం ఉంది. నీ భక్తికి నీ హృదయమే కొలమానం. నిజమైన భక్తి అనగానే దొంగభక్తి ఉంటుందని తెలిసిపోతోంది కదా... ఇతరులెరుగకున్న ఈశ్వరుడెరుగడా? విమానం ఎక్కిన వాళ్లందరికీ ఎయిర్‌హోస్టెస్ నమస్కారం చేసి స్వాగతం చెబు తుంది. అది ఆమె వృత్తిధర్మం. అటువంటి నమస్కారాలు చేసే అలవాటు మనలో చాలామందికి ఉంది. నమస్కారం హృదయ పూర్తిగా చేయాలి. ఎక్కడికి వెళ్లి ఏం చూసినా, దైవదర్శనమో, సత్పురుషుల దర్శనమో చేసినప్పుడు ఆ పవిత్రతను హృదయం లో నిలుపుకోగలగాలి. అక్కడ తెలుసుకున్న మంచివిషయాలను ఆచరణలో పెట్టగలగాలి. అదే నీ యాత్రకు పరిపూర్ణత. కాశీలో ఉన్నా, మన గోదావరి ఒడ్డున నిల్చున్నా నాకు ఒకేలాంటి ప్రశాం తత లభిస్తుంది. ప్రశాంతత కోసం తీర్థయాత్రలు చేయాల్సిన అవసరం లేదు. అంతకంటే పవిత్రమైనది, ప్రశాంతతనిచ్చే చోటు బహుశా మన పక్కవీదిలోనే ఉంటే మనం ఉదాసీనంగా వదిలేసి ఉండవచ్చు. సకల చరాచర జగత్తును సృష్టించిన భగవంతుడు తన సృష్టిలో ఎక్కడా అందవిహీనతను నింపలేదు. అణువ ణువూ పవిత్రతనే నిలిపాడు. కొన్నిచోట్ల మనిషే ఆ పవిత్రతను భగ్నం చేశాడు. మరికొన్నింటికి రెట్టింపు అందాలు సమకూర్చి పెట్టాడు. అందుకే చూసే చూపులోనే అంతా ఉందనిపిస్తుంది.

నీ భక్తికి నీ హృద యమే కొలమానం. నిజమైన భక్తి అనగానే దొంగభక్తి ఉంటుందని తెలిసిపోతోంది కదా... ఇతరులెరుగకున్న ఈశ్వరుడెరుగడా?

---

నా చిత్రాల్లో పౌరాణిక ఇతివృత్తాలు పాటలుగా ఉంటాయి. త్యాగరాజ కృతులో, క్షేత్రయ్య పదాలో పాటలకు పల్లవులుగా ఉంటాయి. జననీజన్మభూమిలో ఈ పాట చూడండి...

**ఘల్లు ఘల్లున కాళ్ల గజ్జెలందెలు మ్రోయ**
**కలహంస నడకల కలికీ ఎక్కడికే**
**జటలోన గంగను ధరియించి ఉన్నట్టి**
**జగములేలే సాంబశివుని సన్నిధికే**

పనిపాటలన్నింటిలో దైవధ్యానానికి చోటు కల్పించడం మన సంస్కృతిలో గొప్పదనం. నా చిత్రాల విషయంలో నేను ఇదే

సూత్రాన్ని పాటించాను. అయితే కావాలని ఇరికించడం సాధ్యపడదు. పాత్ర ఔచిత్యము, సందర్భ శుద్ధి రెండూ కావాలి. ఉదాత్తమైన పాత్ర ఉదాత్తమైన గీతాన్నే పాడటంలో రసభంగం ఏదీ ఉండదు కదా! అలాంటి గీతాలే జనరంజకాలు అయ్యాయి. ఆ పాటే ఎందుకు అంటూ కొందరు ప్రశ్నించేవాళ్లు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ శిష్యులైన వేదుల భరతశర్మ శంకరాభరణం ప్రస్తావన తెస్తూ ఓ సభలో ఇలా అడిగారు నన్ను. 'శంకరశాస్త్రి, తులసి పాత్రల అనుబంధంలోని పవిత్రతను సూచిస్తూ తామరాకుపై నీటిబొట్టును చూపించడం, మానససంచరరే పాటలో శంకరశాస్త్రిని తంబురలా పడుకోబెట్టడం, మాణిక్య వీణాం పాట సన్నివేశంలో శుభసూచకంగా ఆవు పృష్ఠభాగాన్ని చూపించడం ఇలా ఇవన్నీ కావాలనే చేశారు కదూ!' అని. నిజానికి నేనవన్నీ ముందుగా ఇలా అనుకుని చేసినవి కావు. అలా తీయాలనిపించింది తీశానంతే అని చెప్పాను. బహుశా నేను పుట్టి పెరిగిన వాతావరణం నుంచే నాకు ఈ విద్య అబ్బిందనుకుంటాను.

కాశీలో ఉన్నా, మన గోదావరి ఒడ్డున నిల్చునా నాకు ఒకేలాంటి ప్రశాంతత లభిస్తుంది. ప్రశాంతత కోసం తీర్థయాత్రలు చేయాల్సిన అవసరం లేదు.

యువతలో అవసరానికి మించిన హేతువాదం పెరిగిపోయింది. ఇంటికి రాగానే కాళ్లు కడుక్కో అంటే చాదస్తం అంటారు. ముంగిట్లో ముగ్గుల దగ్గరనుంచి, మడికట్టుకోవడం వరకు మన ఆచార సంప్రదాయాలన్నీ ఏదో ఒకరకంగా ఆరోగ్యపరంగా, సామాజికంగా మేలుచేసేవే. తెలియనప్పుడు అర్థరహితంగా అనిపించినా వాటి అంతరార్థం ఏదో ఒక సందర్భంలో మనకే స్వయంగా తెలియకపోదు. పిల్లలకు చెవులు కుట్టే సంప్రదాయంలో ఆక్యుపంక్చర్ వైద్యవిధానం ఉందని ఇటీవల ఓ ఉత్తరాదికి చెందిన స్వామీజీ చెబితే ఆశ్చర్యపోయాను. ఏమైనా మనకి పొరుగింటి పుల్లకూర రుచి. రేపో ఎల్లుండో అమెరికా వాడొచ్చి నెయిల్ పాలిష్ వద్దు.. గోరింటాకు పెట్టుకోండని చెబితే ఎగబడతాం. ఏ గొప్పకార్యమైనా నేనొక్కణ్ణే సాధించేశానని అనుకోవడం భ్రమే అవుతుంది. ఇంతవరకు ఏ అద్భుతకార్యమైనా ఒక్క చేతిమీదుగా జరిగిందని చరిత్రలో లేదు. అన్నీ సమష్టి కృషి ఫలితాలే. సమాజంలో అందరూ సోదరుల్లా కలిసిమెలిసి ఉంటే ఎంతటి కార్యాన్నైనా సాధించవచ్చు. మనదైన సంస్కృతిని కాపాడుకునేందుకు ఏ ఒక్కరో కృషి చేయడం కాదు... పత్రికలు, ప్రసారమాధ్యమాలు, సమాజంలోని ప్రతి ఒక్కరూ కృషి చేయాలి.

– మే 19, 2006

పనిపాటలన్నింటిలో దైవధ్యానానికి చోటు కల్పించడం మన సంస్కృతిలో గొప్పదనం. నా చిత్రాల విషయంలో నేను ఇదే సూత్రాన్ని పాటించాను.

**ఆనందంగా ఉండటమే అందరి జీవిత లక్ష్యం. అయితే అందుకు మనం ఎంచుకునే మార్గమే ప్రధానం అంటారు హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానంద. సత్సాంగత్యం, జ్ఞానాన్వేషణ, నిరంతనర సాధన ఉన్నప్పుడే జీవితాన్ని సుఖమయం చేసే శాంతిమార్గం కనిపిస్తుంది. కోర్కెల ప్రవాహంలో ఎదురీదేకంటే భగవంతుడి శరణాగతి పొందడంలోనే శాశ్వతానందం లభిస్తుందంటున్నారు స్వామి జ్ఞానదానంద.**



# సన్మార్గమే సత్యమార్గం

'ఈశ్వరః సర్వభూతానాం' అన్నట్లు సమస్త జీవులలో దేవుడున్నాడు. తన నిజరూపాన్ని మరుగుపరిచి అందరినీ భ్రమింపచేస్తున్నాడు. మాయపొరలను ఛేదించుకుని చూస్తే నీలోనే దేవుడు కనిపిస్తాడు. నిప్పును ముట్టుకుంటే కాలుతుంది. మంచుగడ్డ చల్లగా ఉంటుంది. మిగిలిన అనుభూతుల మాదిరిగానే దైవాన్ని కూడా అనుభవంలోకి తెచ్చుకోవచ్చు అని రామకృష్ణ పరమహంస చెబుతుండేవారు. నీలోపలి దైవాన్ని చూడాలనుకుంటే అంతశ్శోధన చేసుకోవాలి.



నీలోపలి దైవాన్ని చూడాలనుకుంటే అంతశ్శోధన చేసుకోవాలి. భగవంతుడంటే పవిత్రత. భగవంతుడంటే ప్రేమ లేదా ఇష్టం. ప్రతి మనిషి తాను ఇష్టపడిన వ్యక్తి లేదా వస్తువును గురించి రోజంతా ఆలోచిస్తాడు. అదే ధ్యాసలో ఉంటాడు. క్రమంగా ఆ వ్యక్తిలోని లక్షణాలను కొన్నింటిని తనవిగా చేసుకుంటాడు.



భగవంతుడంటే పవిత్రత. భగవంతుడంటే ప్రేమ లేదా ఇష్టం. ప్రతి మనిషి తాను ఇష్టపడిన వ్యక్తి లేదా వస్తువును గురించి రోజంతా ఆలోచిస్తాడు. అదే ధ్యాసలో ఉంటాడు. క్రమంగా ఆ వ్యక్తిలోని లక్షణాలను కొన్నింటిని తనవిగా చేసుకుంటాడు. దైవధ్యానం ఈ ప్రయోజనం కోసమే చేయాలి. దైవత్వాన్ని సాధించడానికి ధ్యానాన్ని మించింది లేదు. కానీ మనసు ఊరుకోదు. పరిగెత్తిస్తుంది. ఐహిక సుఖాలలో బందీని చేస్తుంది. అలాగని కోరికలను చంపుకోమని చెప్పడం లేదు. ఆ కోర్కెలను జయించాలని ప్రయత్నించినా ఫలితం ఉండదు. అవి తిరిగి పుడతాయి. వాటికి ఎదురీదే కంటే నీ మనసును క్రమంగా భగవంతునిపైకి మళ్లించడమే మంచిపని. భగవంతునిపై ధ్యాసను మళ్లించుకోవడం ఎలాగో స్వామి వివేకానంద చెప్పారు. నీ గమ్యం ఉత్తర దిక్కున ఉంటే ఇంకా దక్షిణాన్నే ఉండిపోయాను, ఉత్తరానికి చేరలేకపోతున్నానంటూ దుఃఖించడం వల్ల ఏ

ప్రయోజనం ఉండదు. ఉత్తర దిక్కుకు నిరంతరం ప్రయాణం సాగిస్తూ ఉంటే క్రమంగా దక్షిణం దూరమవుతుంది. ఉత్తర దిక్కు దగ్గరపడుతోందనే భావన మొదలవుతుంది. ఇది మని షిలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తుంది. భగవంతుని చేరుకోలే కపోతున్నాని బాధపడుతూ కూర్చునే కంటే నిరంతరం భగవ ధ్యానం వల్ల మనిషి ఆయనకు చేరువగా వెళ్లగలుగుతాడు.

భగవంతుని చేరుకోలే కపోతున్నాని బాధప డుతూ కూర్చునే కంటే నిరంతరం భగ వధ్యానం వల్ల మనిషి ఆయనకు చేరువగా వెళ్లగలుగుతాడు.

ఓ సారి మా అన్నయ్యతో కలిసి రామకృష్ణ మఠానికి వచ్చాను. అక్కడి ప్రశాంత వాతావరణం, స్వాముల బోధనలు, జ్ఞానపిపాస, సేవా దృక్పథం చూసిన తర్వాత వీరి జీవితం బాగుందనిపించింది. చేస్తున్న ఉద్యోగానికి సెలవుపెట్టి 1972లో మఠంలో చేరాను. మూడు నెలలు గడిచింది. ఇదే నా జీవిత గమ్యం అని అర్థమయింది. ఉద్యోగానికి రాజీనామా చేసి బ్రహ్మచర్య దీక్ష తీసుకున్నాను. ఈ జీవితం నేను కోరుకున్నదే. ఈ విషయంలో ఎవరి ప్రేరణా లేదు. మా మఠంలో శని, ఆది వారాల్లో భజన కార్యక్రమాలు నిర్వహిస్తాం. ఓ పోలీసు అధికారి ఆ రెండు రోజులు భార్యను తీసుకువచ్చే వారు. ఆమెను ధ్యాన మందిరంలోకి పంపి ఆయన బయట ఉండిపోయే వారు. నాలుగు వారాలు ఇలా గడిచాయి. ధ్యాన మందిరం నుంచి వస్తున్న భగవన్నామ సంకీర్తన తరంగాలు ఆయన్ను క్రమంగా కమ్ముకోవడం ప్రారంభించాయి. నిలువనీయకుండా చేశాయి. ఐదో వారం నుంచి ఆయన కూడా భజనకు కూర్చోవడం ప్రారం భించారు. 'నా గురించి నేను తెలుసుకోవడానికి, ఆత్మ ప్రక్షాళ నకు, శాంతి సాధనకు భజన పరమౌషధంగా ఉపయోగప డింది' అని ఆయన ముకుళిత హస్తాలతో నాకు చెప్పారు. ఇటు వంటి ఎందరో వ్యక్తుల్ని తరచూ మా మఠంలో చూస్తూనే ఉంటాను. ఇలాంటి సంఘటనలే మేం ఎంచుకున్న మార్గం పట్ల, మా కార్యక్రమాల పట్ల మాకు సంతృప్తిని, ఆత్మవిశ్వా సాన్ని కలిగిస్తాయి. మఠంలో దైనందిన కార్యక్రమాలైన నిరం తర భగవత్ ధ్యానం, సేవా కార్యక్రమాలు, జ్ఞానాన్ని నలుగు రికీ పంచడం, ఆధ్యాత్మిక చర్చలు ఇవన్నీ ఎంతో సంతోషాన్ని కలిగిస్తాయి. అంతిమ లక్ష్యం మాత్రం రామకృష్ణులు, వివేకా నందులు చూపిన బాటలో ఆ భగవంతునికి చేరవ కావడమే.

అంతిమ లక్ష్యం మాత్రం రామకృ ష్ణులు, వివేకానం దులు చూపిన బాటలో ఆ భగవంతు నికి చేరువ కావడమే.

ప్రతి మనిషి ఆశించేది ఆనందంగా ఉండాలని. ఆ ఆనం దాన్ని వెతుకుతున్న చోటును బట్టే అతను అది పొందగలడా

కోరిక ఆనందం కాదు. అది తీరిన ప్పుడు కలిగేదీ ఆనందం కాదు.

లేదా అన్నది ఆధారపడి ఉంటుంది. కోరిక ఆనందం కాదు. అది తీరినప్పుడు కలిగేదీ ఆనందం కాదు. ఏడంతస్తుల మేడను సొంతం చేసుకోవాలని కలలు కన్నవారికి అది తీరాక అంత కంటే పెద్దదైన మరో కోరిక పుడుతుంది. కోరికల వెల్లువ చివ రకు దుఃఖాన్ని మిగులుస్తుంది. నిజమైన ఆనందం భౌతికం కాదని తెలిపోతూనే ఉంది కదా! ఆదిశంకరుల భజగోవిందం ఇలా చెబుతోంది... ప్రతిదినమూ గీతా పారాయణ చేయడం, భగవధ్యానం, సజ్జన సాంగత్యంతో పాటు అవసరంలో ఉన్న వారిని ఆదుకోవడంలోనే మహదానందం చేకూరుస్తాయి. ఒక చెట్టుమీద రెండు పక్షులుండేవిట. ఆ పక్షుల్లో మొదటిది లోకంతో తనకేం నిమిత్తం లేనట్లు ఎప్పుడూ ధ్యానంలో ఉండే దిట. రెండోపక్షి పాపం ఎంతో శ్రమించి ఆహారాన్ని సమకూర్చు కునేది. గూడును నిర్మించుకునేది. అది తెచ్చుకున్న పళ్లల్లో కొన్ని తియ్యవి, కొన్ని చేదుగా ఉండేవి. చెట్టును పండిన పళ్లలో చేదు, తీపి వాటిని ఎంచుకోవడం దానికి ఎప్పటికీ తెలిసింది కాదు. చిట్ట చివరికి విసుగు చెంది అది కూడా తన జతపక్షితో పాటు ధ్యానంలో కూర్చుందట. ఇక్కడ తీపి, చేదు పళ్లంటే మానవ జీవితంలోని సుఖ దుఃఖాలని అర్థం చెప్పాలి. సుఖదుఃఖాల సమాహారమైన జీవనంలో, శాంతికోసం వెతుకులాటలో మాన వుడికి చివరకు శాశ్వత ఆనందాన్నిచ్చేది ఆధ్యాత్మిక మార్గమే అని అర్థమవుతుంది. అది అతనికి అనుభవమే నేర్పాలి. కానీ ఎవరో పని గట్టుకుని బోధిస్తే రాదు అని ఈ ఉపనిషద్ గాథ మనకు చెబుతుంది. ఇటీవలి కాలంలో అన్ని వర్గాల్లో భక్తి, ఆధ్యాత్మిక ధోరణి పెరుగుతోంది. కేవలం ఆధ్యాత్మిక చింతన పెరగడం వల్ల ఏ ప్రయోజనమూ ఉండదు. ఏదో ఒక ప్రయో జనం ఆశించి చేసే జపతపాలతో ముక్తి రాదు. ఇతర జీవులలో లేని బుద్ధి, వివేచనల సాయంతో ఇతరులతో పోలిస్తే నేనెలా మిన్నగా ఉండగలను అని నిరంతరం ఆత్మపరిశీలన చేసు కుంటూ ముందుకు సాగితే ప్రతి ఒక్కరికీ సుఖశాంతులు లభి స్తాయి.

కోరికల వెల్లువ చివరకు దుఃఖాన్ని మిగులుస్తుంది. నిజమైన ఆనందం భౌతికం కాదని తెలి పోతూనే ఉంది కదా!

– మే 26, 2006

**యోగభూమిగా, ప్రశాంతవనంగా పేరుపొందిన శ్రీశైలం లోని నిర్మలత్వం అంతా ఆయన మాటల్లో ధ్వనిస్తుంది. భక్తులకు కొంగుబంగారమైన శ్రీశైల మల్లికార్జునిని సేవలో దశాబ్దాలుగా తరిస్తున్నారాయన. ఆదిశంకరుల వంటి మహనీయులు పరవశించిన మల్లికార్జునుడి సన్నిధిని పెన్నిధిగా భావించిన ఆయనే శ్రీశైల ఆలయ ప్రధానార్చకులు మఠం రాచయ్య స్వామి. మల్లన్న మాహత్మ్యాన్ని, శ్రీశైల సౌందర్యాన్ని, భక్తి ధోరణులపై ఆయన ఇలా వివరించారు.**



# ఈ జీవితం శివసంకల్పం



స్వామిని స్పృశించి, పూజించవచ్చు. ద్వాదశ జ్యోతిర్లింగాలు ఉన్న క్షేత్రాలన్నింటిలో ఈ అవకాశం ఉంది. స్వామిని స్పృశించి... శిరసు వంచి ప్రణమిల్లి, వెలుపలకు వచ్చే భక్తుల కళ్లలో కనిపించే ఆనందం వర్ణనాతీతం. ఆదే శ్రీశైల క్షేత్ర విశేషం.



దేవాలయం తలుపుతీసి, గర్భగుడిలో అడుగుపెట్టగానే ఓంకార నాదం వినిపిస్తూ ఉండేది. ఆకు కదిలినా ఆ చప్పుడు వినిపించేది ఆ రోజుల్లో. శ్రీశైలం అంత ప్రశాంతంగా ఉండేది. ఏవో శబ్దాలు, భక్తుల కోలాహలం....ఆ ఓంకార నాదం ఇప్పుడు వినిపించడం లేదు. నా మనసులో మాత్రం ఆ ఓంకారం ఇప్పటికీ ప్రతిధ్వనిస్తునే ఉంటుంది. మనసు పులకరిస్తునే ఉంటుందన్నారు రాచయ్య స్వామి తన్మయత్వంతో. మిగిలిన ఆలయాల్లో దేవతామూర్తిని గర్భగుడికి వెలుపల ఉండి మాత్రమే దర్శనం చేసుకొనే వీలుంటుంది. శ్రీశైలంలో గర్భగుడిలోకి వెళ్లి స్వామికి శిరసు తాటించి ప్రణమిల్లే అవకాశం ఉంది. దీని ప్రత్యేకత ఏమిటంటే, మల్లికార్జునుడు స్వయంభువుడు. స్వయంభువుడైన స్వామిని స్పృశించి, పూజించవచ్చు. ద్వాదశ జ్యోతిర్లింగాలు ఉన్న క్షేత్రాలన్నింటిలో ఈ అవకాశం ఉంది. స్వామిని స్పృశించి... శిరసు వంచి ప్రణమిల్లి, వెలుపలకు వచ్చే భక్తుల కళ్లలో కనిపించే ఆనందం వర్ణనాతీతం. ఆదే శ్రీశైల క్షేత్ర విశేషం. ఈ క్షేత్రంలో మరో విశేషం కూడా ఉంది. ద్వాదశ జ్యోతిర్లింగాలలో ఒకటైన మల్లికార్జున ఆలయం, అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటైన భ్రమరాంబికా ఆలయాలు ఒకే ప్రాంగణంలో ఉండడం ఈ క్షేత్ర విశిష్టత. అందుకే ఇది శక్తిమంతమైన క్షేత్రంగా ప్రశస్తికెక్కింది. ఆదిశంకరాచార్యులు ఇక్కడ స్వామిని, అమ్మవారిని దర్శించేందుకు వచ్చినప్పుడు ఈ ప్రకృతి శోభకు, స్వామి, అమ్మవార్ల తేజస్సుకు పులకించి, సౌందర్య లహరి వంటి

మల్లికార్జున ఆలయం, అష్టాదశ శక్తిపీఠాల్లో ఒకటైన భ్రమరాంబికా ఆల యాలు ఒకే ప్రాంగ ణంలో ఉండడం ఈ క్షేత్ర విశిష్టత.

అద్భుత స్తోత్రాన్ని రచించారు.

ఓ దశాబ్ది క్రితం వరకు ఇక్కడకు వచ్చే భక్తుల సంఖ్య అంతంత మాత్రంగానే ఉండేది. శ్రీశైలం రావడం కూడా అంత సులభమైన పని కాదు. పూర్వం వంతెన ఉండేది కాదు. మహ బూబ్‌నగర్ జిల్లా మీదుగా వచ్చిన వారు డింగీలో కృష్ణ దాటాల్సి వచ్చేది. అందుకే చాలా మంది భక్తులు కర్నూలు తది తర ప్రాంతాల్లో రైలు దిగి, అక్కడి నుంచి దేవస్థానం బస్సుల్లో వచ్చేవారు. కాలక్రమంలో శ్రీశైలం వచ్చే భక్తుల సంఖ్య బాగా పెరిగింది. భక్తుల్లో ఆధ్యాత్మిక చింతన పెరిగింది... ఈ క్షేత్రంలో వసతులు కూడా బాగా పెరిగాయి. గతంలో ఉన్న ప్రశాంతత శ్రీశైలంలో ప్రస్తుతం లోపించిందా అంటే ప్రస్తుతం వారాం తాల్లో, పండుగలు, పర్వాల సమయంలో రోజూ సుమారు 10 వేల మంది ఈ క్షేత్ర సందర్శనకు వస్తున్నారు. వసతులు ఉన్నాయి కాబట్టే వారంతా స్వామిని సందర్శించుకుని ఆనం దంగా తిరిగి వెళుతున్నారు. ఆ మల్లికార్జునుడు భక్తుల కోర్కెలు తీరుస్తున్నాడు... భక్తులు పరవశంతో వచ్చి స్వామి సందర్శించు కుంటున్నారు... ఇక ప్రశాంతతకు భంగం కలగడం అంటారా.... ఇన్ని వేల మంది భక్తులు వచ్చినప్పుడు అవన్నీ కొంత వరకు సహజమే.

రోజూ సుమారు 10 వేల మంది ఈ క్షేత్ర సందర్శనకు వస్తు న్నారు. వసతులు ఉండబట్టే వారంతా స్వామిని సందర్శించు కుని ఆనందంగా తిరిగి వెళుతున్నారు.

భక్తుల్లో దీక్షా భావం పెంపొందించేందుకు రెండు దశా బ్దాలుగా శివదీక్షలు నిర్వహిస్తున్నాం. ఇక్కడకు వచ్చి శివదీక్ష తీసుకుని నలభై రోజులు లేదా 20 రోజుల పాటు దీక్షతో, నిరం తరం శివ నామ స్మరణతో గడపాలి. ఏటా శివదీక్షలు తీసుకొనే వారి సంఖ్య పెరిగిపోతున్న ది. కార్తీక మాసారంభం నుంచి నలభై రోజులు, శివరాత్రికి 40 రోజుల ముందు నుంచి శివదీ క్షలు తీసుకుంటారు. సొంతానికి వస్తే, రంగారెడ్డి జిల్లా వికారా బాద్‌లో పుట్టి పెరిగాను. తరాలుగా అర్చకత్వ వృత్తికే అంకిత మైన కుటుంబం మాది. మా తండ్రిగారు శంకరస్వామి. గొప్ప సంస్కృత పండితులు. పదేళ్ల పాటు వేదం చదువుకున్నాను. ఆ తరువాత సంస్కృతంలో విశారద చేశాను. అర్చకునిగా ఉద్యోగం రావడంతో సరిగ్గా 30 ఏళ్ల కిందట శ్రీశైలం వచ్చాను. తొలిసారిగా మల్లికార్జునుడి ఆలయంలో ప్రవేశించినప్పుడు ఓ అద్భుతమైన ఆధ్యాత్మిక అనుభూతి కలిగింది. అప్పటి నుంచి ఆ స్వామే నాకు సర్వస్వం. కష్టం వచ్చినా, ఆనందం కలిగినా ఆయ

నతోనే చెప్పుకుంటాను. నా జీవితం ఆయనకే సమర్పించుకున్నాను. ఇక భవిష్యత్తు అంటారా... అది కూడా ఆ మల్లికార్జునుడిదే భారం. నా కుమారుల్లో ఒకరు స్వామి సేవకే అంకితమయ్యాడు. మిగిలినవారు మాత్రం ఉద్యోగాల్లో స్థిరపడ్డారు.

**సరిగ్గా 30 ఏళ్ల కిందట శ్రీశైలం వచ్చాను. తొలిసారిగా మల్లికార్జునుడి ఆలయంలో ప్రవేశించినప్పుడు ఓ అద్భుతమైన ఆధ్యాత్మిక అనుభూతి కలిగింది.**

పాతాళగంగ నుంచి నీరు తెచ్చి, నిత్యం స్వామికి అభిషేకం చేసే సంప్రదాయం ఇప్పటికీ ఉంది. పాతాళగంగ నీరు టూరిజం వారి బోట్లు వదిలే డీజిల్, ఇతర అవశేషాలతో క్రమంగా కలుషితం అవుతున్నాయి... భక్తులు అక్కడ స్నానం చేసేందుకు కూడా ఆలోచిస్తున్నారు, ఆ నీటితో స్వామికి అభిషేకం చేయడం ఎంతవరకు సమంజసం అంటే భక్తుల సంఖ్య, వసతులు పెరిగినప్పుడు వచ్చే సమస్యలివి.... ఆ నీటితో స్వామికి అభిషేకం చేయడం మనసుకు కష్టంగానే ఉంటుంది. నలుగురూ తలుచుకుంటే ఈ సమస్యకు పరిష్కారం కనుక్కోవడం కష్టం కాదు. శ్రీశైలం వస్తేనే మనసు ప్రశాంతం అవుతుంది. యోగభూమి ఇది. గతంలో ఇక్కడ ఎందరో మహనీయులు తపస్సు చేసు కొనేవారు. కాలక్రమంలో వారి సంఖ్య తగ్గింది. కాలానుగుణంగా ఎన్నో మార్పులు వచ్చాయి. ఇటీవల కాలంలో ప్రజల్లో భక్తిభావం పెరిగింది. ఎవరి జీవితానికైనా ఆనందమే పరమావధి. అందుకు భగవదారాధన, ప్రశాంత జీవనమే మార్గం.

**శ్రీశైలం వస్తేనే మనసు ప్రశాంతం అవుతుంది. యోగ భూమి ఇది. గతంలో ఇక్కడ ఎందరో మహనీయులు తపస్సు చేసుకొనేవారు.**

– జూన్ 23, 2006





**తెలుగులో స్మృతి సాహిత్య సృష్టికర్తగా డాక్టర్ రావూరి భరధ్వాజ పొందిన కీర్తి అజరామరం. ఏడో తరగతి మాత్రమే చదువుకున్న ఆయన సాహితీ సృష్టికి విశ్వవిద్యాల యాలు డాక్టరేట్‌లు ఇచ్చాయి. 50 ఏళ్లు దాటే వరకు దేవుడు లేడు అని నమ్మిన ఆయన ఆ తరువాత ప్రతి మంచి మనసులోనూ ఈశ్వరుడు ఉంటాడని గ్రహించారు. అందరూ ఆనందంగా ఉండేలా చూడడమే నిజమైన ఈశ్వ రార్చన అంటున్న రావూరి భరధ్వాజ అంతరంగం.**

# ప్రతి మంచి మనిషీ ఈశ్వరుడే

తెలతెలవారుతుండగా చెరువు గట్టుమీద తచ్చట్లా డుతూ... కాషాయం బట్టలు కట్టుకుని ఓ అపరిచిత వ్యక్తి కనిపించి మాయమయ్యాడనుకుందాం. ఇక ఆ రోజంతా ఊరిలో అతని గురించి చర్చ జరుగుతూనే ఉంటుంది. ఎవ రిష్టం వచ్చినట్లు వాళ్లు చెప్పుకొంటారు. కొందరతన్ని పొరుగుదే శపు గూఢచారి అనుకోవచ్చు. కొందరు మహాయోగి అనుకో వచ్చు. పెళ్లాంతో పోట్లాడి ఆ వైరాగ్యంలో సన్యాసి వేషం కట్టాడ నుకోవచ్చు. దొంగేమో అనుకుని ఆరాలు తీయవచ్చు. సరిగ్గా భగవంతుడు కూడా ఆ అపరిచిత వ్యక్తి లాంటివాడే. ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి కనబడతాడు. ఎలా చూసినవాడికి అలా కనబడతాడు. కొందరు ఆయన్ని ఆలయంలో ఉండే శిలా ప్రతిమ అనుకోవచ్చు. కాదు... అది చండప్రచండ కాంతితేజం... మామూలు మానవుడు ఆ ప్రతాపాన్ని భరించలేడంటూ కొందరు వర్ణించవచ్చు. నాకు మాత్రం దయగల ప్రతి హృద యంలోనూ దేవుడున్నాడనిపిస్తుంది. దయ లేనివాడికి దేవుడు లేడు. దయను కోల్పోనంత వరకు మనిషిలో దైవిక గుణాలన్నీ ఉన్నట్లే అనిపిస్తుంది.



భగవంతుడు ఎవరి సంస్కారాన్ని బట్టి వారికి కనబడతాడు. ఎలా చూసినవాడికి అలా కన బడతాడు. కొందరు ఆయన్ని ఆలయంలో ఉండే శిలాప్రతిమ అను కోవచ్చు. నాకు మాత్రం దయగల ప్రతి హృద యంలోనూ దేవుడున్నా డనిపిస్తుంది.



తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు ఇద్దరు కాంతాలున్నారు. ఒకరు మునిమాణిక్యం వారి కాంతం అయితే రెండోవారు రావూరి వారి కాంతమ్మ. ఆ కాంతం హాస్యపు జల్లులు కురిపిస్తే, ఈ కాంతమ్మ జ్ఞాపకాలు కన్నీరై జారి స్మృతి

సాహిత్యానికి ఆలంబనగా నిలిచింది. నా సతీమణి కాంతమ్మ స్మృతులతో రాసుకున్న డైరీలను 'ఆయినా ఒక ఏకాంతం', 'అంతరంగిణి' 'నాలోని నీవు' వంటి పుస్తకాల రూపంలో ప్రచురించడం ద్వారా తెలుగులో స్మృతిసాహిత్యాన్ని వెలువరించాను. నాది గుంటూరు జిల్లా తాడికొండ. 1927లో జన్మించాను. మొట్టమొదట పరమ నాస్తికుడిని. కాంతమ్మ గారు దండం పెట్టుకో అయ్యా అంటే పెట్టుకున్నాను కానీ నాలో భక్తి లేదు. తిరుపతి తీసుకువెళ్లమని ఆమె కోరినప్పుడు తన వెంట విహారానికి వెళ్లినట్లే వెళ్లాను. జీవితంలో దాదాపు ఏభై ఏళ్లపాటు దేవుడు లేడు. కానీ ఆ తరువాత ఆస్తికునిగా మారాను. రాత్రి మేలుకుని చదువుకుంటే కిరసనాయిల్ దుబారా చేస్తున్నానని నాన్న తిట్టిన రోజులవి. మా పొలంలో మేమే కూలిపని చేసుకునే దుస్థితి. చిరిగిన బట్టలు కట్టుకుని స్కూల్‌కి వెళ్లానని మా హెడ్మాస్టారు కొట్టారు. అందుకే ఎనిమిదో తరగతిలోనే చదువు మానేశాను. అంతే.... విద్యార్థిగా మళ్లీ ఏ పాఠశాలలోనూ అడుగుపెట్టలేదు. రెండుపూటలా తిండికోసమే పదహారేళ్లకే రెండో ప్రపంచ యుద్ధకాలంలో మిలటరీలో చేరాను. ఇంకా రకరకాల పనులు చేశాను. మొదట్నుంచీ నేను మొండివాణ్ణే. ఆ మొండితనమే నా చేత స్కూల్ మాన్పించింది.... మళ్లీ పుస్తకం పట్టించింది కూడా! వారినీ వీరినీ అడిగి పుస్తకాలు సంపాదించి కసిగా చదివాను. బతుకు దారిలో ఎన్నో అవరోధాలు. చదువు మాత్రం విడిచిపెట్టలేదు. సాహిత్యం వంటబట్టింది. పద్యంతో మొదలైన రచనా ప్రస్థానం కథల దారిలోకి మళ్లింది. కొత్త బతుకు తెరువులు చూపించింది. రాజీపడని మనస్తత్వం ఎన్నో ఉద్యోగాలు మాన్పించింది. 'పాకుడురాయి' లాంటి సినిమారంగం మోసాలకు గురిచేసింది. చివరకు ఆకాశవాణిలో స్థిరపడ్డాను. ఎన్నో కష్టాలు. ఏ కష్టంలోనూ ఏనాడూ దైవాన్ని నమ్ముకోలేదు. పైపెచ్చు విమర్శించేవాణ్ణి... దూషించేవాణ్ణి. కానీ ఏమయ్యింది?

**జీవితంలో దాదాపు ఏభై ఏళ్లపాటు దేవుడు లేడు. కానీ ఆతరువాత ఆస్తికునిగా మారాను.**

**మనిషి జ్ఞానేంద్రియాల ద్వారా తెలుసుకోగలిగిన విజ్ఞానం చాలా పరిమితమైనది. కంటితో చూసింది, చెవులతో విన్నవి మాత్రమే శాశ్వత సత్యాలని అని అనుకోకూడదు.**

---

మనిషి జ్ఞానేంద్రియాల ద్వారా తెలుసుకోగలిగిన విజ్ఞానం చాలా పరిమితమైనది. కంటితో చూసింది, చెవులతో విన్నవి మాత్రమే శాశ్వత సత్యాలని అని అనుకోకూడదు. కళ్లు లేనివాడు సూర్యుడు లేడంటాడు. మామూలు కళ్లకి పరమాణువులు కనిపించవు. అంతమాత్రం చేత అవి లేకుండా పోలేదు కదా! అలాగని అప్పటికి ఉన్న జ్ఞానాన్ని బట్టి అవి లేవు అనుకో

**జీవితం చెప్పినన్ని పాఠాలు, నీతులు, ధర్మాలు పుస్తకాలు చెప్పలేవు. శంకరా చార్య, రమణమహర్షి, వివేకానంద లాంటి వ్యక్తుల్ని తయారుచే యడం సాధ్యం కాదు.**

వడం కూడా తప్పు కాదు. సృష్టిలాగే జ్ఞానం కూడా పరిణామశీలమైనది. లేవు అనుకున్నవి ఉన్నాయి అని నిరూపితమైతే ఒప్పుకోక తప్పదు కదా! మనిషిలోని తాత్త్విక చింతనకు, వేదాంత వైరాగ్యాలకు కారణం అనుభవాలే. విజ్ఞానం మాత్రం కాదు. ఈశ్వర సంకల్పాలన్నీ అనుభవైకవేద్యాలే పుస్తకాల్లో రాసి ఉండవు. జీవితం చెప్పినన్ని పాఠాలు, నీతులు, ధర్మాలు పుస్తకాలు చెప్పలేవు. శంకరాచార్య, రమణమహర్షి, వివేకానంద లాంటి వ్యక్తుల్ని తయారుచేయడం సాధ్యం కాదు కదా! నా మట్టుకు నాకు ఏడో తరగతి మాత్రమే చదివిన నాకు మూడు యూనిర్సిటీలు డాక్టరేట్లను బహుకరించడం, దేశవిదేశాల్లో గౌరవ పురస్కారాలు దక్కడం అబ్బురమనిపిస్తుంది. ఇదంతా నా కృషి వల్లనే జరిగిందనే అమాయకత్వం తొందరగానే వదిలిపోయింది. కష్టాలన్నీ తీరి, సుఖాలు చుట్టుముట్టే వేళ పరమాత్మ తత్త్వం బోధపడింది. మనిషి చేసే ప్రతి సత్కార్యంలోనూ ఈశ్వరుడుంటాడని అర్థం అయింది. నీకు ఏది జరిగితే ఆనందిస్తావో అది ఇతరులకు జరగాలని కోరుకోవడం కంటే మించిన ఈశ్వరార్చన లేదు. ఆధ్యాత్మిక చింతనాస్థాయి లేదు. ఆధ్యాత్మికతకు అది ఆత్మీయత అని అర్థం చెప్పుకోవచ్చు. ఈశ్వరునికి సామీప్యంగా తీసుకువెళ్లి ఆయన ఆత్మీయతను పంచేది ఆధ్యాత్మికత అవుతుంది. భక్తి అందుకు ఉపయోగించే మార్గం మాత్రమే. ఆయన సామీప్యతను అనుభవించే వాడికి ఈ లౌకికమైన పూజాక్రతువులు, తీర్థయాత్రా దర్శనాలతో నిమిత్తం లేదు. మనిషి తనలోని ఈర్ష్య, అసూయ, ద్వేషాలను, కోరికలను, లౌకికమైన సుఖభోగాలను త్యజిస్తూ పోవడమే నిజమైన భగవత్పూజ. విజ్ఞానికే వేదాంతం ఒంటబడుతుందని ఎక్కడా లేదు. హృదయాన్ని కలుషితం చేసుకున్న జ్ఞాని కంటే నిష్కల్మష హృదయం కల అజ్ఞాని ఎక్కువ సంతృప్తిని, సంతోషాన్ని అనుభవిస్తున్నాడు. వందేళ్ల జీవితంలో ఒక్క వ్యక్తి కన్నీరైనా నీ చేతితో తుడవగలిగితే నీ జీవితం ధన్యమైనట్లే. ఈశ్వరునితో స్నేహం చేసినట్లే.

**ఈశ్వరునికి సామీప్యంగా తీసుకువెళ్లి ఆయన ఆత్మీయతను పంచేది ఆధ్యాత్మికత అవుతుంది. భక్తి అందుకు ఉపయోగించే మార్గం మాత్రమే.**

– జూన్ 30, 2006



**అభయ వీరాంజనేయ స్వామి పరమభక్తుడాయన. ఆయనకు గుడి కట్టించారు.తన గుండెల నిండా నింపుకున్న ఆ అంజనీసుతుని రూపాన్ని ప్రతి ఒక్కరి గుండెలో నిలపాలని, అందరిలో ఆధ్యాత్మిక సుమాలు వికసింపజేయాలని దశాబ్దాలుగా ఊరూరా తిరుగుతూ ప్రచారం చేస్తున్నారు. ఆయనే గాధిరాజు సత్యనారాయణ రాజు. మహబూబ్‌నగర్‌లో ఆ చుట్టు పక్కల పల్లెల్లో ఆయనంటే తెలియని వారు ఉండరు. ఆయన ఆధ్యాత్మిక ప్రయాణం ఇది.**

# భక్తి నిండిన హృదయం ఆనందధామం

నిత్యం హనుమంతునికి సేవ చేయనిదే నిద్రపట్టదు... ఆ స్వామి భజన చేయనిదే మనసుకు ప్రశాంతత లేదు. ఈ జీవితాన్ని ఆయనకే అంకితం చేశాను. మొదట్లో పౌరోహిత్యం, కలెక్టరేట్‌లో రికార్డ్ అసిస్టెంట్ ఇలా ఎన్నో పనులు చేశాను. సోషలిస్టు నేత లోక్‌నాయక్ జయప్రకాశ్ నారాయణ ఓ సారి పాలమూరు వచ్చినప్పుడు... ఈ పనులన్నీ ఏం చేస్తావ్. ప్రజలకోసం పనిచేయండి అని స్ఫూర్తి నిచ్చారు. అప్పటి నుంచి బుర్రకథలు చెబుతూ సోషలిస్టు పార్టీకి ప్రచారం చేశాను. పాతికేళ్ల పాటు శ్రీ ప్రకాశ నందగిరి స్వామి పాఠశాలను నడిపాను. ఎంతో మంది విద్యాబోధ చేశాను. అప్పటి వరకు సామాజిక సేవలో ఉన్న నేను ఆధ్యాత్మిక రంగంవైపు మళ్లడం కేవలం దైవ సంకల్పమే... ఆ పాండురంగడి లీలా విలాసమే. మా నాన్నగారు ఆర్యసమాజ సేవకుడు. ఆర్య సమాజంలో ఆయన జీవితాంతం పనిచేసి తరించారు. వివిధ పురాణాలు, భాగవతం, రామాయణం, భగవద్గీత, భారతం చెబుతూ ఉండేవారు. నేను ఆధ్యాత్మిక మార్గం పట్టడానికి ఆయనే ప్రేరణ. అభయ వీరహనుమాన్ ఆలయం నిర్మాణానికి కూడా ప్రేరణ మా నాన్న గారే. ఆయన ఉపదేశం వల్లే నేను ఆలయ నిర్మాణానికి పూనుకున్నాను. భక్తి ప్రచార ఉద్యమానికి మూలకారణం పాండురంగ విఠలుడు స్వామి, రుక్మిణి దేవి అమ్మవారు. నేను భక్తి పుస్తకాలు రాయడానికి కూడా వారిరువురే కారణం. నాకు ఈ రచనా శక్తి ఇచ్చింది ఆ అమ్మవారే.



**పాతికేళ్ల పాటు శ్రీ ప్రకాశనందగిరిస్వామి పాఠశాలను నడిపాను. ఎంతో మంది విద్యాబోధ చేశాను. అప్పటి వరకు సామాజిక సేవలో ఉన్న నేను ఆధ్యాత్మిక రంగం వైపు మళ్లడం కేవలం దైవ సంకల్పమే... ఆ పాండురంగడి లీలా విలాసమే.**



నేటి యాంత్రిక జీవనంలో మాట్లాడు కోవడం కూడా గగన మైపోయింది. ఎవరికీ దైవనామస్మరణ చేయాలనే చింతన కూడా లేదు.

బాల్యం నుంచి నాకు ఆంజనేయస్వామి అంటే పరమ భక్తి. నా తండ్రిగారు నాకు ఆంజనేయ మంత్రోపదేశం చేశారు. నాటి నుంచి నేటి వరకు ఆయనే నాకు సర్వస్వం. ప్రజలందరికీ మాన సిక ప్రశాంతత కలిగించేందుకు ఆ స్వామి ఆలయం నిర్మిం చాను. పరమభక్తుడైన ఆంజనేయుని పట్ల అందరిలో భక్తిభావం పెంపొందించే లక్ష్యంతోనే ఆయనపై ఇప్పటికి 15 పుస్తకాలు రాశాను. నేను చేస్తున్న భక్తి ప్రచారం లక్ష్యం కూడా అదే అన్నారు గాధిరాజు. ప్రముఖ వేదపండితులు శ్రీకాళహస్తి విద్యా ప్రకాశనందగిరి స్వామి వారి గీతా యజ్ఞాలు చేసే వారు. వారు పాలమూరుకు గీతా యజ్ఞం కోసం 1958లో వచ్చారు. ఆయన గీతా ప్రవచనం చేస్తుంటే ఆధ్యాత్మిక తన్మయత్వంతో ఊగిపోయే వాణ్ణి. ఆయన ప్రవచనం కంటే ముందుగా నేను భక్తి శ్లోకాలను ప్రారంభ సూచకంగా పాడి వినిపించే వాణ్ణి. ఈ రోజుకూ ఎక్కడ ఆధ్యాత్మిక సమావేశాలైతే అక్కడకు వెళ్లి భక్తి ప్రచారం చేస్తున్నాను. ఆధ్యాత్మిక సమావేశాలే కాదు రోజూ కొంతసేపు నలుగురినీ కలిసి భక్తి, ఆధ్యాత్మిక భావాలను పెంపొందించుకో వాల్సిన అవసరం గురించి చెబుతూ ఉంటాను.

చేసే పట్ల శ్రద్ధ ఉండాలి. పక్కవారి పట్ల కరుణ ఉండాలి. అప్పుడే ప్రశాంతత లభిస్తుంది.

నా భక్తి ప్రచారానికి ప్రజలు నుంచి బ్రహ్మాండమైన స్పందన లభిస్తుంది. నా మాటలను పాటలను శ్రద్ధగా ఆలకిస్తున్నారు. నన్ను ప్రేమగా ఆదరిస్తారు. అధికారులు కూడా నన్ను అభినం దిస్తూ ఉంటారు. నేటి యాంత్రిక జీవనంలో ఒకరికొకరు మాట్లాడుకోవడం కూడా గగనమైంది. ఎవరికీ దైవనామస్మరణ చేయాలనే చింతన కూడా లేదు. ప్రజల్లో భక్తి, ఆధ్యాత్మిక భావ నలు పెరగాల్సిన అవసరం ఉంది. అందుకే నా వంతుగా అభయ వీరహనుమాన్ ఆలయంలో ప్రతిరోజూ భజన, గీతా ప్రవచన కార్యక్రమాలను నిర్వహిస్తున్నాను. అలాగే ప్రతినెలా సుందరకాండ కరపత్రాన్ని విడుదల చేస్తూ అందరికీ పంచిపెడు తున్నాను. ఈ కాలంలో నిజమైన భక్తి భావం పెరగాల్సిన అవ సరం చాలా ఉంది. ప్రజల్లో భక్తి భావన అనేది బాహ్యాడంబరా ల్లో కనిపిస్తుంది. తప్పితే వారి హృదయాంతరాల్లో కనిపించడం లేదు. అంతరంగపు లోతుల్లో భక్తి జ్యోతులు వెలిగితే అదే ముక్తి నిస్తుంది. అద్భుతాలు అవసరంలేదు. భక్తి ఆధ్యాత్మిక భావా లంటే ఏవో అద్భుతాలు చేయాల్సిన పనిలేదు. మనం చేసే పని పట్ల శ్రద్ధ ఉండాలి. పక్కవారి పట్ల కరుణ ఉండాలి. అప్పుడే ప్రశాంతత లభిస్తుంది. మనిషి ప్రశాంత హృదయమే పరమా

త్మ స్థానం. పరమాత్మ స్థానం మనిషిలో ఉంటే ఆ ఇల్లు అష్ట ఐశ్వ ర్యాలతో తులతూగుతుంటుంది. ఏ జీవితానికైనా ఇంతకు మించి కావలసిందేముంది. నేను కలిసిన వారందరికీ నేను చెప్పేది ఇదే.

ప్రజల్లో భక్తి భావన అనేది బాహ్యాడంబరాల్లో కనిపిస్తుంది. తప్పితే వారి హృదయాంతరాల్లో కనిపించడం లేదు.



ఏడు పదుల వయసులో కూడా ఇంత ఉత్సాహంగా, చైతన్యంతో సేవలు అందించడానికి ఆ స్వామి ప్రేరణ ముఖ్య కారణం అయితే కుటుంబ సభ్యుల ప్రోత్సాహం అత్యంత కీలకం. ఏడుగురు సంతానం ఉన్నా మిగిలింది ముగ్గురు ఆడపిల్లలు. నా ప్రతి అడుగులో నా శ్రీమతి మణెమ్మ ప్రోత్సాహం, సహకారం చాలా ఉంది. ఆ పైన అభయాంజనేయుని కరుణ ఉంది. అంజనీసుతుని ఆజ్ఞ ఉన్నంత వరకు ఈ భక్తి ప్రచారం ఆగదు.

– జూలై 7, 2006

మనిషి ప్రశాంత హృదయమే పరమాత్మ స్థానం. పరమాత్మ స్థానం మనిషిలో ఉంటే ఆ ఇల్లు అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతుంటుంది.

## శాంతి మంత్రం

సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు
మా విద్విషావహై
ఓం శాంతి శాంతి శాంతిః

**భావము:** ఆ పరమేష్ఠి మన ఇరువురినీ రక్షించుగాక. మన ఇరువురినీ పురోగతి వైపు నడిపించుగాక. మన ఇరువురికీ శాస్త్ర అధ్యయన శక్తి లభించుగాక. మన అధ్యయనం తేజోవంతం అగుగాక. మన ఇరువురి మధ్యా వాగ్వివాదాలు లేకుండా శాంతి నెలకొనుగాక.



**ఆయన పేరు ముంతాజ్ అలీ. ఉపనిషత్తులంటే ఆయనకు ప్రాణం. వేదాలను ఔపోశన పట్టారు. పురాణాలు, ఇతిహాసాలు ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. భారతీయ వేదాంత ఔన్నత్యాన్ని ప్రచారం చేస్తూ దేశదేశాలు తిరుగుతున్నారు. కేరళలో పుట్టి మదనపల్లిలో సత్సంగ్ ఫౌండేషన్ నిర్వహిస్తున్నారు. వైద సంస్కృతి ఔన్నత్యాన్ని, ఆధ్యాత్మిక ప్రయాణాన్ని ఇలా వివరించారు.**



# భారతీయ వేదాంతం సర్వహితం

భారతీయ వేదాంత ఔన్నత్యం మహాద్భుతం... మనిషిలో వివేచనను మేల్కొలిపి, మార్గదర్శనం చేయించి, ఆనంద పథంలో నడిపించే శక్తి ఒక్క భారతీయ వేదాంతానికే ఉంది. ఎన్నో మార్గాలను పరిశీలించాను.... అనుసరించాను. భారతీయ తత్త్వంలో ఉన్న వివేచన, చర్చించి పరష్కారం కనుగొనే ధోరణి, జీవితాన్ని సార్థకం చేసుకొనేందుకు అవసరమైన స్ఫూర్తి మరే తత్త్వంలోనూ నాకు కనిపించలేదు. ఆధ్యాత్మిక ప్రస్థానంలో నా పేరును శ్రీ ఎం.గా మార్చుకున్నాను.

**భారతీయ తత్త్వంలో ఉన్న వివేచన, చర్చించి పరష్కారం కనుగొనే ధోరణి, జీవితాన్ని సార్థకం చేసుకొనేందుకు అవసరమైన స్ఫూర్తి మరే తత్త్వంలోనూ నాకు కనిపించలేదు.**

భారతీయ వేదాంతంతో తనకు ఎలా పరిచయం కలిగిందంటే కేరళలో పుట్టాను. మా కుటుంబం మొదటి నుంచి సూఫీ తత్త్వాన్ని అనుసరించేది. తొమ్మిదో ఏట నుంచి నాకు ఆధ్యాత్మిక వివేచన ప్రారంభం అయిందని చెప్పాలి. స్కూలు, కాలేజీ చదువుల పట్ల పెద్దగా ఆసక్తి ఉండేది కాదు... పరధ్యానంగా ఉండేవాడిని. తాత్త్విక చర్చ ఎక్కడైనా వినబడితే మాత్రం నా కళ్లు మెరిసేవి. నా ధోరణి చూసి మిత్రులంతా నన్ను ఆటపట్టించే వారు. ఎలాగో డిగ్రీ అయిందనిపించాను. అప్పటికి దశాబ్దికాలంగా నాలో రగులుతున్న ఆలోచన నన్ను స్థిమితంగా ఉండనివ్వలేదు. 19 ఏట ఇల్లు వదిలిపెట్టాను. హిమాలయాలు చేరుకున్నాను. సత్యాన్వేషణ మొదలైంది. ఆ ప్రస్థానంలో ఎన్నో దారులు కనిపించాయి. చివరకు సత్యం ఒకటే అని అర్థమైంది. మతాలు... దారులు వేరు తప్ప సత్యం

ఒకటే . ఈ విషయాన్ని భారతీయ వేదాంతం అద్భుతంగా చెప్పింది. ఆచరణ యోగ్యమైన మార్గదర్శనం నాకు భారతీయ వేదాంతంలోనే కనిపించింది. రుషి అంటే శాస్త్రవేత్త. రుషులు ఎంతో అంతర్మథనం చెంది.... దశాబ్దాల పాటు చర్చించి సత్యా విష్కరణ చేశారు. భారతీయ వేదాంతానికి పట్టుకొమ్మలైన ఉప నిషత్‌ల సారం ఇదే. హిమాలయాల్లో కొన్నేళ్లు గడిపిన తరు వాత అక్కడి నుంచి తిరిగివచ్చాను. ఆధ్యాత్మిక గురువులు ఎందరినో కలిశాను. జిడ్డు కృష్ణమూర్తి ఫౌండేషన్‌లో పనిచే శాను. అప్పుడే నాకు ఆంధ్రప్రదేశ్‌తో అనుబంధం ఏర్పడింది. నేను తెలుసుకున్న సత్యాన్ని నలుగురితో పంచుకోవడం నా కర్త వ్యంగా భావించాను. భగవద్గీత, ఉపనిషత్‌లపై ప్రసంగాలు ఇవ్వడం ప్రారంభించాను. దశాబ్దికాలం క్రితం మదనపల్లి సమీ పంలో సత్సంగ్ ఫౌండేషన్ ఏర్పాటు చేశాను. అక్కడ మూడు పాఠశాలలు నిర్వహిస్తున్నాను.

సత్యాన్వేషణ మొదలైంది. ఆ ప్రస్థానంలో ఎన్నో దారులు కనిపించాయి. చివరకు సత్యం ఒకటే అని అర్థమైంది.

---

మా ఆధ్యాత్మిక గురువులంతా విదేశీ మార్గాలు పట్టి పోతుంటే నేను గ్రామాల బాట పట్టడానికి కారణం ఏమిటనే సందేహం రావచ్చు. కడుపు కాలుతున్న వారికి ఆధ్యాత్మిక విష యాలు చెబితే కర్రపుచ్చుకొని వెంటపడతారు. ఉపాధి లభించా లంటే ఈ రోజుల్లో నాలుగు అక్షరం ముక్కలు రావాలి. తిండి, బట్ట, వైద్య సౌకర్యం అందాలి. ముందుగా వీటిని సమకూర్చేం దుకు ప్రయత్నిస్తున్నాం. గ్రామసీమల్లోని ప్రజలు ఆనందంగా ఉన్నప్పుడు అందరూ ఆనందంగా ఉండగలుగుతారు. ఆందుకే వారిపై దృష్టి సారించాను. ఇక విదేశాలకు వెళ్లి ఆధ్యాత్మిక ప్రచారం చేయడం అంటారా... ఈ కాలంలో అది అనివా ర్యంగా మారింది. అక్కడకు వెళితే డాలర్లు వస్తాయి. ఇక్కడ ఉండి ఆ స్థాయిలో వనరులు సమకూర్చుకోవడం అసాధ్యం. అందుకే భారతీయ తత్త్వం ఇప్పుడు దేశదేశానా విస్తరిస్తున్నది. ఆధ్యాత్మిక జీవనం ఆధ్యాత్మిక గురువు అనగానే కాషాయం, గడ్డాలు.. మీసాలు గుర్తుకు వస్తాయి. అందుకు భిన్నంగా ఎందుకు ఉన్నారని అడిగితే, ఆధ్యాత్మిక జీవనం అనగానే అన్ని సుఖాలు వదిలేసి సన్యాసం తీసుకోవాలి... కాషాయం ధరించా లనే ది కేవలం అపోహ. సాంసారిక జీవితం సాగిస్తూ కూడా ఆధ్యాత్మికంగా ఎదగవచ్చు. మనకు తెలిసిన విషయాలు నలు గురితో పంచుకోవచ్చు. మన ఆహార్యం ఎలా ఉన్నదనేది ముఖ్యం కాదు. మనం ఏం చెబుతున్నాం... ఎదుటి వారు ఎంత

దశాబ్దికాలం క్రితం మదనపల్లి సమీపంలో సత్సంగ్ ఫౌండేషన్ ఏర్పాటు చేశాను. అక్కడ మూడు పాఠశాలలు నిర్వహిస్తున్నాను.

గ్రామసీమల్లోని ప్రజలు ఆనందంగా ఉన్నప్పుడు అందరూ ఆనందంగా ఉండగ లుగుతారు. అందుకే వారిపై దృష్టి సారించాను.

వరకు ప్రభావితం అవుతున్నారనేది ముఖ్యం. ఏటా ఓ నెలరోజులు విదేశాల్లో ఆధ్యాత్మిక ప్రచారం చేస్తాను. మిగిలిన రోజుల్లో మనదేశంలో పర్యటిస్తాను.

కేవలం ప్రసంగాలకు పరిమితం కాకుండా మత సద్భావన కలిగించే లక్ష్యంతో మానవతా మిషన్ ఏర్పాటు చేయాలని సంకల్పించాను. అందరినీ కలుపుకొని త్వరలో కాశ్మీర్ నుంచి కన్యాకుమారి వరకు సద్భావనా యాత్రలు నిర్వహించాలన్నది నా సంకల్పం. ఆధ్యాత్మిక రంగంలో చేస్తున్న కృషి విషయానికి వస్తే విజ్‌డమ్ ఆఫ్ రుషీస్, ది త్రీ ఉపనిషద్స్ అనే గ్రంథాలు రచించారు. వరల్డ్ స్పేస్ రేడియాలో ప్రతి ఆదివారం ఉపనిషత్తులలోని తాత్త్విక అంశాలపై ప్రసంగిస్తున్నాను... దేశం నలుమూలలా ఆధ్యాత్మిక ప్రసంగాలు ఇస్తున్నాను. ఆధునిక జీవనం కారణంగా తలెత్తే సమస్యల నుంచి బయటపడి, ప్రతి ప్రాణి ఆనందంగా జీవించాలంటే కొన్ని వదులుకోవడం అనివార్యం. సంతోషంగా ఉండడమే ప్రతి ప్రాణి జీవిత లక్ష్యం. దాన్ని ఎలా సాధించాలన్నదే సమస్య. సహజీవనం, సత్సాంగత్యం, ఆత్మశోధన, విచారణతత్వం అలవరచుకుంటే ఆనంద మార్గం కనిపిస్తుంది. స్వార్థ చింతనను వదిలేసి, మనకున్న సంపద, జ్ఞానాన్ని నలుగురితో పంచుకోగలిగితే అంతకు మించిన ఆనందం మరొకటి ఉండదు. సంప్రదాయ, ధార్మిక జీవన విధానాన్ని వదులుకోని పక్షంలో ఆనందం అందరి సొంతం అవుతుంది.

సహజీవనం, సత్సాంగత్యం, ఆత్మశోధన, విచారణ తత్వం అలవరచు కుంటే ఆనంద మార్గం కనిపిస్తుంది.

– జూలై 14, 2006



**సంగీతం వాళ్లింట్లో ఉంది. సాహిత్యం తన ఒంట్లో ఉంది. ఖాకీ కట్టుకున్నా ఆయన హృదయం కవిత్వం చెబుతుంది. కళలకు, కరకు ఖాకీకీ లక్షణంగా పొంతన కుదురిందంటే, నిరంతరం పరమాత్మకు చేరువలో ఉన్నామనే అనుభూతికి మించిన ఆధ్యాత్మికత మరొకటి లేదంటున్నారు మాజీ ఐపిఎస్ అధికారి, సాహితీ ప్రియుడు, పోలీస్ శాఖలో అనేక ఉన్నత పదవులు నిర్వహించిన రామ్‌నారాయణ్.**



# దయనిండిన మనసే దేవాలయం

'ఆర్ద్రత నిండిన హృదయమే పరమేశ్వరుని నివాసస్థానం అని నమ్ముతాను నేను.' అందుకు తార్కాణంగా ఈ చిన్ని కథ– 'లోకకల్యాణం కోసం ఎన్నో గొప్ప త్యాగాలు చేసిన మహనీయులకు దేవసభలో సన్మానం జరుగుతోంది. ఎంతోమంది గొప్పగొప్ప వాళ్లందరూ సన్మానాలు అందుకుంటున్నారు. ఇంతలో ఒక అనామకుడు, బికారిని తీసుకుని వచ్చి దైవం సింహాసనంపైన కూర్చోపెట్టాడు. అతడి తలపై వజ్రాలు పొదిగిన కిరీటం పెట్టాడు. ఈ గొప్పవాళ్లంతా ఒక్కసారిగా తిరగబడ్డారు. ఇంతమందిని వదిలిపెట్టి ఒక అనామకుడికి ఎందుకా ఘనసన్మానం అని ప్రశ్నించారు. దైవం ఇలా సమాధానం ఇచ్చాడు... 'ఇతడు తన తోటివారి కష్టాలను చూసి కన్నీరు కార్చాడు. ఒక్కొక్క కన్నీటి బొట్టుకి ఒక్కొక్క వజ్రం చొప్పున ఈ కిరీటం ఇప్పుడితడి శిరస్సుపై ఉంది.'

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ రచించిన మ్రోయు తుమ్మెద నవలా నాయకుడు నారాయణరావు, గత శతాబ్దికి చెందిన ప్రఖ్యాత హిందూస్తానీ సంగీత విద్వాంసులు, న్యాయవాది. ఆయన కుమారుడిని నేను. లెక్చరర్‌గా జీవితాన్ని ప్రారంభించాను. 1977వ సవత్సరంలో ఐపిఎస్‌కు సెలక్ట్ అయ్యాను. అసిస్టెంట్ కమీషనర్‌తో ప్రారంభించి పోలీస్ శాఖలో అనేక ఉన్నత పదవులను నిర్వహించాను. డిఐజి హోదాలో పదవీ విరమణ పొందాను. ఇప్పటికీ నిత్యం కసరత్తు చేస్తాను. ఇది



ఇప్పటికీ నిత్యం కసరత్తు చేస్తాను. ఇది దేహాన్ని ఆరోగ్యంగా ఉంచితే మనసును ఆరోగ్యంగా ఉంచేది సాహిత్యం. సాహిత్యం నా ఆరో ప్రాణం. తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు కవిత్వం చాలా ఇష్టం.



'తపోభూమి అయిన భారతదేశంలో పుట్టిన ప్రతివాడికీ మహర్షుల తపోఫల మైన వేదాంతం ఎంతోకొంత ఒంటబ డుతుంది.

దేహాన్ని ఆరోగ్యంగా ఉంచుతుంది. మనసును ఆరోగ్యంగా ఉంచేది సాహిత్యం. సాహిత్యం నా ఆరోప్రాణం. తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు కవిత్వం చాలా ఇష్టం. ఇదంతా వింటే నా వృత్తికి, ప్రవృత్తికి పొంతన కుదరడం లేదే అనే సందేహం కల గడం సహజం. అందుకు ఒకటే సమాధానం. నాలో విరహం– విరసం' రెండూ ఉన్నాయి!

**'నేనొక మహాభుజగమునై**
**నీ మెడను పెనవేసుకుని**
**విషసిక్తమైన నా కోరలను**
**నీ రుద్రాక్షలతో రాపిడి చేస్తూ**
**ప్రక్షాళన చేసుకుంటున్నాను.**
**ఇప్పుడు విషం నీ గళంలోనే కాదు**
**నీ వక్షస్థలిని కూడా వ్యాపించింది నన్ను మన్నించు'**

రామ్‌నారాయణ్ ఇటీవల వెలువరించిన 'తీర్థం' సంకలనం లోని కవిత ఇది. 'తపోభూమి అయిన భారతదేశంలో పుట్టిన ప్రతివాడికీ మహర్షుల తపోఫలమైన వేదాంతం ఎంతో కొంత ఒంటబడుతుంది. నాకూ అలాగే వచ్చింది. మా నాన్నగారి పాద రజోలేశం నన్ను తాకడం వల్ల సంగీతం అబ్బింది. మహా మహుల పరిచయభాగ్యంతో కవిత్వం చెప్పగలుగుతున్నాను. పోలీస్ ఉద్యోగంలోని బాధ్యతలు కూడా నన్ను భక్తి పథం వైపు కాకుండా ఆధ్యాత్మిక చింతనవైపే పురికొల్పాయి. మూఢవిశ్వా సాలను అంగీకరించను. తీర్థయాత్రలపట్ల ఆసక్తి లేదు. ఆధ్యాత్మి కతలో ఆడంబరాలకు తావులేదు. ప్రశాంతంగా ధ్యానం చేసు కునే తావు మసీదైనా, చర్చి అయినా, దేవాలయమైనా భేదం లేదు. ఏ మత విశ్వాసానికైనా లోకకల్యాణమే పరమావధి కావాలని ఆశిస్తాను.

**మనిషి ఒక్కడే తన చూపులో తెలివి తేటల్ని ప్రదర్శిస్తాడు. కానీ పరమేశ్వర తత్త్వాన్ని దర్శించా లంటే పసితనపు అమాయకత్వం కావాలి.**

'ప్రభూ! నా గుండెల సవ్వడులే నీ అడుగుల చప్పుడులా వినబడుతున్నాయి' అంటాడో ఫార్సీ కవి. రామ్‌నారాయణ్ ఈ కవితను వినిపించినప్పుడు ఒకే ప్రశ్న పుట్టింది.... నిరంతరం పరమాత్మకు చేరువలో ఉన్నామన్న ఆ అనుభూతిని నిలిపి ఉంచేదెలా? 'వేటాడే పులి కళ్లల్లో కూడా ఒకరకమైన అమాయ కత్వం కనిపిస్తుంది. సృష్టిలో ఏ జంతువుకూ లేనివిధంగా మనిషి ఒక్కడే తనచూపులో తెలివి తేటల్ని ప్రదర్శిస్తాడు. కానీ పరమేశ్వర తత్త్వాన్ని దర్శించాలంటే పసితనపు అమాయకత్వం కావాలి. ప్రతి వ్యక్తిలోనూ సున్నితమైన పట్టుదారంలాంటి పసి

తనం ఉంటుంది. దాన్ని చేయిజార్చుకోకూడదు. పసిమనస్సుల నిష్కల్మషత్వంలోనే పరమేశ్వరుడుంటాడు.' సిద్ధిపొందిన యోగుల పనులు పసిపిల్లల చేష్టల్లా ఉంటాయని వింటూ ఉంటాం కదా! అది ఇదే. 'ఆధ్యాత్మిక వికాసాన్ని విజ్ఞానంతో కంటే అమాయకత్వంతోనే సులభంగా సాధించవచ్చు. తానొ కటి తలిస్తే దైవం ఒకటి తలుస్తాడు తరహా వేదాంతం మనకు చిన్నతనంలోనే తెలుసు. వాటిలో ఉన్న వేదాంతమే అత్యున్నత స్థాయిలోని తాత్త్విక చర్చల్లో కూడా ఉంటుంది. దాన్ని మనం ప్రత్యేకంగా తెలుసుకోనక్కరలేదు. నేర్చుకోవలసిందల్లా మనిషి మనిషిలా ప్రవర్తించడం. గుడికి పోవడం కంటే రోగంతో బాధ పడుతున్నవాడిని ఆసుపత్రికి తీసుకుపోవడం గొప్ప పని. అంటే గుడికి పోనక్కరలేనదని కాదు. గుడికెళ్లాలి అని అనుకున్న క్షణం నుంచే నీ ప్రార్థన మొదలైనట్లే.

– జూలై 28, 2006

ప్రతి వ్యక్తిలోనూ సున్నితమైన పట్టు దారంలాంటి పసి తనం ఉంటుంది. దాన్ని చేయి జార్చుకోకూడదు.

నేర్చుకోవలసిందల్లా మనిషి మనిషిలా ప్రవర్తించడం. గుడికి పోవడం కంటే రోగంతో బాధపడుతు న్నవాడిని ఆసుపత్రికి తీసుకుపోవడం గొప్ప పని.

## శాంతి మంత్రం

ఓం శంనో మిత్రః శం వరుణః శంనో భవత్వర్యమా.
శం న ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణు రురుక్రమః
నమో బ్రహ్మణే నమస్తే వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి
తన్మామవతు తద్వక్తారమవతు అవతు మామ్
అవతు వక్తారం
ఓం శాంతి శాంతి శాంతిః

**భావము:** సూర్యభగవానుడు మనకు శుభములు చేకూర్చుగాక. వరుణుడు శుభములు చేకూర్చుగాక. ఇంద్రుడు, బృహస్పతి శుభాశీస్సులు అందించుగాక. ఆ మహావిష్ణువు మనకు శుభాలు కలిగించుగాక. ఆ పరబ్రహ్మకు నమస్సులు. వాయువుకు నమస్సులు. మీరే ప్రత్యక్ష దైవాలు. మీరే ప్రత్యక్ష దైవాలనేది శాశ్వత సత్యం. ఇది పరమ సత్యం. వారంతా మనల్ని రక్షించుగాక. ఆ సద్గురువును రక్షించుగాక. నన్ను రక్షించుగాక.
ఓం శాంతి శాంతి శాంతిః



**గాలి మనకు కనిపించదు. అంతమాత్రాన గాలి లేకుండా ఉండగలమా? భగవంతుడూ అంతే. జ్ఞాననేత్రంతో చూస్తే సర్వాంతర్యామి మన ముందే సాక్షాత్కరిస్తాడు. మనం బాగుండటంతో పాటు పది మంది హితం కోసం కృషి చేయడంలోనే నిజమైన ఆనందం.. భక్తి ఉన్నాయంటారు 500 పైగా చిత్రాల్లో నటించి, పలు చిత్రాలు నిర్మించి, రాజకీయాల్లో సైతం రాణిస్తున్న మురళీమోహన్.**



# సేవాభావమే దైవస్వరూపం



ఎవరి ప్రమేయం లేకుండా ప్రకృతి తన ధర్మాన్ని నిర్వర్తించడమే ఈ ప్రపంచాన్ని ఏదో అద్భుత శక్తి నడిపిస్తున్నది అనేందుకు నిదర్శనం. ఆశక్తికి ఒకొక్కరం ఒక్కో పేరు పెట్టుకుంటున్నాం. ఒక్కోరకంగా పూజిస్తున్నాం.



చికాగోలోని బహాయ్‌లో ఓ అద్భుతమైన ఆలయం ఉంది. అందులో ఏ దేవుని రూపం ఉండదు. సువిశాలమైన ఆలయం.. అంతా నిశ్శబ్దం. అన్ని మతాల వారూ అక్కడకు వస్తారు. మౌనంగా కూర్చొని తమ ఇష్టదైవాన్ని ప్రార్థిస్తూ ఉంటారు. ఆ ఆలయంలో ఎక్కడా హడావుడి కనిపించదు. ప్రతి ఒక్కరి వదనం నిర్మలంగా ఉంటుంది. నిశ్శబ్దమే భగవంతుడు... ఆయన నిరాకారుడు... ఇన్ని రూపాలు... మతాలు మనం కల్పించుకున్నవే. సర్వ సమానత్వాన్ని ప్రబోధిస్తూ, అనంత చైతన్య దీప్తిని వెలిగించే ఆ ఆలయమే నాకు ఆదర్శం. ఎవరి ప్రమేయం లేకుండా ప్రకృతి తన ధర్మాన్ని నిర్వర్తించడమే ఈ ప్రపంచాన్ని ఏదో అద్భుత శక్తి నడిపిస్తున్నది అనేందుకు నిదర్శనం. ఆ శక్తికి ఒకొక్కరం ఒక్కో పేరు పెట్టుకుంటున్నాం. ఒక్కో రకంగా పూజిస్తున్నాం. నన్ను నా తండ్రి అబ్బాయ్ అని, భార్య ఏమండీ అని, మా అబ్బాయి నాన్నగారూ అని. మనవడు తాతా అని పిలుస్తారు నేను ఒక్కడినే. ఈ వరసలన్నీ ఎలా అయితే మనం కల్పించుకున్నామో భగవంతుని రూపాలు కూడా అంతే. ఆ భావన, విశ్వాసమే మనిషిని సన్మార్గంలో నడిపిస్తుంది. నేను ఓ రోజు పుట్టపర్తి సాయిబాబాను దర్శించుకొని వస్తున్నాను. ఓ సైకిల్ అతను కారుకు అడ్డంగా వచ్చాడు. బ్రేక్ వేసినా బంపర్ తగిలింది. అతను కిందపడిపోయాడు. స్పృహ తప్పింది. సాయిని దర్శించుకొని వస్తుంటే ఇలా జరిగిందేంటి? ఏదీ దారి? అని నా మనసు ఆరాటపడుతున్నది. ఊళ్లోవాళ్ళు

గుమికూడారు. వాళ్లలో ఒకవ్యక్తి నా దగ్గరకు వచ్చి, మా సమితి అధ్యక్షుడు ఊళ్లోనే ఉన్నారంటూ ఫోన్ కలిపి ఇచ్చాడు. ఆయన కు ఫోన్ చేస్తే క్షణాల్లో మా దగ్గరకు వచ్చి అంతా చక్కదిద్దారు. ఎవరో తెలియని వ్యక్తి వచ్చి ఆపద నుంచి గట్టెక్కించడం దైవలీల కాక మరేమిటి?

నేను చిన్నతనం నుంచి భగవంతుడిని నమ్మేవాడిని. మాది పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు దగ్గరలోని చాటపర్రు. మా అమ్మగారు రోజూ దేవుడి పద్యాలు చెప్పేవారు. పూజలు, వ్రతాలు చేస్తూ ఉండేవారు. మా ఊరే కాదు ఆ కాలంలో పల్లెలన్నీ భక్తి వాతావరణంతో తొణికిసలాడుతూ ఉండేవి. నా 23వ ఏట... 1963లో విజయవాడ వచ్చి వ్యాపారం ప్రారంభించాను. ఆ సమయంలో నాటకరంగంతో పరిచయం ఏర్పడింది. పదేళ్ల తరువాత తొలిచిత్రం జగమేమాయలో నటించాను. 1975 నుంచి సినిమారంగంలో వెనక్కు తిరిగి చూసుకోవాల్సిన పనిలేకుండా పోయింది. చిన్నతనంలో రోజూ కొద్దిసేపు దేవుడ్ని స్మరించుకొనే వాడిని. నా వయసుతో పాటు భక్తి కూడా పెరుగుతూ వచ్చింది. ప్రస్తుతం సినిమాలు.. వ్యాపార పనులతో బిజీగా ఉన్నా రోజూ ఉదయం ఒక గంటసేపు పూజ చేసుకోనిదే కాలు బయటపెట్టేది లేదు. నా భార్య కూడా అంతే. నిష్ఠగా మండల దీక్ష పూర్తి చేసుకొని మకరజ్యోతి దర్శనానికి వెళుతున్నాను. దీక్ష వల్ల మనసు నిర్మలంగా ఉంటుంది. ఆ స్వామి దర్శనం ఆత్మానందంగా జరుగుతుంది. ఐదారేళ్లుగా శబరిమలలో మకరదర్శనానికి రెండు రోజుల ముందు నుంచి అన్నదానం చేస్తున్నాం. ఐదు నుంచి పది వేల మంది అయ్యప్పలకు మిత్రులతో కలిసి స్వయంగా వండి వడ్డిస్తున్నాం. అక్కడ వసతులు సరిగా ఉండవు. పైగా నిరాహారంగా అంతదూరం నడిచి వచ్చిన వాళ్లకు పట్టెడన్నం పెట్టడం నిజంగా మహద్భాగ్యం. ఆ సమయంలో వారి కళ్లలో కనిపించే ఆనందం అంతా ఇంతా కాదు. నిజమైన దేవుని సేవ అదేనేమో?

రోజూ సాయంత్రం అయ్యే సరికి ఫిల్మ్‌నగర్‌లోని దైవసన్నిధానం ఆలయానికి వెళ్లడం ఈ మధ్య అలవాటుగా మారింది. జగపతి రాజేంద్రప్రసాద్‌గారు ఆ ఆలయానికి జీవితాన్ని అంకితం చేశారు. ఆ ఆలయాన్ని ఎలా అభివృద్ధి చేయాలి... ఎటువంటి కార్యక్రమాలు నిర్వహించాలి అనే విషయాలు మేం

గత **23** ఏళ్లుగా అయ్యప్ప దీక్ష తీసుకుంటున్నాను. నిష్ఠగా మండల దీక్ష పూర్తి చేసుకొని మకరజ్యోతి దర్శనానికి వెళుతున్నాను.

శబరిమలకు నడిచి వచ్చిన వాళ్లకు పట్టెడన్నం పెట్టడం మహద్భాగ్యం. ఆ సమయంలో వారి కళ్లలో కనిపించే ఆనందం అంతా ఇంతా కాదు.

గతంలో పల్లెలలో ఆలయాలు భక్తి, సంప్రదాయాలకు వేదికలుగా ఉండేవి. చాలా ఆలయాలు క్షీణదశకు రావడం బాధాకరం.

చర్చించుకుంటూ ఉంటాం. ఆలయం పనుల్లో పాలుపంచుకోవడం అంతులేని సంతృప్తిని ఇస్తున్నది. ఈ రోజుల్లో పల్లెల్లో కంటే పట్టణాల్లోనే ఆలయాలు కళకళలాడుతున్నాయి. గతంలో పల్లెలలో ఆలయాలు భక్తి, సంప్రదాయాలకు వేదికలుగా ఉండేవి. చాలా ఆలయాలు క్షీణదశకు రావడం బాధాకరం. సంప్రదాయాలను, విశ్వాసాలను ఎంత జాగ్రత్తగా కాపాడుకోవాలో ఆలయాలను కూడా అంతే పదిలంగా రక్షించుకోవాలి. గ్రామప్రజలు నడుం కట్టినప్పుడే ఆలయాలు కళకళలాడతాయి. గతంలో అప్పుడప్పుడూ ఏదో కొద్ది మందికి చదువుకొనేందుకు ఆర్థికంగా సాయం చేసే వాడిని. ఇటీవలే మురళీమోహన్ ఛారిటబుల్ ట్రస్ట్ ఏర్పాటు చేశాం. ఏటా వంద మంది నిరుపేద విద్యార్థుల చదువుకు అవసరమైన నిధులు. నేను ఇంతగా ఎదగడానికి తోడ్పడిన ఈ సమాజానికి ఏదో ఒక మేలు చేయాలనే సంకల్పంతో ఈ విద్యాదానం చేస్తున్నాను. అన్ని జన్మల్లోకెల్లా మానవ జన్మ ఎంతో ఉన్నతమైనదంటారు. ఆ మానవ జన్మ ఇచ్చినందుకు భగవంతుడికి మనం కృతజ్ఞులమై ఉండాలి. మన హితంతో పాటు జనహితం కూడా చూడడమే భగవంతునికి నిజంగా కృతజ్ఞత చూపడం అవుతుందని నా అభిప్రాయం. ఆచార, సంప్రదాయాలు మనిషిలో సత్‌ప్రవర్తనకు తోడ్పడతాయి. మనం ఎవరికైనా మంచి చేస్తే మనకు కూడా మంచి జరుగుతుందని నాకు ఎన్నో అనుభవాలు నేర్పాయి. మనం తప్పు చేస్తే దాని ఫలితం మనల్ని వెంటాడుతునే ఉంటుంది. అందుకే మంచి ఆలోచనలు, పనులు ప్రశాంతమయ జీవితానికి బాటలు వేస్తాయి. ఈ కాలం యువతలో భక్తి ధోరణి తగ్గుతుందని చెప్పలేం. వస్తువాదంతో పాటు భక్తి ఆధ్యాత్మిక ధోరణులు కూడా వారిలో కనిపిస్తున్నాయి. ఏ ఆలయానికైనా వెళ్లి చూడండి.. పెద్దలతో పాటు యువతీ యువకులు కూడా పెద్ద సంఖ్యలో కనిపిస్తారు. ఎన్ని మార్పులు వచ్చినా మనం నిలబెట్టుకుంటున్న భక్తి, ఆధ్యాత్మిక భావాలే భారతీయ సమాజానికి శ్రీరామ రక్ష.

మానవ జన్మ ఎంతో ఉన్నతమైనదంటారు. ఆ మానవ జన్మ ఇచ్చినందుకు భగవంతుడికి మనం కృతజ్ఞులమై ఉండాలి.

– సెప్టెంబర్ 1, 2006





**సనాతన ధర్మం, వేదవిద్యలకు దూరం కావడమే మనం, మనతో పాటు సమాజం ఎదుర్కొంటున్న అనేక అనర్థాలకు మూలకారణం అంటారు డాక్టర్ కోరాడ సుబ్రహ్మణ్యం. వేద వేదాంగాలు చదువుకుని, భాషా శాస్త్రంలో డాక్టరేట్ సాధించి, సెంట్రల్ యూనివర్శిటీ రీడర్‌గా పనిచేస్తున్న ఆయన వేదాంగాలు – దర్శనాలను సులభశైలిలో వివరిస్తూ ఒక సిడి రూపొందించారు. ధర్మమార్గం జీవితాన్ని సార్థకం చేస్తుందంటున్న డాక్టర్ సుబ్రహ్మణ్యం అంతరంగం.**

# సనాతన ధర్మంతో పరిపూర్ణ జీవితం

వేదం ప్రభు సమ్మితం, పురాణం మిత్ర సమ్మితం, కావ్యం కాంతా సమ్మితం అంటారు. వేదాలు ప్రభువులా ఆదేశపూర్వకంగా ఉంటాయి. పురాణాలు మిత్రునిలా మార్గదర్శనం చేస్తాయి. కావ్యాలు అతివల్లా జీవితాన్ని కాంతిమంతం చేస్తాయి. వేదాల్లోని ప్రతి అక్షరం జీవితాన్ని సార్థకం చేసేందుకు ఉద్దేశించినదే. సంస్కృత భాష ఆ వేదాల లోతులు అందుకొనేందుకు తోడ్పడుతుంది. వేద సంస్కృతి, సంస్కృత భాష ఔన్నత్యం అంతటిది. కొన్ని దశాబ్దాల క్రితం వరకు సనాతన ధర్మాన్ని ఆచరిస్తూ అంతా సుఖజీవనం సాగించే వారు. ఈ రోజు సౌకర్యాలు, సంపత్తి పెరిగాయి. అయినా ఏదో వెలితి మనిషిని వెంటాడుతున్నది. ఉన్నదానితో సంతృప్తి చెందడం, సుఖజీవనానికి పనికిరాని పోటీతత్వాన్ని దూరంగా ఉంచడం వేద సంస్కృతి మనకు అందించిన వరం. భాష, శరీరం, మనసు ఈ మూడు ఆరోగ్యంగా ఉంటే మనిషి సుఖంగా ఉంటాడు. సమాజం సుభిక్షంగా ఉంటుంది. ఆధునిక కాలంలో ఈ మూడూ ఆరోగ్యంగా ఉండడం లేదు. కొత్త సంస్కృతుల వ్యామోహంలో పడి మన సంస్కృతికి దూరం అవుతున్నాం. అనర్థాలు కొనితెచ్చుకుంటున్నాం. ప్రజలు దారితప్పుతున్నప్పుడు మార్గదర్శనం చేయాల్సిన ధార్మిక సంస్థలు, ప్రభుత్వాలు మౌనం వహించడం కూడా ఈ అనర్థానికి కారణం.

**భాష, శరీరం, మనసు ఈ మూడు ఆరోగ్యంగా ఉంటే మనిషి సుఖంగా ఉంటాడు. సమాజం సుభిక్షంగా ఉంటుంది. ఆధునిక కాలంలో ఈ మూడూ ఆరోగ్యంగా ఉండడం లేదు. కొత్త సంస్కృతుల వ్యామోహంలో పడి మన సంస్కృతికి దూరం అవుతున్నాం.**

కొంత అనర్థం తరువాత ఇప్పుడు క్రమంగా ప్రజలు వేదవి

శబ్దబ్రహ్మమే పర బ్రహ్మం. నాలుగు మంచి మాటలు వినడం, ఆచరించడం వల్ల వికాసం కలుగుతుంది.

జ్ఞానంపై దృష్టి సారిస్తున్నారు. ముఖ్యంగా యోగవిద్య వెంట పడుతున్నారు. ఇది కచ్చితంగా మంచి పరిణామమే. యోగపితామహుడు పతంజలి శారీరక ఆరోగ్యంతో పాటు మానసిక ఆరోగ్యానికి అధిక ప్రాధాన్యత ఇచ్చారు. మనవాళ్లు ప్రస్తుతం యోగాన్ని శారీరక ఆరోగ్యం తెచ్చిపెట్టేంత వరకే పరిమితం చేస్తున్నారు. మనో వికాసాన్నిచ్చే యోగాన్ని, ధార్మిక జీవనాన్ని ఆశ్రయించాల్సి ఉంది. యోగంతో పాటు పరిణతి కలిగించే సత్సంగాలు విస్తృతంగా జరగాలి. శబ్దబ్రహ్మమే పరబ్రహ్మం. నాలుగు మంచి మాటలు వినడం, ఆచరించడం వల్ల వికాసం కలుగుతుంది. గతంలో ఇది దైనందిన జీవితంలో భాగంగా ఉండేది. నేడు మాత్రం ప్రత్యేకంగా నేర్చుకోవాల్సి వస్తున్నది. ఈ సమయంలో మనందరికీ వేదాంగాలు, దర్శనాల విజ్ఞానం తప్పనిసరి. అందుకే నాకు తెలిసినంత విషయాలను పది మందితో పంచుకుంటాను. అప్పుడప్పుడూ ధార్మిక ఉపన్యాసాలు ఇస్తూ ఉంటాను. అమలాపురం సమీపంలోని ముంగండలో ఓ పీఠం ఉంది. వారి ఆహ్వానం మేరకు గత జూన్‌లో వారం రోజుల పాటు ధార్మిక ప్రసంగాలు చేశాను. వేదాంగాల సారాన్ని సులభశైలిలో వివరించాను. ఆ ప్రసంగాలు మరింత మంది వినేందుకు వీలుగా సి.డి. రూపంలో తీసుకు వస్తున్నాం. త్వరలో విడుదల కానున్న ఆ సిడిలో పురుషార్థాలు, సంస్కృతి–సంప్రదాయాల వంటి 14 రకాల విద్యలు, శిక్ష వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం, కల్పం వంటి వేదాంగాలు, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస, యోగం, సాంఖ్య, న్యాయ, వైశేషికాలతో కూడిన దర్శనాల గురించి సమగ్రంగా వివరించాను. వీటితో పాటు దశశాంతి మంత్రాలను కూడా జోడించాం.

నేను నిత్యం వేదపారాయణ, సంధ్యావందనం చేసుకుంటాను. అలజడి లేకుండా ప్రశాంత జీవితం గడిపేందుకు ప్రయత్నిస్తాను.

---

మాది అమలాపురం సమీపంలోని బెల్లంపూడి గ్రామం. నాన్నగారు ఘనాంతస్వాధ్యాయి. వ్యాకరణ పండితులు. మా ఇంట్లో నిత్యం వేదఘోష వినిపిస్తూ ఉండేది. అడిగిన వారికి నాన్నగారు వేదం చెబుతూ ఉండే వారు. ఆయన దగ్గర కొంత, పడగట్లపల్లిలో భాషాప్రవీణ చేస్తూ అక్కడ గురువుగారి వద్ద మరికొంత వేదం నేర్చుకున్నాను. వేదంతో పాటు జ్యోతిషంతో కూడా పరిచయం ఏర్పడింది. 1982లో మహావాక్య విచారం అనే అంశంపై సంస్కృతంలో డాక్టరేట్ అందుకున్నాను. సుమారు మూడు దశాబ్దాలుగా బోధనా రంగంలో ఉన్నాను.

ఆధునిక ప్రపంచంలో ఉన్నా, నేను నిత్యం వేదపారాయణ, సంధ్యావందనం చేసుకుంటాను. అలజడి లేకుండా ప్రశాంత జీవితం గడిపేందుకు ప్రయత్నిస్తాను. ఇంతవరకు నేను జ్వరం అంటే ఎరుగను. మానసిక ఆరోగ్యం సాధిస్తే శరీర ఆరోగ్యం దానంతట అదే చేకూరుతుందనేది నా స్వానుభవం. వేదకాలంలో ఆలయాలకు వెళ్లే సంప్రదాయం మనకు ఎక్కడా కనిపించదు. ప్రతి ఇల్లూ ఓ ధర్మాచరణ కేంద్రంగా ఉండేది. ప్రతి ఒక్కరూ దేహాన్ని, ఇంటిని దేవాలయంగా భావించే వారు. ఇప్పుడు ఇల్లు, శరీరం కష్టాల్లో పడే సరికి ఆలయాలు కిటకిటలాడిపోతున్నాయి. భగవదారాధన మనలో చింతన పెంచుతుంది. చెడు ఆలోచనలకు దూరంగా ఉంచుతుంది. వ్యక్తికి, సమాజానికి సద్గతిని ప్రసాదిస్తుంది. ఈశ్వరారాధనతో పాటు సనాతన ధర్మాచరణ వల్ల చక్కని సంస్కృతి అలవడుతుంది. జీవితంలో సంతృప్తి సాధించేందుకు తోడ్పడుతుంది. వేదనకు కారణమైన అసంతృప్తిని జయించగలిగితే జీవితం ధన్యం అవుతుంది. సంప్రదాయ జీవనం అనేది బాల్యం నుంచే అలవాటు చేయాలి. కేవలం ఉద్యోగాలకు పనికి వచ్చేది కాకుండా జీవితాన్ని సుసంపన్నం చేసుకొనే విద్య కూడా ఉండాలి. యుజిసి వారు తాజాగా ప్రవృత్తిని సుసంపన్నం చేసే కోర్సులు ప్రవేశపెట్టాల్సిందిగా విశ్వవిద్యాలయాలను కోరారు. ఇది ఎప్పటి నుంచో జరగాల్సిన విషయం. పూర్వం చిన్నతనం నుంచే పెద్దబాల శిక్ష, సుమతీ, దాశరథీ శతకాలు ప్రతి ఒక్కరూ చదువుకొనే వారు. పురాణ గాథలు వినేవారు. అవి చిన్నారుల మనసుల్లో సంస్కార బీజాలు నాటేవి. చక్కని నడవడికకు బాటలు వేసేవి. కానీ నేటి పరిస్థితి వేరు. మన ప్రవర్తనను ప్రభావితం చేసే చదువులు ఈ కాలంలో తక్షణావసరం. అందుకే పాఠశాల స్థాయి నుం చి భగవద్గీత, శతకాలు, ఆయుర్వేదం, యోగం గురించి ప్రాథమిక సూత్రాలను పాఠ్యాంశంగా చేర్చాలి. అవి చిన్నారుల్లో చైతన్య దీప్తి నింపుతాయి. ఆ వెలుగులు చక్కని సమాజానికి బాటలు వేస్తాయి.

– అక్టోబర్ 6, 2006

**వేదకాలంలో ఆలయాలకు వెళ్లే సంప్రదాయం మనకు ఎక్కడా కనిపించదు. ప్రతి ఇల్లూ ఓ ధర్మాచరణ కేంద్రంగా ఉండేది.**

**ఈశ్వరారాధనతో పాటు సనాతన ధర్మాచరణ వల్ల చక్కని సంస్కృతి అలవడుతుంది.**



**ముఖంలో బ్రహ్మతేజస్సు... ఎర్రని పట్టు లుంగీ, ఉత్త రీయం, మెడలో రుద్రాక్షలు, చెదరని చిరునవ్వు.. ఇదీ ఆయన ఆహార్యం. ఆయనే మంత్రాలయ శ్రీ రాఘవేంద్ర స్వామి మఠం పీఠాధిపులు శ్రీ సుశమీంద్ర తీర్థ. ఆధ్యాత్మికతకు ఆధునికతను అద్దుతున్నారాయన. లోకక ల్యాణం కోసం హోమాలు నిర్వహించేందుకు ఉత్తరాధి కారి సుయతీంద్రులతో పాటు భాగ్యనగరానికి వచ్చారు. వారిద్దరి మనోభావ వీచిక.**



# శరణాగతితో సద్గతులు

మనమంతా ఎటో పరుగెడుతున్నాం. ఎవరు ఎంత ఆర్జిం చినా, ఎంత ఉరుకులు పరుగులు తీసినా అందరి గమ్యం ఒకటే. అందరం ఆ పరమాత్మను చేరుకోవాల్సిందే. ఈ విషయాన్ని చాలా మంది మరచిపోతున్నారు. సర్వం కోల్పోక ముందే ప్రతి ఒక్కరూ మేల్కొనాలి. భక్తి, ఆరాధనలతో ఆ పర మాత్మను ఆశ్రయించాలి. వస్తువులు, సిరిసంపదల వెంట కాదు.. భగవంతుని వెంట పరుగులు తీయాలి. ఆయన శరణు కోరాలి. అదే జీవితాన్ని సార్థకం చేస్తుంది. భక్తితో భగవంతుని శరణాగతి కోరితే అన్నీ ఆయనే చూసుకుంటాడు.



**వస్తువులు, సిరిసంప దల వెంట కాదు.. భగవంతుని వెంట పరుగులు తీయాలి. ఆయన శరణు కోరాలి. అదే జీవితాన్ని సార్థకం చేస్తుంది. భక్తితో భగవం తుని శరణాగతి కోరితే అన్నీ ఆయనే చూసు కుంటాడు.**



లోకకల్యాణ కాంక్షతో మూడున్నర శతాబ్దాల క్రితం రాఘ వేంద్రులు ప్రహ్లాదుని అంశగా ఈ భూమిపైకి వచ్చారు. సన్యా సాశ్రమం స్వీకరించి, ప్రజలకు తాత్త్విక, భక్తి సుగంధాలను అందించారు. కర్ణాటకలో పుట్టిన ఆయన కర్నూలు జిల్లాలోని మంత్రాలయంలో మఠం స్థాపించారు. ఎన్నో అద్భుతాలు చేశారు. వందకు పైగా గొప్ప గ్రంథాలు రచించారు. బాల్యంలో రాఘవేంద్రునికి తినేందుకు తిండి లేదు. కానీ ఈ రోజున ఆయన పేరిట రోజూ వేలాది మందికి అన్నదానం జరుగుతు న్నది. దేశ విదేశాల్లో సుమారు 1200 బృందావనాల్లో నిరంతర రాఘవేంద్రనామ పారాయణం జరుగుతున్నది. ఇదంతా రాఘ వేంద్రుని ఆధ్యాత్మిక దార్శనికత ఫలితం. దేవుని శరణు వేడితే మన జీవితంతో పాటు అందరి జీవితాలూ సార్థకం అవుతాయన

డానికి రాఘవేంద్రుని చరితే నిదర్శనం. బృందావనం మధ్వ సంప్రదాయంమధ్వాచార్యుని తరువాత ఆ సంప్రదాయంలో 17వ పీఠాధిపతి రాఘవేంద్రులు. 335 సంవత్సరాల క్రితం ఆయన సశరీరంగా బృందావనస్థులయ్యారు. స్వయం జీవ సమాధినే బృందావనం అంటారు. రాఘవేంద్రుని భక్తులంతా ఈ బృందావనాలనే ఆశ్రయిస్తారు. చనిపోయిన వారిని పూజించడం ఎందుకు అనే సందేహం రావచ్చు. నిరంతర రామనామ జపంతో జీవితాన్ని పునీతం చేసుకున్న మహనీయుల ధార్మిక కిరణాలు మనపై ప్రసరించాలనే ఆకాంక్షతో బృందావనాలను పూజించడం మధ్వ సంప్రదాయం. ఈ సంప్రదాయంలో మరో విశేషం కూడా ఉంది. మహిమాన్వితమైన మూలరామ విగ్రహం నిరంతరం పీఠాధిపతుల చేతిలో ఉంటుంది. అనుక్షణం శ్రీరామ స్పర్శతో, స్మరణలో ఉన్న వారు జనహితం కోసం చేసే సంకల్పం సిద్ధించదంటారా? ప్రజల గుండెల్లో భక్తి సంప్రదాయాలు శాశ్వతంగా నిలిచిపోయేందుకు రాఘవేంద్రస్వామి మఠం నిరంతరం కృషి చేస్తున్నది. 12 సంస్కృత పాఠశాలలను ఏర్పాటు చేసి వందలాది మందికి వేదవేదాంగాలు నేర్పుతున్నాం. దేశవిదేశాల్లో పెద్ద సంఖ్యలో బృందావనాలు ఏర్పాటు చేసి ప్రజలకు భక్తి పరిమళాలను పంచుతున్నాం. అమెరికా వంటి దేశాల్లో బృందావనంలో ఏదైనా ఉత్సవం నిర్వహిస్తే పదివేలమందికి పైగా భక్తులు మఠానికి వచ్చి రాఘవేంద్రుని స్మరించి.. తరిస్తున్నారు. దేశవ్యాప్తంగా విద్వత్ సభలు ఏర్పాటు చేయడంతో పాటు వందలాది మంది పండితులను సత్కరిస్తూ, సంప్రదాయాన్ని పాటించే వారిని ప్రోత్సహిస్తున్నాం అన్నారాయన. భక్తి, ఆధ్యాత్మిక భావాలు మనిషిలో ధర్మ ప్రవృత్తిని పెంపొందిస్తాయని, సమాజ పురోగతికి అదే శ్రీరామరక్ష.

**దేవుని శరణు వేడితే మన జీవితంతో పాటు అందరి జీవితాలూ సార్థకం అవుతాయనడానికి రాఘవేంద్రుని చరితే నిదర్శనం.**

**మహనీయుల ధార్మిక కిరణాలు మనపై ప్రసరించాలనే ఆకాంక్షతో బృందావనాలను పూజించడం మధ్వ సంప్రదాయం.**

మైసూరు సమీపంలోని నంజనగూడు గ్రామంలో జన్మించాను. మా గ్రామానికి చెందిన వారు సుమారు పది మంది రాఘవేంద్ర పీఠాధిపతులు కావడం విశేషం. మైసూరులోని రాఘవేంద్ర స్వామి ఆలయంలో సేవాకార్యక్రమాలు నిర్వహిస్తూ నిరంతరం సాధన చేశాను. గృహస్థ జీవితం గడిపినా ఆ తరువాత ఆసేతు హిమాచలం పర్యటించి, జ్ఞానాన్వేషణ చేశాను. ఆ పైన సన్యాసం స్వీకరించి, రెండు దశాబ్దాల క్రితం పీఠం సారథ్యాన్ని చేపట్టాను. రాఘవేంద్ర స్వామి పీఠం నిర్వహ

భక్తి, ఆధ్యాత్మిక భావాలు మనిషిలో ధర్మ ప్రవృత్తిని పెంపొందిస్తాయి. సమాజ పురోగతికి అవే శ్రీరామరక్ష.

ణలో కొత్త ఒరవడికి శ్రీకారం చుట్టాను. నాకు ముందు 37 మంది మంత్రాలయ పీఠాధిపతులుగా ఉన్నారు. వారందరి కంటే భిన్నంగా మఠం నిర్వహణలో పెను మార్పులు చేప ట్టాను. మఠాన్ని సంప్రదాయ బద్ధంగా నిర్వహిస్తూనే కులమత భేద భావాలకు అతీతంగా తీర్చిదిద్దాను. 102 మృత్తికా బృందా వనాల ప్రతిష్ఠతో పాటు లోకహితం కోసం అసంఖ్యాకంగా యాగాలు నిర్వహించాను. ఆసేతు హిమాచల పర్యంతం ధార్మిక జ్యోతులు వెలిగించడం, రాఘవేంద్రవాణిని ప్రపంచా నికి వినిపించడమే నా జీవిత పరమావధి.

## అతిశయం వీడితేనే సంతృప్తి

**– రాఘవేంద్ర మఠం ఉత్తరాధికారి సుయతీంద్రులు**

మనం ఏమీ చేయడం లేదు. భగవంతుడే మన చేత అన్నీ చేయిస్తున్నాడు. మనమేదో ఘనకార్యాలు చేసేస్తున్నాం అనుకో వడం వల్ల అతిశయం పెరిగి, శిష్టాశ్రయం తగ్గుతున్నది. మన సమాజం ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్యలకు ఇదే మూలకా రణం. మైసూరు సమీపంలోని నంజనగూడు గ్రామంలో జన్మించాను. బెంగుళూరులోని ఓ పాఠశాలలో హెడ్‌మాస్టర్‌గా పనిచేశాను. ఆ తరువాత సన్యాసం స్వీకరించాను. వేదవేదాం గాలు అభ్యసించి మంత్రాలయ పీఠాధిపత్యం చేపట్టాను. భక్తితో భగవంతునికి మనల్ని మనం సమర్పించుకోవడంలోనే అసలైన సంతృప్తి లభిస్తుంది. ఉదాహరణకు చాతుర్మాసంలో బ్రహ్మము హూర్తంలో నదీస్నానం చేసి, భగవంతుని సందర్శించుకొని, సత్పురుషులకు దానధర్మాలు చేయడంలో ఎంతో ఆనందం ఉంటుంది. మనసులోని కల్మషాలన్నీ తొలగిపోయి సాంత్వన లభిస్తుంది. ఈ చాతుర్మాస కాలంలో గంగాదేవి కూడా కావేరీ నదిలో స్నానంచేసి పునీతం అవుతుంది. మానవాళికి సన్మార్గం చూపించడమే పరమావధిగా రాఘవేంద్రులు కృషి చేశారు. ఆయన పరంపరను నిరాటంకంగా కొనసాగిస్తాం.

భక్తితో భగవంతునికి మనల్ని మనం సమర్పించుకోవడంలోనే అసలైన సంతృప్తి లభిస్తుంది.

– అక్టోబర్ 13, 2006



**యేసు క్రీస్తు.. షిరిడీ సాయి పాత్రలు అనగానే మన మనసులో మెదిలేది ఆయన రూపమే. ఆయన నిర్మించి, నటించిన కరుణామయుడు చిత్రం ఓ అద్భుతం. ఆ చిత్రంతో అనంత ఖ్యాతిని ఆర్జించారు విజయచందర్. టంగుటూరి ప్రకాశం పంతులు మనవడైన ఆయన మహనీయుల పాత్రలు పోషించడమే కాదు ఆ తత్త్వాన్ని కూడా పుణికిపుచ్చుకున్నారు. ప్రపంచశాంతి స్థాపనకు ఎన్నో గొప్ప ఆలోచనలు చేస్తున్నారాయన.**



# ఎదుటివారిలో దేవుని చూడు



**చిన్నతనం నుంచే నా ఆలోచనలు కాస్త వేరుగా ఉండేవి. నా ఇద్దరు ముఖ్య స్నేహితులలో ఒకరు క్రిస్టియన్, మరొకరు ముస్లిం. వాళ్లతో కలిసి తినే వాడిని. బ్రాహ్మణుల ఇంట్లో పుట్టి ఇదేం ధోరణి అని కొందరు నోళ్లు నొక్కుకొనే వారు.**



ఆ భగవంతుని విశ్వ వీణకు మనమంతా తంత్రులం. ఆయన ఏం పలికిస్తే అదే పలుకుతాం. ఆయన ఏం ఆదేశిస్తే అదే చెబుతాను... కాకినాడలోని గాంధీనగరం మాది. ఇంట్లో మడి, ఆచారాలు ఉండేవి. తల్లిదండ్రులు భక్తి పరాయణులు. చిన్నతనం నుంచే నా ఆలోచనలు కాస్త వేరుగా ఉండేవి. నా ఇద్దరు ముఖ్య స్నేహితుల్లో ఒకరు క్రిస్టియన్, మరొకరు ముస్లిం. వాళ్లతో కలిసి తినే వాడిని. బ్రాహ్మణుల ఇంట్లో పుట్టి ఇదేం ధోరణి అని కొందరు నోళ్లు నొక్కుకొనే వారు.. నా ధోరణ నాదే. కాకినాడలో ప్రాథమిక విద్య పూర్తయింది. డిగ్రీ మద్రాసులో చదివాను. ఆ తరువాత పలు ప్రభుత్వ ఉద్యోగాలు చేసినా, చిరకాల స్వప్నమైన సినిమా కోసం మద్రాసు చేరాను. 1969లో బుద్ధిమంతుడు సినిమాలో అతిథి పాత్ర ద్వారా సినీరంగ ప్రవేశం చేశాను. మరోప్రపంచంలో అభ్యుదయవాది అయిన జర్నలిస్టు పాత్ర మంచిపేరు తెచ్చిపెట్టింది. మొదటి నుంచి నేను అక్కినేని నాగేశ్వరావుగారి ఏకలవ్య శిష్యుడిని. కె. విశ్వనాథ్ వంటి మహానుభావులు దారి చూపించారు. ఆది నుంచి నాటకరంగంతో పరిచయం ఉంది. దాంతో పాటు నా మేనత్త, ప్రముఖగాయని టంగుటూరి సూర్యకుమారి ద్వారా సినీరంగం పరిచయం అయింది. ఏదో సాధించాలనే తపన. 1974లో మొదలైన కరుణామయుడి సినిమా ఆలోచన నా జీవితాన్ని మలుపు తిప్పింది.

రోజూ ఒక్కడినే రూములో కూర్చొని గంటలతరబడి యేసు గురించి ఆలోచించే వాడిని. ఆయనతోనే మాట్లాడే వాడిని.

కరుణామయుడు సినిమా తీస్తున్నాం అని ప్రెస్‌మీట్‌లో చెప్పగానే అంతకు ముందు ఎం.జి.రామచంద్రన్ ఇదే ప్రయత్నం చేసి విరమించుకున్నారని, ఆ పాత్ర ధరించిన వారికి మంచి జరగలేదని కొందరు వ్యాఖ్యానించారు. అటువంటి భయాలు నాకేమీ లేవని చెప్పడంతో పాటు కరుణామయుడు పూర్తయ్యే వరకు వేరే సినిమాలో నటించనని ప్రకటించాను. అనివార్య కారణాల వల్ల చిత్ర నిర్మాణం ఆగిపోయింది. అప్పటికే యేసు పాత్రలో నేను లీనమైపోయాను. ఎలాగైనా చిత్రం పూర్తి చేయాలనే తపన. నిరంతరం అదే ధ్యాస. ఆ రోజు నుంచి మూడేళ్ల పాటు నానా కష్టాలు పడ్డాను. కనిపించిన వారినందరినీ యేసు చిత్రనిర్మాణం తిరిగి చేపట్టమని అడిగేవాడిని. కొన్నాళ్లకు నాలో నిరాశ ఆవహించింది. 30 రూపాయల అద్దెకు ఒకే రూమ్ ఉన్న ఇంట్లో ఉండే వాడిని. నా పరిస్థితి చూసి ఆ ఇంటి యజమానులే ఇంత వండి పెట్టే వారు. నిరంతరం నా మనసంతా కరుణామయుడి సినిమా చుట్టూనే తిరుగుతూ ఉండేది. యేసుతో మాటలు...ఈ సందర్భంలో మద్రాసులో ఓ ప్రముఖ క్రైస్తవ మతగురువును కలుసుకున్నాను. యేసు గొప్పతనాన్ని ప్రపంచానికి చాటిచెప్పేందుకు నడుం కడితే నా పరిస్థితి ఇలా ఎందుకు తయారైందని కోపంగా ప్రశ్నించాను. కష్టాల్లో ఉన్న వారిని కడతేర్చేందుకే యేసు ఈ భూమి మీదకు వచ్చాడు. అలాంటిది నిన్ను కష్టాల్లో పడేస్తాడా అని ఆయన భరోసా ఇచ్చారు. రోజూ ఒక్కడినే రూములో కూర్చొని గంటలతరబడి యేసు గురించి ఆలోచించే వాడిని. ఆయనతోనే మాట్లాడే వాడిని. నేను నా కష్టాల గురించి చెబుతూ కోపంగా కేకలు వేసే వాడని.. అంతలోనే ఏడ్చే వాడిని. నా అవస్థలన్నీ ఆయన చిరునవ్వుతో గమనిస్తూ ఉండే వాడు. నేను ఏడుస్తుంటే నువ్వు నవ్వుతావా అని గద్దించే వాడిని. ఇలా యేసుతో మాట్లాడడం నాకు అలవాటైపోయింది. ఆయనతో నేను చేసిన పాపాలన్నీ చెప్పుకొనే వాడిని. ఆయన సన్నిధిలోనే నాకు సాంత్వన లభించేది. ఆ మూడేళ్లూ తినీ తినకా, శుష్కించిపోయాను. గడ్డం పెరిగిపోయింది. స్వరం నీరసించింది. నడక నెమ్మదించింది. అలా నా శరీరం శుష్కించిపోతేనే యేసు పాత్రకు సరిపోతుందనుకున్నాడేమే ఆ ప్రభువు. నిజానికి ఆ సంఘర్షణ యేసు పాత్రకు, నా జీవితానికి వన్నెలద్దింది. ఆ తరువాత నేనే స్వయంగా కరుణామయుడు సినిమా నిర్మాణం చేపట్టాను. మళ్లీ అవాంతరాలు. కష్టం వచ్చినప్పుడల్లా యేసుతో మాట్లాడే వాడిని. తెల్లారేసరికి

యేసుగా అడుగడుగునా ప్రజలు నాకు నీరాజనాలు పట్టారు. దేశదేశాల నుంచి ప్రసంగాల కోసం ఆహ్వానాలు అందేవి.

నా కష్టాలు ఎలాగో గట్టెక్కేవి. సినిమా నిర్మాణం పూర్తయింది. 14 భాషల్లో అనువదించాం. యేసుగా అడుగడుగునా ప్రజలు నాకు నీరాజనాలు పట్టారు. దేశదేశాల నుంచి ప్రసంగాల కోసం ఆహ్వానాలు అందేవి. నాకు తోచిన నాలుగు మంచి మాటలు చెప్పే వాడిని. ఆ తరువాత షిర్డి సాయి పాత్ర పోషించాను. ఎన్నో ఆధ్యాత్మిక అనుభవాలు ఎదురయ్యాయి. ఆ పాత్రను మొత్తం ఆకళింపు చేసుకున్నాను. నా ఆహార్యానికి, వాచకానికి ఆ పాత్రలు ఎంతో సరిపోయాయి. నా జీవిత గమన్యాన్ని ఆ పాత్రలు మార్చేశాయి.

ఇతరుల కోసం భగవంతుడ్ని వరం కోరుకో.. సమాజ హితంలోనే స్వహితం ఉందని తెలుసుకుంటే జీవితం శాంతిమయం అవుతుంది.

దైవసమానులుచేసిన తప్పులు చెప్పుకుంటే పోతాయంటారు. నేను ఎప్పుడూ నా గురించి భగవంతుడికి నివేదించుకుంటూ ఉంటాను. ఎదుటి వ్యక్తిలో భగవంతుడ్ని చూడగలిగితే ఈ ప్రపంచం శాంతిసౌధం అవుతుంది. పూర్వం ఎవరికైనా ఉత్తరం రాసే సమయంలో, పెద్దలను పిలిచే సమయంలో దైవ సమానులైన... అని సంబోధించే వాళ్లం. ఎదుటి వారిలో దైవం చూడడం అంటే అదే. అది నీ ఔన్నత్యాన్ని పెంచుతుంది. నీ కోసం కాదు... ఇతరుల కోసం భగవంతుడ్ని వరం కోరుకో.. సమాజ హితంలోనే స్వహితం ఉందని తెలుసుకుంటే జీవితం శాంతిమయం అవుతుంది. ఏసుతో పాటు ఏ దేవుడైనా బోధించేది సేవాభావంతో ఉండమనే. అందుకే కరుణామయుడు పుణ్యక్షేత్రం పేరిట ఓ ప్రాజెక్టు తలపెట్టాను. భాగ్యనగరానికి 40 కిలోమీటర్ల దూరంలో పది ఎకరాల స్థలాన్ని అందుకోసం కేటాయించాను. అక్కడ ఓ చర్చి నిర్మాణం ఇప్పటికే ప్రారంభించాం. షిర్డి సాయి మందిరానికి సన్నాహాలు జరుగుతున్నాయి. ఓ వృద్ధాశ్రమం, అనాధశరణాలయం, మహిళలకు ఉపాధి కల్పించే పథకాలు చేపట్టాలని నా సంకల్పం. ప్రస్తుతానికి నా దృష్టిఅంతా దీనిపైనే. నేను చేయగలిగినంత చేస్తాను. ఎవరైనా ముందుకు వచ్చి సేవా కార్యక్రమాలు చేపడతానంటే స్థలం ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నాను. ఆ పైన ఆ భగవంతుడి దయ.

ఓ వృద్ధాశ్రమం, అనాధశరణా లయం, మహిళలకు ఉపాధి కల్పించే పథకాలు చేపట్టాలని నా సంకల్పం.

– డిసెంబర్ 22, 2006





**దైనందిన విధులను త్రికరణ శుద్ధితో నిర్వర్తించినప్పుడే ఆ అంతర్యామి అనుగ్రహం లభిస్తుంది. అయితే భగవంతుని ధ్యానం, పరహితాలే జీవితాన్ని ఆనంత మయం చేస్తాయి.. జన్మ సార్థకం కావడానికి అవే సోపానాలు అంటున్నారు మైసూరులోని సుప్రసిద్ధ హయగ్రీవ పీఠాధిపతి పరకాల స్వామి. రామానుజ తత్వాన్ని ప్రచారం చేస్తున్న అభినవ వాగీశ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల స్వామి అంతరంగం.**

# త్రికరణ శుద్ధితో జీవితం సార్థకం

జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిం
ఆధారం సర్వ విద్యానాం హయగ్రీవ ముపాస్మహే

సకల విద్యలకు, విజ్ఞానానికి మూలం హయగ్రీవుడు. వేద స్వరూపుడైన హయగ్రీవుడు విధాతకే జ్ఞానబోధ చేశారు. దశావతారాలకు పూర్వం నుంచి దేవతల కైమోడ్పులు అందుకున్న హయగ్రీవుడు మా మూలదైవం.... ఆయన సేవకే ఈ జీవితం అంకితం. మా మఠం తొలుత తిరుపతిలో ఉండేది. మైసూరు మహారాజా వారి ఆహ్వానం మేరకు అక్కడకు వెళ్లాం. దేశవ్యాప్తంగా ఉన్న శాఖల ద్వారా ధర్మ ప్రచారం చేస్తున్నాం. బ్రహ్మ కొలిచిన హయగ్రీవుడు, హయగ్రీవ తత్త్వ విశేషాలు ఇలా ఉన్నాయి. వేదాలకు అధిపతియైన హయగ్రీవుడిని సృష్టికర్త బ్రహ్మదేవుడు జ్ఞాన సాధనకై ఆరాధించాడని ప్రతీతి. మహావిష్ణువు శ్వాస నుంచి వెలువడిన వేదాలను మధుకైటభులనే రాక్షసులు వేదాలు అపహరించుకుపోయి పాతాళలోకంలో దాగారు. దీంతో సృష్టికార్యం నిలిచిపోయింది. బ్రహ్మదేవుడు కలవరపడి ఈ విషయాన్ని విష్ణువుకు తెలిపాడు. ఆ సమయంలో యోగనిద్రలో ఉన్న మహావిష్ణువు మనుష్య దేహం, హయ (గుర్రం) ముఖాన్ని ధరించి, పాతాళలోకానికి వెళ్ళి మధు కైటభులను సంహరించి, వేదాలను తిరిగి బ్రహ్మకు అప్పగించాడు. వేదాలు లేని బ్రహ్మ జ్ఞాన శూన్యుడయ్యాడు. వేదాలను తిరిగితెచ్చిన హయగ్రీవుడు బ్రహ్మకు జ్ఞాన సంపత్తిని కలిగించాడని ప్రతీతి. ఆ సందర్భంలో ఆరాధన కోసం మీ మూర్తిని

**దేవతల కైమోడ్పులు అందుకున్న హయగ్రీవుడు మా మూల దైవం.... ఆయన సేవకే ఈ జీవితం అంకితం. మా మఠం తొలుత తిరుపతిలో ఉండేది. మైసూరు మహారాజా వారి ఆహ్వానం మేరకు అక్కడకు వెళ్లాం. దేశ వ్యాప్తంగా ఉన్న శాఖల ద్వారా ధర్మ ప్రచారం చేస్తున్నాం.**

అనుగ్రహించవలసినదిగా బ్రహ్మ కోరారు. మానవదేహం, హయముఖంతో ఉన్న తన స్వరూపాన్ని ప్రతిమగా బ్రహ్మకు ఇచ్చారాయన. బ్రహ్మ ఆ ప్రతిమను సరస్వతీదేవికి ఇచ్చారు. సరస్వతీదేవి ఆ ప్రతిమను శ్రీభాష్యకారుడైన రామానుజాచార్యులకు ఇచ్చారు. ఆయన హయగ్రీవుని కాశ్మీరులో ప్రతిష్ఠించారు. అప్పటి నుంచి వేదస్వరూపునిగా, జ్ఞానమూర్తిగా హయగ్రీవుడు పూజలందుకుంటున్నారు. ఇదీ హయగ్రీవ తత్వం.

**ఆధునిక జీవితంలో వేదాధ్యయనం లేదా ఆధ్యాత్మిక చింతన సన్నగిల్లుతున్నాయి. సంప్రదాయ జీవనం, భక్తి ప్రపత్తులు కూడా తగ్గుతున్నాయి.**

దశాబ్దాలుగా ఆ స్వామి సేవకు అంకితం కావడం నా అదృష్టం. గత జన్మ సుకృతం. కర్ణాటకలో పుట్టి పెరిగాను. అసలు పేరు శ్రీనివాస. కాఫీబోర్డులో అకౌంట్స్ ఆఫీసర్‌గా పని చేసేవాడిని. చిన్నతనం నుంచి భక్తి, ఆధ్యాత్మిక వాతావరణంలో పెరిగాను. మా కుటుంబం మొత్తం పరకాల మఠం భక్తులు. పరకాల పీఠం 35వ పీఠాధిపతి శ్రీ అభినవ రామానుజులకు నాపై గురి కుదిరింది. సన్యాసం తీసుకోవలసిందిగా ఆజ్ఞాపించారు. లౌకిక జీవితానికి స్వస్తి చెప్పి హయగ్రీవుని సేవ ప్రారంభించాను. దేశమంతా పర్యటించాను. వేదాధ్యయనం చేశాను. 1992లో 36వ పీఠాధిపతిగా బాధ్యతలు స్వీకరించాను. శతాబ్దాలుగా ఈ పీఠాధిపతలు ప్రజలకు భక్తి, ఆధ్యాత్మిక సుగంధాలను పంచుతున్నారు. ఆధునిక జీవితంలో వేదాధ్యయనం లేదా ఆధ్యాత్మిక చింతన సన్నగిల్లుతున్నాయి. సంప్రదాయ జీవనం, భక్తి ప్రపత్తులు కొంతవరకు తగ్గుతున్నాయనే వాస్తవాన్ని కాదనలేం. కాలధర్మ రీత్యా సంప్రదాయ జీవనం కొంతవరకు తగ్గుతున్నా ప్రజల్లో ఆధ్యాత్మిక చింతన, భక్తి ధోరణులు మాత్రం పెరుగుతున్నాయి. వేదాంతం మన జీవన నాదం. సాధుసత్సంగులు చెప్పే వేదాంత విషయాలను అందరూ శ్రద్ధగా ఆలకిస్తున్నారు. ప్రజల్లో వేదవిజ్ఞాన జ్యోతుల్ని వెలిగించి, వారి జీవితాలను సార్థకం చేసుకొనేలా చేయాల్సిన బాధ్యత విజ్ఞులందరిపైనా ఉంది.

**ప్రజల్లో వేదవిజ్ఞాన జ్యోతుల్ని వెలిగించి, వారి జీవితాలను సార్థకం చేసుకొనేలా చేయాల్సిన బాధ్యత విజ్ఞులందరిపైనా ఉంది.**

కర్మ, భక్తి, జ్ఞాన, యోగ మార్గాల్లో దేని ద్వారా అయినా తనను చేరుకోవచ్చునని గీతాచార్యుడు చెప్పాడు. వేదాల సారాన్ని అంతా సులభశైలిలో భగవద్గీతలో చెప్పారు. మనం జీవించడానికి అవసరమైన బాధ్యతలను త్రికరణ శుద్ధితో నిర్వర్తించడం కూడా దైవారాధనే. భక్తి, జ్ఞాన, యోగ మార్గాలను అనుసరించడం అందరికీ సాధ్యం కాకపోవచ్చు. కానీ మనం

చేసే పని పట్ల చిత్తశుద్ధి ఉండాలి. అదే భక్తి. అదే యోగం. వీలు దొరికినప్పుడల్లా భగవత్ చింతనలో గడపాలి. నవవిధ భక్తి మార్గాలలో ఏ మార్గంలో నడిచినా భగవంతుని చేరుకోవచ్చు. అంతఃకరణ శుద్ధితో ఏ మార్గంలో వచ్చినా ఆ భగవంతుడు మనకు చేరువ అవుతాడు. హైందవ సంప్రదాయానికి ప్రతీక లైన దేవాలయాల దుస్థితి చూస్తే ఆవేదన కలుగుతోంది. ఇక్కడే కాదు అన్ని చోట్లా ఆలయాల పరిస్థితి ఇదే విధంగాఉంది. మన సంప్రదాయాలకు, మన ఉనికికి ఆధారం మాత్రమే కాదు. సమాజానికి జీవనాడి వంటి ఆలయాలను, సంప్రదాయాలను పరిరక్షించుకోవాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిపైనా ఉంది. చివ రిగా ఒక్కమాట... వైదిక ధర్మ సూత్రాలన్నీ సమాజహితం కోసం రూపొందించినవే. సమాజహితంలోనే స్వహితం కూడా ఉంటుంది. ధార్మిక, సంప్రదాయ జీవనం, దైవ చింతన ఆనంద మయ జీవితానికి మార్గం చూపుతాయి. నిరంతరం చేయలేకపో యినా మనసా, వాచా, కర్మణా కాసేపయినా ఆ భగవంతుడిని స్మరిస్తే ఈ జన్మ సార్థకం అవుతుంది. భగవన్నామ స్మరణ వల్ల వచ్చే శక్తి, సంకల్ప బలం దైనందిన జీవితంలో సైతం విజయం సాధించేందుకు తోడ్పడతాయి.

– జనవరి 19, 2007

మనం చేసే పని పట్ల చిత్తశుద్ధి ఉండాలి. అదే భక్తి. అదే యోగం. వీలు దొరికి నప్పుడల్లా భగవత్ చింతనలో గడపాలి.

వైదిక ధర్మ సూత్రా లన్నీ సమాజహితం కోసం రూపొందించి నవే. సమాజహితం లోనే స్వహితం కూడా ఉంటుంది.

## శాంతి మంత్రం

పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిశ్యతే
ఓం శాంతి శాంతి శాంతిః

**భావము:** అది సంపూర్ణం. ఇదీ సంపూర్ణం. పూర్ణత్వం నుంచే పరిపూర్ణత వస్తుంది. పరిపూర్ణత్వం నుంచి పూర్ణ త్వాన్ని తీసి వేసినా పరిపూర్ణతే మిగులుతుందనేది ఉప నిషద్ వాక్యం.



**దేవుడు ఎక్కడ ఉన్నాడు... మనకు కనబడడేం అంటే ఏ మాత్రం తడుముకోకుండా దేవుడు నీలోనే.. నీ గుండెల్లోనే ఉన్నాడు, అన్వేషించడం నీ వంతు అంటారాయన. ప్రపంచానికి దారిచూపే శక్తి ఉన్న భారతదేశం జ్ఞానమార్గం వీడి భౌతిక మార్గం వైపు మళ్లడం దురదృష్టకరం అంటారు మహోయోగి సుధాకర్ జీ. నిత్య నీ హృదయంలోకి తొంగిచూసుకుంటే పరమశాంతి లభిస్తుందంటున్నారాయన.**



# ఆత్మావలోకనమే ఆనందమార్గం

దేవుడు ఎక్కడ ఉన్నాడనే ప్రశ్న యుగాలుగా మనిషిని వెంటాడుతున్నది. అనంత కాంతి స్వరూపమే దేవుడు అని అన్ని మతాలూ చెబుతున్నాయి. ఆ కాంతి ఎక్కడ ఉంటుంది? అది విశ్వవ్యాప్తమై ఉంటుంది. ప్రతి అణువులో, ప్రతిజీవిలో ఉంటుంది. మన హృదయంలో ఉంటుంది. ఆ అనంత కాంతిని శోధించి, సాధించేందుకు వేదాలు, ఉపనిషత్తులు చక్కని మార్గదర్శకాలు. వాటి సాయంతో.. నిరంతర అన్వేషణతో స్వస్వరూప జ్ఞానం సాధిస్తే అనంతమైన ఆనందం లభిస్తుంది. వేద విజ్ఞానాన్ని సరళంగా ప్రజలందరికీ అందించి, వారికి స్వస్వరూప జ్ఞానాన్ని అందించాల్సిన పీఠాలు, మఠాలు తదితర ఆధ్యాత్మిక కేంద్రాలు జనాకర్షణ మార్గాన్ని పట్టాయి. అన్ని మతాల్లోనూ ఇదే ధోరణి. వేద వ్యాసుడి కాలం నుంచి కూడా ద్వైత ప్రచారం జరిగింది. దేవుడికి మానవరూపం ఊహించారు. మంచి చెడ్డలు ఆపాదించారు. దేవుడు చెడు ఎలా చేస్తాడు... దీంతో ప్రజలకు ఎటుపోవాలో పాలుపోని పరిస్థితి ఏర్పడింది. దీంతో భగవంతుడికి సంబంధించిన ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలిపోయాయి. వేద సంస్కృతి మహోన్నతంవేద సంస్కృతి అనేది మతాలకు అతీతమైనది. ఎందరో మహనీయులు స్వస్వరూప జ్ఞానాన్ని ఆర్జించి, వాటిని వేదాలు, ఉపనిషత్‌ల రూపంలో ప్రపంచానికి అందించారు. వేదాల్లో చెప్పిన సాంఖ్యాశాస్త్రం ఓ మహాద్భుతం. విశ్వమంతా పరమాణువుల మయం. ప్రతి అణువులో ప్రాణశక్తి ఉంటుంది. ఆ శక్తి అనేక

**వేదాలు, ఉపనిషత్తులు సాయంతో.. నిరంతర అన్వేషణతో స్వస్వరూప జ్ఞానం సాధిస్తే అనంతమైన ఆనందం లభిస్తుంది. స్వస్వరూప జ్ఞానాన్ని అందించాల్సిన పీఠాలు, మఠాలు తదితర ఆధ్యాత్మిక కేంద్రాలు జనాకర్షణ మార్గాన్ని పట్టాయి. అన్ని మతాల్లోనూ ఇదే ధోరణి.**

> ప్రతి అణువులో ప్రాణశక్తి ఉంటుంది. ఆ శక్తి అనేక రూపాల్లో విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. ఈ అనంత విశ్వమే భగవంతుడు.

రూపాల్లో విశ్వమంతా వ్యాపించి ఉంటుంది. ఈ అనంత విశ్వమే భగవంతుడు. అందులోని అణువణువూ, ప్రతి ప్రాణిలో భగవంతుడు ఉంటాడు. వేదాంత సారం ఇదే. వేదకాలంలో దేవుని ప్రస్తావన లేదు. విశ్వరహస్యాల విశ్లేషణ జరిగింది. ఆ తరువాత కాలంలో భగవంతుడిని మనం మనిషి రూపంలో ఊహించుకోవడం మొదలు పెట్టాం. ఆయనకు అనేకానేక పేర్లు పెట్టుకున్నాం. ఆరాధనలు ప్రారంభించాం. ఇవన్నీ కొంతవరకు ఉండాల్సిందే. వీటి ప్రవాహంలో పడి జ్ఞానమార్గాన్ని వీడటం సరికాదు. దురదృష్టవశాత్తు వేల సంవత్సరాలుగా అదే జరుగుతున్నది. అమృత భాండం వంటి వేదవిజ్ఞానానికి నిలయం మన దేశం. అంతటి శక్తిమంతమైన వేదవిజ్ఞానాన్ని మనం సద్వినియోగం చేసుకోలేకపోతున్నాం. వాటి లోతులు తెలుసుకుంటే జీవితం ఆనందమయం అవుతుంది.

> మన గురించి, మన మనోలోకం గురించి ఆలోచించేందుకు కొంత సమయం కూడా కేటాయించం. ఇదే కష్టానికి, వేదనకు, అశాంతికి కారణం.

జాగృత్, స్వప్న, సుషుప్తిమెలకువగా ఉన్నప్పుడు నేను... నాది అనే భావన చుట్టుముడుతుంది. నిద్రలో కూడా నేను అనే భావన సూక్ష్మంగా ఉంటుంది. అదే బ్రహ్మలోకం. అందుకే నిద్ర ఓ అద్భుత ఆనంద స్థితి. ఇక మీ స్వప్నాలను ఓసారి విశ్లేషించుకోండి. స్వప్నంలో మనోసంచారం చేస్తాం. ప్రపంచం అంతా చుట్టి వస్తాం. మెలకువ రాగానే వాస్తవ ప్రపంచంలోకి వస్తాం. మళ్లీ విషయవాసనలు మనల్ని చుట్టుముడతాయి. ఈ మూడు స్థితులను చక్కగా విచారించగలిగితే అదే సంపూర్ణ జ్ఞానం. మనం నిత్యం చాలా విషయాలు ఆలోచిస్తాం. కానీ మన గురించి, మన మనోలోకం గురించి ఆలోచించేందుకు కొంత సమయం కూడా కేటాయించం. ఇదే కష్టానికి, వేదనకు, అశాంతికి కారణం. మనిషికి తన మనసుకు సంబంధించిన జ్ఞానం లభిస్తే అంతకు మించిన ఆనంద స్థితి మరొకటి ఉండదు. హృదయం గురించి ఆలోచించడమే ఆత్మదర్శనం. అన్ని ధర్మాలూ హృదయాన్వేషణే అద్భుత మార్గమని చెప్పాయి. హృదయజ్ఞాన సాధనకు కొంతవరకు గురువు సాయం అవసరం అవుతుంది. చాలా వరకు మనం స్వతంత్రంగా అన్వేషించుకోవాలి. అప్పుడే పరమసత్యం బోధపడుతుంది. హృదయాన్వేషణ కోసం ఎక్కడికో పోవాల్సిన పని లేదు. రోజూ కొద్దిసేపు మౌనంగా కూర్చోండి. మీ గురించి ఆలోచించండి. క్రమంగా శాంతి స్థితి లభిస్తుంది. సాధనతో హృదయాకాశంలో విహరించే మార్గం లభిస్తుంది. నేను అనే స్థితి నుంచి బయటపడతారు. మీ

మనసులో నేను అనే భావం తొలగిపోతే అంతా పరమశాంతే.

కృష్ణాజిల్లా కొల్లేరు సమీపంలోని కుగ్రామంలో వ్యవసాయ కుటుంబంలో పుట్టాను. మా తల్లిగారు నిత్యం భగవదారాధనలో గడిపేవారు. 1955లో గుంటూరులో డిగ్రీ చేశాను. ఆ తరువాత హైదరాబాద్ చేరాను. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగం.... 1980లో స్వచ్ఛంద పదవీ విరమణ.. ఆ తరువాత వ్యాపారం... అనేకానేక అనుభవాలు. 'నీవెవరో నీకు తెలుసా' అనే వివేకానందుని ప్రశ్న నా తాత్త్విక ప్రస్థానానికి ప్రేరణ అయింది. హైదరాబాద్ రామకృష్ణ మఠం అప్పటి అధ్యక్షులు స్వామి రంగనాథానంద అంటే ఎనలేని మక్కువ. ఆయన సాంగత్యంలో నా అన్వేషణ ప్రారంభం అయింది. 1991 నుంచి రాజయోగం మొదలుపెట్టాను. ఏడేళ్ల పాటు అనుక్షణం అన్వేషణ. హిమాలయాలు.. ఆధ్యాత్మిక కేంద్రాలు.. అలా దేశమంతా తిరిగాను. స్వతంత్ర అన్వేషణ మాత్రమే ఆత్మజ్ఞానాన్ని ఇస్తుంది. పరిపూర్ణ జీవితం గడిపేందుకు అవసరమైన తాత్త్విక చింతన కోసం ఎక్కడికో వెళ్లనవసరం లేదు. అది హృదయాంతరంలోనే ఉంటుంది.

**పరిపూర్ణ జీవితం గడిపేందుకు అవసరమైన తాత్త్విక చింతన కోసం ఎక్కడికో వెళ్లనవసరం లేదు. అది హృదయాంతరంలోనే ఉంటుంది.**

హృదయ అన్వేషణ అనేది స్వతంత్రంగానే సాగాలి. గురువులు, యోగులు మార్గనిర్దేశం మాత్రమే చేయాలి. నేను తెలుసుకున్న సత్యాన్ని యావత్ ప్రపంచానికి తెలియజేస్తున్నాను. క్రైస్తవం, ఇస్లాంతో పాటు తాత్త్విక విషయాలపై 5 పుస్తకాలు రాశాను. పలు వేదికలపై ప్రసంగించాను. రెండేళ్ల క్రితం బెంగుళూరులో జరిగిన ప్రపంచ వేదవిజ్ఞాన సదస్సులో ప్రసంగించాను. దహరోపాసన కేంద్రం ద్వారా నేను తెలుసుకున్న విషయాలను పదిమందికి అందిస్తున్నాను. హృదయోపాసనే ప్రధానం. అన్నిమతాల సారం ఒక్కటే, అందరు దేవుళ్లు ఒక్కరే అనే సత్యాన్ని ప్రపంచానికి చాటడమే నా లక్ష్యం. త్వరలో ఓ వేదిక ఏర్పాటు చేసి ఆ లక్ష్య సాధన కోసం ప్రయత్నిసాను.

దహరోపాసన కేంద్రం ద్వారా నేను తెలుసుకున్న విషయాలను పదిమందికి అందిస్తున్నాను. హృదయోపాసనే ప్రధానం.

– జనవరి 26, 2007



**అన్నీ వేదాల్లో ఉన్నాయష.. అంటూ వెటకారం చేసే వారికి, అవును అన్నీ వేదాల్లోనే ఉన్నాయి... ఉన్నాయో? లేవో తెలుసుకునేందుకు ఎప్పుడైనా ప్రయత్నించారా అని ప్రశ్నించి షాక్ ఇస్తారాయన. కంప్యూటర్ రంగంలో అద్భుతాలు చేశారు. వేదగణితాన్ని దేశవ్యాప్తంగా ప్రచారం చేశారు. వేదాల్ని పరిరక్షించేందుకు అపర హయగ్రీవునిలా కృషి చేస్తున్నారు డాక్టర్ ఆర్.వి.ఎస్.ఎస్. అవధానులు. వేదం మన జీవన నాదం అంటున్న ఆయన వాణి.**



# వేద విజ్ఞానం జీవనామృతం

మనది వేదభూమి అని సగర్వంగా చెప్పుకొంటాం. వేద సంస్కృతి మాత్రమే భారతదేశాన్ని సజీవంగా, ప్రపంచ దేశాల ముందు తలెత్తుకొనేలా చేసిందని ప్రతి ఒక్కరూ అంగీకరిస్తారు. వేల సంవత్సరాలుగా యావత్ ప్రపంచ విజ్ఞానానికి తలమానికంగా నిలిచిన వేదవిజ్ఞానం గురించి మాత్రం మనకు పట్టదు. నాలుగు వేదాలకు మొత్తం 1131 శాఖలుండేవని భాగవతం, పతంజలి మహాభాష్యం, ఆదిశంకరుల భాష్యాల ద్వారా తెలుస్తున్నది. కానీ ప్రస్తుతం లభిస్తున్నవి కేవలం 13 వేద శాఖలే. ఏడు శాఖలకు మాత్రమే గురుశిష్య పరంపర కొనసాగుతున్నది. మిగిలిన 6 వేదశాఖలు పాక్షికంగా మాత్రమే లభిస్తున్నాయి. అమూల్యమైన మన ప్రాచీన భారతీయ విజ్ఞానంలో 99 శాతాన్ని చేజేతులా పోగొట్టుకున్నాం. ఎక్కువగా నష్టపోయింది సామవేదం. ఆ వేదంలో వెయ్యి శాఖలకు పైగా ఉన్నాయి. ఇప్పుడు లభిస్తున్నవి కేవలం 3 శాఖలు మాత్రమే. వేల సంవత్సరాలుగా విజ్ఞాన గనులుగా భాసిల్లిన వేదాలు క్రీస్తుశకం 800 సంవత్సరాల వరకు నిక్షేపంగా ఉన్నాయి. ఆ తరువాత 1200 ఏళ్ల కాలంలో వేద శాఖలు 99 శాతం అంతరించిపోయాయి. ప్రత్యర్థులు దండెత్తినప్పుడు మనరాజులు వేదపండితులను, మహిళలను, ధనాన్ని సురక్షిత ప్రాంతాలకు తరలించేవారు. వేదం గ్రంథస్థంకాలేదు. ఒకరి నుంచి మరొకరికి అది పరంపరగా సంక్రమించేది. వేదపండితులు నశిస్తే వేదం నశించినట్టే. అందుకే రాజులు వేదపండితుల్ని కాపాడుకొనేవారు. వేదానికి వారు



**నాలుగు వేదాలకు మొత్తం 1131 శాఖలుండేవని భాగవతం, పతంజలి మహాభాష్యం, ఆదిశంకరుల భాష్యాల ద్వారా తెలుస్తున్నది. కానీ ప్రస్తుతం లభిస్తున్నవి కేవలం 13 వేద శాఖలే. ఏడు శాఖలకు మాత్రమే గురుశిష్య పరంపర కొనసాగుతున్నది.**



అంతటి ప్రాధాన్యం ఇచ్చేవారు. వందల సంవత్సరాలుగా మనం పాశ్చాత్యధోరణిలో పడి వేద విచారమే విస్మరిస్తున్నాం.

ఉన్న కొన్ని వేదశాఖలు కూడా కాలగర్భంలో కలిసిపోకూడదనే సంకల్పంతో వేదాలను రికార్డు చేసే మహా యజ్ఞానికి శ్రీకారం చుట్టాం. ఆరేళ్లుగా కృషి చేసి ఇప్పటి వరకు ఋగ్వేదం, యజుర్వేద మంత్రాలతో 250కి పైగా సిడిలు రూపొందించాం. అందుబాటులో ఉన్న వేదశబ్దాలను రికార్డింగ్ చేస్తే 2,500 గంటలు పడుతుంది. ఇప్పటి వరకు 400 గంటలు మాత్రమే పూర్తి చేశాం. ఆడియో సిడిలతో పాటు మల్టీ మీడియా సిడీలను రూపొందించాం. ప్రతి మంత్రాన్ని ఛందోబద్ధంగా 11 స్వరాల్లో అందించడంతో పాటు, దాని అర్థాన్ని, అర్థానికి అనుగుణమైన చిత్రాన్ని కూడా మల్టీ మీడియా సిడిలలో రూపొందించాం. ప్రపంచవ్యాప్తంగా ఉన్న సంస్కృత అభిమానులు ఆశ్చర్యంతో, ఆరాధనతో, రాగయుక్తమైన వేద మంత్రాలను ఆస్వాదిస్తున్నారు. ఓ రోజున నిమ్స్ దగ్గరలో వేలంపాట జరుగుతుంటే ఆసక్తిగా అటువైపు వెళ్లాను. ఓ పెద్దమనిషి ఓ పాత బీరువా పాటపాడుకున్నాడు. తెరిచి చూస్తే దాంట్లో అమూల్యమైన తాళపత్ర గ్రంథాలు లభించాయి. మరో సందర్భంగా బస్తా నిండా రాగిరేకులపై రాసిన వాఙ్మయం లభించింది. వాటన్నింటినీ పరిశోధించి, పరిరక్షించాలి. అందుకోసం అయ్యే ఖర్చులను ఇప్పుడు కొందరు మహనీయుల సౌజన్యంతో భరిస్తున్నారు. ప్రభుత్వం ముందుకు వచ్చి ఇటువంటి పరిశోధనలను ప్రోత్సహించాలి. వేద వాఙ్మయాన్ని పరిరక్షిస్తే వేద సంస్కృతిని పరిరక్షించినట్టేనని గ్రహించాలి. వేదాలకు సంస్కృత భాష ముఖద్వారం వంటిది. ఎన్నో భాషలకు సంస్కృతం మూల భాష. పాశ్చాత్య ప్రభావంలో పడి మనదైన సంస్కృత భాషకు, వేదాలకు దూరమైపోయాం. అందుకే వేదాలను, సంస్కృత భాషను పరిరక్షించి, ప్రచారం చేసేందుకు శ్రీ వేదభారతి అనే స్వచ్ఛంద సంస్థను ప్రముఖుల సహకారంతో ఏర్పాటు చేశాం. వేదాల అన్వేషణ, ప్రచారం, పరిశోధన, సంస్కృత బోధన లక్ష్యాలుగా ఈ సంస్థ పనిచేస్తున్నది. సంస్కృతంలో సర్టిఫికెట్ కోర్సు నిర్వహిస్తున్నాం. ఉచిత బోధన తరగతులు నిర్వహిస్తున్నాం. సంస్కృత భాషను నేర్చుకొనేందుకు కంప్యూటర్ నిపుణులు, ఇంజనీర్లు, ఉన్నతాధికారులు ఆసక్తి చూపడం విశేషం.

**ప్రపంచవ్యాప్తంగా ఉన్న సంస్కృత అభిమానులు ఆశ్చర్యంతో, ఆరాధనతో, రాగయుక్తమైన వేద మంత్రాలను ఆస్వాదిస్తున్నారు.**

**ఎన్నో భాషలకు సంస్కృతం మూల భాష. పాశ్చాత్య ప్రభావంలో పడి మనదైన సంస్కృత భాషకు, వేదాలకు దూరమై పోయాం.**

ప్రస్తుతం ప్రపంచం అంతా నీరాజనాలు పలుకుతున్న జావా లాంగ్వేజ్‌కు మూలాలు మన వేదాల్లోని మీమాంసలో స్పష్టంగా కని పించాయి.

మాది తూర్పుగోదావరి జిల్లా పడగట్లపల్లి. వేదపండితులు, మహామహోపాధ్యాయుల కుటుంబం మాది. ప్రాథమిక విద్య చదువుతున్నప్పుడు సంస్కృతభాషతో పరిచయం ఏర్పడింది. హైస్కూలు నాటికి కావ్యాలు పూర్తయ్యాయి. ఆంధ్ర విశ్వవిద్యాల యంలో న్యూక్లియర్ ఫిజిక్స్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశాను. కంప్యూటర్ కోర్సు పూర్తయింది. రాజోలులో లెక్చరర్‌గా ఉద్యోగం మొదలు పెట్టాను. తీరిక సమయంలో వేదాధ్యయనం మొదలు పెట్టాను. ఆ తరువాత హైదరాబాద్ ఇ.సి.ఐ.ఎల్‌లో కంప్యూటర్ రంగంలో ఉద్యోగం వచ్చింది. అమెరికాకు చెందిన ఓ కంపెనీ రూపొందించిన సాఫ్ట్‌వేర్‌ను అధ్యయనం చేయమ న్నారు. ఆరు మాసాల్లో ఆ ప్రాజెక్టు పూర్తి చేశాను. ఆ ప్రోగ్రాం మూలాలన్నీ వేదాల్లో ఉన్నాయనిపించింది. అక్కడి నుంచి నా అన్వేషణ మొదలైంది. మీమాంసలో కంప్యూటర్ భాషకు మూలంవేదిక్ మాథమెటిక్స్ అనే పుస్తకం నాకు ఎవరో ఇచ్చారు. కంప్యూటర్ ప్రోగామింగ్‌కు ప్రాణం వంటి ఫండమెంటల్ అల్గోరి థమ్స్ గ్రంథకర్త వేదగణితం గొప్పదనాన్ని వేనోళ్ల ప్రశంసించారు. ప్రస్తుతం ప్రపంచం అంతా నీరాజనాలు పలుకుతున్న జావా లాంగ్వేజ్‌కు మూలాలు మన వేదాల్లోని మీమాంసలో స్పష్టంగా కనిపించాయి. ఇంతటి విజ్ఞాన భాండాగారం మన దగ్గర పెట్టు కొని, ప్రపంచం అంతా దిక్కులు చూస్తున్నాం అనిపించింది. వేదాల లోతులు చూడాలని సంకల్పించాను. ఇసిఐఎల్‌లో ఉన్న సమయంలో తెలుగులిపికి సాఫ్ట్‌వేర్ రూపొందించాం. తరువాత సంస్కృత భాషకు కూడా లిపి రూపొందించాం. అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్‌కాలేజీ, జె.ఎన్.టి.యు. నిమ్స్‌లో కంప్యూటర్ రంగంలో బాధ్యతలు నిర్వర్తించి ఇటీవలే పదవీ విరమణ చేసి పూర్తి సమ యాన్ని వేదభారతి కార్యక్రమాలకు కేటాయిస్తున్నాను. వేదం నేర్చుకోవడంతో పాటు సంస్కృతంలో డాక్టరేట్ చేశాను. వేదా లను ఆధునిక విజ్ఞానంతో మేళవించి వాటి పట్ల ఆసక్తి పెంపొం దించేలా ఇప్పటికి ఐదు గ్రంథాలు రచించాను. భారతప్రభుత్వం నుంచి సంస్కృతిమిత్ర అవార్డు, అమెరికా సంస్థ నుంచి 1999 సంవత్సరానికి మ్యాన్‌ఆఫ్‌ది ఇయర్ అవార్డుతో పాటు పలు అవా ర్డులు అందుకున్నాను. ప్రపంచానికి అందించడం, సంస్కృత విద్యను పది మందికీ పంచగలగడం నిజంగా ఆ అంతర్యామి ఆశీర్వాదం.

వేదాలను ఆధునిక విజ్ఞానంతో మేళవించి వాటి పట్ల ఆసక్తి పెంపొందించేలా ఇప్పటికి ఐదు గ్రంథాలు రచించాను.

– ఫిబ్రవరి 2, 2007

**ఆయన నడిచే సుందరకాండ. ఆయన గళం నుంచి సంస్కృత శ్లోకాలు, వాటి అర్థాలు గలగలా జాలువార తాయి. లోకహితాన్ని కోరుతూ ఐదేళ్ల పాటు అష్టోత్తర శత సుందరకాండల పారాయణ యజ్ఞాన్ని పూర్తి చేశారు శ్రీమాన్ శృంగారం శింగరాచార్యులు. భక్తి, జ్ఞాన మార్గాలను మధురంగా రంగరించి, భక్తకోటికి ఆ అమృ తాన్ని అందిస్తున్న శింగరాచార్యుల ఆధ్యాత్మిక ప్రస్థానం.**



# భక్తితోనే ఇహం ... పరం



నాకు అప్పటి వరకు సుందరకాండతో పరిచయం లేదు. ఎలాగైనా పారాయణ చేయాలని సంకల్పించాను. మొదట నేను ఉపదేశం పొంది ద్వివేది దంపతులకు దీక్ష ఇచ్చి వారి తరపున తొలి సుందరకాండ పారాయణ చేశాను. ఏదో దివ్య తేజం నాలోకి ప్రవేశించినట్టయింది.



పదవీ విరమణ చేసి, పెన్షన్, గ్రాట్యుటీలు లెక్కలు చూసుకొని, భవిష్యత్ ప్రణాళికలు వేసుకుంటున్న రోజులవి. హఠాత్తుగా గతంలో నా పై అధికారిగా ఉన్న పంకజ్ ద్వివేది నుంచి పిలుపు వచ్చింది. ఆచార్యులు గారూ... నాకు కొన్ని సమస్యలు ఉన్నాయి. అవి పరిష్కారం కావాలంటే సుందరకాండ పారాయణ చేయాలి. నా తరపున మీరు సుందరకాండ పారాయణ చేయకూడదా అని కోరారు. నాకు అప్పటి వరకు సుందరకాండతో పరిచయం లేదు. ఆ పుస్తకం నా లైబ్రరీలో దుమ్ముకొట్టుకుపోయి ఉంది. ఏం చేయాలా అని మథన పడ్డాను. ఇది దైవ సంకల్పం. ఎలాగైనా పారాయణ చేయాలని సంకల్పించాను. మొదట నేను ఉపదేశం పొంది ద్వివేది దంపతులకు దీక్ష ఇచ్చి వారి తరపున తొలి సుందరకాండ పారాయణ చేశాను. ఏదో దివ్యతేజం నాలోకి ప్రవేశించినట్టయింది. 41 రోజుల పాటు పారాయణ సాగింది. మా ఇంట్లో సందడి చూసిన కాలనీవాసులు తమ కోసం కూడా సుందరకాండ చేయమని కోరారు. సరే అని రెండు, మూడు సుందరకాండల పారాయణం చేశాను. మరొకరి ఇంట్లో నాలుగో పారాయణ ముగిసే సమయానికి.... మీ పారాయణ ప్రభావంతో నా సమస్యలు తీరాయి. నేను కోరుకున్న విధంగా చత్తీస్‌గఢ్ బదిలీ అయ్యానంటూ ద్వివేది నుంచి కబురు వచ్చింది. అంతులేని ఆశ్చర్యం. ఆ సంఘటన నా జీవిత గతిని మార్చేసింది. స్వామి ఆలయానికి వెళ్ళి లోకకల్యాణం కోసం అష్టోత్తర శత సుందరకాండలు

> ఇదంతా ఆ అంతర్యామి నా చేత చేయిస్తున్నారు... నేను కేవలం నిమిత్తమాత్రుడిని.

చేస్తానని సంకల్పం చెప్పుకొన్నాను.

మొదట కేవలం మా ఇంట్లోనే సుందరకాండ పారాయణ చేయాలని అనుకున్నాను. అయితే శారదాబాయి అనే భక్తురాలు తమ ఇంటికి వచ్చి సుందరకాండ చేయాలని కోరారు. అంతవరకు బయటకు వెళ్ళి సుందరకాండ నిర్వహించాలనే ఆలోచనే కలగలేదు. ఆమె ఆహ్వానాన్ని కూడా దైవాదేశంగా భావించి బయటకు వెళ్ళి సుందరకాండలు చేయడం ప్రారంభించాను. అప్పటి నుంచి ఇక తిరిగి చూడవలసిన అవసరమే లేకపోయింది. భక్తులు, శిష్యగణం వారికి వారే సుందరకాండలు చేయించుకునేందుకు ముందుకు వచ్చారు. అందరి సహకారంతో ఇప్పుడు అష్టోత్తర శత సుందరకాండలు పూర్తి చేశాను. ఇంకా చాలా మంది తమ వంతు కోసం వేచి ఉన్నారు. ఇప్పుడు ద్వితీయాష్టోత్తర శత సుందరకాండ చేసే పనిలో నిమగ్నం అయ్యాను. ఇదంతా ఆ అంతర్యామి నా చేత చేయిస్తున్నారు... నేను కేవలం నిమిత్తమాత్రుడిని. భాగ్యనగరంలో సుందరకాండ పారాయణకు ఎవరు పిలిచినా వారి ఇళ్లకు స్వామి పటాలు, విగ్రహాలు, ప్రసాదం వండే పాత్ర, మైక్‌సెట్, దీపకుందులు అన్నీ భక్తులు సమకూర్చినవే తీసుకువెళతాను. తొమ్మిది రోజుల పాటు వారి ఇంట్లో పారాయణ, ప్రవచనం చేస్తాను. చివరి రోజు సామూహిక విష్ణు సహస్రనామ పారాయణ, ఆంజనేయ సహస్రనామ పూజలు చేయిస్తాం. పారాయణ చేసినందుకు నాకు ఏమీ ఇవ్వ వలసిన పని లేదు. భక్తి శ్రద్ధలేనాకు సమర్పించవలసిన దక్షిణ. 108 సుందరకాండల పారాయణానికి ఐదేళ్లు పట్టింది. ఆ కాలంలో ఎన్నో అద్భుతాలు.. మరెన్నో అనుభవాలు. భక్తులు స్వయంగా వచ్చి తమకు పారాయణ వల్ల ఎంత మేలు జరిగిందో చెప్పే వారు.

> 108 సుందర కాండల పారాయణానికి ఐదేళ్లు పట్టింది. ఆ కాలంలో ఎన్నో అద్భుతాలు.. మరెన్నో అనుభవాలు.

సుందరకాండలోని ఒక్కొక్క సర్గ ఒక్కో అభీష్ట సిద్ధికి సాధనం. సుందరకాండ పారాయణ చేయడం వల్ల ఎందరికో ఎన్నో సమస్యలకు పరిష్కారం లభించింది. వివాహం కాని వారికి వివాహం అయింది. నిత్యదరిద్రంలో అల్లాడుతున్న వారికి సంపద చేకూరింది. శత్రుబాధ, అపమృత్యుబాధ, దూరమైన బంధుజనం దగ్గర కావడం, తప్పిపోయిన వ్యక్తులు కూడా తిరిగి రావడం వంటి అద్భుతాలెన్నో జరిగాయి. అందుకే సుందరకాండ పారాయణ చేస్తే సకల అభీష్టాలూ నెరవేరతాయి.

పుట్టింది పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులో. మా తండ్రి గారు అర్చకత్వం చేసేవారు. మా కుటుంబంలో నిత్యార్చన లుండేవి. పురాతన కాలం నుంచి అనూచానంగా వస్తున్న సాల గ్రామాలున్నాయి. వాటికి నిత్యపూజలు నిర్వహించేవారు. నిత్య నైవేద్యాలు ఉండేవి. పెరిగి పెద్దవాడనై విద్యాబుద్ధులు నేర్చిన తర్వాత ప్రభుత్వ సర్వీసులో చేరాను. ఆంధ్రప్రదేశ్ ఖాదీ గ్రామో ద్యోగ మండలిలో అంచెలంచెలుగా ఎదిగి అడ్మినిస్ట్రేటివ్ అధికా రిగా 2000 సంవత్సరంలో పదవీ విరమణ చేశాను. అప్పటి వరకు పురాణాలతో పెద్దగా పరిచయం లేని నేను ఇప్పుడిలా ప్రవచనాలు చేయడం.. అంతా దైవలీల. సుందరకాండ నేటి సమాజానికి చాలా అవసరం. సంస్కృతి, సంప్రదాయం, ధర్మ నిరతిని బోధించే మహత్తర ఘట్టం అది. వేదభూమిలో పుట్టినా పాశ్చాత్య ధోరణుల్లో కొట్టుకుపోతున్నాం. సమున్నతమైన సనా తన సంస్కృతిని బతికించుకోవలసిన అవసరం ఉంది. నేను చేస్తున్న సుందరకాండ పారాయణలు, చివరి రోజున నిర్వ హించే సహస్రనామార్చనకు పెద్దల నుంచి జీన్స్‌పాంట్లు వేసు కుని తిరిగే కాలేజి అబ్బాయిలు, అమ్మాయిలు వస్తున్నారంటే ఇంకా మనలో ఆ సంస్కారం అంతర్లీనంగా ఉందని రుజువవు తోంది. అందరిలో మన సంస్కృతీ సంప్రదాయాల పట్ల ఆసక్తి, అనురక్తి పెంచాలి. మన పురాణాలన్నీ కథలే కదా... ఆ కథలు మాకెందుకు అనే వారున్నారు. రామాయణమే తీసుకోండి స్వామిభక్తికి, పరాక్రమానికి నిదర్శనం హనుమంతుడు. శ్రీరా ముడు సకలగుణాభిరాముడు. రావణుడు సకల వేదపారంగతు డైనా అరిషడ్వర్గాలను జయించలేక లంకకు చేటు తెచ్చాడు. ఇంతటి గొప్ప సత్యాలు అందులో ఇమిడి ఉన్నాయి. పురాణా లన్నీ వేదాంత సారాలే. నేను చేస్తున్న ఈ పని నాతోనే నిలిచిపో కూడదన్నది నా ధ్యేయం. నిత్యానుష్ఠానం ఉన్నందువల్ల నేను హైదరాబాద్ దాటి వెళ్ళే అవకాశం లేదు. అందువల్ల రాష్ట్రం లోని ఇతర ప్రాంతాల వారు కూడా దీని వల్ల ప్రయోజనం పొందేందుకు ఏదైనా చేయాలని ఉంది. నా శిష్యులు, మిత్రులు, శ్రేయోభిలాషుల సహకారంతో సుందరకాండ పారాయణలపై ఔత్సాహికులకు శిక్షణ ఇవ్వాలని ఉంది. ఎవరైనా ముందుకు వస్తే క్లాసులు నిర్వహించి ప్రాచీన సంస్కృతీ సంప్రదాయాల గురించి బోధించి తద్వారా వారిని కూడా సుందరకాండ పారా యణలు చేసే విధంగా తీర్చి దిద్దాలన్నది నా సంకల్పం.

– ఫిబ్రవరి 9, 2007

**సుందరకాండ నేటి సమాజానికి చాలా అవసరం. సంస్కృతి, సంప్రదాయం, ధర్మనిరతిని బోధించే మహత్తర ఘట్టం అది.**

**శ్రీరాముడు సకల గుణాభిరాముడు. రావణుడు సకల వేద పారంగతుడైనా అరిష డ్వర్గాలను జయించ లేక లంకకు చేటు తెచ్చాడు.**

**ఆయన గొంతు సవరిస్తే సరస్వతీ కటాక్షమే. సర్వబద్ధమైన ఆయన మంత్రపఠనం విని వేదమాత పులకరించిపోతుంది. దశాబ్దాలుగా వేదవికాసానికి కృషి చేస్తూ, ఆరుసార్లు రాష్ట్రపతి అవార్డులు అందుకున్నారు మహామహోపాధ్యాయ తంగిరాల బాలగంగాధరశర్మ. 85 ఏళ్ల వయసులో వేదంలా... గోదావరిలా.. శాంతంగా.. పవిత్రంగా కనిపిస్తారాయన. వేద విజ్ఞానాన్ని విస్మరించి మనం తప్పు దారిన నడుస్తున్నాం అంటున్నారు శర్మగారు.**



# వేదాల సంరక్షణే విశ్వరక్ష



రాజమండ్రి నుంచి రావులపాలెం వెళ్లే ప్రధాన రహదారిలో ఉన్న గ్రామం జొన్నాడ అగ్రహారం. ఇంటి వసారాలో పాతబడిన పడకకుర్చీలో అలా జారగిల పడి, వేద జిజ్ఞాసువుల సందేహాలను నివృత్తి చేస్తూ కనిపిస్తారు మహామహోపాధ్యాయ తంగిరాల బాలగంగాధర శర్మ.



గోదావరి తీరం... రాజమండ్రి నుంచి రావులపాలెం వెళ్లే ప్రధాన రహదారిలో ఉన్న గ్రామం జొన్నాడ అగ్రహారం. పచ్చని పొలాల మధ్య ఓ పెంకుటిల్లు. పాతబడినా వేదోచ్చారణల గంభీర తరంగాలతో తడిసిన ఆ ఇల్లు కొత్త కాంతులీనుతూ ఉంటుంది. లేగదూడల తుళ్లింతలు, రెల్లుగడ్డితో అందంగా నిర్మించిన యజ్ఞవాటిక ఆ పరిసరాల అందాలను రెట్టింపు చేస్తాయి. ఆ ఇంటి వసారాలో పాతబడిన పడకకుర్చీలో అలా జారగిల పడి, వేద జిజ్ఞాసువుల సందేహాలను నివృత్తి చేస్తూ కనిపిస్తారు మహామహోపాధ్యాయ తంగిరాల బాలగంగాధర శర్మ. ఆ పరాత్పరుడికి నమస్కరించండి... మనం.. మన గొప్పదనమంతా ఆయన ఆశీర్వచనమే అంటూ తనకు పాదాభివందనం చేసేవారిని మెల్లగా మందలిస్తారాయన.

1922 ఏప్రిల్ 16న తూర్పుగోదావరి జిల్లా ఇరగవరంలో పుట్టాను. మా కుటుంబంలో వంశపారంపర్యంగా అందరూ వేదం నేర్చుకున్నారు. నేనూ ఊహ తెలిసిన రోజు నుంచి రుగ్, యజుర్, అధర్వణ వేదాధ్యయనం ప్రారంభించాను. వేదాంగాలైన శిక్షా, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం నేర్చుకున్నాను. పూర్వం నుంచి వేదాలు గురుముఖత నేర్చుకోవడమే తప్ప గ్రంథాధారం లేదు. ఎన్ని వందల మంత్రాలనైనా పల్లెవేసి గుర్తుపెట్టుకొనే అపూర్వమైన ధారణ విద్య గురుకుల

విద్యావిధానంలో ఉండేది. నేటి విద్యా విధానంకంటే నాటి గురుకుల విద్యా విధానం విద్యార్థిని పరిపూర్ణంగా తీర్చిదిద్దేది. జ్యోతిష ఆచార్య, ధర్మశాస్త్ర అభిజ్ఞ, వేదార్థ అభిజ్ఞ పట్టాలు పుచ్చుకున్నాను. కాశీ విశ్వవిద్యాలయం వారు సాంగత్రివేదా చార్య బిరుదునిచ్చారు. 2006తో పాటు ఆరు సార్లు రాష్ట్రపతి విశిష్ట పురస్కారాన్ని అందుకున్నాను. తిరుపతి విశ్వవిద్యా లయం వారు మహామహోపాధ్యాయ బిరుదునిచ్చి సత్కరిం చారు. ఇదంతా నేను కాదు... వేదశాస్త్రం సాధించిన సత్కారం. అంతా అంతర్యామి కృప. 1973 నుంచి తూర్పుగోదావరి జిల్లా కపిలేశ్వరపురంలోని సర్వారాయ వేదపాఠశాల ప్రధానాచార్యు లుగా పనిచేస్తూ, విద్యార్థులకు వేదవిజ్ఞానం అందిస్తున్నాను. ఈ కంప్యూటర్ యుగంలో వేదవిజ్ఞానం ఎంత వరకు ఆవశ్యకం అని అడిగితే...మనది కర్మభూమి. యావత్ ప్రపంచ దేశాలకూ మార్గదర్శనం చేయగల సామర్థ్యం ఈ వేదభూమిలో పుట్టిన వారికే ఉంది. అడవుల్లో ఉంటూ, ఆకులు అలములు తింటూ విశ్వమానవకల్యాణం గురించి ఎందరో రుషులు, మహనీ యులు ఆలోచించారు. మానవాళి సమస్యలన్నింటినీ పరిష్క రించి, ఆనందమార్గం చూపే జ్ఞానభాండాగారాలైన వేదాలను మనకు అందించారు. మానవాళిని తరింపజేసే వేదవిజ్ఞానం పట్ల ఈ రోజున ఎవరికీ ఆసక్తి లేదు. ఇప్పుడు ప్రతి ఒక్కరికీ డబ్బే ప్రధానం. ఆస్తిపాస్తులే పరమావధి. వైదిక సంస్కృతే నిజ మైన సంపద అని చెప్పేవారు కరువయ్యారు.. వినేవారు అసలే లేరు.

> మనది కర్మభూమి. యావత్ ప్రపంచ దేశాలకూ మార్గ దర్శనం చేయగల సామర్థ్యం ఈ వేద భూమిలో పుట్టిన వారికే ఉంది.

> ఏవో నాలుగు ముక్కలు బట్టీపట్టి, వేదపండితులుగా ఉద్యోగం లభించగానే వేదం గురించి.. వైదిక జీవనం గురించి విస్మరిస్తున్నారు.

వేదం చదివే వారి పరిస్థితి కూడా ఇప్పుడు అధ్వాన్నంగా తయారైంది. వేదాధ్యయనం ఇప్పుడు కేవలం ఉపాధిమార్గంగా మారింది. వేదవిజ్ఞానాన్ని ఆకళింపు చేసుకొని తమ జీవితాన్ని సుఖమయం చేసుకోవడంతో పాటు విశ్వవికాసానికి తోడ్పడం వేదాధ్యాయుల బాధ్యత. కానీ ఇప్పుడు అలా జరగడం లేదు. ఏవో నాలుగు ముక్కలు బట్టీపట్టి, వేదపండితులుగా ఉద్యోగం లభించగానే వేదం గురించి.. వైదిక జీవనం గురించి విస్మరిస్తు న్నారు. వేద పండితుల కోసం పరీక్షలు పెట్టించి, వారికి రేయిం బవళ్లు వేదం నేర్పించింది కేవలం నాలుగురాళ్లు సంపాదించడం కోసం కాదు. అదే జీవిత పరమార్థం కానే కాదు. అటువంటి వారికి విద్య నేర్పించినందుకు ఈ రోజున నిజంగా సిగ్గుపడు తున్నా. ఈ కాలంలో అందరూ ఇన్‌స్టంట్ మోక్షం కోరుతు

ఈ కాలంలో అందరూ ఇన్‌స్టంట్ మోక్షం కోరుతు న్నారు. వేదం పట్ల ఎవరికీ గౌరవం లేదు. వేదసంస్కృతి క్షీణించి పోతోంది.

న్నారు. వేదం పట్ల ఎవరికీ గౌరవం లేదు. వేదసంస్కృతి క్షీణించి పోతోంది. సమాజంలో విలువలు లుప్తం కావడానికి ఇదే కారణం. ఇవి పూర్తిగా క్షీణించి పోతే కానీ పునరుజ్జీవం జరగదేమో అన్నారాయన దార్శనికంగా. ఈ రోజుల్లో ప్రతి ఒక్కటీ ఇన్‌స్టంట్ వ్యవహారమే. మోక్షం కూడా చిటికెలో రావాలనుకుంటున్నారు. సంపాదన తుపానులో చిక్కుకొని మనశ్శాంతికి దూరమవుతున్నారు. తక్షణం మనశ్శాంతినిచ్చే మార్గాల అన్వేషణలో పడుతున్నారు. సంవత్సరాల తరబడి సాధన చేస్తే కానీ ఏ విషయంలో అయినా పరిపూర్ణత రాదు. సంప్రదాయ జీవనం, నిరంతర సత్యాన్వేషణ, ఆత్మ విజ్ఞానం... ఇవీ శాంతిమార్గాలు. వీటిని సాధన చేయాలి. జీవితం, జగత్ సత్యాలను అనుభవించాలి. ఇందుకు వేదవిజ్ఞానం మాత్రమే దారిచూపుతుంది. వేదాల్లో అన్నీ ఉన్నాయని మౌనంగా ఊరుకోకూడదు. వాటిని అందరికీ అర్థమయ్యేలా వివరించాలి. అప్పుడే వేదవిజ్ఞాన ఫలాలు అందరికీ అందుతాయి. సమాజం సుఖశాంతులతో ఉంటుంది. వేదవిజ్ఞానాన్ని సక్రమ రీతిలో అందరికీ పంచేందుకు విజ్ఞులు నడుం కట్టాలి.

సంప్రదాయ జీవనం, నిరంతర సత్యాన్వేషణ, ఆత్మ విజ్ఞానం... ఇవీ శాంతిమార్గాలు. వీటిని సాధన చేయాలి.

మన జీవితాన్ని ఆనందమయం చేసుకొనేందుకు మార్గదర్శనం చేసే గురువు ప్రతి ఒక్కరికీ కావాలి. సరైన వివేకాన్ని, విజ్ఞానాన్ని అందించే శక్తి కేవలం గురువుకే ఉంది. గురువును అన్వేషించుకొనే శక్తి కానీ, వారిని గౌరవించే సంప్రదాయం కానీ ఈ కాలంలో మచ్చుకైనా కనిపించదు. మనకు అసంఖ్యాకంగా వేదాలున్నాయి. వాటిని పదిలపరిచే వారు లేక ఎన్నో అమూల్య మంత్రాలు అంతరించిపోయాయి. ఉన్నవాటినైనా పదిలపరచుకొనే ప్రయత్నం జరగాలి. ప్రపంచ దేశాల ఎదుట మనం సగర్వంగా నిలబడేలా చేసిన వేదాలకు, వేదవిజ్ఞానానికి పూర్వవైభవం రావాలి.. అందుకు ప్రతి ఒక్కరూ నడుం కట్టాలి. అదే మానవాళి సుఖజీవన సోపానం.

– ఫిబ్రవరి 23, 2007



**వేదాలు చదివితే కడుపునిండా భోజనం కూడా దొరకదు. వేదాలు విజ్ఞాన భాండాగారాలే కానీ వాటికే జీవితాన్ని అంకితం చేసిన వారికి మిగిలేది మాత్రం శూన్యం. మన దేశంలో వేదాధ్యయనం చేసే వారిలో వినిపించే మాట ఇది. కానీ అమెరికాలో పుట్టి, ఆస్ట్రేలి యాలో పెరిగినా.. వేద వికాసం కోసం 30 ఏళ్లుగా కృషి చేస్తున్నారు హేమాపాటంకర్. వారణాసి అంత ర్జాతీయ వేద సదస్సులో ఆమెను కలిసిన వేళ...**



# వేద సారం...విశ్వకల్యాణం

విశ్వ శ్రేయస్సుకు మార్గాలైన వేదాలు, వేదపరంపర ప్రమాదంలో ఉంది. వేదభూమిలో వేదాల పరిస్థితి ఇలా ఉండడం బాధాకరం. వేదాధ్యయనం చేసేవారు కానీ, వేద సంస్కృతిని అనుసరించే వారు కానీ అరుదైపోయారు. వేదపండితుల కుటుంబాలు కూలిపోతున్నాయి. మానవ జీవితాన్ని సార్థకం చేయడంతో పాటు విశ్వకల్యాణానికి తోడ్పడే విజ్ఞాన భాండాగారాన్ని వేలసంవత్సరాల క్రితమే భారతీయ రుషులు ప్రపంచానికి అందించారు.. భారతీయ వేద సంపద అపూర్వమని యునెస్కో కూడా ఇటీవల ప్రశంసించింది. అటువంటి వేదాలను పరిరక్షించుకుందాం... వేద సంస్కృతిని అనుసరించి జీవితాలను సార్థకం చేసుకుందాం. నా వరకు నేను వేదాలను పరిరక్షించేందుకు ముక్తబోధ భారతీయ వేదాంత పరిశోధన సంస్థ అంతర్జాతీయ ఎగ్జిక్యుటివ్ డైరెక్టర్ హోదాలో కృషిచేస్తున్నాను. అమెరికాలో పుట్టి ఆస్ట్రేలియాలో పెరిగాను. నా 19వ ఏట మొదటి సారిగా భారతదేశం వచ్చాను. నా స్నేహితురాలికి ముంబయ్ సమీపంలోని గణేశ్‌పురిలోని ముక్తబోధానంద ఆశ్రమంతో అనుబంధం ఉండేది. ఆమెతో పాటు ఆశ్రమానికి రాగానే ఏదో దివ్వలోకంలోకి అడుగుపెట్టినట్టయింది. ముక్తానందస్వామి దర్శనం చేసుకొని, ఆశ్రమంలో కొన్ని రోజులు ఉండి తిరిగి అమెరికా వెళ్లిపోయాను. కానీ అక్కడ మనసు నిలవలేదు. తిరిగివచ్చేశాను. నేరుగా ముక్తబోధ ఆశ్రమం చేరాను.

**అమెరికాలో పుట్టి ఆస్ట్రేలియాలో పెరిగాను. నా 19వ ఏట మొదటి సారిగా భారతదేశం వచ్చాను. నా స్నేహితురాలికి ముంబయ్ సమీపంలోని గణేశ్‌పురిలోని ముక్తబోధానంద ఆశ్రమంతో అనుబంధం ఉండేది. ఆమెతో పాటు ఆశ్రమానికి రాగానే ఏదో దివ్వలోకంలోకి అడుగు పెట్టినట్టయింది.**

గురువులు తమ జీవితంతో పాటు ఎన్నో జీవితాలను పరి పూర్ణం చేస్తారు. భార తీయ సంస్కృతి గొప్పదనాల్లో ఒకటి గురుపరంపర.

భారతీయుల ధార్మిక సంపద అయిన వేదాల్లో ఇప్పుడు మనకు అందు బాటులో ఉన్నది నామమాత్రమే.

అది నా జీవితాన్ని మలుపుతిప్పిన రోజు. సత్సంగ్ జరుగుతుండగా స్వామీజీ నన్ను పిలిచి శాలువా కప్పారు. వాత్సల్యంతో నా వీపుతట్టారు. నా కళ్లలోకి చూస్తూ మందహాసం చేశారు. నాలో ఆధ్యాత్మిక తరంగాలు ప్రసరించాయి. దివ్యమైన అనుభూతికి లోనయ్యాను. దీక్షాస్వీకారం జరిగిపోయింది... నా ఆధ్యాత్మిక ప్రయాణం మొదలైంది. ఆ రోజు నుంచి ఆశ్రమ జీవితం.... సత్యాన్వేషణ మొదలైంది. గురువులు తమ జీవితంతో పాటు ఎన్నో జీవితాలను పరిపూర్ణం చేస్తారు. భారతీయ సంస్కృతి గొప్పదనాల్లో ఒకటి గురుపరంపర. అటువంటి గురువు సన్నిధి లభించడం నా అదృష్టం. ముక్తానంద ఆశ్రమం నిర్మలతకు, ఆధ్యాత్మిక వైభవానికి నిదర్శనం. అంతరంగ స్వేచ్ఛకు ముక్తానంద పెద్దపీట వేసేవారు. సత్సాంగత్యం, అధ్యయనం, నిరంతర అన్వేషణ, యోగ సాధన, భజనలు నిత్యకృత్యాలయ్యాయి. దేశమంతా తిరిగాను. నా పేరు.. మనసు అంతా భారతీయం అయిపోయాయి. వేదాలు, వేదాధ్యాయులు కనుమరుగు కావడం పట్ల ముక్తానంద ఆవేదన వ్యక్తం చేసేవారు. అంతరించి పోతున్న వేద ప్రతులను, వేద సంస్కృతిని పరిరక్షించే సంకల్పంతో ఆయన ముక్తబోధ భారతీయ తత్త్వపరిశోధన సంస్థను ఏర్పాటు చేశారు. ప్రపంచ దేశాలకు చెందిన ఎందరో ప్రముఖులు ఈ సంస్థకు వెన్నుదన్నుగా నిలిచారు. భారతీయుల ధార్మిక సంపద అయిన వేదాల్లో ఇప్పుడు మనకు అందుబాటులో ఉన్నది నామమాత్రమే. మిగిలిన వేద సంపద అంతా ఏమైందని పరిశోధన ప్రారంభించాం. సనాతన కుటుంబాలు, వేద సంస్థల నుంచి ఎన్నోతాళపత్ర గ్రంథాలు సేకరించాం. అవి శాశ్వతంగా, అందరికీ అందుబాటులో ఉండేందుకు వీలుగా ఇంటర్నెట్‌లో ఉంచాం.

కాశ్మీర్ శైవం, శక్తి ఆరాధన, అద్వైత, ఏకదేవోపాసన పథంలో సమున్నతమైనదని ముక్తబోధానంద చెబుతూ ఉండేవారు. శివ సూత్రాలకు మూలం కూడా కాశ్మీర్ శైవమే. అయితే వాటికి ఏమాత్రం గ్రంథాధారం లేదు. వాటి అన్వేషణలో భాగంగా కాశ్మీర్ వెళ్లాను. పురాతన గ్రంథాల కోసం శ్రీనగర్‌లోని మ్యూజియం గ్రంథాలయానికి వెళ్లాను. కాశ్మీరీ శైవం గురించి అడిగితే నిర్వాహకులు గ్రంథాలయం వెనుక పాడుబడిన ఓ రేకుల షెడ్డును చూపారు. అది తెరిచి చూస్తే దుఃఖం, ఆనందం రెండు భావనలు ఏకకాలంలో కలిగాయి. అక్కడ అమూల్యమైన గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. అయితే అవన్నీ ఎలుకలకు ఆహా

రంగా, చెదలు పట్టిపోయి మిగిలాయి. వాటిని ఫొటోలు తీసి, కంప్యూటర్‌లో భద్రపరిచాం. కాశ్మీర్ శైవం గురించి 11వేల గ్రంథాలుండాలని విన్నాం. ఇప్పటి వరకు మనకు వెయ్యి మంత్రాలు మాత్రమే లభించాయి. అద్భుతమైన వేద సంపదను కోల్పోయాం. ముక్తబోధ డిజిటల్ లైబ్రరీలో ప్రస్తుతం 75కి పైగా అపురూప గ్రంథాలున్నాయి. మరిన్ని గ్రంథాలను, తాళపత్రాలను సేకరించి, పరిరక్షించేందుకు నిరంతరం కృషి చేస్తున్నాం.

**కాశ్మీర్ శైవం గురించి 11వేల గ్రంథాలుండాలని విన్నాం. ఇప్పటి వరకు మనకు వెయ్యి మంత్రాలు మాత్రమే లభించాయి.**

ఆధునిక యుగంలో వేదవిజ్ఞానంపై దృష్టి సారించడం ఎంత వరకు సాధ్యం అని కొందరు సందేహం వ్యక్తం చేస్తున్నారు. కానీ ప్రతి ఒక్కరూ కాలానుగుణంగా జీవించాల్సిందే. అయితే సమున్నతమైన సనాతన ధర్మాన్ని కూడా పరిరక్షించుకోవాలి. ఇది ప్రతి ఒక్కరి విధి. ఆధునికంగా ఉన్నంత మాత్రాన జీవితం పరిపూర్ణం కాదు. వేద సంస్కృతిని అనుసరిస్తేనే ఆనందమార్గం కనిపిస్తుంది. కేవలం వేదాలు చదవడం కాదు. వాటిని అనుసరించాలి. వేదసాధన వల్ల మనసులో చక్కని భావతరంగాలు జనిస్తాయి. అవి మనల్ని, మన పరిసరాలను ఆనందమయం చేస్తాయి. ఇదే విశ్వకల్యాణ సూత్రం అన్నారామె. వేదాలే కాదు కబీర్, తులసీదాస్ వంటి మహనీయులు భారతీయ తత్త్వసారాన్ని సులభశైలిలో చిన్నచిన్న గీతాలుగా ప్రపంచానికి అందించారు. దక్షిణాదిలో కూడా అంటువంటి మహనీయులు మరెందరో ఉన్నారు. వారి బోధలన్నీ అమృతగుళికలే. మూడు దశాబ్దాల ఆధ్యాత్మిక ప్రస్థానంలో ఎన్నో అద్భుతమైన అనుభూతుల్ని సొంతం చేసుకున్నాను. సిద్ధయోగ నాకు అలౌకిక అనుభూతిని ఇస్తుంది. ఇది భక్తి, జ్ఞాన, కర్మ మార్గాల సమన్వయం అని నేను అనుకుంటాను. మరాఠీ అభంగాలు, కబీర్ తత్త్వాలంటే నాకు ప్రాణం. భారతీయ వేదాంతానికి ఇలా సేవచేయగలగడం నిజంగా నా అదృష్టం. నేను జ్ఞానిని కాదు... కేవలం జ్ఞానుల సేవికను అంతే.

– మార్చి 2, 2007

**వేదసాధన వల్ల మనసులో చక్కని భావతరంగాలు జనిస్తాయి. అవి మనల్ని, మన పరిసరాలను ఆనందమయం చేస్తాయి.**



**ఆయన మాట ఎదుటి వారిని మంత్రముగ్ధం చేస్తుంది. మాటలోని భావం ఆలోచనను తట్టిలేపుతుంది. వేదశాస్త్రాలు, జీవిత రహస్యాలు ఆయనకు కొట్టినపిండి. రామకృష్ణ పరమహంస నడయాడిన బేలూరులో ఆయన ప్రపంచానికి కొత్తమార్గం చూసేందుకు నడుంకట్టారు. ఆయనే బేలూరులోని వివేకానంద విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ స్వామి ఆత్మప్రియానంద. రసాయనశాస్త్రంలో డాక్టరేట్ చేసి, ఆధ్యాత్మిక మార్గం పట్టిన ఆత్మప్రియానంద మార్గం.**



# అందరి మేలు కోరితేనే ఆనందం



మనిషి అశాంతికి అతి పోటీతత్త్వం, అనుకరణలే మూలకారణాలు. మితిమీరిన పోటీతత్త్వం వల్ల మనలో వస్తులాలస పెరుగుతోంది. డబ్బు చుట్టూ తిరగక తప్పని పరిస్థితి ఏర్పడుతున్నది. ఫలితంగా రాగ ద్వేషాలు... చివరకు అశాంతి.



జీవిత పరమావధి ఆనందం. కానీ ఆ ఆనందం చాలా మందికి అందడం లేదు. ప్రస్తుత సమాజంలో ప్రతిఒక్కరిలో అలజడి...అశాంతి కనిపిస్తున్నది. ఎవరి మీదా, చివరికి మన మీద మనకే నమ్మకం లేకపోవడం ఈ అశాంతికి కారణం. అశాంతి ఉన్న చోట ఆనందం ఒక్క క్షణం కూడా నిలవదు. అందుకే ప్రతి ఒక్కరూ యోగ ధ్యానాల వైపు పరుగులు తీస్తున్నారు. యోగా,ధ్యానాలు మంచివే. అయితే నీలో రగులుతున్న అశాంతికి శాశ్వత పరిష్కారం నీలోనే ఉంది. మనిషి అశాంతికి అతిపోటీతత్త్వం, అనుకరణలే మూలకారణాలు. మితిమీరిన పోటీతత్త్వం వల్ల మనలో వస్తులాలస పెరుగుతోంది. డబ్బు చుట్టూ తిరగక తప్పని పరిస్థితి ఏర్పడుతున్నది. ఫలితంగా రాగ ద్వేషాలు... చివరకు అశాంతి. ఎదుటి వారిని, ఎదుటి సమాజాన్ని అనుకరించి జీవించడం తేలికే. అందులో సృజనాత్మకత ఉండదు. సృజన లేని చోట సంతృప్తి ఉండదు. అందుకే ఆనందం అందనిపండుగా మారుతున్నది. ప్రజలు ఈ స్థితి నుంచి మేలుకోవాలి. మితిమీరిన పోటీతత్త్వానికి, అనుకరణకు స్వస్తి చెప్పి నీలో ఉన్న అంతర్గత శక్తిని గుర్తించాలి. ధార్మిక జీవనం అందుకు తోడ్పడుతుంది. నీలోనే ఉన్న ఆ శక్తే నీకు ఆనందమార్గం చూపుతుంది.

వివేకానంద విశ్వవిద్యాలయం మిగిలిన విశ్వవిద్యాలయాల కన్నా పూర్తిగా భిన్నమైనది. పశ్చిమ బెంగాల్‌లోని బేలూర్

మఠం రామకృష్ణ పరమహంస ఆధ్యాత్మిక తరంగాలతో పునీత మైన కేంద్రం. స్వామి వివేకానంద తాత్త్విక ప్రేరణ పొందిన స్థలం. మన విద్యా విధానం పరిపూర్ణంగా లేదని, విద్యార్థులను పరిపూర్ణులుగా తీర్చిదిద్దే విద్యావిధానంతో అంతర్జాతీయ స్థాయిలో ఓ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని వివేకా నంద సంకల్పించారు. తదనుగుణంగా 1941లో సనాతన ధర్మం, ఆధునిక విద్యలను సమన్వయం చేస్తూ బేలూరులో ఓ విద్యా కేంద్రాన్ని ప్రారంభించాం. అది విశ్వవిద్యాలయంగా ఎదిగేందుకు 54 ఏళ్ల సమయం పట్టింది. ఎన్నో అవరోధాలు.... మరెన్నో చిక్కులను అధిగమించాక 2005లో పశ్చిమబెంగాల్ లోని బేలూరులో రామకృష్ణ మిషన్ వివేకానంద డీమ్డ్ విశ్వవి ద్యాలయం ప్రారంభమైంది. ''ఆత్మనో మోక్షార్థం జగత్ హితా యచ'' అంటే నీవు అభివృద్ధి చెందాలి... అదే సమయంలో ప్రపంచహితం కూడా చూడాలని దీని అర్థం. విద్య... విజ్ఞానాల పరమావధి అదే. ప్రస్తుత విద్యావిధానం జ్ఞానం సంగతి అటుంచి చివరకు ఉపాధిమార్గం చూపడంలో కూడా విఫలం అవుతున్నది. స్వహితమే సాధ్యం కానప్పుడు లోకహితం ఊసె క్కడిది, అందుకే మా విశ్వవిద్యాలయం లోకకల్యాణానికి తోడ్పడే కోర్సులను ప్రారంభించింది.

మానసిక, శారీరక వికలాంగులకు విద్యనేర్పే టీచర్లకు శిక్షణ ఇచ్చే కేంద్రాన్ని కోయంబత్తూర్‌లో, బెంగాల్‌లోని నరేంద్రపూ ర్‌లో, జార్ఖండ్‌లోని రాంచీలో వ్యవసాయం, బయోటెక్నాలజీ, గిరిజనుల వికాసంపై కోర్సులు ప్రారంభించాం. బేలూరు, మైసూరులలో ధార్మిక, నైతిక జీవనంపై కోర్సులు నడుపు తున్నాం. మానవాళికి సంకటంగా మారిన ప్రకృతి వైపరీత్యా లపై కూడా కోర్సులు మొదలుపెట్టాం. ప్రభుత్వం విస్మరించిన రంగాలన్నింటిపైనా దృష్టిసారించి, దేశవ్యాప్తంగా ఉన్న రామ కృష్ణ మఠాలను కేంద్రాలుగా చేసుకొని డీమ్డ్ విశ్వవిద్యాల యాన్ని నిర్వహిస్తున్నాం. లోకకల్యాణం కోసం ఏర్పాటైన ఈ సరస్వతీ మందిరం నడవాలంటే నిధులు కావాలి. అందుకు ప్రజలే నడుంకట్టాలి. విశ్వవిద్యాలయం పరిపుష్టికి తోడ్పడాలను కొనే వారు స్వామి ఆత్మప్రియానంద, వైస్ చాన్సలర్, రామకృష్ణ మఠం వివేకానంద డీమ్డ్ విశ్వవిద్యాలయం, బేలూర్ మఠ్‌పోస్ట్, హౌరా జిల్లా, పశ్చిమబెంగాల్ ఫోన్ 033–26549999లో సంప్రదించవచ్చు.

**విద్యార్థులను పరిపూర్ణులుగా తీర్చిదిద్దే విద్యావిధానంతో అంతర్జాతీయ స్థాయిలో ఓ విశ్వవిద్యాలయం ఏర్పాటు చేయాలని వివేకానంద సంకల్పించారు.**

ప్రస్తుత విద్యావిధానం జ్ఞానం సంగతి అటుంచి చివరకు ఉపాధి మార్గం చూపడంలో కూడా విఫలం అవుతున్నది. స్వహితమే సాధ్యం కానప్పుడు లోకహితమెక్కడ.

చదువే వ్యక్తి వికాసానికి తద్వారా ప్రపంచ ప్రగతికి తోడ్పడుతుందని వివేకానంద గట్టిగా నమ్మేవారు.

చదువే వ్యక్తి వికాసానికి తద్వారా ప్రపంచ ప్రగతికి తోడ్పడుతుందని వివేకానంద గట్టిగా నమ్మేవారు. కోరుకుంటే జీవితాంతం చదువుకొనేందుకు వీలుగా విద్య మన గడప దగ్గరకు రావాలనేవారు. దూరవిద్యను శతాబ్దం క్రితమే ఆయన తలపోశారు. ఆధునిక విద్యను సుసంపన్నం చేయడంతో పాటు మనిషి జీవితాన్ని పరిపూర్ణం చేసే వేదవిద్యను కూడా సమ్మిళితం చేసి మా విశ్వవిద్యాలయంలో కోర్సులను రూపొందించాం. మనిషి ప్రశాంతంగా జీవించడంతో పాటు మానవకల్యాణానికి తోడ్పడే విద్య కోసం వివేకానందులు కలలు కన్నారు. ఆయన కలలను సాకారం చేయడమే మా కర్తవ్యం.

– మార్చి 9, 2007

మనిషి ప్రశాంతంగా జీవించడంతో పాటు మానవకల్యాణానికి తోడ్పడే విద్య కోసం వివేకానందులు కలలు కన్నారు.

## శాంతి మంత్రం

**ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః**
**స్థిరైరంగైస్తుష్టువాగ్ం సస్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః**
**స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః**
**స్వస్థినస్తార్క్ష్యో అరిష్టనేమి స్వస్తినో బృహస్పతిర్దధాతు**
**ఓం శాంతి శాంతి శాంతిః**

**భావము:** ఓ పరమాత్మా.. మా చెవులు శుభాలనే వినుగాక. మా నయనాలు మంచినే చూడుగాక. సంపూర్ణ ఆరోగ్యంతో, స్థిరచిత్తంతో ఆ భగవంతుడిని ప్రార్థిస్తూ, మాతో పాటు సకల జనావళికి ఉపయోగపడేలా మా జీవితాలు ఉండుగాక.





**సనాతన సంప్రదాయానికి, ధార్మిక జీవనానికి, భాషా పాండిత్యానికి ఆయన నిలువెత్తురూపం. ఏడున్నర దశాబ్దాల చరిత్రకు ఆయన అపురూప సాక్ష్యం. ఈ కాలంలో కోర్కెల ఎండమావుల వెంట పెరిగెడుతూ, అర్థానికి పెద్దపీట వేస్తున్నారు. అదే అన్ని అనర్థాలకు కారణం అంటున్నారు శ్రీమాన్ కె.వి.రాఘవాచార్యులు. 19 ఆధ్యాత్మిక గ్రంథాలు రచించిన ఆయన ముందు స్వర్ణకంకణాలు, ఉగాది పురస్కారాలు ప్రణమిల్లాయి.**

# దరిచేర్చే ధర్మాచరణ

స్వాతంత్ర్య ఉద్యమ స్ఫూర్తితో ప్రతి ఒక్కరూ రగిలిపోతున్న రోజులవి. రజాకార్ల ఉద్యమం ఊపందుకుంటున్నది. అప్పుడు నాకు 17 ఏళ్లు. మా ఊరి పరిసరాల్లో ఉన్న ఏడు గ్రామాల వారందరినీ ఒక చోట చేర్చాం. వారందరినీ సంఘటితం చేసి, ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనేందుకు సిద్ధం చేయాలనుకున్నాం. వందలాది మందిని కలిసినడిపించే శక్తి భక్తికే ఉంది. అందుకే రోజూ సాయంత్రం ప్రవచనాలు, భజనలు, పూజలు ఏర్పాటు చేశాం. 40 రోజుల పాటు ఆ పల్లెలన్నీ భక్తి పారవశ్యంతో ఊగిపోయాయి. ఇంత మందిని కూడగట్టి ఏదో గూడుపుఠాణీ చేస్తున్నామని సైనికులకి అనుమానం వచ్చింది. మమ్మల్ని పట్టుకెళ్లి బాగా కొట్టారు. ఆ తరువాత ఊరు ఊరంతా మాకు అండగా వచ్చింది. సైనికులకు దేహశుద్ధి చేసి తరిమి కొట్టారు. వారిలో భక్తి రగిలించిన శక్తి అది. ఆ రోజు సాయంత్రం రేడియోలో ప్రకటించారు. మనకు ఆజాద్ అయిందని....స్వేచ్ఛా వాయువుల తొలిస్పర్శ.. సుదీర్ఘ దాస్యం వీడిన అద్భుత అనుభూతి...

**ఈ కాలంలో ధార్మిక జీవనం మృగ్యం కావడంపై వ్యాఖ్యానిస్తూ మనిషి కోర్కెల ఎండమావుల వెంట పరుగుతీస్తున్నాడు. సౌకర్యాల చింత పెరిగిపోయింది. కోరిక అనేది ఉండాల్సిందే కానీ దానికి పరిమితి ఉండాలి. అర్థం, కామం పెరిగిపోయి ధర్మం తగ్గిపోయింది.**

కరీంనగర్ జిల్లా సిరిసిల్ల తాలూకా నారాయణపురంలో 1929లో జన్మించాను. మా తండ్రిగారు రామాలయంలో స్థానాచార్యులుగా ఉండేవారు. సంచారం సాగిస్తూ ప్రవచనాలు చేసేవారు. నారాయణపురం సకల కళలకు కోవెలగా ఉండేది. వేద పండితులు మొదలుకొని, కళా నిష్ణాతులు, సాహితీ దురంధరు

నారాయణపురం సకల కళలకు కోపెలగా ఉండేది. వేదపండితులు మొదలుకొని, కళా నిష్ణాతులు, సాహితీ దురంధరులకు నెలవుగా ఉండేది.

లకు నెలవుగా ఉండేది. చుట్టుపక్కల ఏడు గ్రామాలకు మా గ్రామం పెద్దదిక్కు. పైరుపచ్చలతో, ఆధ్యాత్మిక చింతనతో, ఆ పల్లె కళకళలాడుతూ ఉండేది. ప్రజలు సుఖసంతోషాలతో హాయిగా ఉండేవారు. ఇప్పుడు ఆ పల్లెలను చూస్తే గుండె నీరవుతుంది. గ్రామంలో కానీ, పల్లె ప్రజల కళ్లలో కానీ జీవం కనిపించడం లేదు. మా తండ్రిగారు వేదనిష్ణాతులు. చిన్నతనం నుంచే మాకు వేదం నేర్పడం ప్రారంభించారు. ఉదయం వేద పాఠం, సాయంత్రం సంస్కృతం, ద్రావిడ ప్రబంధాలు నేర్పేవారు. ఎనిమిదేళ్ల వయసు వచ్చే సరికి వేదం కరతలామలకమయింది. పండితగోష్ఠులకు, ప్రవచనాలకు నాన్నగారి వెంట వెళ్లేవాడిని. ఆ రోజుల్లో ప్రతి ఒక్కరిలో గొప్ప జ్ఞాన తృష్ణ కనిపించేంది. నిరంతర అధ్యాయన శీలంతో జీవితాన్ని ఆనందమయం చేసుకొనే వారు. తండ్రిగారి వద్ద వేదం, సంస్కృతం నేర్చుకున్నాకానీ ఆ పాండిత్యానికి తగిన గుర్తింపు లేదనిపించింది. నాన్నగారికి చెబితే పట్నం వెళ్లనివ్వరు. లాభంలేదనుకొని ఇంట్లో చెప్పకుండా లారీ పట్టుకొని హైదరాబాద్ చేరాను. సారస్వత పరిషత్ వారు నా పాండిత్యాన్ని పరీక్షించారు. నా విద్యను మెచ్చుకున్నారు. అలా ప్రవేశ పరీక్షకు అర్హత సంపాదించాను. నేను హైదరాబాద్‌లో ఉన్నానని కనుక్కొని నాన్నగారు నా గదికి వచ్చారు. పట్నానికి వచ్చినా నా వంట నేను చేసుకొని, నిత్యం దేవతార్చన చేయనిదే ముద్ద ముట్టేవాడిని కాదు. ఈ రోజుకీ స్వయంపాకం, ఏకభుక్తమే. పట్నానికి వచ్చినా ధర్మమార్గాన్ని వీడలేదంటూ నాన్నగారి పాదాలమీద పడి బావురుమన్నాను. బోధన మీద నాకున్న శ్రద్ధను గమనించి పట్నంలో ఉండేందుకు ఆయన సరే అన్నారు. వేదాధ్యయనం అపారమైన ధారణ శక్తిని ఇస్తుంది. మూడు మాసాల్లో ఏడోతరగతి వరకు అన్ని పుస్తకాలను ఔపోశన పట్టేశాను. ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడనై 1950లో సంగారెడ్డి సమీపంలో టీచర్‌గా ఉద్యోగ జీవితం ప్రారంభించాను. 37 ఏళ్ల ప్రాయంలో ఎం.ఎ చేశాను. ఆదిలాబాద్‌లో తెలుగు లెక్చరర్‌గా 17 ఏళ్ల పాటు పనిచేసి 1989లో పదవీవిరమణ చేశాను.

వేదాధ్యయనం అపారమైన ధారణ శక్తిని ఇస్తుంది. మూడు మాసాల్లో ఏడో తరగతి వరకు అన్ని పుస్తకాలను అవుపోశన పట్టేశాను.

ఆ కాలంలో చక్కటి సాహితీ వాతావరణం ఉండేది. సంస్కృతాంధ్రాలు బాగా ఒంటపట్టడంతో సాహితీ రచన చేయమని మిత్రులు ప్రోత్సహించారు. కొందరు నవలా రచన చేస్తే కీర్తి, కనకం రెండూ వస్తాయన్నారు. నాకెందుకో మనస్క

రించలేదు. ఈ జన్మను ఇచ్చిన పరిమేష్టికి మనం ఏం ఇవ్వ గలం? ఆయన సేవకే నా అక్షరం వినియోగిస్తాను తప్ప మరో రచన చేయకూడదనుకున్నాను. 1983లో నా తొలి రచన మాఘ కావ్య వైభవం యువభారతిలో ప్రచురితం అయింది. ఇటీవల రచించిన అభితిస్తవం నా 19వ గ్రంథం. శ్రీ రంగనాథ పాదుకా సహస్రం నాకు చాలా సంతృప్తిని ఇచ్చిన గ్రంథం. భక్తి సాహిత్యాన్ని ప్రచురిస్తూ, ధార్మికతను పెంపొందిస్తున్న అహో బిల మఠం వారు ఎంతగానో అభినందనీయులు. మనిషి కోర్కెల ఎండమావుల వెంట పరుగుతీస్తున్నాడు. సౌకర్యాల చింత పెరిగిపోయింది. కోరిక అనేది ఉండాల్సిందే కానీ దానికి పరిమితి ఉండాలి. అర్థం, కామం పెరిగిపోయి ధర్మం తగ్గి పోయింది. ప్రస్తుత అనర్థాల్నింటికీ ఇదే కారణం. గతిశీలత నుంచి ప్రగతి సాధించాలి కానీ అధోగతి కాదు. ఇంద్రియాలు నిన్ను లాగుతూ ఉంటాయి. నీలో ఉన్న విచక్షణను మేలుకొ ల్పితే ఇంద్రియాలు అదుపులో ఉంటాయి. జీవితం ఆనంద మయం అవుతుంది. అందుకు ధార్మిక జీవనం ఒక్కటే మార్గం. ధర్మంగా జీవిస్తే అర్థం, కామ, మోక్షాలు వాటంతట అవే లభి స్తాయి. ధర్మ, అర్థ, కామాలను త్రికోణంతో పోల్చారు. త్రికోణం అడుగు భాగం ప్రపంచం అయితే కుడి, ఎడమల ఉండే రేఖలు అర్థ, కామాలు. శిఖరాగ్రంలో ధర్మం ఉంటుంది. కానీ ఇప్పుడు ఆ త్రికోణం తిరగబడింది. ధర్మానికి ప్రాధాన్యం తగ్గింది. పూర్వ వైభవం సాధించి, మళ్లీ ధార్మిక జీవనం పెంపొందాలంటే బాల్యం నుంచే ఆచార సంప్రదాయాలు నేర్పాలి. వాటి వల్ల మనిషికి నేర్పు... ఓర్పు రెండూ అలవడతాయి. సంస్కృత విద్యను ఇప్పుడు మార్కుల కోసం చదువుతున్నారు. అక్షరాన్ని అర్థయుతంగా తెలుసుకుంటే జీవితం చరితార్థం అవుతుంది. సత్సాంగత్యం పెరగాలి. తద్వారా పరహితం పెరుగుతుంది. అదే జీవితానికి ఆనందమార్గం.

– మార్చి 30, 2007

**కోరిక అనేది ఉండా ల్సిందే కానీ దానికి పరిమితి ఉండాలి. అర్థం, కామం పెరిగి పోయి ధర్మం తగ్గి పోయింది. అనర్థాల న్నింటికీ ఇదే కారణం.**

మళ్లీ ధార్మిక జీవనం పెంపొందాలంటే బాల్యంనుంచే ఆచార సంప్రదాయాలు నేర్పాలి. వాటి వల్ల మనిషికి నేర్పు... ఓర్పు రెండూ అలవడతాయి.





**తెలుగునేలపై పుట్టినా విదేశీ భాషలతో పాటు దాదాపు అన్ని భారతీయ భాషల్లో ఐదు దశాబ్దాల పాటు వేలాది పాటలతో గానామృతాన్ని పంచారు ఎస్. జానకి. నీ లీల పాడెద దేవా.. అంటూ సన్నాయికి దీటుగా అద్భుతంగా పాడి సంచలనం సృష్టించారు. శ్రీకృష్ణుడు నాలో ఉన్నాడు. నా పాటకు ప్రాణం ప్రేరణ ఆయనే. ఈ జన్మకు ఈ భాగ్యం చాలు. ఇక కోరేదల్లా కైవల్యమే అంటున్న జానకి భక్తిగీతం.**

# పాడించేది పరమాత్ముడే

ఓంకారం ప్రణవనాదం. నాదంలో పరమాత్మ ఉంటాడు. పాట మనల్ని తన్మయుల్ని చేస్తుంది. మంచి పాట వింటే ఎవరైనా మైమరచిపోతారు. ఆ తాదాత్మ్యమే పారమార్థిక స్థితి. అంతర్యామి ఎక్కడో ఉండడు. మీలో... నాలో ప్రతి ఒక్కరిలోనూ ఉంటాడు. సాధన ద్వారా మనలోని స్వామిని దర్శించుకోగలగాలి. సంగీతం, నాట్యం భగవంతునికి చేరువ అయ్యేందుకు ఉత్తమ మార్గాలు. నావరకు నాకు సంగీతమే దైవం. పాటలోనే భగవంతుడిని చూస్తాను. కృష్ణపరమాత్మ నాలో ఉండి ఇన్ని పాటలు పాడించాడు. భక్తి, తాత్త్విక, సరస శృంగార గీతాలు ఏవి పాడినా అంతా ఆయన కృపే. ఆ గోపికా మనోహరుడు లేనిదే నేను లేను.. నా పాటా లేదు.



**రాజమండ్రిలో ప్రముఖ నాదస్వర విద్వాంసులు పైడిస్వామి వద్ద సంగీతం నేర్చుకున్నాను. అంతకు మించి శాస్త్రీయ సంగీతం పెద్దగా నేర్చుకున్నది లేదు. చిన్నతనం నుంచే పాటల పోటీల్లో పాల్గొనేదాన్ని.**



గుంటూరు జిల్లా రేపల్లె దగ్గర్లోని పల్లపట్ల మాది. 1938లో పుట్టాను. మూడో ఏట నుంచే సంగీతం అంటే ఇష్టంగా ఉండేది. మాది సంప్రదాయ కుటుంబం. మడి, ఆచారం, పూజలు, పునస్కారాలతో మా ఇల్లు నిత్యం దేవాలయంలా ఉండేది. మా అమ్మగారు కృష్ణ భక్తురాలు. ఆ వేణుగానలోలునిపై ఆమెకు వచ్చిన రీతిలో పాటలు పాడుతూ ఉండేది. ఆ పాటలను నేను శ్రద్ధగా ఆలకిస్తూ ఉండేదాన్ని. ఆమె పాటలకే కాదు తను ఆరాధించే కృష్ణుడికి కూడా నేను క్రమంగా భక్తురాలినయ్యాను. పాట నాకు జన్మతః అబ్బిందనే చెప్పాలి. నా పదో ఏట ఓ ఏడాది పాటు రాజమండ్రిలో ప్రముఖ నాదస్వర విద్వాంసులు పైడి

స్వామి వద్ద సంగీతం నేర్చుకున్నాను. అంతకు మించి శాస్త్రీయ సంగీతం పెద్దగా నేర్చుకున్నది లేదు. చిన్నతనం నుంచే పాటల పోటీల్లో పాల్గొనేదాన్ని. ఆల్ ఇండియా రేడియో నిర్వహించిన పాటల పోటీల్లో గెలుపొంది అప్పటి రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్రప్రసాద్ చేతుల మీదుగా అవార్డు తీసుకోవడం చిరుప్రాయంలో ఓ మధురమైన అనుభూతి. 19 ఏళ్ల వయసులో మద్రాసు చేరుకున్నాను. ఆచార సంప్రదాయాలను త్రికరణశుద్ధిగా పాటించే నేల అది. సంప్రదాయ సంగీత పండితులకు పుట్టినిల్లు. అటువంటి చోట బెరుకుబెరుగ్గా 1957లో గాయనిగా నా ప్రస్థానానికి నాంది జరిగింది. ఈ 50 ఏళ్లలో జర్మన్, ఇంగ్లీషుతో పాటు అన్ని భారతీయ భాషల్లో సుమారు 20 వేల పాటలు పాడాను. నాలుగు సార్లు జాతీయ స్థాయిలో ఉత్తమ గాయని పురస్కారం అందుకున్నాను. 10 సార్లు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఉత్తమ గాయని పురస్కారం, 14 సార్లు కేరళ ఉత్తమ గాయని పురస్కారం. 7 సార్లు తమిళనాడు ఉత్తమ గాయని పురస్కారం అందుకున్నాను. కలైమామణి, సర్‌సింగార్‌తో పాటు పలు పురస్కారాలు అందుకున్నాను. నేను పాడినా, ఇన్ని అవార్డులు వచ్చినా అవన్నీ ఆ మురళీగానలోలుని అనుగ్రహం. ఆయన నాతో... నాలో ఉండి ఇన్ని పాటలు పాడించాడు... నేను కేవలం నిమిత్తమాత్రురాలిని.

**నేను పాడినా, ఇన్ని అవార్డులు వచ్చినా అవన్నీ ఆ మురళీ గానలోలుని అను గ్రహం. ఆయన నాతో... నాలో ఉండి ఇన్ని పాటలు పాడించాడు.**

కృష్ణ భక్తి తల్లి నుంచి అబ్బింది. ఆ తరువాత షిర్డి సాయి పట్ల ఆకర్షితురాలినయ్యాను.

సాయి చరిత, ఆ మహనీయుని బోధనలు నన్ను అమితంగా ఆకర్షించాయి. మానవులంతా ఒక్కటే అనే ఆయన తత్త్వం, నియమాలు, నిష్టలు ఏవీ అవసరం లేదు. గుళ్ల గోపురాలు తిరగాల్సిన పనిలేదు...నీవే దిక్కు అంటూ నిండు మనసుతో స్మరిస్తే చాలు మనసు తన్మయమౌతుంది. షిర్డి సాయి మహిమ అంతటిది. అందుకే సాయి స్మరణం నాకు దినచర్య అయింది. చిన్నతనం నుంచి భక్తి, దైవారాధన ఉన్న కుటుంబాల్లో పెరగడం, మెట్టినింట్లో కూడా అదే వాతావరణం ఉండడంతో దైవారాధన అనేది నిత్యకృత్యం అయింది. రోజూ కొద్దిసేపు ధ్యానం చేసుకుంటాను. ధ్యానం ప్రారంభించిన మొదట్లో మనసు కుదురుగా ఉండేది కాదు. ఆలోచనల వలయాలన్నింటినీ ఛేదించి, మనసును ఓ దారికి తెచ్చే లోగా మళ్లీ ఏదో ఒక అవాంతరం వచ్చేది. ఆ మధ్య భీమిలి వెళ్లినప్పుడు సద్గురు శివా

దైవారాధన అనేది నిత్యకృత్యం అయింది. రోజూ కొద్దిసేపు ధ్యానం చేసుకుంటాను.

నంద మూర్తిగారిని కలిసి, నా అవస్థ గురించి చెప్పాను. ధ్యానం అంటే ఏదో ఓ గదిలో కూర్చొని నిశ్చలంగా చేయాల్సిన పని లేదు. నిరంతర భగవత్ చింతన కూడా ధ్యానమే... మీరు పాడే సమయంలో మనసంతా దానిపైనే లగ్నం చేసి పాడతారు.. అది కూడా ఓ రకంగా ధ్యానమే అన్నారు శివానందమూర్తి. అప్పటి నుంచి కుదిరినప్పుడల్లా ధ్యానం చేసుకుంటున్నాను. ధ్యానంతో తనువు తేలికవుతుంది. మనసు పులకితం అవుతుంది.

**సంగీతం నిరంతర ప్రవాహం. ఈ కాలంలో అమ్మాయిలు చాలా బాగా పాడుతున్నారు. అయితే చాలా మంది అనుకరణ మాయలో పడుతున్నారు.**

నేను పాడిన ప్రతి పాటా మనసు పెట్టి పాడాను. అన్నీ సంతృప్తినిచ్చేవే. ముఖ్యంగా భక్తి సంగీతంలో త్యాగరాజ కృతులు, సూర్‌దాస్, కబీర్‌దాస్, మీరా భజన్స్‌కు నేనే సంగీతం సమకూర్చుకొని పాడాను. కొన్ని భక్తి గీతాలకు రచన కూడా నేనే చేశాను. నేను స్వయంగా సంగీతం సమకూర్చిన కృష్ణ రవళి మంచి ఆదరణ పొందింది. తెలుగులో భక్తి గీతాలు, అయ్యప్ప గీతాష్టకం, శ్రీ వెంకయ్యారు సుప్రభాతం, షిర్డిసాయి గీతమాలిక వంటి క్యాసెట్స్, మరికొన్ని ఆల్బమ్స్ చేశాను. మురిపించే మువ్వల్లో 'నీ లీల పాడెద దేవా' కన్నడ చిత్రం హేమావతిలో 'శివశివ యన్నద నాళిగె యేకె' (శివ శివ అనని నాలిక ఎందుకు?)అనే పాట చాలా సంతృప్తినిచ్చిన పాటలు. సంగీతం నిరంతర ప్రవాహం. ఈ కాలంలో అమ్మాయిలు చాలా బాగా పాడుతున్నారు. అయితే చాలా మంది అనుకరణ మాయలో పడుతున్నారు. పాడే వేళ స్వరం, శైలి వారిదే ఆయి ఉండాలి. అప్పుడే వారు మరింతగా రాణించగలుగుతారు. ఈ కాలంలో భక్తికేం లోటు లేదు. గతంలో కంటే ప్రజల్లో భక్తి ఎక్కువగానే ఉంది. ఏ గుడికైనా వెళ్ళి చూడండి. పిల్లలు, యువత కూడా భక్తితో ప్రణమిల్లుతూ కనిపిస్తారు. కానీ ఆచార, సంప్రదాయాలు మాత్రం తగ్గాయనిపిస్తున్నాయి. ఆ పరమాత్మకు స్వరార్చన చేసేందుకు నాకు శక్తి ఉన్నంత వరకు ప్రయత్నిస్తాను. అంతా ఆ స్వామి లీలా విలాసం. ఇంకా ఇలా పాడగలగడం ఆయన కరుణే. ఈ ప్రయాణం ఇంతవరకు తృప్తిగా సాగింది. ఈ జన్మకు ఈ భాగ్యం చాలు.... మరు జన్మ లేకుండా మోక్షం ప్రసాదించమని ఆ సర్వాంతర్యామిని వేడుకుంటున్నాను.

**ఈ కాలంలో భక్తికేం లోటు లేదు. గతంలో కంటే ప్రజల్లో భక్తి ఎక్కువగానే ఉంది. ఆచార, సంప్రదాయాలు మాత్రం తగ్గాయనిపిస్తున్నాయి.**

– ఏప్రిల్ 6, 2007

**ఓ వంద మందిలో జ్ఞానజ్యోతిని వెలిగిస్తే ఆ తేజం వందలాది మందిని చేరి, వారికి దివ్యమార్గం చూపుతుందనేది ఆయన తత్వం. ఆధ్యాత్మికవాదులు కేవలం యజ్ఞయాగాదులకు పరిమితం కాకుండా సేవాభావం జోడిస్తే లోకకల్యాణం చేకూరుతుందన్నారు భీమవరం ఆశ్రమానికి చెందిన కృష్ణజ్యోతి స్వరూపానంద స్వామి ప్రజల్లో ఆధ్యాత్మిక జ్యోతుల్ని వెలిగించడంతో పాటు పలు సేవాకార్యక్రమాలు చేపడుతున్నారు.**



# జీవితాన్ని పండించే ప్రేమతత్వం

మన గురించి, మన జీవితాల గురించి అసంపూర్ణమైన జ్ఞానమే మనలో చెలరేగుతున్న అలజడికి కారణం. రాగద్వేషాలు లేని చోట అద్భుతమైన చైతన్యం ప్రవహిస్తూ ఉంటుంది. ఆ చైతన్యమే సమభావానికి, ప్రేమతత్త్వానికి నాంది పలుకుతుంది. వేద సంస్కృతి, ధార్మిక జీవనం పరిపూర్ణ జ్ఞానమార్గాన్ని చూపుతుంది. మంచి సాంగత్యం, సమతుల ఆహారం ఆ మార్గంలో ముందుకు సాగేందుకు తోడ్పడతాయి. విజయనగరం జిల్లా బొబ్బిలి నుంచి నా ప్రస్థానం మొదలైంది. తాతగారు, తల్లి ఉపాసకులు. చిన్నతనం నుంచే ఆధ్యాత్మిక చింతన మొదలైంది. ఆయుర్వేద వైద్యంతో ప్రజలకు చేరువగా ఉంటూ, వారి కష్టసుఖాలు తెలుసుకుంటూ ఉండేవాడిని. మనం ఎదుర్కొంటున్న అలజడికి, కష్టాలకు మూలాలు అన్వేషిస్తూ ఉండే వాడిని. సంసారజీవితం సాగించినా ఆ అన్వేషణ నిరంతరం నన్ను వెన్నాడేది. హిమాలయాలు వెళ్లాను. ఆరేళ్ల ఆధ్యాత్మిక పయనంలో ఎన్నో ఆశ్రమాలు సందర్శించాను. అన్ని చోట్లా ఏదో వెలితి.. అసంపూర్ణత. సమత్వ భావం లోపించడం, ప్రేమతత్త్వం వికసించకపోవడమే అసంపూర్ణతకు, అన్ని కష్టనష్టాలకు కారణం అనిపించింది. ఎక్కడో ముక్కుమూసుకొని తపస్సు చేసుకోవడం, సన్యాస జీవితం సాగించడం వల్ల నాకు ప్రయోజనం ఉండవచ్చు. అది ఒక రకంగా స్వార్థమే అవుతుంది. అందువల్ల ఒనగూడే ప్రయోజనం కూడా పరిమితంగానే ఉంటుంది. అందుకే నేను తెలుసుకున్న విషయాలను పది

హిమాలయాలు వెళ్లాను. ఆరేళ్ల ఆధ్యాత్మిక పయనంలో ఎన్నో ఆశ్రమాలు సందర్శించాను. అన్ని చోట్లా ఏదో వెలితి.. అసంపూర్ణత. సమత్వ భావం లోపించడం, ప్రేమ తత్త్వం వికసించకపోవడమే అసంపూర్ణతకు, అన్ని కష్టనష్టాలకు కారణం అనిపించింది.

పరుల హితం గురించి ఆలోచించినప్పుడు సమత్వ భావం ఉదయిస్తుంది. త్యాగ నిరతి పెరిగితే నీలోనే ఉన్న ప్రేమతత్త్వం వికసిస్తుంది.

మందికి చెప్పాలనుకున్నాను. భీమవరం సమీపంలో ఆశ్రమం ఏర్పాటు చేసి ధార్మిక కార్యక్రమాలకు శ్రీకారం చుట్టాను.

ప్రేమతత్త్వం ఎక్కడో ఉండదు. అది నీలో.. నాలో ... ప్రతి ఒక్కరిలో ఉంటుంది. మనలో నిగూఢంగా ఉన్న ఆ చైతన్యాన్ని వెలికి తీసుకు వచ్చేందుకు సాధన.. ధార్మిక చింతన అవసరం. ధార్మిక చింతన నీ గురించి నీవు ఆలోచించుకొనేలా చేస్తుంది. నీలో చైతన్యం నింపుతుంది. స్వార్థ చింతనను వీడేందుకు తోడ్పడుతుంది. స్వార్థం వదిలేసి తామరాకుమీద నీటి బిందువులా నీ పనులు నీవు చేసుకుంటూ పోవాలి. స్వహితమే కాకుండా పరుల హితం గురించి ఆలోచించినప్పుడు సమత్వ భావం ఉదయిస్తుంది. త్యాగ నిరతి పెరిగితే నీలోనే ఉన్న ప్రేమతత్త్వం వికసిస్తుంది. పరహితం కోరుతూ సేవా కార్యక్రమాలు నిర్వహించడం వల్ల జన్మ సార్థకం అవుతుంది. యజ్ఞాలు, యాగాలు నేరుగా వ్యక్తిలో మార్పు తెచ్చేందుకు తోడ్పడకపోవచ్చు. కానీ సమత్వ భావం పెంపొందించేందుకు ఇవి నాందిగా పనిచేస్తాయి. మహోన్నతమైన హైందవ సంస్కృతిలో కొందరు విజ్ఞులు సైతం మాదేవుడు గొప్ప అంటే మా దేవుడు గొప్ప అని వాదులాడుకోవడం వల్ల ప్రజలు అయోమయంలో పడుతున్నారు. భగవంతుడు ఒక్కడే. అలాంటప్పుడు ఈ వాదాలు ఎందుకని ప్రశ్నించారాయన. ఆ పరమాత్మ ఒక్కడే అన్నప్పుడు మనకు ఇందరు దేవుళ్లు ఎందుకనే ప్రశ్న రావడం సహజం. జీవితంలోని ఒక్కొక్క అంశానికి ఒక్కో దేవతను స్ఫూర్తిగా ఆరాధించడం మన సంప్రదాయం. చదువులకు సరస్వతిని, సిరిసంపదలకు లక్ష్మిని, ధైర్యానికి హనుమంతుడిని, శక్తికి సుబ్రహ్మణ్యేశ్వరుని ఇలా పలు దేవతా రూపాలను ఆరాధించినా భగవంతుడు ఒక్కడే. అందుకే శివకేశవులనే కాదు..సకల దేవతా రూపాలను ఆవాహన చేసి ఇక్కడ యాగం నిర్వహిస్తున్నాం. విభేదాలు వదిలేసి, సమత్వ భావాన్ని వ్యాప్తి చేసేందుకు ఈ యాగం తోడ్పడాలన్నదే మా సంకల్పం.

జీవితంలోని ఒక్కొక్క అంశానికి ఒక్కో దేవతను స్ఫూర్తిగా ఆరాధించడం మన సంప్రదాయం.

రాష్ట్రవ్యాప్తంగా యాగాలు నిర్వహిస్తున్నాం. నేను మహానుభావుడినని, నేను యాగం నిర్వహించినంత మాత్రాన ఆ ప్రభావంతో అందరూ ప్రేమమూర్తులు అవుతారని చెప్పడం లేదు. ఈ యాగం ఓ వంద మందిలో ప్రేమతత్త్వాన్ని నింపితే చాలు. ఆ వందమంది మరో వేయి మందిలో మార్పునకు ప్రయత్ని

స్తారు. నేను కోరుకొనేది అదే. భక్తుడు కనిపిస్తాడు... భక్తుడు పలికే నామం వినిపిస్తుంది. కానీ భగవంతుడు కనిపించడు. దీన్ని త్రివేణీ సంగమంతో పోల్చవచ్చు. గంగ,యమునలు కనిపిస్తాయి. సరస్వతీ నది కనిపించదు. కానీ అది లేదని చెప్పలేం కదా. భగవంతుడు ఎలా కనిపించడో ప్రేమ అనేది కూడా అంతే. భగవంతుడు, ప్రేమతత్త్వం ఈ రెండూ కనిపించక పోయినా అందరిలో చైతన్యం నింపి, బతుకులను పండిస్తాయి. అందుకే వాటిని మనం సాధన చేసి సాధించాలి. ఆధునిక జీవన పరిస్థితుల్లో ధార్మిక జీవనం సాగించడం కాస్త కష్టమే. కానీ స్వధర్మాన్ని ప్రతి ఒక్కరూ పాటించాల్సిందే. అరిషడ్వర్గాలను జయించి, రాగద్వేషాలకు అతీతంగా ఉండగలిగితే మనసు నిర్మలంగా ఉంటుంది. అప్పుడు నీ గురించే కాదు నీ ఎదుటి వారి గురించి కూడా ఆలోచించే వీలుంటుంది. అందరి సంక్షేమం కోసం కొందరైనా ఆలోచిస్తే అంతకు మించిన లోకకల్యాణం ఏముంటుంది. వేదసంస్కృతి మనతో పాటు అందరి గురించి ఆలోచించేందుకు తోడ్పడుతుంది. అందుకే సంస్కృత భాష, వేద సంస్కృతి వైభవాన్ని ప్రపంచవ్యాప్తం చేయాలన్నదే నా సంకల్పం. త్వరలో వేదపాఠశాలలు ప్రారంభించేందుకు కూడా ప్రయత్నాలు చేస్తున్నాం. సంకల్పం అయితే చెప్పుకున్నాం... ఆపై ఆ అంతర్యామి కృప.

– ఏప్రిల్ 13, 2007

**భగవంతుడు ఎలా కనిపించడో ప్రేమ కూడా అంతే. భగవంతుడు, ప్రేమతత్త్వం కనిపించకపోయినా అందరిలో చైతన్యం నింపి, బతుకులను పండిస్తాయి.**

వేదసంస్కృతి మనతో పాటు అందరి గురించి ఆలోచించేందుకు తోడ్పడుతుంది. అందుకే వేద సంస్కృతి వైభవాన్ని ప్రపంచవ్యాప్తం చేయాలనుకున్నాను.

## శాంతి మంత్రం

సర్వే సంతు సుఖినః సర్వే సంతు నిరామయా
సర్వే భాద్రాని పశ్యంతు మాకశ్చిద్ దుఃఖ భాగ్‌భవేత్

**భావం:** అందరూ సంతోషంగా ఉండాలి. అందరూ ఆరోగ్యంగా జీవించాలి. సమస్త జనావళి అనంత సౌందర్యాన్ని దర్శించాలి. అంతటా ఆనందం వెల్లి విరియాలి. దుఃఖ జాడ లేకుండా పోవాలి. అంతటా శాంతి నెలకొనాలి.



**ఆమె ఒక చైతన్య స్వరూపం. మూర్తీభవించిన శితతత్వం. విశ్వవ్యాప్తంగా ఉన్న లక్షలాది మంది బసవతత్వ అనుయాయులకు ఆమె ప్రత్యక్షదైవం. బసవతత్వాన్ని ప్రచారం చేస్తూ, విశ్వకల్యాణం కోసం కృషి చేస్తున్నారు బసవ ధర్మ పీఠ అధ్యక్షురాలు మాతమహాదేవి. భక్తి, కర్మ, జ్ఞాన, యోగమార్గాలను సమన్వయం చేసి పరిపూర్ణ యోగాన్ని ప్రతిపాదించారు బసవేశ్వరుడు. అదే ఆ పరమాత్మను చేర్చే మార్గం అంటున్నారామె.**



# సేవతో జన్మ సార్థకం

చిత్రదుర్గలో నేను ఫైనల్ బి.ఎస్‌సి చదువుతున్నప్పుడు లింగానంద మహా స్వామీజీ మా ఊరు వచ్చారు. ఆయన ప్రవచన కార్యక్రమానికి ప్రజలు తండోపతండాలుగా వెళుతున్నారు. నా ప్రమేయం లేకుండానే నా నడక అటువైపు సాగింది. లింగానంద స్వామి బసవేశ్వరుని గురించి చెప్పడం మొదలు పెట్టారు. ఆ ప్రసంగం మహాద్భుతం. బసవన్న అనుభవ మంటపాన్ని ఏర్పాటు చేశారు. దానిని మొదటి లోక్‌సభగా అభివర్ణిస్తారు. 770 మంది సన్యాసులు అందులో సభ్యులు. కుల, మత, లింగ ప్రస్తావనే లేదు. అందరూ చర్చలో పాల్గొని లోక కల్యాణానికి కార్యాచరణ రూపొందించే వారు.... అని స్వామీజీ ప్రసంగిస్తుంటే నాలో ఏదో దివ్యతేజస్సు ప్రవేశించింది. ఆధ్యాత్మిక ప్రస్థానానికి అలా నాంది జరిగింది. అందరూ సమానమనే బసవ తత్త్వం నన్ను కట్టిపడేసింది. ఆ తత్త్వాన్ని విశ్వవ్యాప్తం చేసేందుకు నడుం కట్టాను.



**స్వామీజీ ప్రసంగిస్తుంటే నాలో ఏదో దివ్యతేజస్సు ప్రవేశించింది. ఆధ్యాత్మిక ప్రస్థానానికి అలా నాంది జరిగింది. అందరూ సమానమనే బసవ తత్త్వం నన్ను కట్టిపడేసింది.**



బసవేశ్వరుడు 12వ శతాబ్దంలో ఉన్న ఛాందస వాదాన్ని సమూలంగా వ్యతిరేకించి, కొత్త సిద్ధాంతానికి నాంది పలికారు. ఆయన శైవ బ్రాహ్మణుడు. సమాజంలో దుస్సంప్రదాయాలను చూసి కలత చెందుతారు. బాల్య వివాహాలు, అస్పృశ్యతలపై తండ్రితో సైతం విభేదించారు. 21 ఏళ్లలోనే ఆయనలో విప్లవ భావాలు ప్రోది చేసుకున్నాయి. యజ్ఞోపవీతం మహిళలు కూడా ధరించాలని ప్రతిపాదించారు. వారికీ ఉపనయనం

చేయాలన్నారు బసవన్న. మనం కొలిచే భగవంతునికీ జనన, మరణాలున్నాయి. కనుక ఆయన దేవుడు కాడు. ఆయనకు మించిన దివ్య శక్తి ఉంది. ఆయనే భగవంతుడు. ఆయన కనబ డడు అని వాదించారు. ఆకారం లేకపోతే ఎలా పూజ చేయాలి. అందుకే ఇష్ట లింగమని సృష్టించాడు. పూజలు చేశాడు. ఇదే క్రమంలో కూడల సంగమంలోనే ఆయనకు జ్ఞానోదయమైంది. కూడల సంగమంలో పూజారిగా ఉంటూ వచనాలు రాయడం ప్రారంభించారు బసవన్న. తెలుగులో వేమన శతకంలా అద్భు తమైన తాత్త్విక వచనాలు ప్రపంచానికి అందించారాయన. బస వన్నే మొదటి వచన కారుడు. చిరుప్రాయంలోనే ఆధ్యాత్మికం గా ఉన్నత శిఖరాలను అధిరోహించడంతో పాటు ప్రపంచానికి విలక్షణ తత్త్వాన్ని అందించారు బసవన్న. చాలా మంది బసవే శ్వరుని సిద్ధాంతాన్ని సరిగా అర్థం చేసుకోలేదు. అసలైన బసవ సిద్ధాంతం సమాజంలో ఏదోఒక వర్గానికి పరిమితం కాదు. అది విశ్వజనీనం. కులమతాలకు, లింగ వివక్షకు బసవతత్త్వం అతీతం. మూఢ నమ్మకాలకు అసలే తావు లేదు. బసవన్న తత్త్వాన్ని విలక్షణంగా ప్రచారం చేసేందుకు నడుం కట్టాం. ప్రవచనాలు, చర్చా గోష్టులు, బహిరంగ చర్చలు నిర్వహి స్తున్నాం. వీటిని దేవాలయాల్లో కాక పార్కుల వంటి బహిరంగ ప్రదేశాల్లో ఏర్పాటు చేస్తున్నాం. దేవాలయాల్లో ఏర్పాటు చేస్తే ఆ వర్గం వారే వస్తారు. బసవన్న కోరుకున్నది ఇది కాదు. దేవుని పేరిట జరిగే దోపిడీలను నిర్మూలిస్తున్నాం. సాహితీపరంగా కూడా బసవన్న సిద్ధాంతాల ప్రచారం సాగిస్తున్నాం.

అసలైన బసవసిద్ధాం తం సమాజంలో ఏదో ఒక వర్గానికి పరిమితం కాదు. అది విశ్వజనీనం.

దేవుని పేరిట జరిగే దోపిడీలను నిర్మూలి స్తున్నాం. సాహితీప రంగా కూడా బసవన్న సిద్ధాంతాల ప్రచారం సాగిస్తున్నాం.

బసవ తత్త్వం అజరామరమైనది. ఏ కాలంలో అయినా ఆచరించ తగినది. పరిసరాల్లోను, సమాజంలోనూ దైవాంశను చూడమన్నారు బసవన్న. ఆ విధంగా జాతినంతా పరివర్తన చేయదలిచారు. ఆధ్యాత్మిక ఉత్థానను పూజ అన్నారు. సమాజ ఉత్థానను సేవ అన్నారు. ప్రతి ఒక్కరూ ఉద్యోగం చేయాల న్నారు. తద్వారా లభించే ఆదాయంలో కేవలం ఒక శాతం సమాజం కోసం ఖర్చు చేయమన్నారు. అదే జీవిత పరమార్థం అన్నారు. ఇంతటి మహోన్నత తత్త్వం ఏ కాలంలో అయినా ఆచరణీయమనడం నిస్సందేహం. జీవాత్మ పరమాత్మలో ఐక్యం కావడమే ఆధ్యాత్మిక చింతన పరమ లక్ష్యం. జీవుడు శివుడు కావడమే దాని పరమోద్దేశం. పరమాత్మను చేరేందుకు భక్తి, కర్మ, జ్ఞాన, యోగమార్గాలను సమన్వయం చేసి పరిపూర్ణ

అనేక మతాలు ధార్మిక కార్యక్రమాలను గాలి కొదిలేశాయి. రాజకీయాల ప్రభావానికి లోనయ్యాయి.

యోగాన్ని ప్రతిపాదించారు బసవేశ్వరుడు. ఆ పరమాత్మను చేరేందుకు పరిపూర్ణ యోగం ఒక్కటే మార్గం.

అనేక మతాలు ధార్మిక కార్యక్రమాలను గాలి కొదిలేశాయి. రాజకీయాల ప్రభావానికి లోనయ్యాయి. ఆ సంస్థలు విద్యార్థులకు నైతిక, ధార్మిక శిక్షణ ఇవ్వడం లేదు. కేవలం వ్యాపార ధోరణిలోనే సాగుతున్నాయి. వ్యక్తి వికాసానికి ఇసుమంతైనా పాటు పడడం లేదు. సనాతన ధర్మం పేరిట అనేక మతాలు వెలిశాయి. అయితే బసవ తత్త్వానికి ఇది పూర్తి విరుద్ధం. ఒక రకంగా ఇవి రెండు సమాంతర రేఖలు. లింగాయతులు కూడా బసవన్న తత్త్వానికి వ్యతిరేకంగా సాగుతున్నారు. ఇదో విషాదం. బసవన్న సిద్ధాంతాల ప్రచారం గురించి వివరిస్తూ దాదాపు అన్ని దేశాల్లో బసవ ధర్మ ప్రచారం జరుగుతున్నది. అమెరికాలో 30, ఆస్ట్రేలియాలో మూడు, బ్రిటన్ తదితర దేశాల్లో కూడా బసవ సంఘాలున్నాయి. అందరూ ఒకచోట సమావేశమై ధార్మిక కార్యక్రమాలు నిర్వహిస్తారు. దేహాన్నే దేవాలయం చేసుకో అనేది ప్రధాన ప్రచారం. జీవితంలో సమస్యలు పెరిగే కొద్దీ ఆధ్యాత్మిక చింతన పెరుగుతుంది. ఒత్తిళ్లను అధిగమించేందుకు చాలా మంది ఆధ్యాత్మిక మార్గం పడుతున్నారు. భక్తిలో స్వార్థం ఉండరాదు. ప్రేమతో, నిస్వార్థంగా, భక్తితో దేవుని ఆరాధించాలి. ప్రజల్లో క్రమంగా ఆధ్యాత్మిక చింతన పెరుగుతున్నది. యోగకు అపూర్వ ఆదరణ లభిస్తున్నది. జాతి పునరుత్థానమవుతోంది. అందరూ దేవునిపై శ్రద్ధ పెంచుకోవాలి. సేవాతత్పరతను అలవరచుకోవాలి. మూఢవిశ్వాసాలకు డబ్బు తగలేయకుండా సమాజసేవకు ఖర్చు చేయాలి. సమాజ సేవ నీకు సంతృప్తినిస్తుంది... సమాజ పురోగతికి, తద్వారా లోకకల్యాణానికి తోడ్పడుతుంది. బసవన్న కోరుకున్నది ఇదే.

భక్తిలో స్వార్థం ఉండరాదు. ప్రేమతో, నిస్వార్థంగా, భక్తితో దేవుని ఆరాధించాలి. ప్రజల్లో క్రమంగా ఆధ్యాత్మిక చింతన పెరుగుతున్నది.

– ఏప్రిల్ 20, 2007



**ఆయనకు వేదం ఆరోప్రాణం. సనాతన ధర్మం ఆరాధ్య దైవం. రెండు దశాబ్దాలుగా వేలాది మందిని వేదపండితులుగా తీర్చిదిద్దుతూ, వైదిక ధర్మాన్ని సుసంపన్నం చేస్తున్నారు ఆర్. వెంకట్రామ ఘనాపాఠి. సనాతన ధర్మానికి వేదమే రక్ష. వేదాన్ని మనం రక్షిస్తే, అది మనల్ని యావత్ ప్రపంచాన్ని కూడా రక్షిస్తుంది. నిత్యం వేదాధ్యయనం లేదా వేద శ్రవణం చేయాలి. వీలుకాని వారు స్తోత్రాలు చదివినా ఆ ధార్మిక తరంగాలు ప్రశాంతతనిస్తాయి. అదే లోకకల్యాణ మార్గం.**



# వేదో రక్షతి రక్షితః

ఒకనాడు ఏ పల్లెలో చూసినా వేదం చదువుకున్న వారు ఒక్కరైనా ఉండేవారు. వేద సంస్కృతికి, సనాతన ధర్మాచరణకు ప్రజలు ప్రాణం పెట్టేవారు. పరిస్థితి మారింది. ప్రజలు వేదసంస్కృతికి దూరమయ్యారు. మళ్లీ ఈ రోజున వేదాన్ని ఆదరిస్తున్నారు. అక్కున చేర్చుకుంటున్నారు. ఆ రోజున... ఈ రోజున వేదవైభవం ఒకలానే ఉంది... మన దృష్టిలోనే మార్పు వచ్చింది. ఇదంతా కాలచక్ర మహిమ. ఈశ్వరేచ్ఛ. మా నాన్నగారు కంచి పీఠంలో ఉండేవారు. ఆయనకు సనాతన ధర్మం, వేదం అంటే అమితమైన గౌరవం. నాలో ఉన్న ధారణ శక్తిని గమనించి నన్ను వేదాధ్యయనం చేయమని ఆయనే ప్రోత్సహించారు. కంచి శంకరాచార్యుల ఆశీస్సులు, మా ఇంటి వాతావరణం కూడా నాకు తోడ్పడ్డాయి. తంజావూరులోని మధ్యార్జున క్షేత్రంలో వేదం నేర్చుకున్నాను. కంచిలో జట, ఘన చదువుకున్నాను. సుమారు రెండు దశాబ్దాల పాటు వేదం నేర్చుకున్నా నాలో తృష్ణ చల్లారలేదు. ఆ కాలంలో వేదపాఠశాలలు చాలా తక్కువగా ఉండేవి. హైదరాబాద్‌లో స్వరాజ్య ప్రెస్ వారి ఆధ్వర్యంలో ఓ వేదపాఠశాల ఉండేది. అందులో సన్నిధానం లక్ష్మీనారాయణ పండితుల దగ్గర విద్యారణ్య భాష్యం నేర్చుకున్నాను. వేదాధ్యయనం పూర్తయింది. ఇక సాధన... బోధనే జీవితలక్ష్యం అనుకున్నాను. 1984లో ఇంట్లోనే ముగ్గురు విద్యార్థులతో వేద పాఠశాల ప్రారంభించాను. సనాతన గురుకుల పద్ధతిలోనే వేదం నేర్పాలనేది నా ఆకాంక్ష. అలా నేర్పినప్పుడే వేదాధ్యా



**ముగ్గురు విద్యార్థులతో వేదపాఠశాల ప్రారంభించాను. సనాతన గురుకుల పద్ధతిలోనే వేదం నేర్పాలనేది నా ఆకాంక్ష. అలా నేర్పినప్పుడే వేదాధ్యాయులు మనసా, వాచా వేద ధర్మాన్ని పాటించేందుకు వీలుంటుంది. క్రమంగా విద్యార్థులు పెరిగారు.**



యులు మనసా, వాచా వేద ధర్మాన్ని పాటించేందుకు వీలుంటుంది. క్రమంగా విద్యార్థులు పెరిగారు. హైదరాబాద్‌లో వేద పాఠశాల ప్రారంభించండని కంచి శంకరాచార్యులు ఆదేశించారు. పదేళ్ల క్రితం సికింద్రాబాద్‌లోని సఫిల్‌గూడలో వేదాధ్యయనం కోసం ప్రత్యేకంగా వేదభవన్ నిర్మించుకున్నాం. ప్రస్తుతం వంద మంది విద్యార్థులు మా వద్ద వేదం నేర్చుకుంటున్నారు. ఇప్పటికే నా వద్ద వంద మందికి పైగా విద్యార్థులు వేదాధ్యయనం పూర్తి చేసుకొని వివిధ హోదాల్లో స్థిరపడ్డారు. తుది శ్వాస వరకు వేదం బోధించాలని, వేద సంస్కృతిని పరిరక్షించాలన్నదే నా అభిమతం.

**వేదం విశ్వకల్యాణం ప్రదం. అందులోని ప్రతి అక్షరం అందరి శ్రేయస్సును కాంక్షించేదే.**

గత శతాబ్ది ద్వితీయార్థం నుంచి వేదాధ్యయనం పట్ల ఆసక్తి సన్నగిల్లుతూ వచ్చింది. వ్యక్తి ప్రయోజన చింత క్రమంగా పెరగడమే ఇందుకు కారణం కావచ్చు. వేదం పట్ల అపోహలు కూడా పెరిగాయి. వేదంలో కేవలం వ్యక్తి ప్రయోజనం మాత్రమే ఉందనుకున్నారు. కేవలం కొందరి శ్రేయస్సు కోసమే వేదం ఉందని అపోహపడ్డారు. నిజానికి వేదం విశ్వకల్యాణప్రదం. అందులోని ప్రతి అక్షరం అందరి శ్రేయస్సును కాంక్షించేదే. వేదం విశ్వ శ్రేయస్సుకు ఏ విధంగా ఉపయోగపడుతుందని అడిగితే, కాసేపు వేదం చదవండి... లేదా వేదం చదువుతుంటే వినండి. మనసు నిర్మలం అవుతుంది. అనిర్వచనీయమైన ప్రశాంతత చేకూరుతుంది. వేదశబ్దం గొప్పదనం అది. వేదపఠనం సందర్భంగా వేలాది మంగళశబ్దాలు జనిస్తాయి. అవి అపశబ్దాలను నివృత్తి చేస్తాయి. వేదాధ్యయనం, వేదసంస్కృతిని పాటించడం వల్ల దేశం సుభిక్షంగా ఉంటుంది. ధార్మిక జీవనం వల్ల సమాజం సుఖశాంతులతో విలసిల్లుతుంది. వ్యక్తి, సమాజం సుఖసంతోషాలతో ఉండడం కంటే కావలసింది ఏముంటుంది? వేదం చదివే వారు కేవలం స్వహితం కోరుకోరు.. లోకాః సమస్తాః సుఖినో భవంతు అంటూ శాంతిమంత్రం చెబుతారు. నేనే కాదు ప్రపంచం యావత్తూ సుఖశాంతులతో ఉండాలని కోరే గొప్ప వేద సంస్కృతి మన భరతజాతికే సొంతం. అందుకే ప్రతి గ్రామంలో వేదపాఠశాల ఏర్పాటు చేయాలనేది కంచిపీఠాధిపతుల ఆకాంక్ష. అలా జరిగితే పల్లెలన్నీ మంగళప్రదమైన వేద ఘోషతో పునీతమౌతాయి. వేదంలో ఒక శాఖ సంపూర్ణంగా చదవాలన్నా కనీసం 18 సంవత్సరాలు పడుతుంది. అన్ని సంవత్సరాలు ప్రపంచంతో సంబంధం లేకుండా వేదాధ్యయనం

**ప్రపంచం యావత్తూ సుఖశాంతులతో ఉండాలని కోరే గొప్ప వేద సంస్కృతి మన భరతజాతికే సొంతం.**

చేసిన వారు, ఆపైన వేదార్థాన్ని కూడా పరిపూర్ణంగా తెలుసుకో వాలంటే మరి కొన్ని సంవత్సరాలు కేటాయించాల్సి ఉంటుంది. ఈ కాలంలో అది ఎంతవరకు సాధ్యమో ఆలోచించండి? పూర్వం పోషకులు ఉండేవారు. ఏళ్లతరబడి వేదాధ్యయనం జరిగేది. ప్రస్తుత పరిస్థితి వేరు. వేదాధ్యయనం పూర్తయ్యాక ఈ లౌకిక ప్రపంచంలో జీవించేందుకు ఏదో ఉద్యోగం వెతుక్కోక తప్పదు? వేదం నేర్చుకొనే వారికి ఎలాగూ సంస్కృత భాషతో పరిచయం కల్పిస్తాం. వేదార్థం కూడా కొంత వరకు తెలుస్తుంది. వేదభవన్‌తో పాటు రాష్ట్రవ్యాప్తంగా ఉన్న వేదపాఠశాలల్లో పెరుగుతున్న వేదాధ్యాయుల సంఖ్యే వేదాధ్యయనం పట్ల ఆసక్తి పెరుగుతుందనేందుకు నిదర్శనం. వేదం చదువుకున్న వారికి గతంలో కంటే ఇప్పుడు మెరుగ్గా ఉపాధి దొరుకుతున్నది. ఆలయాల్లో వేదపండితులుగా నియమితులౌతున్నారు. వేదపండితుల్ని ఆదరించే విషయంలో మిగిలిన రాష్ట్రాలతో పోలిస్తే ఆంధ్ర రాష్ట్రానిదే పైచేయి. ప్రజల్లో అన్ని విషయాల్లో అపనమ్మకం పెరిగిపోయింది. అపనమ్మకమే అశాంతికి మూలం. మన సనాతన వైదిక సంస్కృతి, ధార్మిక జీవనం మనలో నమ్మకాన్ని పెంచేది. ప్రశాంతతను పంచేది. ఆ విషయాన్ని ప్రజలు క్రమంగా గ్రహించడం మొదలు పెట్టారు. వేదాన్ని, వేదం చదువుకున్న వారిని గౌరవిస్తున్నారు. వేదభవన్‌లో నిత్యం వేదపారాయణ చేస్తాం. సత్సంగాలు నిర్వహిస్తూ ఉంటాం. హోమాలు, పూజలు నిర్వహిస్తున్నాం. ఇవన్నీ లోకహితం కాంక్షిస్తూ చేసేవే. ఒక వ్యక్తి మంచి సంకల్పం చేసి, త్రికరణ శుద్ధితో లోకహితం కోరుకుంటేనే ప్రపంచానికి ఇంత మంచి జరుగుతున్నది. వేద పరమార్థం కూడా ఇదే వేదం చదివే వారు కనీసం రోజూ పదినిమిషాలయినా వేదమంత్రాలు చదవండి. మిగిలిన వారు దైవ స్తోత్రాలు చదువుకోండి. తద్వారా వెలువడే ధార్మిక తరంగాలు ప్రపంచాన్ని సుఖశాంతులతో ఉంచుతాయి. వేదాధ్యయనం చేసే వారిని ప్రోత్సహించండి. వేదవికాసానికి తోడ్పడాలనుకొనేవారు 58,59, రోడ్1, చంద్రగిరికాలనీ, సఫిల్‌గూడ, సికింద్రాబాద్, ఫోన్ః 040- 27227669లో సంప్రదించవచ్చు. మీరు వేదాన్ని రక్షిస్తే అది మిమ్మల్ని, లోకాన్ని కూడా రక్షిస్తుంది.

– మే 11, 2007

**ప్రజల్లో అన్ని విషయాల్లో అపనమ్మకం పెరిగిపోయింది. అపనమ్మకమే అశాంతికి మూలం. సనాతన వైదిక సంస్కృతి, ధార్మిక జీవనం మనలో నమ్మకాన్ని పెంచేది.**

**వేదం చదివే వారు కనీసం రోజూ పదిని మిషాలయినా వేద మంత్రాలు చదవండి. మిగిలిన వారు దైవ స్తోత్రాలు చదువుకోండి.**

**ముది వయసులో కూడా ఆయన గీతాసారం చెబుతుంటే భక్తులు మైమరచిపోతారు. ఆయన గానం చేస్తే లయబద్ధంగా నాట్యం చేస్తారు. మలయాళ స్వామి వంటి మహనీయలతో కలిసి ఆధ్యాత్మిక ప్రవచనాలు చేశారాయన. సహస్రాధిక గీతా యజ్ఞాలు, శ్రీరామ శతకోటి జప యజ్ఞాలు నిర్వహించారు. ఆరున్నర దశాబ్దాలుగా సనాతన ధర్మాన్ని ప్రచారం చేస్తున్నారు మహబూబ్‌నగర్‌కు చెందిన లక్ష్మీకాంతరావు బాబా.**



# ఆధ్యాత్మిక సోపానం.. సత్సాంగత్యం



భగవన్నామ సంకీర్తన, ధ్యానం సంస్కారం నేర్పుతుంది. సత్సాంగత్యం జీవితాన్ని సార్థకం చేస్తుంది. అందుకే ప్రజల్లో భక్తి సంస్కారం పెంపొందించేందుకు ఆధ్యాత్మిక ప్రవచనాల ద్వారా ప్రయత్నిస్తున్నాను.



సంస్కారం, జ్ఞాన సముపార్జనకు నిన్నమొన్నటి వరకు అధిక ప్రాధాన్యం ఉండేది. ఇప్పుడు జ్ఞానార్జన స్థానంలో ధనార్జనకు పెద్దపీట వేస్తున్నారు. ఇది చాలా ప్రమాదకర ధోరణి. ప్రపంచీకరణ ఫలితంగా ఆధ్యాత్మిక వాతావరణం కూడా కలుషితం అవుతున్నది. భగవన్నామ సంకీర్తన, ధ్యానం సంస్కారం నేర్పుతుంది. సత్సాంగత్యం జీవితాన్ని సార్థకం చేస్తుంది. అందుకే ప్రజల్లో భక్తి సంస్కారం పెంపొం దించేందుకు ఆధ్యాత్మిక ప్రవచనాల ద్వారా ప్రయత్నిస్తున్నాను. చిన్నతనం నుంచి నాలో దైవ భక్తి ఎక్కువగా ఉండేది. 1922లో పాలమూరు జిల్లా గూడూరులో పుట్టాను. ఆనాటి భారతదేశ పరిస్థితులు నన్ను స్వాతంత్ర్య ఉద్యమం వైపు నడిపించాయి. దేశభక్తి , దైవభక్తి అనే రెండు అంశాలను రెండు కళ్ళుగా భావించాను. ఆచార్య వినోబాభావే వెంటనడిచి భూదానోద్యమంలో పాల్గొన్నాను. రజాకార్లకు వ్యతిరేకంగా ఉద్యమాలు నిర్మించాను. స్వాతంత్ర్య సమర దీక్ష సాగుతున్నా నాలో భక్తి చింతన తగ్గలేదు. ఆధ్యాత్మిక మార్గంలో సాగాలంటే ముందుగా మనం త్యాగం నేర్వాలి. అందుకే కనీస అవసరాలకు సరిపోను భూమి ఉంచుకొని మిగిలిన భూమిని పేదలకు పంచాను.

21 ఏళ్ల వయసులో శ్రీరంగపట్టణంలో మధ్వ సంప్రదాయ గురుదేవులైన శ్రీరంగ భట్టార్ వద్ద మంత్రదీక్ష తీసుకున్నాను. భగవద్గీత అన్ని ఉపనిషత్తుల సారమని, భారతీయ తత్వాన్ని

సూక్ష్మంగా బోధించే ఉద్గ్రంధమని భావించాను. ఆధ్యాత్మిక ప్రచారానికి గీతోపన్యాసాలే సాధనంగా భావించి గీతాప్రవచనాలు చేస్తున్నాను.

నేనొక్కడినే ప్రచారం చేస్తే సరిపోదు... మరికొందరిని సిద్ధం చేస్తే ఎక్కువ మందికి గీతారాసాన్ని చేరవేసే అవకాశం ఉంటుందని భావించాను. ఆధ్యాత్మిక జీవనం అంటే సన్యాసం తీసుకోవాల్సిన పనిలేదు. గృహస్థులు సైతం ఆధ్యాత్మిక ప్రచారానికి అర్హులే. గీతను విస్తృతంగా పల్లెపల్లెనా ప్రచారం చేసేందుకు వీలుగా వేల సంఖ్యలో గీతాప్రచారకులను సమాయత్తం చేశాను. ప్రస్తుతం పరిగి గ్రామంలో ఉంటున్నాను. రంగారెడ్డి, మహబూబ్‌నగర్, మెదక్ జిల్లాలో దాదాపు 1000 మంది నిబద్ధులైన ప్రచారకులున్నారు. వారి ద్వారా శంకర్‌పల్లి, పరిగి, రాకంచర్ల, చేవెళ్ళ, మెదక్, సంగారెడ్డి తదితర ప్రాంతాల్లో ఉన్న గీతా ప్రచార కేంద్రాల ద్వారా శక్తిమేరకు భగవద్గీత, సంకీర్తనా సాహిత్య ప్రచారం చేస్తున్నాను. ఉర్దూ, ఆంగ్ల, సంస్కృతం, తెలుగు భాషల్లో ఇప్పటి వరకు వేలాది ఉపన్యాసాలు ఇచ్చాను. జపయజ్ఞాలు నిర్వహించడం వల్ల ప్రజల్లో వైదిక సంస్కృతిని పెంపొందించే వీలుంటుంది.

ఆధ్యాత్మిక జీవనం అంటే సన్యాసం తీసుకోవాల్సిన పనిలేదు. గృహస్థులు సైతం ఆధ్యాత్మిక ప్రచారానికి అర్హులే.

సత్సంగమే మోక్షగాములకు సరైన దారి చూపుతుంది. అందుకే సత్సంగాలు, ఆధ్యాత్మిక ప్రచారమే సాధనాలుగా చేసుకున్నాను. 'తాళనాద' పూర్వకంగా సంకీర్తనలను ఆలపిస్తూ ఉంటాను. భగవంతునిలో తాదాత్మ్యం చెందాలంటే నిరంతరం నామ సంకీర్తనకు మించిన మార్గం లేదు. వేలాది గ్రామాల్లో భగవన్నామ సంకీర్తన ఏర్పాటు చేశాం. నిత్యం ఎన్నో గ్రామాల్లో మా ప్రచారకులు ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉంటారు. వేదాలు, ఉపనిషత్తుల సారం అంతా భగవద్గీతలో అంతర్లీనంగా ఉంది. అది సనాతన మౌనతత్త్వాన్ని ప్రబోధిస్తుంది. అందుకే భగవద్గీత పండితపామర జనరంజకమై భాసిల్లుతున్నది. ఆధ్యాత్మిక సాధనకు ఒకొక్కరికి ఒక్కో మార్గం అనుకూలంగా ఉంటుంది. వాళ్ళ వాళ్ళ జిజ్ఞాసను బట్టి హృదయ ప్రధానమైనవాడు ప్రేమ మార్గంలో, భక్తి మార్గంలో, మస్తిష్క ప్రధానమైన వాడు జ్ఞాన మార్గంలో సాధన చేయాల్సి ఉంటుంది. మార్గాలు ఏదైనా గమ్యం ఒక్కటే. ఎవరు ఏ విధంగా పూజించినా, ధ్యానించినా ఆ పరమాత్మే లక్ష్యం.

వేదాలు, ఉపనిషత్తుల సారం అంతా భగవద్గీతలో అంతర్లీనంగా ఉంది. అది సనాతన మౌనతత్త్వాన్ని ప్రబోధిస్తుంది.

ఆ పరమాత్మనే సర్వస్వంగా భావించే వారికి కులమతాలు, బేధభావాలు ఉండవు. అన్ని జీవుల్లో అత్మస్వరూపం కనిపిస్తుంది.

ప్రేమసమాధి తత్త్వాన్ని నేను ప్రజల్లో ప్రచారం చేస్తూ ఉంటాను. ఇది భగవంతుని సత్వరం చేరువ చేస్తుంది. ప్రేమతత్త్వంతో భగవంతుని చేరుకోవడమే ప్రేమసమాధి తత్త్వం. మీరా, చైతన్య, రామకృష్ణ పరమహంస ఈ కోవకు చెందుతారు. 'అత్యంతభక్తి యుక్తానం నైవ శాస్త్రం నచక్రమః' ఆధ్యాత్మికాభివృద్ధి సాధించే కొద్ది అడ్డంకులన్నీ వాటంతటవే తొలగిపోతాయి. ఆ పరమాత్మనే సర్వస్వంగా భావించే వారికి కులమతాలు, బేధభావాలు ఉండవు. అన్ని జీవుల్లో అత్మస్వరూపం కనిపిస్తుంది.

భౌతిక ఆడంబరాలేవీ నిజమైన సాధకునికి పట్టవు. ఆ పరమాత్మ సాక్షాత్కారంలో అనంతమైన ఆనందం లభిస్తుంది.

చాలా మంది రుద్రాక్షలు, జపమాలలు, విభూతులతో బాహ్యాడంబరానికి ప్రాధాన్యం ఇస్తారు. ఆధ్యాత్మిక మార్గంలో నడిచేవారికి ఇవన్నీ అవసరం అంటారా అని కొందరు అడుగుతూ ఉంటారు. వాటి పవిత్రత వాటికి ఉన్నది. అవి కొంతవరకు ఆరోగ్య, ఆధ్యాత్మికపరమైన శక్తినిస్తాయి. నిజానికి జపం అంతరార్థం తెలిస్తే జపమాల తిప్పటం ఆగిపోతుంది. భౌతిక ఆడంబరాలేవీ నిజమైన సాధకునికి పట్టవు. ఆ పరమాత్మ సాక్షాత్కారంలో అనంతమైన ఆనందం లభిస్తుంది. పరమాత్మ సన్నిధి లభించాలంటే సనాతన ధర్మాచరణ, సత్సాంగత్యం, దైవచింతన అవశ్యం. నేను ఆధ్యాత్మిక సేవకుడ్ని....ఓ పది మందిలో జ్ఞానజ్యోతిని వెలిగించి, ఆధ్యాత్మిక మార్గం చూపగలిగినా ఈ జన్మ సార్థకమైనట్టే.

– మే 18, 2007



**సరస్వతీ దేవి ఆయన నాలుకపై కొలువుంటుంది. ప్రవచనం, వేద సాహిత్య రచన ఆయన ఉచ్ఛ్వాస, నిశ్వాసలు. వేద రహస్యాలు, కావ్యాలు, పురాణాలు ఆయనకు కరతలామలకాలు. ఆర్ష సంప్రదాయానికి నిండునీరాజనాలర్పించే ఆయనే డాక్టర్ కందాడై రామానుజాచార్యులు. హైదరాబాద్‌లోని వేదాంత వర్ధని సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేసినా, ప్రపంచ వ్యాప్తంగా ఆధ్యాత్మిక ప్రచవనాలు ఇస్తున్నా ఆయన శైలి సరళం.. సుమధురం.**



# అంతర్‌దృష్టి.. జీవితానికి పుష్టి

ఓ రోజు రాత్రి గురువుగారు చాలా ఉద్వేగంతో ఉన్నారు. రోజూ 8 గంటల కల్లా వేదపాఠం ముగించే వారు. ఆ రోజు 9 గంటలైనా ఆయన స్వరధార ఆగలేదు. ఓ అరగంట తరువాత పాఠం ముగించి.. నన్ను దగ్గరకు పిలిచారు. ఆయన కళ్లు వర్షిస్తున్నాయి... నాయనా.. రామానుజం నీ వేదాధ్యయనం ఈ రోజుతో పూర్తయింది. నాకు వచ్చిన విద్యంతా నీకు నేర్పాను. వేద వేదాంగాలలో నీ పాండిత్యానికి తిరుగులేదు. ఒక్క విషయం గుర్తుంచుకో. ఎవరు నోరు తెరిచి అడిగినా వారికి నీకు వచ్చిన విద్య నేర్పించు. నీకు తెలియని విషయం అడిగినా తెలుసుకొని మరీ నేర్పు. నీ శక్తి మేరకు వేద వాఙ్మయానికి అక్షర రూపం ఇవ్వు... ఇదే నాకు నీవిచ్చే గురుదక్షిణ అన్నారు. ఆయన కళ్లు ధారాపాతంగా కురుస్తునే ఉన్నాయి. నన్ను వాత్సల్యంగా చూసి ఇంట్లోకి వెళ్లిపోయారు. తెల్లవారు జామున 4 గంటల ప్రాంతంలో గురువుగారు పరమపదించారు. విద్యా వికాసాన్ని గురుదక్షిణగా అడిగి, తుది శ్వాస వరకు విద్యా బోధన చేసే అటువంటి మహనీయులు ఈ కాలంలో ఎందరుంటారు చెప్పండి?

**ఓ రోజు రాత్రి గురువుగారు చాలా ఉద్వేగంతో ఉన్నారు. రోజూ 8 గంటల కల్లా వేదపాఠం ముగించే వారు. ఆరోజు 9 గంటలైనా ఆయన స్వరధార ఆగలేదు. ఓ అరగంట తరువాత పాఠం ముగించి.. నన్ను పిలిచారు. నాయనా.. రామానుజం నీ వేదాధ్యయనం ఈ రోజుతో పూర్తయిందన్నారు.**

తెలుగు నేలపై సంస్కృత భాషా వికాసానికి, వేదాంత అభివృద్ధికి అనితర సాధ్యమైన సేవచేసిన మహనీయులు కోయిల్ కందాడై శఠగోప రామానుజాచార్యులే నా గురువర్యులు. వేదాంత వర్ధని సంస్కృత కళాశాల వ్యవస్థాపకులు వారే. పావు

మా ఇంట్లోనే ఆసక్తి ఉన్న వారికి వేదాలు నేర్పుతున్నాను. కూర్మపురాణం, పద్మ పురాణం వంటి గ్రంథాలెన్నింటినో తెలుగులోకి అనువదించాను.

రామాయణ, భారత, భాగవతాలు అమృత భాండాలు. వాల్మీకి, వ్యాస మహర్షి ఏం ఆశించి ఆ మహాకా వ్యాలను రచించారు?

కోళ్లు వేసుకొని ఆయన రోడ్డుమీదకు వస్తున్నారంటే ఆయనకు ఎదురు వెళ్లేందుకు ఎవరూ సాహసించేవారు కారు. ఆ వేద స్వరూపుని పట్ల ప్రజల్లో అంతటి గౌరవం ఉండేది. నా పదో ఏట వేదాంత వర్ధనిలో విద్యార్థిగా చేరాను. 48 ఏళ్ల పాటు ఆ సంస్థ లోనే విద్యార్థిగా, బోధకుడిగా, ప్రిన్సిపాల్‌గా సేవలందించాను. 2002లో రిటైరయ్యాను. రిటైరయింది ఉద్యోగం నుంచి మాత్రమే. బోధకునిగా మాత్రం కాదు. రోజూ మా ఇంట్లోనే ఆసక్తి ఉన్న వారికి వేద వేదాంగాలు నేర్పుతున్నాను. కూర్మపు రాణం, పద్మపురాణం, భాగవతం దశమ స్కందం వంటి గ్రంథా లెన్నింటినో తెలుగులోకి అనువదించాను. రాష్ట్ర వ్యాప్తంగా ఎవరు, ఎక్కడకు పిలిచినా వెళ్లి ఆధ్యాత్మిక ప్రవచనాలు ఇస్తు న్నాను. ఇప్పటి వరకు వెయ్యి రామాయణ ప్రవచనాలు, 132 భాగవత సప్తాహాలు, 500 పైగా భాగవతంపై ఉపన్యాసాలు, భారతంపై వందకు పైగా ప్రసంగాలు ఇచ్చాను. గురువుగారికి ఇచ్చిన మాట ప్రకారం వేదాంత ప్రచారానికి, వేద వాఙ్మయాన్ని అక్షరబద్ధం చేసేందుకు తుది శ్వాస వరకు ప్రయత్నిస్తాను.

నల్గొండ జిల్లా గరిడేపల్లి నా జన్మస్థలం. అక్షరాభ్యాసం అయిన రోజు నుంచి నాయనమ్మ గారు పోతన భాగవతం చెప్పడం ప్రారంభించారు. ఆకాలంలో మహిళలు కావ్యాలను అర్థవంతంగా, అద్భుతంగా చెప్పగలిగేవారు. ఏడేళ్ల వయసు లోనే కావ్యాలతో పరిచయం ఏర్పడింది. నాన్నగారు జగ్గయ్యపే టలోని రంగనాథ ఆలయంలో పనిచేసేవారు. ఆయన నిష్టాగరి ష్ఠులు. జైమిని భారతంలో ఉద్దండ పండితులు. పదేళ్ల వయ సులో నన్ను హైదరాబాద్ తీసుకువచ్చి వేదాంత వర్ధని సంస్కృత కళాశాలలో చేర్పించారు. 19వ ఏట వ్యాకరణంలో బిఓఎల్ పూర్తి చేశాను. ఉద్యోగం కోసం ప్రయత్నిస్తుంటే గురువు గారు, ఇక్కడే పాఠాలు చెప్పవోయ్.. అన్నారు. ఆ రోజు నుంచి బోధన పర్వం మొదలైంది. 1988లో డాక్టరేట్ పట్టా పొందాను. సాహిత్య రంగంలో కూడా కొంత కృషి చేశాను. 15 నవలలు, పలు కథానికలు, అనేక గేయాలు రచించాను. ఆగమవారధి, జ్యోతిష విజ్ఞాన బ్రహ్మ, వేద విభూషణ, ఉపన్యాస శిరోమణి, అభినవ వ్యాస వంటి బిరుదులు నా కృషి ఫలాలుగా అందాయి. అష్టాదశ పురాణాలపై కేవలం మూలగ్రంథంతో ప్రవచం ఇవ్వ గల వారు మన దేశంలో 1172 మంది ఉన్నట్టు ఢిల్లీకి చెందిన నాగ్ పబ్లికేషన్స్ సంస్థ గుర్తించింది. వారిలో నాకు 232వ ర్యాంక్

ఇచ్చారు. రామాయణ, భారత, భాగవతాలు అమృత భాండాలు. వాల్మీకి, వ్యాస మహర్షి ఏం ఆశించి ఆ మహాకావ్యాలను రచించారు? వాటిని ప్రచురించి, సొమ్ము చేసుకోనేందుకు కాదుగా? భావితరాల వారికి తాత్త్విక, ఆధ్యాత్మిక సంపదను అందించి, వారికి మార్గనిర్దేశం చేసే మహోదాత్త లక్ష్యంతో ఆ రచనలు చేశారు. తత్త్వాన్ని నేరుగా చెబితే అర్థం కాదనే ఉద్దేశంతో అందమైన కావ్యాలుగా మలచి మనకు అందించారు. ప్రవచనం అంటే కేవలం శ్లోకం చదివి, అర్థం చెప్పడం కాదు. మహనీయులైన రుషులు ఏ లక్ష్యంతో ఆ రచన చేశారో దాన్ని వివరించాలి. రుషి హృదయాన్ని శ్రోతల ఎదుట ఆవిష్కరించాలి. ప్రవచనాల ద్వారా కొందరి మనసుల్లో అయినా తత్త్వజ్యోతులు వెలిగించగలిగితే అంతకు మించిన భాగ్యం మరేముంది.

మన చదువు, ఆలోచన సంకుచితం కావడమే సంస్కృతి, సంస్కార పతనానికి మూలం.

ఈ కాలం వారి ఆలోచన పద్ధతి అన్యాయంగా ఉంది. చదువు అనేది భౌతిక ప్రయోజనాలు ఇచ్చే సాధనం అనుకుంటున్నారు. కనపడేదే సత్యం అనుకుంటున్నారు. 'ఇంద్రియాతీతం శాస్త్రం' అన్నారు. ఆధునిక శాస్త్ర విజ్ఞానమంతా అంతా తెలుసు అనే భావం కలిగిస్తుంది. మనకు కనిపించని ఎన్నో సత్యాలున్నాయనే విషయాన్ని విస్మరిస్తున్నారు. మన చదువు, ఆలోచన సంకుచితం కావడమే సంస్కృతి, సంస్కార పతనానికి మూలం. భౌతిక దృష్టి మాని ప్రతి ఒక్కరూ అంతర్ దృష్టిని అలవరచుకోవాలి. ఇలా ఉంటే ఈ పరుగుపందెంలో వెనుకపడి పోమా అనే సందేహం రావచ్చు. ఈ కాలనికి పట్టిన మరో అరిష్టం అనుకరణ. ఎవరితోనో పోల్చుకోవడం వల్ల మీకు శాంతి దూరం అవుతుంది. నిజానికి మీరు ధర్మంగా ఉంటే అభివృద్ధి దానంతటఅదే వస్తుంది. సర్వే జనాః సుఖినో భవంతు అనేది మన ఆర్షధర్మం. మీరు ఒక్కరే కాదు జనులందరూ సుఖశాంతులతో ఉండాలని సంకల్పించండి. అలా ఉండేందుకు మీకు చేతనైన కృషి చేయండి. అంతర్ దృష్టి అలవడితేనే ఇలా అలోచించగలుగుతాం. అప్పుడు ఈ ఆరాటాలన్నీ అల్పంగా అనిపిస్తాయి. అలజడి తగ్గిపోతుంది. జీవితం ఆనందమయం అవుతుంది. సాధన ద్వారా మాత్రమే అంతర్ దృష్టి అలవడుతుంది. నిత్యం ఆలయ దర్శనం, వీలయినప్పుడల్లా నదీస్నానం, నలుగురు మంచి వాళ్ల సహచర్యం నీలో అంతర్ దృష్టిని పెంచి, జీవితాన్ని ధన్యం చేస్తాయి.

ఎవరితోనో పోల్చుకోవడం వల్ల మీకు శాంతి దూరం అవుతుంది. నిజానికి మీరు ధర్మంగా ఉంటే అభివృద్ధి దానంతటఅదే వస్తుంది.

– మే 25, 2007



**తెలుగు నేలపై లక్షలాది మందిలో చైతన్య స్ఫూర్తిని రగిలించి, విలువలతో కూడిన విద్యను అందిస్తున్నారాయన. ఇతరుల మేలు కోసం జీవించేదే అసలైన జీవితం అనే వివేకానందుని మాటలే ప్రేరణగా 26వ ఏట ఆశ్రమ జీవితం ప్రారంభించారు. యువతను పరిపూర్ణంగా తీర్చిదిద్ది, వివలువలతో కూడిన సమాజాన్ని సాధించేందుకు కృషిచేస్తున్న ఆయనే వివేకానందా ఇన్ స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్సలెన్సీ సారథి స్వామి శ్రీకాంతానంద.**

# అందరిమేలు కోరే ఆదర్శజీవితం

ఆధునిక విద్య సంస్కృతి నేర్పడం లేదు. సంస్కారం ఇవ్వడంలేదు. సమాజం నుంచి ఎదురయ్యే సమస్యలను ఎలా ఎదుర్కోవాలో చెప్పడం లేదు. పెద్దలంటే గౌరవం లేదు. సంప్రదాయాలంటే విలువ లేదు. ఎప్పుడూ డబ్బు ఆలోచనలతో అశాంతిని మూట కట్టుకుంటున్నాడు ఆధునిక మానవుడు.

వేదాంతంలో, ధార్మిక జీవనంలో ప్రపంచ దేశాలకే తలమానికంగా నిలిచిన భారతదేశానికి కొన్ని శతాబ్దాలుగా గ్రహణం పట్టింది. మనం చదివే విద్య మనది కాకుండా పోయింది. ఆధునిక విద్య ఏం సంపాదించాలో, ఎంత సంపాదించాలో నేర్పుతుంది. ఎలా బతకాలో మాత్రం నేర్పదు. భవిష్యత్తులో బాగా సంపాదించేందుకు అవకాశం కలుగజేసేదే గొప్ప విద్య అనే భావం పెరిగింది. ఏ మాత్రం విలువలు లేని మన ఆధునిక విద్యే ప్రస్తుతం మన సమాజం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు మూలం. ఆధునిక విద్య సంస్కృతి నేర్పడం లేదు... సంస్కారం ఇవ్వడం లేదు.. సమాజం నుంచి ఎదురయ్యే సమస్యలను ఎలా ఎదుర్కోవాలో చెప్పడం లేదు. పెద్దలంటే గౌరవం లేదు. మన సంప్రదాయాలంటే విలువ లేదు. నిరంతరం డబ్బు ఆలోచనలతో అనంతమైన అశాంతిని మూట కట్టుకుంటున్నాడు ఆధునిక మానవుడు. ఈ పరిస్థితి నుంచి బయటపడాలంటే విలువలతో కూడిన సంపూర్ణమైన విద్యను అందించాలి. విలువలు, ఆధ్యాత్మికతతో కూడిన విద్యను అందించే లక్ష్యంతో హైదరాబాద్‌లోని రామకృష్ణ మఠంలో వివేకానందా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హ్యూమన్ ఎక్స్‌లెన్స్‌ను 2000లో ప్రారంభించాం. ఈ ఆరున్నర సంవత్సరాల కాలంలో లక్షలాది మందికి ముఖ్యంగా యువత, చిన్నారులకు మా సంస్థ ద్వారా ప్రత్యేక కోర్సులు అందించాం. యువతలో చైతన్యం తీసుకురాగలిగితే సమాజంలో సత్వరం మార్పు తీసుకురాగలం. అప్పుడే

మన సంస్కృతీ వైభవం వెలుగుల్లో భావి తరాలు ఆనందంగా గడిపే వీలుంటుంది. అందులో భాగంగా రాష్ట్ర వ్యాప్తంగా పర్యటిస్తూ, విలువలతో కూడిన విద్య ఆవశ్యకత గురించి ప్రచారం చేస్తున్నాం. వందలాది కళాశాలలు, పాఠశాలలలో నిపుణుల చేత ప్రసంగాలు ఇప్పిస్తున్నాం. నైతికత, ఆధ్యాత్మిక విలువలు, ఆచార సంప్రదాయాలు, ధ్యానం, యోగ, వ్యక్తిత్వాన్ని పెంపొందించుకొనేందుకు తోడ్పడే కోర్సులను ప్రత్యేకంగా రూపొందించి, వాటిలో శిక్షణ ఇస్తున్నాం. రాష్ట్రవ్యాప్తంగా లక్షన్నర మంది యువతీయువకులు ఇప్పటి వరకు మా వద్ద శిక్షణ పొందారు. చిన్నారులపై కూడా దృష్టి కేంద్రీకరించాం. అన్ని వయోవర్గాలకు చెందిన సుమారు 50 వేల మందికి నైతిక విలువలు, ఆధ్యాత్మికతపై శిక్షణ ఇచ్చాం. యువతకు స్ఫూర్తినిచ్చే అనేక గ్రంథాలు ముద్రిస్తున్నాం. పల్లెపల్లెలో వీటిని విక్రయిస్తున్నాం. శిక్షణ ఇవ్వమంటూ పలు ప్రాంతాల నుంచి మాకు ఆహ్వానాలు అందుతున్నాయి. వనరుల కొరత కారణంగా అన్ని ప్రాంతాలకు వెళ్లలేకపోతున్నాం.

**మనకోసం కాదు... ఇతరుల మేలు కోసం కూడా ఎంతోకొంత చేయాలనే ఆలోచన యువతలో రావడం నిజంగా మంచి పరిణామం.**

విలువలతో కూడిన విద్య పట్ల ప్రజలు అద్భుతంగా స్పందిస్తున్నారు. ఇన్నాళ్లుగా తాము కోల్పోయిందేమిటో గ్రహిస్తున్నారు. ముఖ్యంగా యువత నుంచి మంచి స్పందన వస్తున్నది. గ్రామీణ యువత మరింత ఆసక్తిగా ముందుకు వస్తున్నారు. గ్రామీణ ప్రజల్లో చైతన్యం రగిలించి, సేవా కార్యక్రమాలు నిర్వహించేందుకు వివేకానంద యువ కేంద్రాలు ఏర్పాటవుతున్నాయి. అటువంటి సంఘాలు మా దగ్గర రిజిస్టర్ చేయించుకుంటున్నాయి. వారికి అవసరమైన నిపుణులు, వనరులను అందిస్తున్నాం. కేవలం మనకోసం కాదు... ఇతరుల మేలు కోసం కూడా ఎంతోకొంత చేయాలనే ఆలోచన యువతలో రావడం నిజంగా మంచి పరిణామం. మేం అనుసరిస్తున్న విద్యావిధానాన్ని ప్రభుత్వాలు కూడా అనుసరిస్తే అందరికీ విలువలతో కూడిన విద్య అందుతుందని భావించాం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను సంప్రదించాం. యుజిసి వారు విలువలతో కూడిన విద్యను పాఠ్యాంశంగా చేర్చాల్సిన ఆవశ్యకతను గుర్తించారు.

**ప్రభుత్వం చేయడం లేదు కదా అని అందరం మౌనంగా ఊరుకుంటే లాభం లేదు.**

రాష్ట్ర ప్రభుత్వాలు మాత్రం అటువంటి విద్యను పాఠ్యాంశాలలో భాగంగా చేసేందుకు చొరవ చూపడం లేదు. వారికి

ఇతరులకు సేవ చేయడంలోనే నిజమైన ఆధ్యాత్మికత ఉందనే వివేకానందుని మాటలు నాకు ప్రేరణగా నిలిచాయి.

కులం... మతం.. ఇలా ఎన్నో ఇబ్బందులున్నాయి. ప్రభుత్వం చేయడం లేదు కదా అని అందరం మౌనంగా ఊరుకుంటే లాభం లేదు. అందుకే మా సంస్థ ద్వారా విలువలు, ఆధ్యాత్మికతతో కూడిన విద్యను పంచుతున్నాం. ఈ వివేకానంద స్ఫూర్తి అంతటా ప్రసరించాలన్నదే మా ఆకాంక్ష.

మహారాష్ట్రలో ఓ పల్లె నా స్వస్థలం. 1977లో నాగపూర్ సమీపంలోని వర్ధం కళాశాలలో ఎం.కాం. పూర్తయింది. ఆ తరువాత ముంబై చేరుకున్నాను. స్టాటిస్టికల్ ఆఫీసర్‌గా ప్రభుత్వోద్యోగంలో చేరాను. మంచి చదువు... ఉద్యోగం... అయినా నాలో ఏదో తెలియని అసంతృప్తి. ఆ సమయంలో వివేకానందుని సాహిత్యంతో పరిచయం ఏర్పడింది. రెండేళ్ల పాటు ఆయన సాహిత్యమంతా చదివాను. హిమాలయాలకు వెళ్లడం ఆధ్యాత్మికత కాదు... ఇతరులకు సేవ చేయడంలోనే నిజమైన ఆధ్యాత్మికత ఉందనే వివేకానందుని మాటలు నాకు ప్రేరణగా నిలిచాయి. పాతికేళ్ల వయసులో రామకృష్ణ మఠంలో చేరాను. ఐదేళ్ల పాటు కలకత్తాలోని బేలూర్ మఠంలో శిక్షణ పొందాను. 1987లో హైదరాబాద్ రామకృష్ణ మఠానికి వచ్చాను. నాటి నుంచి నేటి వరకు తెలుగునేలతో ఆత్మీయానుబంధం ఏర్పడింది. ఈ కాలం యువతకు క్రమశిక్షణ లేదని విమర్శిస్తారు. ఆధునిక విద్య క్రమశిక్షణ నేర్పడం లేదు. అందుకే యువత భౌతికంగా, మానసికంగా బలంగా మారాలి. వివేకానందుని వంటి మహనీయుల జీవితాలను ఆదర్శంగా తీసుకోవాలి. అధ్యయనం చేయాలి. డబ్బు సంపాదించాల్సిందే. అయితే నీతో పాటు నీ చుట్టుపక్కల వారు కూడా హాయిగా జీవించాలని కోరుకోవాలి. అందుకోసం చిత్తశుద్ధితో పనిచేయాలి. తద్వారా లభించే సంతృప్తి జీవితాన్ని సార్థకం చేస్తుంది. సమాజంలో ప్రతి ఒక్కరూ ఇలా ఆలోచిస్తే భారతదేశానికి పూర్వవైభవం వస్తుందనడం నిస్సందేహం.

ఈ కాలం యువతకు క్రమశిక్షణ లేదని విమర్శిస్తారు. ఆధునిక విద్య క్రమశిక్షణ నేర్పడం లేదు. అందుకే యువత భౌతికంగా, మానసికంగా బలంగా మారాలి.

– జూన్ 1, 2007



**పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి వారసుడాయన. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన బ్రహ్మంగారి కాలజ్ఞానం ఆయనకు నిత్యపారాయణ గ్రంథం. దేశం నలుమూలలా బ్రహ్మంగారి తత్వాన్ని ప్రచారం చేస్తూ ఆధ్యాత్మిక జీవనం సాగిస్తున్న ఆయనే బ్రహ్మంగారి మఠం పీఠాధిపతి శ్రీ వీర భోగ వసంత వేంకటేశ్వర స్వామి. ఆధ్యాత్మిక జీవితం మనిషికి ఆనందమార్గం చూపుతుందంటునారు ఆ బ్రహ్మంగారి వారసుడు.**



# బ్రహ్మంగారితత్వంతో బతుకు ధన్యం

ఎక్కడ ఏ వింత జరిగినా, విడ్డూరం వినిపించినా, కనిపించినా 'అవును బ్రహ్మంగారు ముందే చెప్పారు' అనే మాటలు వింటూ ఉంటాం. బ్రహ్మంగారు తన కాలజ్ఞానంలో చెప్పినవన్నీ కాలక్రమంలో అక్షరాలా నిజం కావడమే అందుకు కారణం. మూడున్నర శతాబ్దాల తరువాత కూడా బ్రహ్మంగారు మన మదిలో మెదలడానికి ఆయన దార్శనికత, తాత్త్వీక చింతనలే మూలం. సామాన్యుడికి సైతం బ్రహ్మోపదేశం చేసిన ఆయన చింతన అనన్యసామాన్యం. కాలజ్ఞానంలోని కొన్ని సత్యాలు అబ్బురం కలిగిస్తాయి. ఇంగ్లీషువారు మన రాజ్యాన్ని పరిపాలిస్తారనే విషయాన్ని బ్రహ్మంగారు తన తత్వంలో 'భరత భూమిని పరిపాలన చేయ పరదేశీయులు వచ్చేరయా' అన్నారు. అలాగే 'ఉత్తర దేశాన వైశ్యకులమందు ఉత్తమ గాంధొకుడు పుట్టేనయా స్వాతంత్ర్య సమరమ్ము చేసేనయా' అని చెప్పారు. మహిళలు రాజ్యం చేస్తారంటూ ఇందిరమ్మ పాలన గురించి ముందే ఊహించిన దార్శనికుడు బ్రహ్మంగారు. ఆయన కడపజిల్లా బ్రహ్మంగారి మఠంలో జీవసమాధి చెందారు. ఆ మహనీయుని దివ్య జ్ఞానాన్ని గుండెల నిండా నింపుకునేందుకు నేటికీ నిత్యం వందలాది మంది భక్తులు ఆ క్షేత్రాన్ని దర్శిస్తున్నారు. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారి ఏడవ తరానికి చెందిన 11వ మఠాధిపతిని నేను. ఇక్కడకు వచ్చిన భక్తులతో పాటు బ్రహ్మంగారి కాలజ్ఞానం విశేషాలను ప్రపంచ వ్యాప్తం చేయడమే నా లక్ష్యం.

మూడున్నర శతాబ్దాల తరువాత కూడా బ్రహ్మంగారు మన మదిలో మెదలడానికి ఆయన దార్శనికత, తాత్త్వీక చింతనలే మూలం. సామాన్యుడికి సైతం బ్రహ్మోపదేశం చేసిన ఆయన చింతన అనన్యసామాన్యం. కాలజ్ఞానంలోని కొన్ని సత్యాలు అబ్బురం కలిగిస్తాయి.

కేవలం సందేశా న్నివ్వడమే కాకుండా బ్రహ్మంగారు తాను చెప్పిన సత్యాలను ఆచరించి చూపారు.

సమాజహితం కోరి ఆయన కాలజ్ఞానాన్ని రచించారు. అందులో ఎన్నో అద్భుతాలున్నాయి. పాపభీతి, పరహితం, జీవ కారుణ్యంపై ఎన్నో సందేశాలను ఆయన తన పద్యాలు, కాల జ్ఞాన తత్త్వాల ద్వారా ప్రజలకు అందించారు. పాపభీతి లేని వారు ఎన్ని గుళ్లూ, గోపురాలు కట్టించినా ప్రయోజనం ఉండదు. బ్రహ్మంగారు తన ప్రబోధంలో జీవిని చంపడమంటే శివుడిని చంపడమే అన్నారు. జనసామాన్యంలోకి ఒక సత్యాన్ని సూటిగా తీసుకవెళ్లేందుకు ఆయన ప్రయత్నించారు. ప్రతి మని షినీ మానవతావాదిగా తీర్చిదిద్దేందుకు బ్రహ్మంగారు ప్రయ త్నించారు. కాలజ్ఞానం నేటికీ ఓ అద్భుతంగా వెలుగొందడానికి అదే కారణం. 'కులమ నేటి తెగులు కొంపలు కూల్చేను! మతము మత్తుగూర్చు మార్గమ్ము కారాదు' అన్నారు బ్రహ్మం గారు. కాలజ్ఞానం భవిష్యత్ దర్శనమే కాదు. జీవిత సత్యాల సంపుటి. సామాజిక స్పృహ ఆయన తత్త్వాల్లో స్పష్టంగా కనిపి స్తుంది. కులమతాలకతీతంగా మెలగాలని ఆయన తేల్చి చెప్పారు. కేవలం సందేశాన్నివ్వడమే కాకుండా బ్రహ్మంగారు తాను చెప్పిన సత్యాలను ఆచరించి చూపారు. దూదేకుల కుల స్థుడైన సిద్ధయ్యను, మాదిగ కులస్థుడైన కక్కయ్యను ప్రియ శిష్యులుగా చేసుకున్నారు. స్త్రీలు, శూద్రులు వేదాలు చదవకూడ దన్న అప్పటి కట్టుబాట్లను తెంచేసి వారికి వేదాలు చెప్పారు. స్త్రీలు సృష్టికి మూలం అని చెప్పి వారికి సమున్నత స్థానం కల్పిం చారు. ఆ కాలంలో ఉన్న ఎన్నో దురాచారాలను వ్యతిరేకిం చారు.

దేశం నలుమూలలా పర్యటించి బ్రహ్మం గారి కాలజ్ఞానం గురించి ప్రసంగిస్తు న్నాను. బ్రహ్మంగారి తత్త్వాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తున్నాను.

బ్రహ్మంగారి కుమార్తె వీరనారాయణమ్మ వారసులు ఆరు త రాలుగా మఠం కార్యకలాపాలను నిర్వహిస్తున్నారు. నేను ఏడో తరం వాడిని. పొద్దుటూరులో విద్యాభ్యాసం చేశాను. ఆ తరు వాత పీఠం అభివృద్ధికే జీవితాన్ని అంకితం చేశాను. బ్రహ్మం గారి తత్త్వంతో పాటు ఆధ్యాత్మిక గ్రంథ పఠనం, ఆదర్శ జీవనం నా మార్గం. దేశం నలుమూలలా పర్యటించి బ్రహ్మంగారి కాల జ్ఞానం గురించి ప్రసంగిస్తున్నాను. బ్రహ్మంగారి తత్త్వాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తున్నాను. మనిషి విష సర్పము, తోడేలు లాంటి నైజాన్ని ఉంచుకోకూడదు. సన్మార్గంలో నడుస్తూ... నడిపిస్తూ ఉండాలి. ఈ మార్గంలో నడవడానికి ఆధ్యాత్మిక చింతన ఎంతగానో దోహదపడుతుంది. ఆధ్యాత్మిక

చింతనతో ప్రశాంతత లభిస్తుంది. ప్రశాంతచిత్తంతో చేసే ప్రతి పనీ నీతో పాటు నీ పక్క వారికి కూడా మేలు కలిగిస్తాయి. అది సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడుతుంది. అందుకే ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పెంపొందించుకొని స్వహితంతో పాటు పరహితానికి కూడా తోడ్పడాలి. 'దాసులు యోగులు ధరలోన దాగేరు.. మోసదాసులు యోగులను మించేరు.. కల్ల గురువులు కలిగేరుయా!' అని ఆనాడే బ్రహ్మంగారు తన కాల జ్ఞానంలో చెప్పారు. కల్లగురువులు మోసదాసులు మొదట జనాన్ని ఆకర్షించి, బహుళ ప్రచారం పొంది దాని చాటున దురా చారాలకు పాల్పడడం మంచిదికాదు. ఇలాంటి ధోరణులు ప్రజల్లో అవిశ్వాసాన్ని కలిగిస్తాయి. ఆ రోజుల్లో ఇతర ధర్మాలన్నీ సన్యాసాన్ని బోధిస్తే బ్రహ్మంగారు గృహస్థు జీవితాన్ని బోధిం చారు. ఆధ్యాత్మిక జీవితాన్ని, తత్త్వసారాన్ని సామాన్యులకు అందుబాటులోకి తెచ్చేందుకు నిరంతరం కృషి చేసిన మహనీ యుడు బ్రహ్మంగారు. గృహస్థ జీవనం సాగిస్తూ కూడా ముక్తి పొందవచ్చనేది ఆయన తత్త్వం. రాజయోగాన్ని మఠం అను యాయులకు అందించారు. ఆ సంప్రదాయమే ప్రస్తుతం కూడా మఠంలో కొనసాగుతున్నది. ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని సాధించేం దుకు మార్గాలు అనేకం ఉన్నాయి. మార్గాలు ఎన్నయినా పర మార్థం మాత్రం ఒక్కటే.

ప్రతి ఒక్కరూ ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పెంపొందించుకొని స్వహితంతో పాటు పరహితానికి కూడా తోడ్పడాలి.

ఆ కాలంలో ఉన్న ప్రపంచ ధోరణులల్లో తప్పులను ఎండగ ట్టడేమే కాకుండా భవిష్యత్ దర్శనం చేశారు బ్రహ్మంగారు. అని తర సాధ్యమైన యోగవిద్యతో, తాత్త్విక చింతనతో ఆయన కాల జ్ఞానాన్ని మనకు అందించారు. ఏకాగ్రతతో మనసును ఒకే అంశంపై నిలిపితే అద్భుతాలు చేయవచ్చు. అందుకు బ్రహ్మం గారి జీవితమే నిదర్శనం. యోగాభ్యాసం ముక్తిమార్గం. ఆధ్యా త్మిక జీవనం, పరుల హితం కోరినప్పుడే జీవితం సార్థకం అవు తుంది.

ఏకాగ్రతతో మన సును ఒకే అంశంపై నిలిపితే అద్భుతాలు చేయవచ్చు. అందుకు బ్రహ్మం గారి జీవితమే నిదర్శనం.

– జూన్ 8, 2007



**ఆమె పుట్టింది కమ్యూనిస్టుల కుటుంబంలో. చిన్నతనంలో ఇంట్లో వారికి తెలియకుండా తలుపు చాటున వేంకటేశ్వర స్వామి ఫోటో పెట్టుకుని ఆ స్వామిని ఆరాధించేవారు. చదువు.. వివేకానందుడు రాసిన ఓ పుస్తకం ఆమెలో ఆధ్యాత్మిక దీప్తిని వెలిగించింది. ఆక్షణం నుంచి వివేకానందుడే ఆమెకు సర్వస్వం. కోట్ల రూపాయలు విలువ చేసే సొంత భవనాన్ని వివేకానంద కేంద్రంగా మలచి, యువతలో వికాసం కలగిస్తున్నారు శ్రీమతి కె.వీణారావు.**



# ఆధ్యాత్మికం... వివేకానందం

నా తండ్రి ప్రముఖ దర్శకులు వి. మధుసూధనరావు. తల్లి ప్రజానాట్యమండలిలో బుర్రకథలు చెబుతూ ప్రజలను చైతన్య పరిచేవారు. ఇంట్లో పూజలు, పునస్కారాల ఊసే ఉండేది కాదు. 35 ఏళ్ల వయసులో తండ్రి యథాలాపంగా కన్యాకుమారి నుంచి తెచ్చిపెట్టిన వివేకానందుని పుస్తకం నా జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ పుస్తకం చదివాక బోలెడన్ని వివేకానందుడి పుస్తకాలు తెచ్చుకొని రెండేళ్ల పాటు వాటిని అధ్యయనం చేశాను. అప్పటి రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి రంగనాథానంద ప్రసంగాలు నన్ను మంత్రముగ్ధం చేశాయి. నాటి నుంచి ఆమె జీవితం వివేకానందమయమైంది. మనలో వికాసం కలిగితే సరిపోదు... సమాజం కూడా చైతన్య పూరితం కావాలనేదే నా భావన.



**35 ఏళ్ల వయసులో తండ్రి యథాలాపంగా కన్యాకుమారి నుంచి తెచ్చిపెట్టిన వివేకానందుని పుస్తకం నా జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ పుస్తకం చదివాక బోలెడన్ని వివేకానందుడి పుస్తకాలు తెచ్చుకొని రెండేళ్ల పాటు వాటిని అధ్యయనం చేశాను.**



స్వామి రంగనాథానంద ఓ అద్భుత వ్యక్తి. వేదవిజ్ఞానాన్ని ఆధునిక పరిజ్ఞానంతో అన్వయిస్తూ ఆయన చేసే ప్రసంగాలు వినే వారందరిలోనూ చైతన్యం నింపేవి. ఆయన ప్రసంగం విన్న మొదటి రోజే ఏదో తెలియని అనుబంధం ఏర్పడింది. ఆయన వివేకానందునికి ప్రతిరూపం. ఆయన చెప్పే దానికి, ఆచరించే దానికి ఏమాత్రం తేడా ఉండేది కాదు. దేశదేశాలకు చెందిన ప్రముఖులు ఆయనను కలుసుకొనేందుకు వచ్చేవారు. వారికి మా ఇంట్లోనే ఆతిథ్యం. ఆధ్యాత్మిక రంగంలోని ప్రముఖుల సాంగత్యం నా ఆలోచనలో ఎంతో మార్పు తీసుకు

వచ్చింది. రంగనాథానంద సాంగత్యం లభించడం నిజంగా నా సుకృతం. రంగనాథానంద భగవద్గీత చెబుతుంటే వేలాది మంది గంటల తరబడి మంత్రం వేసినట్లుగా కూర్చొని వినే వారు. ఆ ప్రసంగాలన్నీ నేను రికార్డు చేశాను. ఆయన ఆంగ్లంలో చెబుతున్న గొప్ప విషయాలను తెలుగు వారందరికీ తెలిసేలా చేయాలనిపించింది. ఆయనకు చెప్పకుండానే కొంత భాగం అనువాదం చేసి స్వామీజీకి చూపించాను. కొనసాగించ మని ప్రోత్సహించారు.

యువతకు వివేకానం దుని సందేశాన్ని అందించాలని అప్పుడే సంకల్పిం చాను. వివేకానంద కేంద్రంతో కూడా అనుబంధం పెరిగింది.

నిజానికి స్వామీజీయే నాలో ఉండి అనువాదం చేయించార నిపిస్తుంది. శ్రీమద్ భగవద్గీతా సందేశం ...820 పేజీల పుస్తకం అయింది. ఎన్నో ప్రశంసలు వచ్చాయి. నాలుగుసార్లు పునర్ము ద్రణ పొందింది. తెలుగువారికి రంగనాథానంద తత్త్వాన్ని అందించాననే తృప్తి మనసు నిండా ఆనందాన్ని నింపుతోంది. వివేకానందుల సందేశాన్ని పదిమందికీ తెలియజేయాలన్న ఆరాటం నాలో మొదలైంది. నా ఆలోచన చెప్పగానే.. ఓ సారి కన్యాకుమారి వెళ్లిరా.. అన్నారు రంగనాథానంద. అక్కడి ప్రశాంత వాతావరణం... పెద్ద చదువులు చదివిన వారి సాంగత్యం నన్ను ఉత్తేజితం చేసింది. యువతకు వివేకానందుని సందేశాన్ని అందించాలని అప్పుడే సంకల్పించాను. వివేకా నంద కేంద్రంతో కూడా అనుబంధం పెరిగింది. దాన్ని వేదికగా చేసుకొని యువతలో ఆధ్యాత్మిక భావాలను, చైతన్య స్ఫూర్తిని రగిలించేందుకు నడుంకట్టాను. వారి కార్యకలాపాలకు ఒక వేదిక అవసరమైతే సారథీ స్టూడియోస్ సమీపంలో ఉన్న నా మూడు ఫ్లాట్‌లను వారికి ఇచ్చాను. అక్కడ యువతకు యోగా, ధ్యానం, ఆంగ్లంతో వాటు విలువలతో కూడిన విద్యను అంది స్తున్నాం. గత ఏడాది సుమారు మూడు వేల మంది విద్యార్థులు వివిధ కోర్సుల్లో శిక్షణ తీసుకున్నారు. వితరణలో గొప్ప సంతృప్తి ఉంటుంది. వివేకాన్ని పంచే యజ్ఞం నా జీవితాన్ని సార్థకం చేసింది. ఇంతకంటే కావలసింది ఏముంది?

యువతకు యోగా, ధ్యానం, ఆంగ్లంతో వాటు విలువలతో కూడిన విద్యను అందిస్తున్నాం.

మా ఇంట్లో ఉన్న స్వేచ్ఛా వాతావరణమే నేను స్వతం త్రంగా ఆలోచించేందుకు తోడ్పడిందనిపిస్తుంది. 1947లో విజ యవాడలో పుట్టాను. ఐదేళ్ల వయసులో మద్రాసు వెళ్లి పోయాం. ఎందుకో తెలియదు.. నాలో దేవుడంటే భక్తి ఏర్ప డింది. నాన్నగారు సినిమా రంగంలో ఉన్నా ఆ ప్రభావం నా

**సంకుచితత్వానికి తావులేకుండా, వికాసాన్ని పెంపొం దించేది ఆధ్యాత్మిక వాదమే అనిపిం చింది. అందుకే ఈ మార్గాన్ని అనుసరించాను.**

మీద పడలేదు. బి.ఎస్‌సి హోం సైన్స్ చదువుకున్నాను. రామ లింగేశ్వరరావుగారితో వివాహం అయింది. ఓ బాబు. ఆ తరు వాత హైదరాబాద్ వచ్చేశాం. సంసారం.. పిల్లల్ని పెంచడమే కాకుండా జీవితం అంటే ఏదో ఉందనిపించింది. ఆ సమ యంలో వివేకానంద సాహిత్యంతో పరిచయం ఏర్పడింది. ఆయన ఓ చైతన్య ప్రభంజనం. ఆయన తత్త్వం ఆలోచనలను వికసింపచేస్తుంది. సంకుచితత్వానికి తావులేకుండా, వికాసాన్ని పెంపొందించేది ఆధ్యాత్మిక వాదమే అనిపించింది. అందుకే ఈ మార్గాన్ని అనుసరించాను.

ఈ ఉరుకులు పరుగుల జీవితంలో ఆనందంగా ఉండాలని ప్రతి ఒక్కరూ కోరుకుంటున్నారు. కానీ సాధ్యం కావడం లేదు. ఈ కాలం మహిళలు దారీతెన్నూ లేకుండా ఉన్నారు. అమూల్యా మైన సమయాన్ని వృథా చేసుకుంటున్నారు. తమలో దివ్యతే జస్సు ఉంది.. దాన్ని బయటకు తేవాలి ఆ దీప్తిలో జీవితాన్ని ఆనందమయం చేసుకోవాలనే ఆలోచన ఎవరిలోనూ కనిపిం చడం లేదు. పిల్లలను పెంచుతూ మహిళలూ పెరగాలన్నారు రామకృష్ణులు. యువతలోనూ నిస్తేజం కనిపిస్తున్నది. వివేకా నంద సాహిత్యం చదవాలి. మనలో మార్పు వస్తే... వికాసం కలిగితే సమస్యలు లేని సమాజం ఏర్పడుతుంది. ప్రభుత్వాలు కూడా విలువలతో కూడిన విద్యను చిన్నారులు, యువతకు అందించాలి. ప్రతి ఒక్కరిలో వివేకం పెరిగి, జీవితం ఆనంద మయం అవుతుంది.

వివేకానంద సాహిత్యం చదవాలి. మనలో మార్పు వస్తే... వికాసం కలి గితే సమస్యలు లేని సమాజం ఏర్పడుతుంది.

– జూన్ 15, 2007

## శాంతి మంత్రం

పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిశ్యతే
ఓం శాంతి శాంతి శాంతిః

**భావము:** అది సంపూర్ణం. ఇదీ సంపూర్ణం. పూర్ణత్వం నుంచే పరిపూర్ణత వస్తుంది. పరిపూర్ణత్వం నుంచి పూర్ణ త్వాన్ని తీసి వేసినా పరిపూర్ణతే మిగులుతుందనేది ఉప నిషద్ వాక్యం.



**ఆధ్యాత్మిక కేంద్రాలైన హిమాలయాలు ఆయనకు ప్రాణ నేస్తాలు. మానస సరోవరంలో జ్ఞానామృతం సేవించారు. షిర్డి సాయి, మహావతార్ బాబాజీ ఆయన సద్గురువులు. 70 మందికి పైగా అవదూతలను కలుసుకుని జ్ఞానాన్వేషణ చేశారు. కాలినడకన శ్రీ కైలాస మానస సరోవర యాత్రతో పాటు అనేక ఆధ్యాత్మిక గ్రంథాలు రచించారు హిమాలయ సంత్, పరమానంద స్వామి వేదానంద సరస్వతి.**



# సాయి నా సద్గురువు

కొందరు శివుడ్ని కొలుస్తారు.. మరికొందరు విష్ణువును మాత్రమే కొలుస్తారు. అందరూ కొలిచే దేవుడు ఎవరనే అన్వేషణ నాలో చిన్నతనం నుంచే ప్రారంభమైంది. ఓ రోజున మా అమ్మమ్మ సాయి విగ్రహం తీసుకువచ్చింది. ఆ విగ్రహం చూడగానే నాలో ఏదో చైతన్యం ప్రవేశించింది. ఆ రోజే అనుకున్నాను... ఈయనే నాకు సద్గురువు అని.. 32 ఏళ్లుగా సాయి నామమే నాకు సర్వస్వం అయింది. ఆయనది విశ్వ తత్త్వం. సాటిలేని సద్గురువు సాయి. సాదాసీదాగా జీవిస్తూ ప్రపంచానికి ఆయన అద్భుతమైన తత్త్వాన్ని బోధించారు. అందరూ ప్రేమగా... కలిసి మెలసి జీవించాలనేది సాయి బోధల సారాంశం. గొప్ప తత్త్వ సూత్రాలను సరళంగా చెప్పడంతో పాటు ఆచరించి చూపిన మహనీయుడాయన. అదే నన్ను అమితంగా ఆకర్షించింది. యుక్తవయసు నుంచే నాకు తెలిసిన సాయి తత్త్వాన్ని అందరికీ చెబుతూ ఉండేవాడిని. ఆయన కీర్తనలు వినిపించే వాడిని. భజనలు, ప్రవచనాలు నిర్వహిస్తూ ఉండే వాడిని. 12 ఏళ్లుగా ఓం సాయిరాం మాసపత్రికను నిర్వహిస్తూ ఆయన తత్త్వాన్ని ప్రచారం చేస్తున్నాను.



**32 ఏళ్లుగా సాయి నామమే నాకు సర్వస్వం అయింది. ఆయనది విశ్వతత్త్వం. సాటిలేని సద్గురువు సాయి. సాదాసీదాగా జీవిస్తూ ప్రపంచానికి ఆయన అద్భుతమైన తత్త్వాన్ని బోధించారు. అందరూ ప్రేమగా... కలిసి మెలసి జీవించాలనేది సాయి బోధల సారాంశం.**



రాజమండ్రిలో వేదపండితుల కుటుంబంలో పుట్టాను. ఇంటి పక్కన ఉన్న రామకృష్ణ మఠంతో నాకు అనుబంధం ఏర్పడింది. మఠంలో జరిగే ఆధ్యాత్మిక, సేవా కార్యక్రమాలు నా ప్రస్థానానికి బీజాలు వేశాయి. విజయవాడలో డిగ్రీ పూర్తి

ఎక్కిరాల కృష్ణమూర్తి గారు అవధూతల దర్శనం చేయించారు. ఆయనే నాకు ఆధ్యాత్మిక ప్రేరణ అని చెప్పాలి.

చేశాను. ఎం.కాం చదువుతూ 1982లో రాజధానికి చేరాను. ఓ దశాబ్దికాలం పాటు పాత్రికేయునిగా పలు బాధ్యతలు నిర్వహించాను. ఎప్పుడూ ఏకాంతం కోరుకొనే తత్త్వం నాది. పాటలు పాడుకోడవం.. రాసుకోవడం.. నా లోకం నాది. అలా నా అంతర్ ప్రయాణం ప్రారంభమైంది. ఎక్కిరాల కృష్ణమూర్తిగారు అవధూతల దర్శనం చేయించారు. ఆయనే నాకు ఆధ్యాత్మిక ప్రేరణ అని చెప్పాలి. షిర్డిలో బ్రహ్మచర్య దీక్ష తీసుకున్నాను. సాయి తత్త్వ ప్రచారం మొదలు పెట్టాను. పలు మార్లు హిమాలయాలు దర్శించాను. సుమారు 70 మంది అవధూతలను కలుసుకున్నాను. వారి సత్సంగంతో నా అన్వేషణ ఫలించింది. కురుపురం దత్తపీఠాధిపతి స్వామి విఠలానంద సరస్వతి నాకు దీక్ష ఇచ్చారు. ఆ తరువాత కాలినడకన మానస సరోవర యాత్ర చేశాను. అదో అద్భుతమైన అనుభవం. దివ్యత్వ శిఖరం అది. అనంత నిర్మల స్థితి.. శంకరులు, యోగావతార్ బాబాజీ వంటి మహనీయులు నడయాడిన నేల అది. అప్పటి నుంచి మానస సరోవరంతో అనుబంధం ఏర్పడింది. ఇప్పటికి నాలుగు సార్లు దర్శించాను. ఆ అనుభవాలను పుస్తకరూపంలో ప్రచురించాను. ప్రతి ఒక్కరూ ఏటా హిమాలయ సానువుల్ని తప్పని సరిగా దర్శించాలి. వాటి నుంచి ప్రసరించే ఆధ్యాత్మిక తరంగాలు జీవితాన్ని ధన్యం చేస్తాయి. హిమాలయాల్లో సాధన చేసుకోవాలనుకొనే వారికి ఉపయోగకరంగా ఉండేందుకు ఉత్తరాఖండ్ రాష్ట్రం ద్వారాహాట్‌లో పరమయోగి మహావతార్ బాబాజీ గుహకు అతి సమీపంలో వేదానంద తపోవన ఆశ్రమం ఏర్పాటు చేశాం. హైదరాబాద్‌లోని నాగారంలో సాయి ఆశ్రమాన్ని ఏర్పాటు చేసుకొని అన్నదానం, సేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం.

ఏటా హిమాలయ సానువుల్ని తప్పని సరిగా దర్శించాలి. వాటి నుంచి ప్రసరించే ఆధ్యాత్మిక తరంగాలు జీవితాన్ని ధన్యం చేస్తాయి.

ఆకలితో ఉన్న వారి ఆలోచన శూన్యం అవుతుంది. వారి జీవితం దారితప్పుతుంది. అందుకే సాయి అన్నదానానికి ప్రాధాన్యం ఇచ్చేవారు. మా ఆశ్రమంలో కూడా చేతనైనంతమందికి అన్నదానం చేస్తున్నాం. ఎవరైనా అన్నదానం చేయాలనుకొనే వారికి మేం ఒక పాత్ర ఇస్తాం. భక్తులు బాబాను కానీ వారి ఇష్ట దైవాన్ని కానీ జపిస్తూ రోజూ గుప్పెడు బియ్యాన్ని, దక్షిణను అందులో వేయాలి. అలా సేకరించిన బియ్యం, దక్షిణలతో ఇప్పటి వరకు 300 అన్నదానాలు నిర్వహించాం. భక్తులు ముందుకు వస్తే ఆశ్రమంలో నిరంతరం అన్నదానాలు చేయాలని మా సంకల్పం. గతంలో ప్రతి ఒక్కరిలో భక్తి భావం అధి

కంగా కనిపించేది. ఇప్పుడు ఆధ్యాత్మిక దృక్పథం పెరుగుతోంది. ఉరుకులు పరుగుల జీవితాల్లో శాంతి లేకుండా పోయింది. నేటి విద్య జీవితానికి అవసరమైన జ్ఞానం ఇవ్వడం లేదు. ధార్మిక జీవనం ఎలాగూ లేదు. దీంతో అంతా అయోమయం. చక్కగా జీవించేందుకు దారి చూపించే గురువుల కోసం ప్రతి ఒక్కరి మనసూ వెదుకుతోంది. ప్రతి ఒక్కరూ గురువు కోసం అన్వేషించాలి. సద్గురువు లభించినప్పుడే జీవితానికి సద్గతి లభిస్తుంది. భక్తిభావం మనసుకు క్రమశిక్షణ నేర్పుతుంది... ఆధ్యాత్మిక జీవితం జన్మను సార్థకం చేస్తుంది. ప్రస్తుతం ఎందరో గురువులు ప్రజలకు అవసరమైన రీతిలో ఆధ్యాత్మిక విషయాలను సులభంగా చెబుతున్నారు. దీంతో ప్రజలు ఆధ్యాత్మిక మార్గం పడుతున్నారు. నిజంగా ఇది మంచి పరిణామం. సైనికుడు దేశాన్ని రక్షిస్తే... ఒక సాధువు ధర్మాన్ని రక్షిస్తాడు. అందుకే వీరిద్దరూ సమానం అని నా భావన. అన్ని వర్గాల సాధు, సత్సంగులను ప్రభుత్వం ఆదరించాలి. సిసలైన సాధువులను గుర్తించి వారికి తగిన సౌకర్యాలు కల్పిస్తే వాళ్లు ప్రజలు.. సమాజ సంక్షేమం కోసం పని చేస్తారు. జ్ఞానాన్వేషణ, నిరంతర సాధన జీవితాన్ని సుసంపన్నం చేస్తాయి. మహా యోగులు సైతం సాధించేది... అందరికీ బోధించేది ఒక్కటే. ప్రతి ఒక్కరూ ప్రేమగా ఉండాలి. సేవాభావంతో మెలగాలి. సత్సంగం కావాలి. సాయి తత్త్వ సారం కూడా ఇదే. ప్రతి ఒక్కరూ ఈ సూత్రాలను పాటిస్తే జీవితం సార్థకం అవుతుంది.

– జూలై 6, 2007

చక్కగా జీవించేందుకు దారి చూపించే గురువుల కోసం ప్రతి ఒక్కరి మనసూ వెదుకుతోంది. ప్రతి ఒక్కరూ గురువు కోసం అన్వేషించాలి.

సైనికుడు దేశాన్ని రక్షిస్తే... ఒక సాధువు ధర్మాన్ని రక్షిస్తాడు. అందుకే వీరిద్దరూ సమానం అని నా భావన.

## శాంతి మంత్రం

సర్వే సంతు సుఖినః సర్వే సంతు నిరామయా
సర్వే భాద్రాని పశ్యంతు మాకశ్చిద్ దుఃఖ భాగ్‌భవేత్

**భావం:** అందరూ సంతోషంగా ఉండాలి. అందరూ ఆరోగ్యంగా జీవించాలి. సమస్త జనావళి అనంత సౌందర్యాన్ని దర్శించాలి. అంతటా ఆనందం వెల్లి విరియాలి. దుఃఖ జాడ లేకుండా పోవాలి. అంతటా శాంతి నెలకొనాలి.



**ఆయన మాట లలితంగా ఉంటుంది. అందులోని భావం మాత్రం ఆధ్యాత్మిక చైతన్య దీప్తుల్ని పంచుతుంది. దశాబ్దాలపాటు సరస్వతీ సేవలో తరించిన సాహితీ సార్వ భౌముడాయన. కవి నుంచి రుషిగా, రుషి నుంచి యతిగా, యతి నుంచి పీఠాధిపతిగా మారిన ఆయనే కుర్తాళం శంక రాచార్య శ్రీ సిద్ధేశ్వరానందం భారతీ స్వామి. ప్రొఫెసర్ ప్రసాదరాయకులపతిగా విద్యాగంధాన్ని పంచిన ఆయన ఇప్పుడు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచుతున్నారు.**



# పూర్వవైభవం తెచ్చే ధర్మచైతన్యం

> చిన్నతనంలోనే సన్యాసం తీసుకోవాలనే ప్రేరణ కలిగింది. కుర్తాళం పీఠాన్ని సంప్రదించాను. అయితే సన్యాసం తీసు కొనేందుకు తల్లిదం డ్రులు సమ్మతించలేదు. వారి సమ్మతి లేనిదే సన్యాసం తీసుకోకూ డదు. ఆ తరువాత చదువుల కోసం గుంటూరు వచ్చి, అక్కడే స్థిరపడిపోయాం.

ఆధ్యాత్మిక, సాహితీ చైతన్యం ఉన్న కుటుంబం మాది. గుంటూరు జిల్లా సమీపంలోని ఓ చిన్నగ్రామంలో పుట్టాను. చిన్నతనంలోనే సన్యాసం తీసుకోవాలనే ప్రేరణ కలి గింది. కుర్తాళం పీఠాన్ని సంప్రదించాను. అయితే సన్యాసం తీసు కొనేందుకు తల్లిదండ్రులు సమ్మతించలేదు. వారి సమ్మతి లేనిదే సన్యాసం తీసుకోకూడదు. ఆ తరువాత చదువుల కోసం గుంటూరు వచ్చి, అక్కడే స్థిరపడిపోయాం. హిందూ కళాశా లలో విద్యార్థిగా చేరి అక్కడే లెక్చరర్‌గా.. ప్రిన్సిపాల్‌గా పనిచే శాను. కుటుంబ నేపథ్యం వల్ల కావచ్చు... ముందు నుంచీ సాహిత్యం అంటే మక్కువ. బాల్యంలోనే అవధానాలు చేశాను. చిన్న వయసులోనే రస ప్రధానమైన ఖండకావ్యం రచించాను. భాగవతంపై సమర్పించిన పరిశోధన వ్యాసానికి డాక్టరేట్ లభించింది. భువన విజయంతో పాటు 40 సాహితీ రూపకా లను దేశ విదేశాల్లో ప్రదర్శించాం. మన జాతి సంస్కృతి, సాహితీ ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పాలన్నదే లక్ష్యంగా పనిచేశాం. నిజానికి సాహిత్యం... ఆధ్యాత్మికం.. ఈ రెంటికీ అవి నాభావ సంబంధం ఉంది. పూర్వం రుషులు తపశ్శక్తితో తాము తెలుసుకున్న జీవిత సత్యాలను సాహిత్యం ద్వారా ప్రపంచానికి తెలియచెప్పారు. వ్యాసుడు.. వాల్మీకి... ఇలా రుషులందరూ చేసింది అదే. సాహిత్యం.. ఆధ్యాత్మిక రంగాల పరమార్థం లోక కల్యాణమే. మన జాతి ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పేం దుకు సాహితీ సేవ చేపట్టాను... ప్రజల హృదయాల్లో భక్తి

చైతన్యం కలిగించేందుకు ఇప్పుడు ఆధ్యాత్మిక మార్గం ఎంచుకున్నాను. మొదటి నుంచి కుర్తాళం పీఠంతో నాకు అనుబంధం ఉన్నది. పదవీ విరమణ చేస్తున్న సమయంలో ఆ పీఠానికి సారథ్యం వహించే వారి కోసం అన్వేషణ జరుగుతున్నది. వారి సూచన మేరకు యతిగా మారాను. 2002 నుంచి కుర్తాళంలోని సిద్ధేశ్వరీ పీఠాధిపత్యం చేపట్టి ఆధ్యాత్మిక ప్రచారం చేస్తున్నాను.

భారతదేశం ఈ స్థితికి రావడానికి కారణాలు అనేకం. పరాయి పాలనలో మన ఆధ్యాత్మిక వైభవం మసకబారింది.

భారతీయ సనాతన ధర్మాన్ని పాటించే వారి సంఖ్య ఈ కాలంలో చాలా తక్కువ. భక్తి, ఆధ్యాత్మికాలు పనిలేని వాళ్ల మార్గాలు అన్న ధోరణి పెరుగుతోంది. వేల సంవత్సరాలుగా మహోన్నత సంస్కృతికి నిలయమై, యావత్ ప్రపంచానికే ఆదర్శప్రాయమైన భారతదేశం ఈ స్థితికి రావడానికి కారణాలు అనేకం. పరాయి పాలనలో మన ఆధ్యాత్మిక వైభవం మసకబారింది. పూర్వం రాజులకు పీఠాధిపతులు, మఠాధిపతులు సలహాదారులుగా ఉండేవారు. లోకకల్యాణ లక్ష్యంతో వారు చేసే సూచనలను రాజులు గౌరవించే వారు. ప్రజలు పీఠాధిపతులను వెతుక్కుంటూ వెళ్లి ఆశీర్వాదం పొందేవారు. ఇప్పుడు పరిస్థితి మారింది. ఆధ్యాత్మిక గురువులే ప్రజలను వెతుక్కుంటూ బయలుదేరుతున్నారు. ప్రజల్లో ఆధ్యాత్మిక చైతన్యం రగిలించాలని, లోకకల్యాణం కోసం పాటుపడాలనే ఆకాంక్ష వారిలో అప్పుడూ... ఇప్పుడూ కూడా ఉంది. అయితే పూర్వం వారికి రాజుల అండదండలుండేవి. ప్రస్తుతం అది లేకుండా పోయింది. ఆధ్యాత్మిక రంగంలో మన దేశానికి పూర్వ వైభవం రావాలని ప్రతి ఒక్కరూ ఆకాంక్షిస్తున్నారు. అయితే వందల సంవత్సరాల పాటు మన సంస్కృతి, సంప్రదాయాలు నిర్లక్ష్యానికి గురయ్యాయి. వాటిని తిరిగి తీసుకురావాలంటే చాలా ఓపిక కావాలి. ఆర్థిక సామర్థ్యం కావాలి. లౌకిక ప్రభుత్వాలు ఆ పని ఎలాగూ చేయలేవు. అందుకే ఆలయాల నిధులను వేరే పనులకు వినియోగించకుండా పీఠాధిపతులు, స్వాములు, సత్సంగులతో ఒక స్వతంత్ర సంస్థను ఏర్పాటు చేయాలి. వారి సూచన మేరకు ప్రజల్లో ధర్మ చైతన్యం కలిగించేందుకు ప్రయత్నించాలి. అప్పుడే మన సనాతన ధర్మం మళ్లీ వెల్లివిరుస్తుంది. ప్రజలు సుఖశాంతులతో ఉండగలుగుతారు. కుర్తాళం పీఠం ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున భక్తి ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. నిరంతర యజ్ఞయాగాదులు చేపడుతున్నాం. గతంలో నిర్వహించిన సాహితీ రూపకాలను ఆధ్యాత్మికంగా

వందల సంవత్సరాల పాటు మన సంస్కృతి, సంప్రదాయాలు నిర్లక్ష్యానికి గురయ్యాయి. వాటిని తిరిగి తీసుకురావాలంటే చాలా ఓపిక కావాలి.

**ఒక పీఠమో మఠమో కాకుండా అందరూ సంఘటితమై కృషి చేస్తేనే మనం పోగొట్టుకున్న వైభవాన్ని తిరిగి పొందగలం.**

మలచి ధర్మవిజయం పేరిట ప్రదర్శనలు ఇస్తున్నాం. ఒక పీఠమో మఠమో కాకుండా అందరూ సంఘటితమై కృషి చేస్తేనే మనం పోగొట్టుకున్న వైభవాన్ని తిరిగి పొందగలం.

'దైవాధీనం జగత్ సర్వం – మంత్రాధీనంతు దైవం' ఈ ప్రపంచాన్ని నడిపించేది దేవుడయితే... ఆయనను ప్రసన్నం చేసుకోనే శక్తి మంత్రానికే ఉంది. ఈ కాలంలో చాలా మంది ధ్యానం చేస్తున్నారు. అది మనసును అదుపులో ఉంచుతుంది.. నిజమే. ఆ తరువాత ఏమిటనే ప్రశ్న ఉదయిస్తుంది. అందుకే మంత్ర సాధనతో కూడిన ధ్యానం ఉత్తమ ఫలితాలను ఇస్తుంది. మా పీఠానికి వందలాది భక్తులు వస్తూ ఉంటారు. వైద్యులు నయం చేయలేని అనేక వ్యాధులకు పరిష్కారాలు కనిపిస్తున్నాయి. ఇదంతా సంకల్ప శక్తి మహత్యం. ప్రతి ఒక్కరూ ఆలయాలకు వెళ్లాలి. పురాణ ప్రవచనాలు వినాలి. భక్తి మార్గంలో నడవాలి. భజనలు చేయాలి. స్తోత్రాలు చదవాలి. వీటితో పాటు మంత్ర సాధన చాలా ముఖ్యం. గురువు సన్నిధిలో మంత్ర ఉపదేశం పొంది, దాన్ని సాధన చేయాలి. మంత్రం మన అధీనంలోకి వస్తే దేవుని అనుగ్రహం మన సొంతమవుతుంది.. జీవితం చరితార్థం అవుతుంది. వ్యక్తి అశాంతికి లోనవుతున్నాడు. ఫలితంగా సమాజం అలజడికి గురౌతున్నది. వ్యక్తి అశాంతి నుంచి బయటపడినప్పుడే సమాజం క్షేమంగా ఉంటుంది. ఆధునిక కాలంలో ఈ అశాంతి నుంచి బయటపడాలంటే మనకు ఉన్న శక్తులు సరిపోవు. అతీత శక్తి సహాయం కావలసిందే. ఆ దేవుని సహాయం పొందాలంటే మనసా వాచా కర్మణా ఆయనను శరణు వేడాల్సిందే. ఒక అతీత శక్తి ఉంది.. అది ప్రపంచాన్ని కాపాడుతుంది... మనల్ని నిరంతరం గమనిస్తుందనే గ్రహింపు ఉంటే మనకు క్రమశిక్షణతో పాటు ప్రశాంతత కూడా లభిస్తుంది. జీవితం ఆనందమయం అవుతుంది. అగ్నిముఖావై దేవాః దేవతలు అగ్నిని ఆశ్రయించి ఉంటారని వేదం. అందుకే సాధ్యమైనన్ని యజ్ఞాలు నిర్వహించాలి. తద్వారా దేవతలకు ప్రీతి కలుగుతుంది. ప్రజలు ప్రశాంతంగా ఉంటారు. లోకం సుభిక్షంగా ఉంటుంది.

**ఈ ప్రపంచాన్ని నడిపించేది దేవుడయితే... ఆయనను ప్రసన్నం చేసుకోనే శక్తి మంత్రానికే ఉంది.**

– జూలై 20, 2007



**మూడు దశాబ్దాల పాటు వైద్యునిగా సేవలందించారా యన. ఇప్పుడు ఆధ్యాత్మిక వైద్యుడిగా మారి లక్షలాది మంది భక్తులకు సాయితత్వాన్ని పంచుతున్నారు. సాయి నుంచి సందేశాలు అందుకుంటూ వాటిని లోకానికి పంచుతు న్నారు రామ్‌రతన్‌జీగా మారిన డాక్టర్ గుడ్లవల్లేటి వెంకట రత్నం. నిరంతరం సాయిని శ్వాసిస్తూ, ధ్యానిస్తూ, అపర సాయిగా మారారు. జీవితాన్ని సాయికే అంకితం చేసిన డాక్టర్ రతన్‌జీ సాయి గీతామృతం.**

# సాయి భక్తులకు సందేశామృతం

కృష్ణాజిల్లా గుడ్లవల్లేరు నా జన్మస్థలం. నాన్నగారు భక్తితత్పరులు. అప్పుడప్పుడూ స్వామీజీలు, బాబాలు మా ఇంటికి వచ్చి వెళుతూ ఉండేవారు. వారిని చాలా మంది వచ్చి దర్శించు కుంటూ ఉండేవారు. నేను కూడా ఆంజనేయ స్వామి భక్తుడిని. మొదట్లో ఇంతకు మించిన ఆధ్యాత్మిక అనుభవాలు లేవనే చెప్పాలి. బందరులో పౌర్ణమి, అమావాస్యలలో సముద్ర తీరంలో కూర్చొని ధ్యానం చేసే వాడిని. అలా ధ్యానం చేస్తున్న సమయంలో దైవవాణి వినిపించడం ప్రారంభమైంది.



**బందరులో పౌర్ణమి, అమావాస్యలలో సముద్రతీరంలో కూర్చొని ధ్యానం చేసే వాడిని. అలా ధ్యానం చేస్తున్న సమయంలో దైవవాణి వినిపించడం ప్రారంభమైంది. 1972 నుంచి ఎనిమిదేళ్ల పాటు గుడ్లవల్లేరు ఆస్పత్రిలోనే వైద్య సేవలు చేశాను.**



1972 నుంచి ఎనిమిదేళ్ల పాటు గుడ్లవల్లేరు ఆస్పత్రిలోనే వైద్య సేవలు చేశాను. ప్రసూతి వైద్య నిపుణురాలైన డాక్టర్ పద్మ కుమారితో వివాహం అయింది. 1982లో మచిలీపట్నంలో ఇద్దరం కలిసి సొంత ఆస్పత్రి ప్రారంభించాం. పోలీసు అధికారులకు సలహాదారుగా, ప్రభుత్వ కళాశాలలో ప్రత్యేక ఆహ్వానితునిగా ప్రసంగాలు ఇచ్చే వాడిని. మొదటి నుంచీ మానసిక వైద్యం పట్ల అత్యంత ఆసక్తి ఉండేది. 1989 నుంచి కారునడుపుతున్నా, ఆపరేషన్ చేస్తున్నా దైవవాణి వినిపిస్తూ ఉండేది. ఆ సందేశాలు ఎవరివో అర్థమయ్యేది కాదు. అలా ఐదేళ్లు గడిచింది. 1994 సంవత్సరంలో తొలిఏకాదశి రోజున అద్భుతం జరిగింది. తెల్లవారుజామున మూడు గంటల ప్రాంతంలో ఓ ఫకీరు నా గదిలోకి వచ్చి, నన్ను లేపారు. గది తలుపులు వేసినవి వేసినట్టే ఉన్నాయి.... మీరు ఎలా లోపలికి వచ్చారని అయనను ఆదుర్దాగా అడిగాను. ఇంతకూ మీరెవరు? అన్నాను.

దేశంలోని అన్ని పుణ్య క్షేత్రాలను దర్శించి, భిక్షాటనతో జీవించాను. ఇవన్నీ సాయి సందేశాను సారం చేసినవే.

అందుకు ఆ ఫకీరు చిరునవ్వు నవ్వుతూ... 'నన్ను సాయిబాబా అంటారు' అని నా తలపై చేయి పెట్టి.. ఇంతకాలం నీకు వినిపిస్తున్న వాణి నాదే. మనది జన్మజన్మల బంధం' అంటూ నా నాలుకపై బీజాక్షరాలు రాశారు. ఆ రోజు నుంచి నాకు బాబా సందేశాలు అందుతునే ఉన్నాయి. ఆ సందేశాల పరమార్థం లోకకల్యాణం, ప్రజలను ఆధ్యాత్మిక మార్గంలో నడిపించడమే. సాయి తత్త్వాన్ని విశ్వవ్యాప్తం చేయడమే నాటి నుంచి నా జీవిత లక్ష్యంగా మారింది. నా శ్వాస... ధ్యాస అంతా బాబాయే.

ఏడేళ్ల క్రితం నుంచి డాక్టర్ వృత్తిని వదిలేశాను. నిజానికి వైద్య వృత్తి నాకు ప్రాణం కన్నా మిన్న. బాబాతో అదే చెప్పాను. 'వైద్యంలో నీవు చేయలేని పనులు ఇకపై చేద్దువుగాని' అని అన్నారాయన. అలా వైద్యాన్ని వదిలిపెట్టి పూర్తిగా బాబా సందేశాలు, ఆయన తత్త్వ ప్రచారానికి అంకితమయ్యాను. బాబా నుంచి అందుతున్న సందేశాలను నేను చెబుతూ ఉంటే నా భార్య రికార్డు చేస్తూ ఉండేది. వాటిని భావ పరిమళాలు, భావ కుసుమాంజలిగా నాలుగు గ్రంధాలుగా వెలువరించాను. సాయి సందేశం మేరకు నా భార్య నేను జోలె పట్టుకొని భిక్షాటన చేసి గూడూరులో సాయి మందిరాన్ని నిర్మించాం. రెండేళ్ల క్రితం 65రోజుల పాటు అజ్ఞాత దీక్ష చేపట్టాను. దేశంలోని అన్ని పుణ్యక్షేత్రాలను దర్శించి, భిక్షాటనతో జీవించాను. ఇవన్నీ సాయి సందేశానుసారం చేసినవే. ఆయన సూచన మేరకు నైమిశారణ్యంలో గోమతి ప్రాంతంలో బాబా ఆలయానికి శంకుస్థాపన చేశాం. ''నేను జ్యోతి రూపంలో ఉంటాను. ఆ జ్యోతి నుంచి వెలువడే దివ్యతేజస్సు ఎంతో మేలు చేస్తుంది... సత్యాన్వేషణలో నడిపిస్తుంది... ఆధ్యాత్మిక జీవితాన్ని అందిస్తుంది. ఇక మీదట అఖండ సాయి జ్యోతి సప్తాహం ప్రారంభించ''మని బాబా సందేశం ఇచ్చారు. ఆ రోజు నుంచి భక్తుల ఇళ్లలో జ్యోతి సప్తాహం ప్రారంభించాం. నేటి వరకు దేశం నలుమూలలా సప్తాహాలు నిర్వహించాను. అఖండ జ్యోతిని వెలిగించిన రోజు నుంచి ఏడురోజుల పాటు నిరంతరం జ్యోతి వెలగాలి. రోజూ ఏడుగురికి తగ్గకుండా సాయి సచ్చరిత్రను పారాయణ చేయాలి. ఇలా చేస్తే భక్తుల కోర్కెలు ఇట్టే ఫలిస్తున్నాయి. పూర్తి అనారోగ్యంతో ఉన్న వారు కూడా సంపూర్ణ ఆరోగ్యవంతులుగా మారుతున్నారు. వైద్యం చేయలేని చాలా పనులు సాయి శక్తి చేస్తు

పూర్తి అనారోగ్యంతో ఉన్న వారు కూడా సంపూర్ణ ఆరోగ్యవంతులుగా మారుతున్నారు. వైద్యం చేయలేని చాలా పనులు సాయి శక్తి చేస్తున్నది.

న్నది. ఆ తరువాత సాయిశక్తిపీఠం అభిషేకాలు, అహోరాత్ర సాయి యజ్ఞాల ద్వారా భక్తులకు ఆధ్యాత్మిక సుగంధాలు పంచుతున్నాం.



నీలో నేనున్నాను అంటూ ప్రజలను చైతన్య పరచడంతో పాటు వారిని సన్మార్గంలో నడిపించే అద్భుత శక్తి సాయి. నిర్మలమైన మనసుతో ఆయన పేరు స్మరిస్తే చాలు మనలో ఆధ్యాత్మిక వికాసం కలుగుతుంది. తద్వారా మనలో ఉన్న అంతశ్శక్తి మనకే తెలుస్తుంది. మనలో ఉన్న దైవాన్ని మనమే తెలుసుకొనేందుకు మార్గం సుగమం అవుతుంది. అయినా మనలో ప్రతి ఒక్కరం తప్పులు చేస్తాం. ఆ పాపాల ప్రక్షాళన కోసం అఖండజ్యోతి సప్తాహాన్ని బాబాయే ప్రవేశపెట్టారు. ఇక సాయి సచ్చరిత్ర వేదాలు, ఉపనిషత్తుల సారం. సచ్చరిత్ర పారాయణ అద్భుతమైన ఫలితాలను ఇస్తుంది. నైమిశారణ్యంలో సాయి ఆలయ నిర్మాణం ప్రారంభించాం. ఇప్పటికే మచిలీపట్నంలోని మా ఆస్పత్రిని వృద్ధాశ్రమంగా మార్చాం. వృద్ధుల కోసం ఓ ఆస్పత్రిని నిర్మించాలని సంకల్పం. సాయి ఏం సందేశం ఇస్తారో చూద్దాం.

– జూలై 27, 2007

నిర్మలమైన మనసుతో ఆయన పేరు స్మరిస్తే చాలు మనలో ఆధ్యాత్మిక వికాసం కలుగుతుంది.

సాయి సచ్చరిత్ర వేదాలు, ఉపనిషత్తుల సారం. సచ్చరిత్ర పారాయణ అద్భుతమైన ఫలితాలను ఇస్తుంది

## నిశ్చలతత్వే జీవన్ముక్తిః

సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం నిశ్చల తత్వే జీవన్ముక్తిః

– శంకరాచార్య విరచిత భజగోవింద శ్లోకం

భావం: మంచి సాంగత్యం వల్ల విషయ వాంఛల పట్ల విముఖత మొదలవుతుంది. ఆ స్థితి వల్ల మోహం దూరం అవుతుంది. మోహం నుంచి బయట పడిన వ్యక్తి జీవితంలో నిశ్చలత్వం సిద్ధిస్తుంది. నిశ్చల స్థితికిచేరిన వారు జీవన్ముక్తులు అవుతారు.



**మహాభారతం వినాలంటే ఆయన ప్రవచనమే వినాలి. ఇతహాసాల్లోని ధర్మసూక్ష్మాలు తెలుసుకోవాలంటే ఆయన రచనలే చదవాలి. సంస్కృత రామాయణం, ఉపనిషత్తులు ఆయన నాలుక చివరలో ఉంటాయి. 24 ఆధ్యాత్మిక గ్రంథాలు రచించి, వేలాది ప్రవచనాలు ఇచ్చిన ఆయనే డాక్టర్ శలాక రఘునాథశర్మ. భారతీయ ఆర్ష సారస్వతాన్ని అక్షర రూపంలో శాశ్వతం చేయడంతో పాటు ప్రసంగాల ద్వారా ప్రజల్లో చైతన్యం నింపడమే జీవిత ధ్యేయం అంటున్నారు.**



# పురాణాల పరమార్థం విశ్వశ్రేయం

కృష్ణాజిల్లా నూజివీడు సమీపంలోని గొల్లపల్లిలో 1941లో జన్మించాను. పదేళ్ల ప్రాయానికే తండ్రి దగ్గర అమరకోశం, కొన్ని కావ్య భాగాలూ చదువుకున్నాను. ఫీజు కట్టలేక పదో తరగతిలో చదువుకు అడ్డంకి ఏర్పడింది. అది నా జీవితంలో గొప్ప మలుపు. ఆధునిక విద్య నుంచి సంప్రదాయ విద్య వైపు ప్రయాణం మొదలైంది. ఆకిరిపల్లిలో మార్కండేయ సంస్కృత పాఠశాలలో చేరి, పేరి వెంకటేశ్వరశాస్త్రి వంటి ఉద్దండ పండితుల సాంగత్యంలో భాషాప్రవీణ పూర్తి చేశాను. 20వ ఏట గ్రేడ్-2 పండిట్‌గా ఉగ్యోగంలో చేరాను. ఇంకా.. ఇంకా చదువుకోవాలనే తృష్ణ నన్ను ఉద్యోగంలో నిలువనీయలేదు. సాహసం చేసి, ఉద్యోగానికి స్వస్తి చెప్పి పి.జి.లో చేరాను. దివాకర్ల వెంకటావధాని వంటి మహామహుల శిష్యరికంలో ఎం.ఎ.లో స్వర్ణపతకం సాధించాను. 1968 నుంచి 33 ఏళ్ల పాటు అనంతపురంలోని పి.జి. సెంటర్‌లో పనిచేసి. 2001లో సీనియర్ ప్రొఫెసర్‌గా రిటైరయ్యాను. మహాభారతంపై పరిశోధన చేసి డాక్టరేట్ అందుకున్నాను. సనాతన ఆర్ష ధర్మాన్ని సుసంపన్నం చేసే లక్ష్యంతో నాలుగు దశాబ్దాలుగా రచనలు చేస్తున్నాను. పిలిచిందే తడవుగా వెళ్లి మహాభారతం, ఉపనిషత్‌లపై ప్రవచనాలు ఇస్తున్నాను. ఏడాదిలోగా భారతంలో మిగిలిన పర్వాలను తెనిగీకరించే పనిలో ఉన్నాను. పుట్టిపెరిగింది కృష్ణాతీరంలో అయినా సాంస్కృతిక సాంగత్యం కోసం ప్రస్తుతం గోదావరి తీరం రాజమండ్రిలో స్థిరపడ్డాను.



సనాతన ఆర్ష ధర్మాన్ని సుసంపన్నం చేసే లక్ష్యంతో నాలుగు దశాబ్దాలుగా రచనలు చేస్తున్నాను. పిలిచిందే తడవుగా వెళ్లి మహాభారతం, ఉపనిషత్‌లపై ప్రవచనాలు ఇస్తున్నాను.



వేదార్థాన్ని సమ్యక్ దర్శనం చేయించడమే పురాణేతిహాసా ల లక్ష్యం. వాటిని తేటతెలుగులో ప్రజలకు అందిస్తే ఆత్మానం దంతో పాటు జనహితం కూడా చేకూరుతుంది. పైగా ధర్మార్థ, కామ, మోక్షాల సారం భారతం. పురాణేతిహాసాలు చదివినా, విన్నా మనలో ధార్మిక జ్యోతులు వెలుగుతాయి. సంస్కారం పెరుగుతుంది. సంకల్ప బలం పెంపొందుతుంది. భారతంపై దృష్టి సారించడానికి ఇదే స్ఫూర్తి. తాను తరిస్తూ జన బాహుళ్యా న్ని తరింపచేయడమే రుషుల లక్షణం. అద్భుతమైన వేదవిజ్ఞా నాన్ని రుషులు మనకు అందించడంలో పరమార్థం ఇదే. నేను కొంతవరకయినా ఆ బాటలో పయనించగలిగితే ఈ జన్మకు ఇంతకు మించిన సార్థకత ఏముంటుంది? ''ఓ పాతికేళ్ల యువ కుడు హైదరాబాద్‌లో సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేసుకుంటున్నాడు. అతని తల్లిగారు నా ప్రవచనాలకు వస్తూ ఉండే వారు. వేరే పట్ట ణాల్లో ప్రవచనాలు జరుగుతుంటే ఆమె తన కుమారుడికి ఫోన్‌లో నా ప్రవచన సారం చెప్పేవారు. అలా అతను నా ప్రవ చనాలకు అభిమాని అయ్యాడు. తరచు నాతో ఫోన్‌లో మాట్లా డుతూ, భారతంలోని ధర్మసూక్ష్మాలను అడిగి తెలుసుకుంటూ ఉంటాడు. ఓ సాఫ్ట్‌వేర్ ఉద్యోగి భారతంపైన, ప్రవచనాలపైన ఇంతటి అభిమానం పెంచుకుంటాడని ఎవరైనా ఊహించగల రా? అతనే కాదు... అలాంటి వారు ఎందరో ఉన్నారు. పురాణే తిహాసాలు శాశ్వతమైనవి. విశ్వజనీనమైన ఆ జ్ఞానభాండాగా రాలు నిరంతరం వెలిగే జ్యోతుల వంటివి. వాటిని సద్వినియో గం చేసుకోవడం మన ధర్మం. దివాకర్ల వెంకటావధానిగారు నన్ను ప్రవచనాలు చేసేందుకు ప్రోత్సహించారు. వేద కాలం నుంచి కూడా మనది శ్రవణ సంస్కృతి. శిష్యులు గురువులను అడిగి సందేహ నివృత్తి చేసుకొనే వారు. అవే ఉపనిషత్తులయ్యా యి. శ్రవణం శక్తి అంత గొప్పది. అందుకే పురాణేతిహాసాల రహస్యాలు పది మందికి తెలియచెప్పేందుకు ప్రవచనాన్ని సాధనంగా ఎంచుకున్నాను. పుస్తకం చదువుతున్నప్పుడు మనలో కలిగే సందేహాలు నివృత్తి చేసుకోవడం కష్టం. అదే ప్రవ చనంలో అయితే సందేహాలను నివృత్తి చేసుకోవచ్చు. సమ్యక్ జ్ఞానాన్ని పెంపొందించుకోవచ్చు.

**ధర్మార్థ, కామ, మోక్షాల సారం భారతం. పురాణేతి హాసాలు చదివినా, విన్నా మనలో ధార్మిక జ్యోతులు వెలుగుతాయి.**

వేద కాలం నుంచి కూడా మనది శ్రవణ సంస్కృతి. శిష్యులు గురువులను అడిగి సందేహ నివృత్తి చేసు కొనే వారు. అవే ఉప నిషత్తులయ్యాయి.

పాశ్చాత్య విద్యా విధానం ప్రవాహంలో పడి కొట్టుకుపోతు

ఓ అరగంటయినా సనాతన విద్య చిన్నతనం నుంచీ నేర్చుకోవాలి. వయసు మీద పడ్డాక ధర్మసూక్ష్మాలు తెలుసుకుంటే ఏం ఉపయోగం?

న్న కాలం ఇది. ఆధునిక విద్య మనం బతికేందుకు ఉపయోగపడుతుంది. అయితే ఆనందంగా, సార్థకంగా జీవించేందుకు సనాతన విద్య తప్పక నేర్చుకోవాలి. ఆధునిక విద్య మానేయమని చెప్పడం లేదు. రోజూ ఓ అరగంటయినా సనాతన విద్య చిన్నతనం నుంచీ నేర్చుకోవాలి. వయసు మీద పడ్డాక ధర్మసూక్ష్మాలు తెలుసుకుంటే ఏం ఉపయోగం? అందుకే బాల్యం నుంచే నేర్చుకోవాలి. అప్పుడే జీవితం చరితార్థం అవుతుంది. ఈ రోజున మనం నేర్చుకుంటున్న భౌతిక విద్య శాశ్వతమైనది కాదు. ఆధ్యాత్మిక విద్యే శాశ్వతమైనది. అది ధర్మంగా ఉండేందుకు దారి చూపుతుంది. ధర్మంగా ఉంటే అర్థం, కామం వాటంతటవే సిద్ధిస్తాయి. మనందరికీ ధర్మం తెలుసు కానీ ఆచరణ తెలియదు. అధర్మం కూడా తెలుసు కానీ దాని నుంచి బయటపడడం మాత్రం తెలియదు. అది తెలియాలన్నా, జీవితం ధన్యం కావాలన్నా పురాణేతిహాసాలు చదవాలి...వినాలి. ఆర్ష విజ్ఞాన్ ట్రస్ట్ వారు వచ్చే ఏడాది అక్టోబర్ నాటికి భారతం మొత్తాన్ని తెలుగులో ప్రచురించాలని సంకల్పించారు. ఇప్పటికి కొన్ని పర్వాలు పూర్తి చేశాను. మిగిలిన పర్వాలు పూర్తి చేయాలంటే రోజుకు పది గంటలు శ్రమించాలి.. ఆ భగవంతుడు ఏం చేయిస్తాడో చూద్దాం.

ధర్మంగా ఉంటే అర్థం, కామం వాటంతటవే సిద్ధిస్తాయి. మనందరికీ ధర్మం తెలుసు కానీ ఆచరణ తెలియదు.

– ఆగస్టు 3, 2007

## శాంతి మంత్రం

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ
ఓం శాంతి శాంతి శాంతిః

**భావం:** ఓ పరమాత్మా...అసత్యం నుంచి సత్యంలోకి నన్ను నడిపించి. చీకటి నుంచి వెలుగు దారుల్లోకి నన్ను నడిపించి. మరణం నుంచి అమృతత్వానికి నన్ను నడిపించు. విశ్వమంతా శాంతిని పంచు.





**శ్రీరాముడు, రామనామానికి మించినది ఈ సృష్టిలో మరేదీ లేదు. రామయణ అమృతాన్ని అందరికీ పంచే లక్ష్యంతో ఇంతవరకు 80 లక్షల శ్రీరామరక్షాస్తోత్రం కాపీ లను ఉచితంగా పంచారు. ఆయనే ఆధ్యాత్మిక అంశాలపై 80కి పైగా అద్భుత గ్రంధాలు రచించిన, ఆధ్యాత్మిక వాజ్మయ మూర్తి పురాణపండ రాధాకృష్ణమూర్తి. రాజమండ్రిలో భాగవత మందిరాన్ని స్థాపించి భక్తి ఉద్యమాన్ని వ్యాప్తి చేస్తు న్నారాయన.**

# కలియుగానికి రాముడే రక్ష

మూడున్నర దశాబ్దాల క్రితం... ఆ అంజనీసుతుడు నాకు స్వప్నంలో కనిపించాడు. ''శ్రీరాముని సేవలో పునీతమై.. ఆధ్మాత్మిక జీవనం సాగించు.... నీ జన్మను సార్థకం చేసుకో'' అంటూ ఉపదేశించాడు. ఆ క్షణం నుంచి రామనామ స్మరణమే నా శ్వాస.... ధ్యాస. రాజమండ్రిలో భాగవత మందిరం ఏర్పాటు చేసి ఆధ్యాత్మిక పరిమళాలు వ్యాప్తి చేసేందుకు చేతనైన కృషి చేస్తున్నాను. ఇప్పటి వరకు 80 ఆధ్యాత్మిక గ్రంథాలు రచించాను. నా ప్రాణదైవం రామచంద్రుడికి నివేదనగా 80 లక్షల రామరక్షా స్తోత్రం కాపీలను ఉచితంగా భక్తులకు అందజేశాను. మరో 20 లక్షల కాపీలను భక్తులకు పంచగలిగితే నా జన్మ ధన్యం అయినట్టే. ఏటా హనుమజ్జయంతి ఉత్సవాలు నిర్వహిస్తూ ఉండేవాడిని. పూజ పూర్తి అయ్యేసరికి అనేక వానరాలు అక్కడ వచ్చి చేరేవి. వాటికి నేను స్వయంగా ప్రసాదం పెడితే కానీ అక్కడి నుంచి కదిలేవి కావు. ఆ స్వామితో నాకున్న అనుబంధం అలాంటిది. ఆధ్యాత్మిక జీవనం ఆత్మానందంతో పాటు లోకకల్యాణానికి కూడా తోడ్పడాలనే తండ్రి బోధను త్రికరణశుద్ధిగా పాటిస్తున్నాను. ఆధ్యాత్మిక కేంద్రం 'భాగవతమందిరం' ఏర్పాటు చేశాను. మా తండ్రి పురాణపండ రామమూర్తి జగమెరిగిన పురాణ వాచస్పతి.. వేద పండితుడు. భారత, రామాయణ, భాగవత పురాణాలను ఆంధ్రీకరించి భక్తకోటికందించిన ఆ మహనీయుడే నా భక్తి ఉద్యమానికి స్ఫూర్తి. పురాణోత్తముడు ఉషశ్రీ నా అన్నగారు. ఆయ

**నా ప్రాణదైవం రామచంద్రుడికి నివేదనగా 80 లక్షల రామరక్షా స్తోత్రం కాపీ లను ఉచితంగా భక్తు లకు అందజేశాను. మరో 20 లక్షల కాపీ లను భక్తులకు పంచ గలిగితే నా జన్మ ధన్యం అయినట్టే.**

ఈ భూమి మీద పుట్టిన వారి జన్మ సార్థకం కావాలంటే ఆధ్యాత్మిక చింతనే మార్గం.

నలోని మొక్కవోని దీక్ష కూడా నా జీవితానికి ఎంతగానో తోడ్ప డింది.

నా జీవిత సర్వస్వాన్నీ శ్రీరామ, హనుమత్సేవకు, సద్గ్రంథరచనలు, ప్రచురణకు వెచ్చిస్తున్నాను. ఇప్పటి వరకు సుమారు 80 ఆధ్మాత్మిక గ్రంథాలు రాశాను. మహాదాత కర్ణ, భీష్మపితామహుడు, సత్కథామంజలి, విదురనీతి, శ్రీకృష్ణలీలామృతం, శ్రీరామవాణి, గాయత్రీదివ్యశక్తి, దేవీమహాత్మ్యం, హనుమచ్చరిత్ర, శ్రీరామరక్షాస్తోత్రమ్, శ్రీలలితోపాసన, హనుమత్ప్రభ, మణిద్వీపవర్ణన, అమ్మదయ అపారం, విష్ణుసహస్రం, భగవద్గీత (వచనం), శివస్తోత్రాలు, ఆదిత్య హృదయం..తదితర గ్రంథాలు ఆధ్యాత్మిక సుగంధాలు పంచుతున్నాయి. వీటిలో 'సత్కథామంజలి' గ్రంథాన్ని వందవాల్యూమ్‌లు రాయాలని సంకల్పించాను. 80 వాల్యూమ్‌లు పూర్తిచేశానని.. త్వరలో మిగిలినవి పూర్తిచేయాలన్నది సంకల్పం. ఆ తరువాత దైవేచ్ఛ.

వ్యర్థమైన వాగ్దానాలు చేయను, దైవభక్తి మాత్రమే జీవితంలో ప్రతిక్షణంలో తోడుగా ఉంటుందని నా విశ్వాసం.

దాన, వీర, శూర, కర్ణ సినిమా తీసే ముందు ఎన్.టి. రామారావు నా దగ్గరకు వచ్చారు. కర్ణుని జీవిత విశేషాలు అడిగి తెలుసుకున్నారు. అప్పటికే నేను రాసిన 'మహాదాత కర్ణ' పుస్తకానికి బాగా పేరు వచ్చింది. అందులోని విశేషాలను ఆనోటా.. ఈ నోటా తెలుసుకున్న రామారావు, నేను కర్ణుడి గురించి చెప్తున్నంతసేపూ చేతులు కట్టుకుని నిలబడి ఉండిపోయారు. అంతటి నిబద్ధత ఉంది కాబట్టే దానవీశూరకర్ణ సినిమా అంత అద్భుతంగా ఆకట్టుకునేలా చేయగలిగారనిపిస్తుంది. ఈ భూమి మీద పుట్టిన వారి జన్మ సార్థకం కావాలంటే ఆధ్మాత్మిక చింతనే మార్గం. ఎక్కడో పరాయిదేశంలో ఉన్నవారు సైతం నాకు ఫోన్లు చేసి ఆధ్మాత్మిక ప్రవచనాలు చెప్పించుకుంటున్నారు. అమెరికాలో ఉంటున్న రూపారెడ్డి అనే ఆమె ఫోన్‌లోనే శ్రీరామరక్షాస్తోత్రం నేర్చుకుంది. అలాగే మస్కట్, అబుదాబి, బ్రిటన్.. ఇలా పలు దేశాలలో ఆంధ్రులు నా పుస్తకాలు చదువుతున్నారు. స్ఫూర్తి పొందుతున్నారు. ఈ జీవితానికి ఇంతకు మించి ఏం కావాలి. అభిమానులు శుభకార్యాల సమయంలో ఇచ్చే తృణమో పణమో తీసుకున్నా.. 'వీటిని మీకు తెలిసినవాళ్లకివ్వండి' అంటూ అందుకున్న బహుమతులకు రెట్టింపు ఖరీదు చేసే ఆధ్మాత్మిక పుస్తకాలను బహుకరిస్తాను. మేం భద్రాచలం వెళ్తున్నాం అని ఎవరైనా చెబితే చాలు ... అక్కడి భక్తులకు పంచ

మంటూ శ్రీరామరక్షా స్తోత్రం పుస్తకాలిస్తాను. వ్యర్థమైన వాగ్వాదాలు చేయను, దైవభక్తి మాత్రమే జీవితంలో ప్రతిక్షణంలో తోడుగా ఉంటుందని నా విశ్వాసం.

రామనామం మాదిరిగానే రామాయణం కూడా అత్యంత మధురమైనది. రామాయణం విన్నా, చదివినా మోక్షం లభిస్తుంది. అందుకే ఈ భరతఖండంపై పుట్టిన ప్రతి వ్యక్తీ రామాయణం చదవాలన్నది నా సంకల్పం. అందరికీ ఆ అవకాశం ఉండదు కనుక.. శ్రీరామరక్షాస్తోత్రాన్ని రాసి ప్రచురించి ఉచితంగా పంపిణీచేసే కార్యక్రమాన్ని చేపట్టాను. విశ్వంలో రామనామాన్ని మించిన అద్భుత శక్తిలేదు. రాముని సేవలో నా జన్మ ధన్యమయింది. శ్రీరామరక్షా స్తోత్రాన్ని నేను రాసి, ప్రచురించి ఉండవచ్చు. కానీ ఇన్ని లక్షల కాపీలు ఉచితంగా పంపిణీ చేసేందుకు సహకరించిన దాతందరికీ పుణ్యఫలం దక్కుతుంది.భగవన్నామ స్మరణాన్ని మించిన ఔషధం ఈ సృష్టిలో మరేదీలేదు. నాకు ఆస్తమా ఉంది. పదేళ్లుగా హైబిపితో బాధపడుతున్నాను. నిత్యం రామనామామృతాన్ని సేవించే వారిని ఈ బాధలు ఏమీ చేయవు. నిత్యం రామనామ స్మరణతోనే గడుపుతాను. రోజులో కొంతసేపు ధ్యానంలో ఉంటాను. వీటితో పాటు రాముని కరుణే నేనింకా జీవించి ఉండడానికి కారణం. ఎవరి జీవితానికైనా ఇదేగా పరమార్థం.

– నవంబర్ 2, 2007

**రామాయణం విన్నా, చదివినా మోక్షం లభిస్తుంది. అందుకే ఈ భరతఖండంపై పుట్టిన ప్రతి వ్యక్తీ రామాయణం చదవాలన్నది నా సంకల్పం.**

నిత్యం రామనామామృతాన్ని సేవించే వారిని ఈ బాధలు ఏమీ చేయవు. నిత్యం రామనామ స్మరణతోనే గడుపుతాను.

## శాంతి మంత్రం

సహనావవతు సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వి నావధీతమస్తు
మా విద్విషావహై
ఓం శాంతి శాంతి శాంతిః

**భావము:** ఆ పరమేష్ఠి మన ఇరువురినీ రక్షించుగాక. మన ఇరువురినీ పురోగతి వైపు నడిపించుగాక. మన ఇరువురికీ శాస్త్ర అధ్యయన శక్తి లభించుగాక. మన అధ్యయనం తేజోవంతం అగుగాక. మన ఇరువురి మధ్యా వాగ్వివాదాలు లేకుండా శాంతి నెలకొనుగాక.





**ఆత్మజ్ఞాన ప్రస్థానంలో భక్తి ప్రాథమికం. ఆ దశను అధిగమించి యోగంలో అడుగుపెడితే స్వస్వరూప జ్ఞానం లభిస్తుంది. పూర్వ కర్మల నుంచి విముక్తి కలిగించి, సద్గతిని ప్రసాదించే శక్తి కేవలం సద్గురువులకే ఉంటుంది. అందుకే మంచి గురువును పొందడం ప్రధానం అంటారు యోగిపుంగవులు మోపర్తి శివరామకృష్ణ. హైదరాబాద్‌లోని చింతల్‌లో స్వామి సమర్థ పీఠం ఏర్పాటు చేసి ఎందరో జీవితాలకు మార్గదర్శనం చేస్తున్నారాయన.**

# మంచి గురువుతోనే మార్గదర్శనం



**మనిషి భక్తికే పరిమితం అయితే యోగదశకు చేరుకోవడం కష్టం. మనిషిని పరిపూర్ణుడిగా చేసే శక్తి యోగానికే ఉంది. అందుకే భక్తి దశ నుంచి యోగదశకు చేరుకోవాలి. పరమగురువులంతా సమస్త విశ్వాన్ని ఒకటిగా భావించారు. వారి దృష్టిలో విశ్వమే భగవంతుడు.**



దేవతలు సైతం మానవజన్మ కోసం పరితపిస్తారు. మానవ జన్మ అంత గొప్పది అంటారు మహాయోగి షిర్డి సాయి. శ్రీమహావిష్ణువు దుష్టసంహారం చేసి, ధర్మస్థాపన చేసేందుకు శ్రీకృష్ణుడిగా, రాముడిగా.. ఇలా అనేక మానవజన్మలు ఎత్తాడు. మానవాళికి యోగం గురించి చెప్పిన మహనీయుడు శ్రీ కృష్ణుడు. అందుకే ఆయన మహాయోగిగా కైమోడ్పులు అందుకున్నాడు. ఆయన అంశతో జన్మించిన దత్తాత్రేయుడు యోగాన్ని సమస్త జనావళికి అందించాడు. యోగంలో పరమోన్నత స్థానంలో ఉన్న వారు యూనివర్సల్ మాస్టర్స్... పరమగురువులు. వీరి ఆశీస్సులే ఈ నిఖిల విశ్వాన్ని నడిపిస్తున్నాయి. మనది రుషి సంప్రదాయం. మహర్షులు యోగ సాధన చేసినా ఆ విజ్ఞానం జనావళికి చేరలేదు. మనకు ఈ కాలంలో కనిపించే భక్తి భావన వేదకాలంలో కనిపించదు. మనిషి భక్తికే పరిమితం అయితే యోగదశకు చేరుకోవడం కష్టం. మనిషిని పరిపూర్ణుడిగా చేసే శక్తి యోగానికే ఉంది. అందుకే భక్తి దశ నుంచి యోగదశకు చేరుకోవాలి. పరమగురువులంతా సమస్త విశ్వాన్ని ఒకటిగా భావించారు. వారి దృష్టిలో విశ్వమే భగవంతుడు. 'ప్రపంచం వేరు.. భగవంతుడు వేరు అనుకుంటే మనం భగవంతుడ్ని పొందలేం' అంటారు సద్గురువు సాయి. అందుకే విశ్వమంతా ఒకటే అనే భావన మనలో కలిగించే యోగాన్ని ఆశ్రయించడం అవసరం. శ్రద్ధావాన్ లభతే జ్ఞానం అన్నాడు గీతాచార్యుడు. మనలో జ్ఞాన జ్యోతుల్ని వెలిగించుకొనేందుకు అవసరమైన శ్రద్ధ యోగం వల్లే

కలుగుతుంది.

ఈ సృష్టి మొత్తానికీ నీరే మూలం. మన పూర్వ రుషులు నీటిని మహావిష్ణువుతో సమానంగా భావించేవారు. విష్ణువు ఆజ్ఞతో నిర్గుణ సాధన పెరిగే కొద్దీ మనమంతా విష్ణుమయం అవుతాం. ఈ జగమంతా విష్ణుమయం అవుతుంది. ఈ సాధనకు గురువు ప్రధానం. అది కూడా ఉన్నతిని పొందిన గురువు సారథ్యంలో మాత్రం చక్కటి సాధన వీలవుతుంది. మన పూర్వ కర్మలు మనల్ని నడిపిస్తూ ఉంటాయి. ఆ కర్మల నుంచి విమోచన కలగనిదే మనకు యోగం సిద్ధించదు. పూర్వ కర్మల నుంచి విముక్తి కల్పించి, మనకు ఉత్తమ మార్గం చూపేందుకు గురువు తోడ్పాటు అవసరం. మనలోని సంస్కారాన్ని రాజేసి, ఉత్తమ పథాన్ని చూపేది గురువే. మంచి గురువు లభించడం అనేది కూడా పూర్వ కర్మలను బట్టే ఉంటుంది. నిజానికి మనం గురువును ఎంపిక చేసుకోవడం కాదు... గురువులే శిష్యుల్ని ఎన్నుకుంటారు. కర్మ పరిపక్వమైన వారిని గురువు స్వయంగా శిష్యునిగా స్వీకరిస్తాడు. అతడిలో ఉన్న భగవంతుడ్ని అతడే గుర్తించేలా చేస్తాడు.

ఈ సాధనకు గురువు ప్రధానం. అది కూడా ఉన్నతిని పొందిన గురువు సారథ్యంలో మాత్రం చక్కటి సాధన వీలవుతుంది.

చిత్తూరు జిల్లా వాయల్పాడులో శ్రీరామనవమి రోజున పుట్టాను. అందుకే నాకు శ్రీరాములు అని పేరుపెట్టారు. ఆ తరువాత శివరామకృష్ణగా మార్చారు. నాలుగోయేట నుంచి ఆలయమే నాకు సర్వస్వం. స్కూలు వేళలు మినహాయించి మిగిలిన సమయమంతా ఆలయంలోనే గడిపేవాడిని. చిన్నతనంలో ఆర్థికంగా సుసంపన్నంగా ఉన్న మా కుటుంబం ఒక్కసారిగా చితికిపోయింది. ఆ పరిస్థితులు నాలో ఆలోచన రేకెత్తించాయి. దైవ చింతన పెరిగింది. నౌకాదళంలో ఉద్యోగంలో చేరాను. దేశమంతా తిరిగాను. చివరకు వైజాగ్‌లో షిర్డిసాయి ఆలయంలో యోగస్ఫూర్తి కలిగింది. నాటి నుంచి షిర్డిసాయినే సమస్తంగా భావించాను. ఆ పైన ఆదాయం పన్నుల శాఖలో ఉద్యోగం. ఏ ఉద్యోగం చేసినా నా మనసంతా ఆధ్యాత్మిక మార్గంలోనే ఉండేది. పుణ్యక్షేత్రాలెన్నో దర్శించాను. యోగుల్ని కలుసుకున్నాను. సద్గురువు కోసం తపించాను. 1983లో శ్రావణ పౌర్ణమి రోజున మోపర్తి గోపాలరావు గారి ఇంటికి వెళ్లాను. ఎన్నో పరీక్షల అనంతరం ఆయన నన్ను శిష్యునిగా స్వీకరించారు. నాటి నుంచి వారి సారథ్యంలో, నిరంతర సాధనతో ఆధ్యాత్మిక ఉన్న

ఇష్టదైవం నుంచి యోగంలోకి ప్రయాణం చేయాలి. సద్గురువు సాంగత్యం లభిస్తే యోగంలో ముందడుగు వేస్తాం.

మన పూర్వ కర్మల ప్రభావాన్ని దారిమళ్లించే శక్తి కూడా గురువుకే ఉంటుంది.ఆపైన కూడా మనం సాధన చేయగలిగితే యూనివర్సల్ మాస్టర్స్ అనుగ్రహం లభిస్తుంది.

తిని పొందాను. నాకు ఆత్మదర్శనాన్ని వారసత్వ భాగ్యాన్ని కూడా వారే ప్రసాదించారు. ఆ తరువాత 1999లో స్వామి సమర్థ పీఠం ఏర్పాటు చేసి, ఆధ్యాత్మిక పిపాసులకు సేవచేస్తున్నాను. నా ఆధ్యాత్మిక అనుభవాలతో 'ఒక యోగ సాధకుని ఆత్మకథ' పుస్తకం రచించాను. గురువు సారథ్యంలో మనలో తపన మొదలవుతుంది. గురువునే సర్వస్వంగా భావించి యోగ సాధన చేయాలి. ఇష్టదైవం నుంచి యోగంలోకి ప్రయాణం చేయాలి. సద్గురువు సాంగత్యం లభిస్తే యోగంలో ముందడుగు వేస్తాం. మన పూర్వ కర్మల ప్రభావాన్ని దారిమళ్లించే శక్తి కూడా గురువుకే ఉంటుంది. ఆపైన కూడా మనం సాధన చేయగలిగితే పరమయోగులైన యూనివర్సల్ మాస్టర్స్ అనుగ్రహం లభిస్తుంది. యోగి కానీ యోగం కానీ ఎప్పుడూ ప్రచారం కోరుకోదు. యోగులు అనే వారు యోగాన్ని అభివృద్ధి చేయాలే తప్ప స్వార్థం కోసం ప్రచారం చేయకూడదు. ఈ కాలంలో యోగం పేరిట జరుగుతున్న దానిలో చాలా వరకు నమ్మశక్యం కానిదే. యోగి అయిన గురువును పొంది, యోగసాధన చేస్తే పరమానందం కలుగుతుంది. అప్పుడు కలిగే ఆనందాన్ని ఇది.... అని నిర్వచించలేం. ఆ ఆనందం ముందు మిగిలినవన్నీ దిగదుడుపే. తృష్ణ ఉన్న వారికి యోగార్హత కలిగించి, వారిలో ఆధ్యాత్మిక దీప్తులను వెలిగించడమే నా లక్ష్యం.

యోగి అయిన గురువును పొంది, యోగ సాధన చేస్తే పరమానందం కలుగుతుంది. అప్పుడు కలిగే ఆనందాన్ని ఇదీ అని నిర్వచించలేం.

– నవంబర్ 23, 2007



**సాధు జీవనానికి నిలువెత్తు నిదర్శనం ఆయన. న్యూక్లియర్ ఫిజిక్స్‌లో స్వర్ణపతకం సాధించి, బ్యాంకు ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహించారు. ఆ జీవితం కాదనుకుని కాకినాడ సమీపంలో ఆశ్రమం స్థాపించిన ఆయనే శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగరామానుజ జీయర్ స్వామి. ఆధ్యాత్మిక జీవనంలో మనం ఎక్కడ ఉన్నామో తెలుసుకునే విలక్షణ ఆధ్యాత్మిక డైరీకి రూపకల్పన చేశారు. పదిహేను సంవత్సరాల ఆయన ఆధ్యాత్మిక ప్రయాణ విలాసం ఇది.**



# ఆధ్యాత్మిక జీవనం ఆనందమార్గం

హిమాలయాల్లో ఉన్న బదరీనాథ్‌కు వెళ్లడం అందరికీ వీలుకాకపోవచ్చు. అందుకే కాకినాడ సమీపంలో 11 ఏళ్ల క్రితం శ్రీమన్నారాయణ అష్టాక్షరీ క్షేత్రాన్ని ఏర్పాటు చేశాం. నిత్యం అష్టాక్షరీ హోమాలు నిర్వహిస్తున్నాం.

బదరీనాథ్ నిరంతరం నారాయణ మంత్రోచ్చారణతో మారుమోగుతూ ఉంటుంది. నిత్యం అష్టాక్షరీ హోమాలతో ఆధ్యాత్మిక జీవులను తరింపజేస్తూ ఉంటుంది. హిమాలయాల్లో ఉన్న బదరీనాథ్‌కు వెళ్లడం అందరికీ వీలుకాకపోవచ్చు. అందుకే కాకినాడ సమీపంలో 11 ఏళ్ల క్రితం శ్రీమన్నారాయణ అష్టాక్షరీ క్షేత్రాన్ని ఏర్పాటు చేశాం. నిత్యం అష్టాక్షరీ హోమాలు నిర్వహిస్తున్నాం. నారాయణ మంత్రం జపిస్తే ఆ ధ్వనితరంగాలు మనసుకు ప్రశాంతత చేకూరుస్తాయి, ఆధ్యాత్మిక జీవితాన్ని సుసంపన్నం చేస్తాయి. ఓ మంత్రం జపించినంత మాత్రాన అది మన మనసుపై ఎలా ప్రభావం చూపుతుందనే సందేహం కలగవచ్చు. మనం ఓ క్లబ్‌కు వెళితే ఆ వాతావరణానికి అనుగుణంగా మనకు ఆలోచనలు వస్తాయి. అదే జాతీయ గీతం వింటున్నప్పుడు మనలో దేశభక్తి భావం మెదులుతుంది. మనం ఉన్న పరిస్థితికి అనుగుణంగా మనసు స్పందించడానికి కారణం మెదడులో ఉండే హైపోథాలమస్ అనే భాగం. మనం ఎప్పుడు ఏ ఆలోచన చేయాలని నిర్ధారించే జంక్షన్ బాక్స్ అది. మనం ఓ ఆలయంలో ఉన్నప్పుడు ఆ సమయంలో ఉద్భవించే శక్తి, ఎలక్ట్రో మాగ్నటిక్ స్పందనల రూపంలో ఆ పెట్టెను చేరుతుంది. అప్పుడు సంబంధిత ఆలోచనలను కలిగిస్తుంది. వేదం వింటున్నప్పుడు స్వరంలోని ఉదాత్త, అనుదాత్తాలు మన మనసును పరవశింపజేయడానికి అదే కారణం. నారాణయ మంత్రం మనసుపై అద్భుతమైన ప్రభావం చూపి, ఆధ్యాత్మిక

పొరుగు వారికి సాయపడినప్పుడే ఆ భగవంతుడు సంతోషిస్తాడని తెలుసుకోవాలి. అలా సాగించేదే ఆధ్యాత్మిక జీవితం.

తను పెంపొందిస్తుందని శాస్త్రవేత్తలు సైతం అంగీకరించారు.

కేవలం మంత్రాన్ని జపించినంత మాత్రాన అది ఆధ్యాత్మిక జీవనం అనిపించుకోదు. భగవంతుడు ఉన్నాడని విశ్వసించాలి. పొరుగు వారికి సాయపడినప్పుడే ఆ భగవంతుడు సంతోషిస్తాడని తెలుసుకోవాలి. అలా సాగించేదే ఆధ్యాత్మిక జీవితం. మా ఆశ్రమంలో కేవలం హోమాలకే పరిమితం కావడం లేదు. వేద పాఠశాల నిర్వహిస్తున్నాం. వారికి వేదంతో పాటు ఆధునిక విద్యలో కూడా శిక్షణ ఇస్తున్నాం. గోశాలలు నిర్వహిస్తున్నాం. కుష్టు రోగుల సంతానం సంక్షేమం కోసం శరణ్య ఛారిటీస్ ద్వారా కాకినాడలో ఓ పాఠశాలను దత్తత తీసుకొని వారికి విద్యాబుద్ధులు నేర్పుతున్నాం. వారు కూడా సంతోషంగా జీవించేందుకు తోడ్పడుతున్నాం. ఈ కార్యక్రమాలన్నీ సౌజన్యశీలురైన దాతల సాయంతో చేపడుతున్నాం. ఈ సేవలన్నీ ఆ నారాయణునికే చెందుతాయి. సంస్థలే ఇలాంటి సేవాకార్యక్రమాలు చేయాలని లేదు. మనలో ప్రతి ఒక్కరూ సేవానిరతిని పెంపొందించుకోవాలి. అప్పుడే జీవితానికి ఓ పరమార్థం చేకూరుతుంది. మనలో చాలా మంది ఆధ్యాత్మిక జీవనం సాగిస్తూ ఉంటారు. అయితే ఆ ప్రస్థానంలో మనం ఏ మజిలీలో ఉన్నాం? నిజంగానే మనం ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నామా? అని సరిచూసుకొనే కొలమానం ఏదీ లేదు. అలా మనల్ని మనం పరిశీలించుకొనే సాధనంగా స్పిరిచ్యువల్ డైరీకి రూపకల్పన చేశాం. సాధారణంగా డైరీ అంటే సంవత్సరాదికి ప్రారంభించి రోజూ రాయాలి. స్పిరిచ్యువల్ డైరీ అలా కాదు. దీన్ని ఎప్పుడైనా ప్రారంభించవచ్చు. అందుకే మా డైరీలో తేదీ రాయలేదు. మనలో సత్సంకల్పం కలిగిన రోజు దీన్ని ప్రారంభించవచ్చు. ఆ రోజు నుంచి సంవత్సరం పాటు ఈ డైరీ రాయాలి. త్రికరణ శుద్ధితో డైరీరాయడం ముఖ్యం అన్నారాయన. ఈ డైరీలో మన గురువు, పూజ, జప వివరాలు, ఆ రోజు ఏదైనా తప్పు చేశారా? సరిదిద్దుకొనే ప్రయత్నం చేస్తున్నారా? సద్గురువు అనుకున్న వారికి మీరు మనస్ఫూర్తిగా విన్నవించుకొనే విషయం ఏమిటనే అంశాలతో పాటు నిత్యం 11 సార్లు నారాయణ మంత్రాన్ని రాసేందుకు వీలుగా డైరీ రూపొందింది.

మనల్ని మనం పరిశీలించుకొనే సాధనంగా స్పిరిచ్యువల్ డైరీకి రూపకల్పన చేశాం.

ఏటా చాతుర్మాస దీక్ష చేస్తాను. ఆ సమయంలో ఆశ్రమానికి పరిమితం కావడం కంటే ఆధ్యాత్మిక వికాసానికి ఏదైనా చేస్తే

బాగుండనిపించింది. రాజధానిలో అష్టాక్షరీ హోమాలు తలపెట్టాను. హోమాలు చేసేందుకు ఎవరైనా ముందుకు వస్తారో! రారో! అని కాస్త ఆలోచించాను. కానీ అద్భుతమైన స్పందన వచ్చింది. కొన్ని రోజుల్లో ఉదయం, సాయంత్రం రెండు పూట్ల హోమాలు నిర్వహించాం. దీక్షాకాలంలో 188 ఇళ్లలో హోమాలు నిర్వహించడం మనలో పెరుగుతున్న ఆధ్యాత్మిక ధోరణికి నిదర్శనం. ప్రస్తుతం 188 ఇళ్లలో నారాయణ మంత్ర తరంగాలు వ్యాప్తి చెంది ఉన్నాయన్నమాట.

పాశ్చాత్య వ్యామోహంలో పడి మనం సంస్కృతికి దూరం అవుతున్నాం. సంస్కృతిని కాపాడుకుంటే జీవితం సుఖమయం అవుతుంది.

ఆధునిక జీవనంలో మనిషికి ఎందులోనూ ఆనందం లభించడం లేదు. ఆనందమార్గం ఏమిటని మీరు అడగవచ్చు. మన వేద సంస్కృతి సమస్త జీవకోటి పట్ల కారుణ్యంతో ఉండాలని, సర్వేజనాః సుఖినో భవంతు.. అంటే అందరూ సుఖంగా ఉండాలనే తత్త్వాన్ని మనకు నేర్పింది. పాశ్చాత్య వ్యామోహంలో పడి మనం మన సంస్కృతికి దూరం అవుతున్నాం. మన సంస్కృతిని కాపాడుకుంటే చాలు.. జీవితం సుఖమయం అవుతుంది. మనం ఏం కోల్పోతున్నాం... ఏం చేయాలనే అవగాహనను అందరిలో పెంపొందించడం ఈ కాలంలో చాలా అవసరం. మారుతున్న కాలానికి అనుగుణంగా మనం చెప్పే పద్ధతిలో మార్పు చేసుకోవాలి. పూర్వం జీవితానికి విశ్వాసం పునాదిగా ఉండాలి. ఈ రోజున ఏ విషయం అయినా హేతుబద్ధంగా చెబితే కానీ నమ్మే పరిస్థితి లేదు. ఆధ్యాత్మిక విషయాలను కూడా హేతుబద్ధంగానే వివరించినప్పుడు అందరూ తప్పనిసరిగా ఆ మార్గాన్ని అనుసరిస్తారు. అందుకే మా ఆశ్రమం ద్వారా సులభశైలిలో ఆధ్యాత్మిక గ్రంథాలు ముద్రిస్తున్నాం.

పూర్వం జీవితానికి విశ్వాసం పునాదిగా ఉండాలి. ఈ రోజున ఏ విషయం అయినా హేతుబద్ధంగా చెబితే కానీ నమ్మే పరిస్థితి లేదు.

– నవంబర్ 30, 2007



**జీవితంలో అనిర్వచనీయ ఆనందానికి మార్గం చూపి, మోక్షపథంలో నడిపించే శక్తి ప్రాణాయామానికి మాత్రమే ఉందంటారు బ్రహ్మజ్ఞాని, కుండలినీ యోగి శేషభట్టార్ సుదర్శనాచార్య. మూడున్నర దశాబ్దాలుగా మహర్షులు చెప్పిన మహోన్నత సంప్రదాయ యోగమే ఆయనకు సర్వస్వం. ఈ రోజుల్లో ప్రచారంలో ఉన్న యోగం కేవలం సర్కస్ ఫీట్లు అని కొట్టిపారేస్తారాయన.**



# ఆత్మజ్ఞానమార్గం ప్రాణాయామం

ప్రాణోవా అమృతం – ప్రాణాయామేవ తపః... ప్రాణాయామమే తపస్సు అంటుంది వేదం. వేద వాఙ్మయంలో యోగం గురించి పలు సందర్భాల్లో ప్రస్తావనలున్నాయి. మొట్టమొదటిసారిగా హిరణ్యగర్భుడు మహోన్నత యోగ విద్యకు రూపకల్పన చేశాడు. రెండో శతాబ్దంలో పతంజలి మహర్షి అష్టాంగ యోగాన్ని ప్రారంభించి, యోగవిద్యను మరింత ప్రాచుర్యంలోకి తీసుకు వచ్చాడు. మనల్ని మనం తెలుసుకొని, పరమాత్మలో లీనం అయ్యేందుకు ఉపయోగపడే అత్యున్నత సాధనం యోగం. ''ఎందరో మహనీయులు యోగ సాధన చేసి ఆత్మజ్ఞానం పొందారు...పరమాత్మను చేరుకున్నారు. మహనీయులు ప్రబోధించిన ప్రాచీన యోగం ఈ రోజుల్లో నామమాత్రంగా మిగిలిపోయింది. ఆసనాలకే పరిమితమై, ఏ మాత్రం సిద్ధాంత ప్రాతిపదికలేని యోగం మాత్రం ప్రచారంలో ఉన్నది.



ఎందరో మహనీయులు యోగసాధన చేసి ఆత్మజ్ఞానం పొందారు...పరమాత్మను చేరుకున్నారు. మహనీయులు ప్రబోధించిన ప్రాచీన యోగం ఈ రోజుల్లో నామమాత్రంగా మిగిలిపోయింది.



మా తండ్రిగారు మెదక్ జిల్లాలో గొప్ప సంస్కృత పండితులు. చిన్నతనంలోనే ఆయన నుంచి పంచకావ్యాలు చదువుకున్నాను. ఓ మహనీయుడి వద్ద ఖగోళ, జ్యోతిష శాస్త్రాలు అభ్యసించాను. అదే సమయంలో తాతగారు మరణించారు. మరి కొందరు సన్నిహితుల మరణం నాలో ఆలోచన రేకెత్తించింది. మరణం మూలాలు కనుగొనాలనే తపన నాలో పెరిగింది. ఇంటి నుంచి వెళ్లిపోయాను. 1960 ప్రాంతంలో హిమాలయా

లు చేరాను. అక్కడ ఎందరో మహనీయులను కలుసుకున్నాను. నా ప్రశ్నకు సమాధానం లభించలేదు. అక్కడ నుంచి టిబెట్ చేరాను. బౌద్ధ భిక్షువు వద్ద ఆయుర్వేదం, నాడి విద్యలు తెలుసుకున్నాను. ఓ దిగంబర స్వామి వద్ద యోగ విద్యను అభ్యసించాను. ఆత్మజ్ఞానానికి అద్భుతమైన మార్గం చూపే శక్తి యోగంలో ఉంది. తన గురించి తాను తెలుసుకొని, పరమాత్మతో క్రీడించే వాడే ఆత్మజ్ఞాని. అదో అనిర్వచనీయమైన ఆనందం. అంతటి విశిష్టమైన యోగవిద్య నాకు లభించడం నిజంగా సుకృతం. టిబెట్ తాంత్రిక విద్యలకు కేంద్రం అనే ప్రచారం ఉంది. కానీ అది అవగాహన లేని వారు చేసే ప్రచారం. టిబెట్‌లోని లాసా ప్రాంతంలో ఓ అందమైన లోయలో, అద్భుత సరోవరం ఉంది. అక్కడ ఉన్న వారంతా వందేళ్లకు పైన జీవించిన వారే. అక్కడ వీచే గాలికి ఉన్న శక్తి అది. అటువంటి మహిమాన్విత స్థలి టిబెట్. నవనాథులు వారి దేవతలు. మన వేదాలకు దీటుగా వారు తత్వబోధలు చేశారు. సనాతన యోగ విద్యను విస్తృతంగా ప్రచారం చేశారు. ప్రాణాయామ విద్యను ప్రపంచానికి చాటి చెప్పిన ఘనత వారిదే. అలాంటి పవిత్ర స్థలానికి కొందరు దురుద్దేశ పూర్వకంగా తాంత్రిక వాదాన్ని అంటగట్టారు.

**తన గురించి తాను తెలుసుకొని, పరమాత్మతో క్రీడించే వాడే ఆత్మజ్ఞాని. అదో అనిర్వచనీయమైన ఆనందం.**

---

''హిమాలయాలు... టిబెట్ నుంచి నా ప్రస్థానం ఢిల్లీకి సాగింది. నేను నేర్చుకున్న సనాతన యోగాన్ని ప్రపంచానికి తెలియచెప్పాలనుకున్నాను. అప్పటి కేంద్ర మంత్రి డాక్టర్ కరణ్ సింగ్ సహకారంతో శ్రీమతి ఇందిరాగాంధీ సూచన మేరకు యోగంపై పరిశోధనలు, ప్రచారం చేసేందుకు మైండ్ కాన్షెస్ నెస్ ప్రాజెక్టును ఏర్పాటు చేసి, దానికి సారథ్యం వహించాను. ఆ ప్రాజెక్టుకు అనుబంధంగా దేశవ్యాప్తంగా 200 కేంద్రాలు ఏర్పాటు చేశాం. ఆ సమయంలోనే 'గురుగీత' గ్రంధాన్ని రచించాను. 1989లో భాగ్యనగరం చేరుకొని సనాతన ధర్మాన్ని, యోగవిద్యను పరిరక్షించేందుకు గురుకుల పద్ధతిలో ఓ ఆశ్రమాన్ని నెలకొల్పాను. ఈ కాలంలో చాలా మంది వేదం నేర్చుకుంటున్నారు. కానీ వేద విద్యను సుసంపన్నం చేసి, సమాజహితానికి ఉపయోగించే వారు తగ్గిపోయారు. అందుకే వేదాంతర్గత సత్యాలను పరిశోధించి, ఆ ఫలాలను లోకకల్యాణానికి ఉపయోగించాలన్నదే నా ఆశయం. నేను ఏర్పాటు చేసిన ఆశ్రమం ద్వారా ఆ కృషి కొనసాగిస్తున్నాను, రాష్ట్రప్రభుత్వం ఆధ్వర్యంలోని యోగాధ్యయన పరిషత్ ఉపాధ్యక్షునిగా, సికింద్రాబాద్‌లోని

**వేద విద్యను సుసంపన్నం చేసి, సమాజహితానికి ఉపయోగించే వారు తగ్గిపోయారు.**

ప్రాణాయామ పరిశోధనా కేంద్రం డైరెక్టర్‌గా బాధ్యతలు నిర్వ హిస్తున్నాను. ప్రస్తుత ప్రభుత్వ సహకారంతో యోగాపై విస్తృత పరిశోధన చేస్తున్నాను.

ఒత్తిళ్లను తొలగించి, ప్రశాంతతో కూడిన పరిపూర్ణమైన జీవితాన్ని అందించే శక్తి యోగాకే ఉన్నది.

ఆధునిక స్వామీజీలు పలువురు యోగా పేరిట అనేక కొత్త విధానాలను ప్రచారంలోకి తీసుకు వస్తున్నారు. స్వస్వరూప జ్ఞానాన్ని అందించి, మనిషిని దేవునికి దగ్గరగా చేసే గొప్ప విద్య యోగం. అంతటి గొప్ప విద్యను ఓ వ్యాయామంగా, నేల బారుగా పరిగణించడం క్షమార్హం కాదు. ఆధునిక యుగంలో ప్రతి ఒక్కరిలో పెరిగిపోతున్న ఒత్తిళ్లను తొలగించి, ప్రశాంతతో కూడిన పరిపూర్ణమైన జీవితాన్ని అందించే శక్తి యోగాకే ఉన్నది. నేటి చిన్నారులను తీసుకోండి. ఇంటి నుంచి పాఠశాల వరకు ఎంతో ఒత్తిడికి గురవుతున్నారు. ఆటపాటలు తగ్గిపోయాయి. చిన్నారులు అలా పెరిగితే భవిష్యత్తు ఏమవుతుందో ఊహిం చండి. సనాతన యోగ ఈ ఒత్తిళ్లన్నింటినీ దూరం చేస్తుంది. ఐదేళ్ల వయసు నిండిన ప్రతి ఒక్కరూ సుశిక్షితులైన గురువు వద్ద యోగా నేర్చుకోవచ్చు. అందుకే మా సంస్థ ద్వారా ఉపాధ్యా యులకు శిక్షణ ఇవ్వాలని సంకల్పించాం. తద్వారా విద్యార్థులకు యోగవిద్యను అందించాలన్నది మా సంకల్పం. అదే విధంగా ప్రాణాయామం ద్వారా దీర్ఘరోగాలను తగ్గించగలుగుతున్నాం, దురలవాట్లను మాన్పించగలుగుతున్నాం. మహోన్నతమైన సనాతన యోగాను పదికాలాల పాటు కాపాడుకొనేందుకు ప్రతి ఒక్కరూ కృషి చేయాలి. చిన్నారుల నుంచి వయోధికుల వరకు మంచి గురువుల వద్ద నేర్చుకొని, సనాతన యోగాన్ని సాధనచే యడంతో పాటు, చక్కని జీవన విధానాన్ని అనుసరించడం ద్వారా జీవితాన్ని సార్థకం చేసుకోవాలి.

ప్రాణాయామం ద్వారా దీర్ఘరోగాలను తగ్గించగలుగుతున్నాం, దురలవాట్లను మాన్పించగలుగుతున్నాం.

– ఫిబ్రవరి 1, 2008



**పుట్టింది కర్నూలులో.. చదివింది మెకానికల్ ఇంజనీ రింగ్.. చిన్నతనం నుంచే ఉన్న వైరాగ్య భావనలు బలపడి వేదాంత అధ్యయనం వైపు నడిపించాయి. 15 ఏళ్ల క్రితం సాయినాథునితో అనుబంధం ఏర్పడింది. ఆ క్షణం నుంచి ఆయన జీవితం సాయిమయమైంది. ఆత్మ సాక్షాత్కారం పొంది, సాయి సందేశాన్ని విస్తృతంగా ప్రచారం చేస్తున్న ఆయనే తత్త్వదర్శి శ్రీ రమణానంద స్వామి. ఆయన సాయితత్త్వ గీతిక ఇది.**



# గుండెల్లో ప్రేమ నిండితే గురుదర్శనం

> **షిర్డీ వెళ్లి ఐదు రోజులు మౌనంగా గడిపాను. కర్నూలులో ఓ మాత వద్ద ఉపదేశం పొందాను. 21 రోజుల పాటు సమాధిలో ఉన్నాను. 1995 జూన్ 29న ఆత్మసాక్షాత్కారం జరిగింది.**

బాల్యం నుంచి నాలో ఆధ్యాత్మిక భావనలు ఉండేవి. ఈ జీవిత పరమార్థం ఏమిటి.. చదువు, ఉద్యోగం.. ఇవే సర్వస్వం కాదు... జీవితం అంటే ఇంకేదో ఉందనిపించేది. అనంతపురంలో మెకానికల్ ఇంజనీరింగ్ చదివాను. భాగ్యనగరంలో అసిస్టెంట్ ఇంజనీర్‌గా ఉద్యోగంలో చేరాను. 4 రోజులకే ఉద్యోగం అంటే మొఖం మొత్తింది. ఆ ఉద్యోగం మానేసి విశాఖ పట్నం చేరాను. శంకరాచార్యుల వేదాంతంతో అనుబంధం ఏర్పడింది. ఆయన గ్రంథాలన్నీ చదివాను. మంచి గురువు దొరికితే గానీ ఆధ్యాత్మిక మార్గంలో పట్టు చిక్కదని భావించి కాశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా తిరిగాను. సద్గురువు లభించక నిరాశ పడ్డాను. 1994లో విశాఖలో మొదటిసారిగా బాబా ఫొటో చూశాను. ఆ ఫొటోను తాకగానే నాలో విద్యుత్ తేజం ప్రవహించింది. మనసంతా గందర గోళం.. స్నేహితుడి ఇంటికి వెళ్లి పడుకున్నాను. కలలో బాబా కనిపించారు. నన్ను స్పృశించారు. ఆ క్షణం నుంచి ఆయనే గురువు... సర్వస్వం అయ్యారు. మొదటిసారిగా షిర్డీ వెళ్లి ఐదు రోజులు మౌనంగా గడిపాను. కర్నూలులో ఓ మాత వద్ద ఉపదేశం పొందాను. 21 రోజుల పాటు సమాధిలో ఉన్నాను. 1995 జూన్ 29న ఆత్మసాక్షాత్కారం జరిగింది. అక్కడి నుంచి ఐదేళ్లపాటు బాబాపై విస్తృతంగా పరిశోధన చేశాను. బాబా శిష్యుల గురించి, సాయి లీలల గురించి మహారాష్ట్ర వారు సైతం చూడని కోణాల్లో పరిశోధన చేశాను. సాయి శివ స్వరూపుడు.. ఆయన సందేశాలను అనుసరించడమే మానవాళికి

అందరిలో నన్ను చూడు.. ప్రతి మని షిలో భగవంతుడున్నా డని నిరూపించిన మహనీయుడు సాయి.

ఉత్తమ మార్గం అని గ్రహించాను. ఆయన సందేశాలను ప్రపంచం నలుమూలలా చాటడమే ప్రస్తుతం నా ముందున్న లక్ష్యం. ఆ లక్ష్య సాధన కోసం పీఠం ఏర్పాటు చేశాం. 2002 నుంచి అనేక సాయి సప్తాహాలు చేశాం. ఇప్పటివరకు సాయిపై 33 గ్రంథాలు రాశాను. 72 పాటలు రాశాను. సాయి సందేశా లతో కూడిన లక్షలాది పుస్తకాలను భక్తులకు పంచాము. పల్లెప ల్లెకు సాయి సందేశాన్ని చేర్చడమే పీఠం కర్తవ్యం.

భారతీయ వేదాంతానికి మూలపురుషులైన రుషులు తత్త్వ చింతన చేశారు. మహోన్నత సత్యాలను మన ముందుంచారు. అయితే బాబా వాటిని ఆచరించి చూపారు. మానవుల్లో ప్రేమ, కరుణ పెంపొందించారు. అందరిలో నన్ను చూడు అని చెప్పిన గొప్ప అవధూత ఆయన. ప్రతి మనిషిలో భగవంతుడున్నాడని నిరూపించిన మహనీయుడు సాయి. ఓ భక్తురాలు కుక్కకు అన్నం పెడితే, సంతోషం అమ్మా.. నా కడుపు నింపావని చెప్పడం ద్వారా జీవకారుణ్యాన్ని చాటారు. ఇలా బాబా మహి మలు అనేకం ఉన్నాయి. జీవుడు – భగవంతునికి మధ్య గొప్ప వారధి బాబా. నిరాడంబరత, సులభంగా ఆచరించేందుకు వీలున్న సందేశాలు బాబాను అందరివాడిని చేశాయి. యువత సైతం బాబా పట్ల ఆకర్షితులు కావడానికి అదే కారణం. ఆంద రిలో ప్రేమతత్వాన్ని పెంపొందిస్తాయి ఆయన బోధలు. అంతరా త్మను విశాలం చేస్తాయి. అందుకే ప్రతి ఒక్కరి గురువు బాబానే అవుతున్నారు. ఆత్మజ్ఞానం పొందిన వారే నిజమైన గురువు. అలాంటి గురువు లభించాలంటే మనలో ప్రేమ, సంస్కారం పెంపొందాలి. అవి ఉంటే సద్గురువు తప్పక లభిస్తాడు. నేను అనే భావం వీడి గురువుకు శరణాగతి చేయాలి. ఆయనే సర్వస్వంగా భావిస్తే జీవితం సార్థకం అవుతుంది. అందుకే ప్రతి ఒక్కరూ గురునిష్ఠ పాటించాలన్నారు బాబా. విద్యా విధానంలో మార్పు లు చేస్తేనే అది సాధ్యం. చిన్నతనం నుంచి సంస్కారం, భక్తి శ్రద్ధలు నేర్పాలి. ఆధ్యాత్మిక పునాదులు వేయాలి. అందు కోసమే సరళమైన సాయి బోధలను విస్తృతంగా ప్రచారం చేస్తున్నాం. విద్యార్థుల్లో సైతం చైతన్యం కలిగించే కార్యక్రమాలను చేపట్టే ఆలోచనలో ఉన్నాం. సాయి తత్వాన్ని పల్లె పల్లెనా ప్రచారం చేయడం, సాయి చింతనలో సిద్ధిత్వం పొందడమే నా జీవిత పర మార్థం.

నేను అనే భావం వీడి గురువుకు శరణాగతి చేయాలి. ఆయనే సర్వస్వంగా భావిస్తే జీవితం సార్థకం అవుతుంది.

– జూలై 18, 2008

**ప్రొఫెసర్‌గా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పాఠాలు చెప్పిన ఆయన ఇప్పుడు చిలుకూరు బాలాజీ ఆలయంలో వేదమంత్రాలు చదువుతున్నారు. గుడి బాగుంటేనే ఊరు బాగుంటుంది. ఊరు బాగుంటేనే దేశం పచ్చగా ఉంటుంది. అందుకే ఆలయాన్ని కాపాడుకుందాం అంటున్నారు డాక్టర్ ఎం.వి. సౌందరరాజన్. ఆలయాల్లో వ్యాపార ధోరణి పెరిగిపోవడానికి ప్రభుత్వం, నేతలతోపాటు మనదీ తప్పేనంటున్నారు సౌందరరాజన్.**



# భక్తులే దేవుళ్లను ఆదుకోవాలి



**భక్తి, ఆధ్యాత్మిక చింతనను వ్యాప్తి చేసే ఆలయాలకు ఈ దురవస్థ పట్టడంతో పల్లెల్లో అశాంతి పెరిగింది. ఈ పరిస్థితికి ప్రభుత్వంతో పాటు ప్రభుత్వ చర్యల్ని ఉపేక్షించినందుకు మనమూ బాధ్యత తీసుకోవాలి.**



కష్టాల్లో ఉన్నప్పుడు మనల్ని ఆదుకొనే భగవంతుడే చిక్కుల్లో పడితే ఆయన్ను గట్టెక్కించేదెవరు? ఆయనకు మనం సృష్టించిన కష్టాల్ని తొలగించేందుకు మనమే నడుం కట్టాలి. భక్తులే చైతన్యవంతులై భగవంతుడికి, ఆలయాలకు జరుగుతున్న అన్యాయాల్ని అడ్డుకోవాలి. అసలు ఈ ఆలయాలు ఎందుకు? ఎవరి కోసం? సమాజహితం కోసం. ధార్మిక, ఆధ్యాత్మిక వికాసం కోసం. దురదృష్టవశాత్తు అర్చకుల మేలు కోసమే ఆలయం అనే భావాన్ని 1983లో చల్లా కొండయ్య కమిషన్ ప్రజల మనసుల్లో నాటింది. అది నిజం కాదు. ఆలయం వల్ల అర్చకుడు ఒక్కడికే కాదు ఊరు ఊరంతటికీ మేలు జరుగుతుంది. ప్రజల్లో భక్తిభావాన్ని పాదుకొలిపి, వారందరినీ సంఘటితం చేసి శాంతినిండిన సమాజాన్ని స్థాపించేందుకు ఆలయం తోడ్పడుతుంది. అర్చకులు కేవలం ఆ మహాయజ్ఞంలో ఓ భాగం మాత్రమే. వంశపారంపర్య అర్చక వ్యవస్థను అప్పటి ఎన్టీఆర్ ప్రభుత్వం రద్దు చేసింది. ఫలితంగా అర్చకులు వీధిన పడ్డారు. వారికి ఆదాయం తగ్గిపోయింది. వారంటే గౌరవం లేకుండా పోయింది. దాంతో అర్చకులు తమ పిల్లల్ని చిన్నాచితక ఉద్యోగాల్లో అయినా పెట్టేందుకు ఇష్టపడ్డారే కానీ వారసత్వంగా వచ్చిన అర్చక వృత్తిలోకి దించేందుకు ఇష్టపడలేదు. వేలాది మంది అర్చకులు పొట్టచేత పట్టుకొని పట్టణాలకు వలసపోయారు. ఫలితం... ఈ రోజున వేలాది ఆలయాల్లో అర్చకులు లేరు. భక్తి, ఆధ్యాత్మిక చింతనను వ్యాప్తి చేసే ఆలయాలకు

పట్టెడన్నం కోసం పట్టణాలకు చేరిన అర్చకులు వంశపారంపర్యంగా వచ్చే నియమాలను, ధర్మాలను పాటించడం మానేశారు.

ఈ దురవస్థ పట్టడంతో పల్లెల్లో అశాంతి పెరిగింది. ఈ పరిస్థితికి ప్రభుత్వంతో పాటు ప్రభుత్వ చర్యల్ని ఉపేక్షించినందుకు మనమూ బాధ్యత తీసుకోవాలి. రాష్ట్రంలో 33,575 ఆలయాలుంటే సుమారు 28 వేల ఆలయాల్లో కనీసం దీపం వెలిగించి, నైవేద్యం పెట్టే దిక్కులేదు. చీకటిపడ్డాక ఇంట్లో దీపం పెట్టకపోతే అశుభం అనుకుంటాం. అదే ఊళ్లో ఉన్న ఆలయంలో దీపం వెలగకపోతే, గంట మోగకపోతే ఎంత అశుభమో ఆలోచించం. దీపం వెలిగించకుండా, నైవేద్యం లేకుండా దేవుడి కడుపు మాడుస్తూ, అందుకు కారణం రాజకీయ నాయకులు, అధికారులు, అర్చకులంటూ తెగ లెక్చర్లిస్తాం. వాళ్లతో పాటు మనలో పెరిగిపోతున్న స్వార్థ చింతన... మన గురించి తప్ప మరి దేన్నీ పట్టించుకోని ధోరణి కూడా ఇందుకు కారణం అని ఒక్కసారైనా అనుకోం. బహుశా మన ధోరణిని చూసి భగవంతుడు కూడా బాధపడుతున్నాడేమో?

కొత్త ఆలయాలు పుట్టుకు రావడంతో అర్చకులకు మళ్లీ ఆదరణ పెరిగింది. కానీ వాళ్లు తమ పిల్లల్ని ఆ వృత్తిలోకి దించేందుకు ఇష్ట పడడం లేదు.

పట్టెడన్నం కోసం పట్టణాలకు చేరిన అర్చకులు వంశపారంపర్యంగా వచ్చే నియమాలను, ధర్మాలను పాటించడం మానేశారు. శాస్త్రం చదువుకొనే సౌకర్యం లేదు.. చదువుకున్నా ఫలితం లేదు. అర్చకుల కుటుంబాలు దారుణమైన సంక్షోభంలో చిక్కుకున్నాయి. నెమ్మదిగా అయినా ఈ పరిస్థితిలో మార్పు రావాలి. లేకపోతే భవిష్యత్తులో అర్చకులు అరుదైపోతారు. కొన్ని కష్టాలు ఎదురైనా అర్చకుల కుటుంబాల వారు వాటిని భరించి, తమ పిల్లలకు అర్చక విద్య నేర్పించాలి. నేను మాటలు చెప్పి ఊరుకోవడం లేదు. మా అబ్బాయి రంగరాజన్ బయోకెమికల్ ఇంజనీర్. మంచి ఉద్యోగం చేసుకుంటూ లక్షలు గడించే అవకాశాన్ని వదిలేసుకొని చిలుకూరు బాలాజీకి సేవ చేసుకుంటున్నాడు. అర్చకుడిగా స్థిరపడిపోయాడు. వాక్ పత్రిక నడుపుతున్నాడు. వ్యవస్థ సంక్షోభంలో ఉన్నప్పుడు మనం కొన్ని త్యాగాలు చేయక తప్పదు.

మన ఆలయాలకు పెద్దదిక్కు తిరుమల. దాని పరిస్థితి చూస్తే భయమేస్తుంది. మీరు తిరుమల వెంకన్నను చూసేందుకు బయలుదేరారనుకుందాం. అక్కడ విఐపిలకు తప్ప సామాన్యులకు దర్శనం దక్కదు. కనీసం కాటేజ్ కూడా పైరవీ లేకుండా దొరకదు కాబట్టి శక్తి మేరకు వాళ్లు పక్కదారిలో ప్రయత్నాలు మొదలుపెడతారు. దేవుడి దర్శనం కోసం ఇంత పరుగు

పందెమా? మరీ ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే తిరుమల కొందరికి విహార కేంద్రం. నింపాదిగా రెండుమూడు రోజులు అక్కడ ఉండి, వీలయినన్నిసార్లు ... ఎంత రికమండేషన్ ఉంటే అంత దగ్గరగా దైవదర్శనం చేసుకుంటే కానీ తనివి తీరదు. తమ వల్ల వేరే వాళ్లు నానా అవస్థలు పడుతున్నారని, కనీసం ఓ క్షణం పాటు కూడా వాళ్లకు దర్శనం కావడం లేదనే ఆలోచన చాలామంది చేయరు. ఇక అధికారులు, రాజకీయ నాయకుల సంగతి సరేసరి. చిలుకూరు మాదిరిగా ఎంత గొప్పవారయినా సరే క్యూలోనే వెళ్లి దర్శనం చేసుకోవాలనే పద్ధతి ప్రవేశపెడితే సమస్య కొంతవరకు పరిష్కారం కాదంటారా? కొండ మీద రాత్రిళ్లు ఎవరూ ఉండకుండా చర్యలు తీసుకుంటే తిరుమల పవిత్రంగా ఉండదా? తిరుమలను పవిత్రంగా తీర్చిదిద్దడంలో అక్కడ ఉన్న మఠాధిపతులు, అర్చకుల ధోరణిలో కూడా మార్పు రావాలి. ఇలాంటి తక్షణ చర్చలు చేపట్టక పోతే తిరుమలలో సంక్షోభం అనివార్యం.

**మన ఆలయాలకు పెద్దదిక్కు తిరుమల. దాని పరిస్థితి చూస్తే భయమేస్తుంది.**

తిరుమల సంగతి సరే. మిగిలిన ఆలయాల మాటేమిటి అనే ప్రశ్న రావచ్చు. ప్రజల్లో ధార్మిక భావాలను పాదుకొలిపే ఆలయ వ్యవస్థను కాపాడేందుకు వైఎస్ ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో ఓ సవరణ బిల్లును ఆమోదించారు. దాన్ని సత్వరం అమలు చేయాలి. ఈ బిల్లును అమలు చేస్తే అర్చకులకు ఆధారం దొరుకుతుంది. మళ్లీ ఆలయాలు నవజీవం నింపుకుంటాయి. అర్చకుల్లో మార్పు వచ్చినంత మాత్రాన ఆలయ వ్యవస్థ బాగుపడదు. కరిగిపోతున్న ధార్మిక విలువలు, సంప్రదాయాల్ని పరిరక్షించాలి. భక్తుల ఆలోచనలో మార్పు తీసుకురావాలి. అందుకోసం నిపుణులతో ధార్మిక పరిషత్ ఏర్పాటు చేయాలని దేవాదాయ సవరణ బిల్లులో ప్రతిపాదించారు. దీనికి కొందరు అధికారులు అడ్డం పడుతున్నారు. సత్వరం ధార్మిక పరిషత్‌ను ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. ఆలయాలు ధార్మిక కాంతుల్ని విరజిమ్మాలంటే ప్రభుత్వం, అధికారులు, అర్చకులతో పాటు ప్రజల్లో కూడా ఆధ్యాత్మిక చైతన్యం రావాలి. సంప్రదాయ జీవనం సాగించాలి. అప్పుడే ఆలయం, అందులో ఉండే దేవుడు చల్లగా ఉంటారు. అశాంతి, అలజడులు తొలగిపోయి ఊరు చల్లగా ఉంటుంది. ఊరు బాగుంటే మన దేశమూ దేదీప్యమానం అవుతుంది.

**అధికారులు, రాజకీయ నాయకుల సంగతి సరేసరి. దేవుడి ముందు అందరం సామాన్యులమే అనే ఆలోచన వాళ్లకు రానేరాదు.**

– జూలై 5, 2010

**స్వామీజీలంటే ఆధ్యాత్మిక ప్రవచనాలు ఇస్తారు. భక్తులకు భగవంతుడిని చేరువ చేస్తారు. స్వామి పరిపూర్ణానంద మాత్రం వీటితో సంతృప్తి చెందరు. ఆధ్యాత్మికం అంటే తనను ఆశ్రయించిన వారిని అనుగ్రహించటం అనుకుని స్వామీజీలు, సద్గురువులు నాలుగు గోడలకు పరిమితం కావడం వల్లే మనదేశం ఇలా చిక్కుల్లో పడిందంటారు. శంకరులు చూపిన మార్గమే ప్రస్తుత విపత్తుల నుంచి దేశాన్ని కాపాడుతుందంటారు.**



# ధర్మానికి నీళ్లు! అందుకే కన్నీళ్లు!!



ఈ కాలంలో స్వామీజీల్లో చాలా మంది ఆశ్రమాలకు పరిమితం అవుతున్నారు. సమాజానికి దూరం అవుతున్నారు. దారితప్పుతున్న ప్రజలకు మంచి దారి చూపాల్సిన బాధ్యతను వారు విస్మరించటం దురదృష్టకరం.



ప్రతి వ్యక్తీ తన బాధ్యతలు సక్రమంగా నిర్వర్తిస్తే కుటుంబం బాగుంటుంది. అలాగే యతి అంటే స్వామీజీ తన ధర్మాన్ని సరిగా నిర్వర్తిస్తే దేశం సుభిక్షంగా ఉంటుంది. శంకరాచార్యులు, స్వామి వివేకానంద ఇందుకు నిదర్శనాలు. శంకరులు కేవలం పీఠం ఏర్పాటు చేసేసి కూర్చుండిపోలేదు. ఆసేతు హిమాచలం సంచారం చేశారు. వేల సంవత్సరాలకు సరిపడా జ్ఞానాన్ని అందించారు. వివేకానందులూ అంతే. అలాంటి మహనీయులు అందించిన జ్ఞానమే నేటికీ మనల్ని నడిపిస్తున్నది. అయితే ఈ కాలంలో స్వామీజీల్లో చాలా మంది ఆశ్రమాలకు పరిమితం అవుతున్నారు. సమాజానికి దూరం అవుతున్నారు. దారి తప్పుతున్న ప్రజలకు మంచి దారి చూపాల్సిన బాధ్యతను వారు విస్మరించటం దురదృష్టకరం. దేశాన్ని సరైన దిశలో నడిపించటం రాజు బాధ్యత. ప్రజల అవసరాలను గమనించి, కాలానుగుణంగా ఆ రాజుకు మంచి సూచనలు ఇవ్వటం మంత్రి ధర్మం. మంత్రి అంటే జ్ఞాని, గురువు. అలాంటి మంచి గురువులు లేకపోవటమే భారతీయ సమాజం ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్యలకు ప్రధాన కారణం. స్వామీజీలు మడికట్టుకు కూర్చుంటే సరిపోదు. వారు ప్రజలతో మమేకం కావాలి. ప్రజలకు చేరువ కాగలిగినప్పుడు పాలకుల గౌరవం పొందటం ఏమంత కష్టం కాదు. ప్రస్తుతం స్వామీజీలు పూజలు, వ్రతాలు, యజ్ఞాలకే పరిమితం అవుతున్నారు. అలా కాకుండా ప్రజల్ని జ్ఞానమార్గంలో నడిపించేందుకు ప్రయత్నించాలి. అందుకోసం నలుదిశలా పర్యటిం

చాలి. అప్పుడే గురువులుగా వారు తమ ధర్మాన్ని నిర్వర్తించిన వారవుతారు.

నేను కాకినాడలో శ్రీపీఠం ఏర్పాటు చేశాను. అది గురువు ఆదేశం మేరకు చేసినదే. నిజానికి నాకు పీఠం ఏర్పాటు చేసి నాలుగు గోడలకు పరిమితం కావటం ఇష్టం లేదు. చిన్నతనం నుంచీ నా ధోరణి వేరు. నెల్లూరు జిల్లాలో సంప్రదాయ కుటుంబంలో జన్మించాను. పాఠశాల విద్య వదిలేసి, బెంగుళూరు సమీపంలో వేదవిద్య ప్రారంభించాను. అర్థాలు తెలియకుండా వేదాలు వల్లె వేయటంలో పరమార్థం ఏమిటో నాకు బోధపడలేదు. ఈ వైదిక సంప్రదాయం ఆత్మ ఏమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస మొదలైంది. వేదాధ్యయనం మధ్యలోనే వదిలేశాను. దేశ సంచారం మొదలు పెట్టాను. ఎందరో గురువుల్ని కలిశాను. వారి నుంచి సంతృప్తికరమైన సమాధానం దొరకలేదు. రుషీకేశ్ చేరుకున్నాను. అక్కడ స్వామి దయానంద సరస్వతిని కలిశాను. నా ప్రశ్నలకు ఆయన వద్ద సమాధానం లభించింది. ఆయన వద్ద పాణిని అష్టాధ్యాయిని, ప్రస్థానత్రయం అధ్యయనం చేశాను. పురాణేతిహాసాలు చదువుకున్నాను. భారతీయ సనాతన ధర్మం ఎంతటి మహోన్నతమైనదో అర్థం అయింది. దయానందుల వద్ద బ్రహ్మచర్య దీక్ష తీసుకున్నాను. ఐదేళ్ళ తరువాత గురువుగారు సన్యాస దీక్ష ఇచ్చారు. సన్యాసి స్వాధ్యాయి కావాలి. అంటే నిరంతరం నేర్చుకుంటూ ఉండాలి. చుట్టూ ఉన్న సమాజాన్ని గమనిస్తే ఒక విషయం అర్థం అయింది. ప్రజలు మునుపెన్నడూ లేని భయంకరమైన పరిస్థితుల్లో ఉన్నారు. ఇందుకు ప్రధాన కారణం మనం మన చరిత్రను, సంస్కృతిని, సనాతన వైదిక ధర్మాన్ని విస్మరించటమే. మన దేశానికి గొప్ప చరిత్ర ఉంది. దాన్ని కొందరు వక్రీకరిస్తున్నారు. మన చరిత్రను వక్రీకరించుకోవటం అంటే మనల్ని మనం కించపరచుకోవటమే. చరిత్రహీనులం కావటమే. నవతరానికి కంప్యూటర్, సెల్‌ఫోన్ తప్ప మరేమీ తెలియని దుస్థితి నెలకొంది. తెలుగు భాషను ఆప్షనల్‌గా చదువుకుంటున్నాం అంటే మనకు మనభాష, సంస్కృతి మీద ఎంత గౌరవం ఉందో అర్థం అవుతుంది. కొందరు మిడిమిడి జ్ఞానంతో కుహనావాదాన్ని ప్రచారం చేస్తున్నారు. వేదాల గురించి విన్నావా? అని విద్యావంతుడైన ఒక యువకుడిని అడిగితే, ''అవును, మాక్స్‌ముల్లర్ వ్యాఖ్యానం చేశారట కదా!'' అని బదులిచ్చాడు. జ్ఞానభాండాగారాలైన వేదాల్ని మన రుషులు రాశా

**వైదిక సంప్రదాయం ఆత్మ ఏమిటో తెలుసుకోవాలనే జిజ్ఞాస మొదలైంది. వేదాధ్యయనం మధ్యలోనే వదిలేశాను.**

**ఏ మనిషీ పరిపూర్ణుడు కాడు. నాకు తెలిసింది ప్రజలకు చెబుతూ, వారి నుంచి అనేకం నేర్చుకుంటున్నాను.**

మన చరిత్రను వక్రీక రించుకోవటం అంటే మనల్ని మనం కించ పరచుకోవటమే. చరి త్రహీనులం కావటమే.

రని కూడా తెలియని వారు కోకొల్లలు. మన యువత ఇలా ఉంటే పాశ్చాత్య దేశానికి చెందిన ఒక యువకుడిని కాశీలో కలిశాను. కాశీ ఎలా ఉంది? అని అడిగితే, ''ఇక్కడ నెలరోజులుగా ఉంటు న్నాను. వీధులన్నీ కంపుకొడుతున్నాయి. గంగాతీరం దుర్గంధ మయం. కానీ ఇక్కడ నుంచి వెళ్ల కుండా నన్ను ఏదో శక్తి కట్టి పడే స్తున్నది. బహుశా అదే భారతీయ ఆధ్యాత్మిక శక్తేమో?'' అని బదులిచ్చాడు. వేరే వాళ్లు ఇంత ఆసక్తి చూపుతున్న మన చరి త్రను, సంస్కృతిని మనం పట్టించుకోవటం మానేశాం, ఇంతకు మించిన విషాదం ఏముంది?

మన చరిత్ర, సంస్కృతి, ధర్మాన్ని కాపాడేందుకు ఏం చేయాలనే చర్చ జర గాలి. అందుకు ఒక వేదిక కావాలి.

ఈ పరిస్థితికి ప్రజల్ని నిందించి ప్రయోజనం లేదు. తప్పంతా గురువులదే. సమాజం దారితప్పుతున్నప్పుడు దాన్ని సక్రమ మార్గంలో పెట్టాల్సిన బాధ్యత గురువులదే. ఎప్పుడైనా జ్ఞాన బోధ చేయటం కష్టమైన పని. అందుకే జ్ఞానాన్ని అందించటం మానేసి పూజలు, వ్రతాలు చేయించటం మొదలు పెట్టారు స్వామీజీలు. పూజ చేస్తే నాకేంటి? అనే ప్రశ్న మొదలైంది. ప్రయో జనవాదం పెరిగింది. ప్రజలంతా పక్కదారి పడుతున్న వేళ ధర్మంగా నడుచుకునేందుకు ఒక్కరు కూడా అదర్శంగా లేని పరి స్థితి దాపురించింది. నిస్వార్థంగా జనహితం గురించి ఆలోచించే వారే కరువయ్యారు. ఇందుకు కారణం మన మూలాల్ని, పునా దుల్ని విస్మరించటమే. ఈ పరిస్థితిని మార్చాలి. అది ఎవరో ఒక రితో కాదని నాకు తెలుసు. కానీ ఎక్కడో ఒక చోట ప్రయత్నం ప్రారంభం కావాలి. అందుకు నాకు చేతనైన కృషి ప్రారంభిం చాను. దేశ భవిత తరగతి గదిలో నిర్ణయం అవుతుందంటారు. అంటే విద్యార్థులే భవితను నిర్దేశిస్తారన్నమాట. అందుకే పాఠ శాల విద్య నుంచి మన చరిత్ర, సంస్కృతి గొప్పతనాన్ని బోధిం చాలి. పెద్దలు, ప్రభుత్వాలు అందుకు తోడ్పడాలి. గతం లేనిదే భవిత లేదు. నవతరానికి భారతీయ సనాతన ధర్మాన్ని, చరిత్రను వివరించి చెప్పకపోతే వారికి దారీతెన్నూ తెలియదు. నేను ఒక తీర్మానం చేసుకున్నాను. దేశంలో ఎక్కడైనా సరే కొందరు విద్యా ర్థులు బృందంగా ఏర్పడి, నాకు సమాచారం అందిస్తే చాలు. వారి దగ్గరకు వెళ్లి మన సనాతన ధర్మం గొప్పతనాన్ని వివరించేం దుకు నేను సిద్ధం. ఇలా ప్రతి ఒక్కరూ తమ శక్తి మేరకు నవతరా నికి మన పూర్వవైభవం గురించి చెప్పగలిగితే వారిలో జ్ఞానజ్యో తులు వెలుగుతాయి. ఆ వెలుగులు మన సమాజంలోని చీకటిని పారద్రోలి దివ్యతేజాన్ని నింపుతాయి.



**ఆరాధన మనల్ని భగవత్ చైతన్యంతో అనుసంధానం చేస్తుంది. శరన్నవరాత్రులలో అమ్మవారి అలంకార విశేషాలను పిల్లలకు వివరిస్తే వారిలో అద్భుత కళాదృష్టి అంకురిస్తుందంటు న్నారు ప్రముఖ సాహితీవేత్త, ఆధ్యాత్మిక వేత్త, విద్యావేత్త అయిన కోవెల సుప్రసన్నాచార్య. శ్రీవైష్ణవ కుటుంబంలో జన్మించినా దశాబ్దాలుగా ఆ జగన్మాత ఆరాధనలో తరిస్తున్నారాయన. శక్తేయ రహస్యాలతో పాటు, ఆధునిక కాలంలో భక్తి, ఆధ్యాత్మిక ధోరణుల గురించి ఇలా చెబుతున్నారు.**

# ఆరాధనతో దైవంతో అనుసంధానం

సంప్రదాయ శ్రీవైష్ణవ కుటుంబంలో పుట్టినా నా దృష్టి ఎప్పుడూ ఆ జగన్మాత మీదే ఉండేది. ముందునుంచీ మా ఇంట్లో ఉదార వాతావరణం ఉండేది. సర్వదేవతా సమ భావం మా పెద్దల నుంచి సంక్రమించింది. ఆధ్యాత్మిక వాతావ రణంలో పెరిగినా ఏది సత్యం, ఏది అసత్యం అనే జిజ్ఞాస ఉండేది. 14వ ఏటే జగత్తు మిథ్య అనే అద్వైతంతో విభేదిం చాను. జగత్తు-బ్రహ్మ రెండూ సత్యమే అనే శ్రీ అరవిందుల తత్వం నన్ను బాగా ఆకర్షించింది. ప్రకృతి, పురుషుల మధ్య భేదం లేదని ఆయన ప్రతిపాదించారు. మదర్‌ను మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి రూపంగా అరవిందులు చెప్పేవారు. మదర్‌ను కలిశాను. ఆమె తత్వం పట్ల ఆకర్షితుణ్ణయ్యాను. ఆ కాలంలో విశ్వనాథ సత్యనారాయణ సాహితీ ప్రభంజనం నడు స్తున్నది. రామాయణ కల్పవృక్ష కావ్యం వచ్చింది. అందులోని సీతమ్మే జగన్మాత. రావణ సంహారానికి ఆమే మూలం. అలాగే మహాభారతంలో ద్రౌపది అమ్మ స్వరూపమే. కురుక్షేత్ర సంగ్రా మానికి, ధర్మస్థాపనకు ఆమే కారకురాలనే భావం నాలో ఉద యించింది. నాటి నుంచి అమ్మ ఆరాధన, అరవిందులు చెప్పిన దివ్యజీవనం నాలో మొదలైంది. 16 సంవత్సరాల పాటు మదర్ ఆరాధనలో ఉన్నాను. అడుగడుగునా ఆమె నా వెంట ఉండి నడిపించేది. ఏ సమస్య వచ్చినా అమే పరిష్కారం చూపేది. విశ్వవిద్యాలయంలో లెక్చరర్ ఇంటర్వ్యూకు హాజరయ్యే నాటికి ముందే అమ్మవారి మీద నేను రాసిన కావ్యం పుస్తకంగా



అమ్మ ఆరాధన, అరవిం దులు చెప్పిన దివ్యజీ వనం నాలో మొదలైంది. **16** సంవత్సరాల పాటు మదర్ ఆరాధనలో ఉన్నాను. అడుగడు గునా ఆమె నా వెంట ఉండి నడిపించేది. ఏ సమస్య వచ్చినా అమే పరిష్కారం చూపేది.



ఆర్భాటాల మీద నాకు నమ్మకం లేదు. సనాతన సంప్రదాయం ఏ నాడూ ఆడంబరాలను ప్రోత్సహించలేదు.

వచ్చింది. ఆ పుస్తకాన్ని కూడా ఇంటర్వ్యూకి తీసుకెళ్లాను. ఇంటర్వ్యూ చేసే వారిలో ఒక స్త్రీ మూర్తి ఉంది. ఆమె నా పుస్తకం చూసి, ఆమోదంగా తల ఊపింది. ఆమెలో నాకు మదర్ కనిపించింది. ఆమే దగ్గర ఉండి నాకు విజయం చేకూర్చిందేమో అనిపిస్తుంది. మదర్‌తో పాటు తెలంగాణ వాతావరణం కూడా నన్ను జగన్మాత భక్తుడిగా మార్చింది.

1948లో విజయవాడలో ఉండేవాడిని. వరంగల్ నుంచి నాకు తెలిసిన కొందరు వైశ్య ప్రముఖులు విజయవాడ వచ్చారు. అవి దసరా రోజులు. వైశ్య ప్రముఖుల సతీమణులంతా పండుగ రోజు కృష్ణాతీరంలో బతుకమ్మలు ఆడుతుంటే బెజవాడ అంతా ఆశ్చర్యంగా తిలకించింది. దుర్గగుడిలో అమ్మవారికి వేద మంత్రాలతో నవరాత్రులు జరుగుతుంటే కృష్ణమ్మ ఒడిలో ఆటపాటలతో, అద్భుతంగా బతుకమ్మ ఆరాధన జరగడం నాకు ఇప్పటికీ గుర్తుంది. దీంతో పాటు స్కూల్లో చదువుతున్నప్పుడు విశ్వనాథ వారి సోదరుడు విశ్వనాథ వెంకటేశ్వర్లు గారు నాకు టీచర్‌గా ఉండేవారు. వారు అమ్మవారి ఉపాసకులు, నిత్యతపస్వి. జగన్మాతపై పలు కావ్యాలు రచించారు. వారి సాంగత్యం కూడా నన్ను ఆ మహాశక్తివైపు నడిపించాయి. 30 ఏళ్లుగా ఏటా ఇంట్లో శరన్నవరాత్రులు చేస్తూ వస్తున్నాను. వేడుకలు, ఆర్భాటాల మీద నాకు నమ్మకం లేదు. సనాతన సంప్రదాయం ఏనాడూ ఆడంబరాలను ప్రోత్సహించలేదు. శ్రీశైల భ్రమరాంబను, ఉజ్జయినీ మహంకాళిని దర్శించుకున్నాను. వరంగల్ కాళిని దర్శించినప్పుడల్లా ఒక్కొక్కసారి ఒక్కో ముద్రలో ఆ తల్లి కనిపించేది. ఆహ్లాదపూరితంగా, కరుణతో, కోపంతో ఇలా భిన్న రీతుల్లో నాకు కనిపించేది. బహుశా అప్పటి నా మనోస్థితి అమ్మవారి ముఖంలో కనిపించేదేమో? మదర్ తరువాత సద్గురు శివానంద మూర్తి మార్గం నన్ను ఆకర్షించింది.

మదర్‌తో పాటు తెలంగాణ వాతావరణం కూడా నన్ను జగన్మాత భక్తుడిగా మార్చింది.

ఆరాధన మనల్ని భగవత్ చైతన్యంతో అనుసంధానం చేస్తుంది. గోదాదేవి చేసింది అదే. అమె గొప్ప యజ్ఞాలు యాగాలు చేయలేదు. తాను ధరించిన మాలను స్వామికి సమర్పించింది. ఆయనను గుండెల నిండుగా ఆరాధించింది. ఆరాధనే ఆమెను స్వామి చెంతకు చేర్చింది. చదువు సంధ్యలు లేని గోపికలు వేణుగాన సమ్మోహితులై, ఆత్మనిండుగా ఆరాధించి ఆ

స్వామిని చేరారు. సామాన్యులైన వారికి అలా భగవంతుని సన్నిధి లభిస్తే, పండితులకు ఎందుకు లభించదు? మనకు, భగవంతుడికి మధ్య అహంకారం అడ్డుగోడగా నిలుస్తుంది. మనలోని అన్ని అహంకారపు పొరల్ని తొలగించే శక్తి కేవలం తల్లిలోనే ఉంటుంది. తండ్రిలో అంతటి ఓరిమి, అనురాగం ఉండవు. అందుకే తల్లి ఆరాధన అమృతపానం వంటిది. ''లక్ష్మీ అష్టోత్తరం 'ప్రకృత్యైనమః' అని ప్రారంభం అవుతుంది. జగన్మాత పకృతిలోనే నివసిస్తుంది. అందుకే ప్రకృతి పరవశంగా ఉండే శరత్‌కాలంలో దసరా జరుపుకోవాలనే ఆచారం మొదలైంది. మనం ప్రకృతికి దగ్గరగా వెళ్లగలిగినప్పుడే మనలో అంతర్యానం మొదలౌతుంది. మనలోకి మనం చూసుకున్నప్పుడే జీవితం సుసంపన్నం అవుతుంది. అందుకు ప్రకృతి ఆరాధన ఉపకరిస్తుంది. అందుకు దసరా నాంది కావాలి. నవరాత్రుల్లోని అలంకారాలు, పసుపుకుంకుమలు, పూజా విశేషాల్ని మన పిల్లలకు చెప్పండి. వాళ్లలో కళాదృష్టి తప్పక పెంపొందుతుంది. భౌతికవాదం పెరిగిపోతున్న ఈ కాలంలో ఆధ్యాత్మిక సంపద మాత్రమే మనదేశాన్ని రక్షిస్తుంది. అమెరికాలో వేలాది యోగా స్కూల్స్ వెలుస్తుంటే మనదైన యోగవిద్యను మనం వదులుకుంటున్నాం. ఈ మధ్య దక్షిణ కొరియా వెళ్లాను. వేలు లక్షలుగా వాళ్లు చెట్టు పెంచుతున్నారు. దురదృష్టవశాత్తు మనం చెట్లు కూల్చుకుంటున్నాం. ప్రకృతిని ఇలా నాశనం చేసుకోవడం వల్ల రేపటితరాలకు మనం హాని చేస్తున్నాం. వినాయక చవితి, దసరా పండుగలు ప్రకృతి ఆరాధన అంటే మన ఇంట్లో నుంచే మొదలు కావాలని చెబుతాయి. అందుకే ప్రకృతిని ఆరాధిద్దాం. లోకకళ్యాణానికి తోడ్పడదాం.''

**మనకు, భగవంతుడికి మధ్య అహంకారం అడ్డుగోడగా నిలుస్తుంది.**

**నవరాత్రుల్లోని అలంకారాలు, పసుపుకుంకుమలు, పూజా విశేషాల్ని మన పిల్లలకు చెప్పండి. వాళ్లలో కళాదృష్టి తప్పక పెంపొందుతుంది.**

– అక్టోబర్ 17, 2010





**నలుగురూ నడిచే దారిలో నడవటం సులభం. కొత్త మార్గంలో నడవాలంటే అందుకు దమ్ముండాలి. ఐఐటి చదువు, అది తెచ్చే ఉద్యోగం ఆయనకు సంతృప్తి ఇవ్వలేదు. భారతీయ వేదాంతం, సూఫీయిజం.. చదివారు. 1976లో జిడ్డు కృష్ణమూర్తిని కలిశారు. ఆయనతో పదేళ్ల పాటు ప్రపంచం అంతా తిరిగారు. ఆయన మరణం తరువాత ప్రపంచదేశాల్లో పర్యటిస్తూ నవీన తత్వాన్ని పంచుతున్నారు రాజేష్ దలాల్.**

# మీరు మీలా నిజాయితీగా ఉన్నారా?

సత్యాన్ని ఎదుర్కొనే పరిణతి, శక్తి మనిషికి లేకుండా పోయాయి. అందుకు చదువు, విజ్ఞానం అవసరం. దురదృష్టవశాత్తు ఈ కాలంలో మనం చదివేది చదువే కాదు. ఈ చదువులు మనల్ని ఇంకా పరాధీనుల్ని చేస్తున్నాయి. సత్యాన్ని ఎలా ఎదుర్కోవాలి ఆనే ఆలోచన మన అంతరంగం లో లోపలి నుంచి తన్నుకురావాలి. అంత లోతుగా, నిజాయితీగా ఆలోచించేందుకు మన మనసు ఒప్పుకోదు. భయాలు, లాలసలు అడ్డుపడతాయి. అవినీతి ఎక్కడో ఉంది అనుకుంటాం. అది మనకు తెలియకుండా మనలోనే ఉంది. నిజాయితీగా నీ గురించి విచారణ చేస్తున్న మనసును వద్దని వారించడం ఒక రకంగా కరప్షన్ కాకమరేమిటి? మన అంతరంగంలో, చుట్టూఉన్న సమాజంలో, మనుషుల మధ్య సంబంధాల్లో నిజాయితీ నిండిన ఆలోచన లోపించింది. ఇదే ఈ రోజున మనం ఎదుర్కొంటున్న సమస్యలకు మూలం. మొదట మన గురించి మనం నిజాయితీగా ఆలోచించాలి. ఆ విచారణ కొనసాగాలి. తద్వారా మనలో రగిలే చైతన్యం అంతటా వ్యాపిస్తుంది. వెలుగులు నింపుతుంది.

మనలో ప్రతి ఒక్కరం ఎవరికి వాళ్లు గిరిగీసుకుని బతుకుతున్నాం. ఈ గోడలు బద్దలు కావాలి. స్వేచ్ఛగా ఆలోచించాలి. హఠాత్తుగా స్వేచ్ఛ ఎదురైతే తత్తరపడిపోతాం. అందుకు మానసికంగా సంసిద్ధులం కావాలి.

చిన్నారుల్లో ముందు నుంచే సత్యాన్వేషణ బీజాల్ని నాటేందుకు ప్రయత్నించాలి. తన గురించి, సత్యం గురించి ఆలోచించే రీతిలో బాల్యం నుంచే శిక్షణ ఇచ్చే వ్యవస్థలు ఉండాలి. భారతీయ తత్వం చాలా గొప్పది. సనాతన భారతీయ విద్య బాల్యం

నుంచే అలాంటి విద్య నేర్పేది. కానీ కాలక్రమంలో అది పోయింది. ఎందరో మహనీయులు ఎన్నో గొప్ప విషయాల్ని బోధించారు. కానీ ఆచరణ మాత్రం పూజ్యం. ఆధ్యాత్మిక గురువులు చెప్పేది ఒకటి, చేసేది మరొకటి. దీంతో మతం మీద నూరుశాతం విశ్వాసం ఎవరికీ లేకుండా పోయింది. మతం మీదే కాదు దేనిమీదా విశ్వాసం లేదు. గురువుల్ని ఆశ్రయించిన మరుక్షణం నుంచి మన ఆలోచనలు ఆగిపోతాయి. నువ్వు ఆలోచించటం ఎందుకు? నన్ను ఆశ్రయించి, సేవచేసుకుంటే నీ గురించి నేను ఆలోచించి పెడతాను అంటారు ఆధునిక గురువులు. అక్కడితో ఆలోచించడం అనేదే మరచిపోతాం. ఇది సరి కాదు. నిజాయితీగా నిరంతర విచారణ సాగినప్పుడే జీవితం ఆనందమయంగా ఉంటుంది. ఈ కాలంలో విద్యార్థులు నేర్చుకుంటున్న శాస్త్రాలు వారిలో ఏ మాత్రం విచారణ ధోరణిని పెంపొందించటం లేదు. శాస్త్ర విజ్ఞానం మనిషికి ప్రశ్నించటం నేర్పిన మాట వాస్తవమే కానీ అది పదార్థం, ఎనర్జీ వంటి అంశాలకే పరిమితం అయింది. జీవితానికి అవసరమైన ముఖ్య అంశాల విచారణను సైన్స్ వదిలేసింది. ఫలితంగా నిజాయితీ నిండిన విచారణ లోపల, వెలుపల ఎక్కడా లేకుండా పోయింది.

**మన అంతరంగంలో ఒక గాంధీ, ఒక క్రీస్తు నిండాలి. అప్పుడు మనం చట్టాన్ని గౌరవిస్తాం.**

**ఆధ్యాత్మిక గురువులు చెప్పేది ఒకటి, చేసేది ఒకటి దీనితో మతం మీద నూరు శాతం విశ్వాసం ఎవరికీ లేకుండా పోయింది.**

మొదట నేను నిజాయితీగా ఏ విషయం గురించి ఆలోచించటం లేదనే సత్యాన్ని గ్రహించాలి. నాకు ఆ శక్తి లేదనే విషయాన్ని గ్రహించినప్పుడు, లేని ఆ శక్తిని సంపాదించుకునే ప్రయత్నం మొదలవుతుంది. మనల్ని బలహీనపరిచే అంశాలను ఆమడదూరంలో పెట్టాలి. కష్టమైనా... నష్టమైనా సరే. అప్పుడు నిజమైన విచారణ మొదలవుతుంది. ప్రశ్నించనివ్వని గురువుల్ని వదిలేయండి. అలాంటి బోధలకు దూరంగా ఉండండి. ప్రశ్నించే సుగుణాన్ని కాపాడుకోండి. చదవండి, పది మందితో మాట్లాడండి. స్వేచ్ఛగా ఆలోచించండి. బంధనాలన్నింటినీ తెంచుకుని, స్వేచ్ఛగా ఆలోచించటం మొదలు పెట్టిన క్షణం నుంచి కొత్తలోకాలు అవిష్కారం అవుతాయి.

గురువును ఆశ్రయించటం అంటే నువ్వు ఒక జైలు నుంచి మరో జైలులోకి పోవటమే. ఆధ్యాత్మిక, తాత్విక వేత్తల్ని, పెద్దల్ని కలవటంలో తప్పు లేదు. వాళ్లను గమనించాలి. స్వేచ్ఛ గురించి వారిలో ఎంత తపన ఉన్నదో గ్రహించాలి. స్వేచ్ఛనిండిన ఆలోచన ఉన్న వారే మీ స్వేచ్ఛను హరించకుండా ఉండగలరు.

మనల్ని బలహీన
పరిచే అంశాలను
ఆమడదూరంలో
పెట్టాలి. కష్టమైనా...
నష్టమైనా సరే.
అప్పుడే నిజమైన
విచారణ
మొదలవుతుంది.

అలాంటి వారి దగ్గరే మనం ఏదైనా నేర్చుకోగలుగుతాం. ఉదాహరణకు నేను చాలా మంది ఆధ్యాత్మిక, తత్వవేత్తల్ని కలిశాను. వారెవరూ నా విచారణను రగిలించలేకపోయారు. జిడ్డు కృష్ణమూర్తి తత్వం చదివాను. జిజ్ఞాస మొదలైంది. నా గురించి జిడ్డు కృష్ణమూర్తి కూడా విన్నారు. నన్ను పిలిపించుకున్నారు. ఇష్టమైతే ఇక నుంచి తనతో ప్రయాణం చేయవచ్చన్నారు. ఆయనతో పదేళ్ల పాటు సంచారం చేశాను. ఆయన నుంచి ఎన్నో నేర్చుకున్నా ఆయనను ఏనాడూ గురువుగా భావించలేదు. నిజానికి కృష్ణమూర్తి తనకు శిష్యులు ఉండాలని ఎప్పుడూ కోరుకోలేదు. అలా గురువులు మనల్ని వెతుక్కుంటూ వస్తారు. అందుకు మనం ఎంత వరకు సిద్ధంగా ఉన్నామనేదే ముఖ్యం. మనం నిజాయితీగా విచారణ చేయకుండా, ఆలోచన చేయకుండా కూర్చుంటే గురువు మనల్ని వెతుక్కుంటూ వచ్చినా ఫలితం ఉండదు. అన్ని వ్యవస్థల్లానే ఆధ్యాత్మిక, తత్వరంగాలు కూడా కలుషితం అయిన మాట వాస్తవం.

మనల్ని మనం
సిద్ధం చేసుకుని,
అన్వేషణ చేస్తే
తప్పక దారిచూపే
గురువులు
దొరుకుతారు.

మనల్ని మనం తెలుసుకునేందుకు సాధన, ధ్యానం, యోగ, పూజలు కొంతవరకే ఉపయోగపడతాయి. యోగ గొప్పదే కానీ దాన్ని పరిధిని తగ్గించి వ్యాయామం కింద చూస్తున్నాం. సమూహంలో కూర్చుని ధ్యానం చేయటం వల్ల నిజమైన విచారణ జరగదు. ఒంటరితనం నుంచి ఆలోచనలు రగులుతాయి. సాధన నిరంతరం జరగాలి. అందుకు ఎవరో సాయం చేయాలని భావించకూడదు. మనం ఆలోచనతో రగిలిపోతుంటే, సాధన చేసేందుకు సిద్ధంగా ఉంటే సహాయం అడగకుండానే మనకు అందుతుంది. నా గురించి నేను నిజాయితీగా ఆలోచించదలుచుకున్నాను.. నాకు సాయం చేయండి అని మీరు ఎవరిని అడుగుతారు? మీరు నిజాయితీగా ఆలోచన మొదలు పెడితే ప్రకృతి మొదలు కొని అన్ని వైపుల నుంచీ సహకారం అందుతుంది. మీరు చేయాల్సిందల్లా ఎవరూ నడవని దారిలో నడిచేందుకు భయపడకుండా, సమాజం ఏమనుకుంటుందో అని జంకకుండా ముందుకు సాగడమే. అది అంత తేలిక కాదు. అందుకు గట్టి సంకల్పం కావాలి.  మనం మనలా ఉండటం, నిజాయితీగా ఉండటం ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న సమస్యలన్నిటికీ పరిష్కారమార్గం.

– సెప్టెంబర్ 23, 2011

**ప్రేమ తత్త్వాన్ని గుండెల నిండా నింపుకుని, ఆ ప్రేమను ఇతరులకు కూడా పంచగలిగితే ఈ ప్రపంచంలో చెడు తుడిచిపెట్టుకుపోతుంది. మనిషి జీవితం ఆనందమయం అవుతుంది అంటారు మాతా అమృతానందమయి. మానవసేవా మూర్తిగా, ప్రేమమయిగా ప్రపంచవ్యాప్తంగా అమ్మగా గుర్తింపు పొందారు. సామాన్య కుటుంబంలో జన్మించారు. కానీ విశ్వవ్యాప్తంగా ఆధ్యాత్మిక సుధల్ని పంచుతున్నారామె.**



# అమృతానందమయం

ఇప్పుడు మనం ఉంటున్నది వసుధైక కుటుంబం. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో ఎన్నో అద్భుతాలు సాధించాం. మనుషులకు, మనుషులకు మధ్య దూరం తగ్గింది. కానీ మనసుకు, మనసుకు మధ్య దూరం పెరిగిపోయింది. ఆధునిక పరికరాల సహాయంతో సమయం వృథా కాకుండా చూసుకుంటున్నాం. కానీ ఆ సమయాన్ని పూర్వంలా ఆనందంగా గడపలేకపోతున్నాం. పిల్లలు ఆడుకునేందుకు రకరకాల బొమ్మలు తయారు చేసుకుంటున్నాం. కానీ వాళ్లు ఆడుకునేందుకు క్షణం తీరికలేని వాతావరణం సృష్టించుకుంటున్నాం. ఒత్తిళ్లు తగ్గించుకునేందుకు అనేక మందులు కనిపెట్టాం. కానీ ఒత్తిడి ముందు మనం ఓడిపోతున్నాం. శాస్త్ర, సాంకేతిక విజయాలు ఒక్కటే మన జీవితాలకు అవసరమైన వనరుల్ని పూర్తి స్థాయిలో ఇవ్వలేవని దీన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. శాస్త్ర సాంకేతిక విజ్ఞానానికి ఆధ్యాత్మికతను మేళవించినప్పుడే అది పరిపూర్ణ విజ్ఞానం అవుతుంది.



ఒత్తిళ్లు తగ్గించుకునేందుకు అనేక మందులు కనిపెట్టాం. కానీ ఒత్తిడి ముందు మనం ఓడిపోతున్నాం. శాస్త్ర, సాంకేతిక విజయాలు ఒక్కటే మన జీవితాలకు అవసరమైన వనరుల్ని పూర్తి స్థాయిలో ఇవ్వలేవని దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.



ఈ కాలంలో ఆనందమయంగా జీవించాలంటే ఆధునిక విద్య తప్పని సరి. విజ్ఞానం ఉన్నప్పుడే మానవజాతి వికాసం చెందుతుంది. అందుకే ఆధునిక విద్యను అందించే విద్యా సంస్థలను మా ఆశ్రమం ఆధ్వర్యంలో నిర్వహిస్తున్నాం. అయితే ఆధునిక విజ్ఞానం ఒక్కటే జీవితానికి పరిపూర్ణత ఇవ్వదు కాబట్టి ఆధ్యాత్మికత, సంస్కృతి, సంప్రదాయాలను ఆధునిక విద్యతో మేళవించి అందిస్తున్నాం. ఆధునిక విద్య, ఆధ్యాత్మికత ద్వారా

ఆధ్యాత్మికత, సంస్కృతి, సంప్రదాయాలను ఆధునిక విద్యతో మేళవించి అందిస్తున్నాం.

మానవ హృదయాల్లో కొత్త జ్యోతులు వెలిగించే ప్రయత్నం చేస్తున్నాను.

కేరళలోని కొల్లం జిల్లా పరయాకడవులో 1953లో జన్మించాను. బాల్యం నుంచి కృష్ణుడంటే నాకు ప్రాణం. నిరంతరం కృష్ణుడిని ఆరాధించే దానిని. కృష్ణ సాక్షాత్కారం కోసం పరితపించే దానిని. కుటుంబ కారణాల వల్ల తొమ్మిదేళ్లకే చదువుకు స్వస్తి చెప్పాను. ఇంటి బాధ్యతలను నిర్వర్తించడం, ఉన్నంతలో మానవ సేవ.. అన్నింటికంటే మిన్నగా మాధవసేవ.. ఇదీ నా నిత్యకృత్యం. నా ధోరణిని చూసి పెళ్లి చేయాలని పెద్దలు ప్రయత్నించారు. ససేమిరా అన్నాను. గంటల తరబడి ధ్యానంతో గడిపేదాన్ని. నా తపోశక్తి పది మందికీ తెలిసింది. క్రమంగా నా ఇల్లే ఆశ్రమంగా మారింది. మూడు దశాబ్దాల క్రితం ఆ ఆశ్రమం అంతర్జాతీయ స్థాయి ఆశ్రమంగా రూపుదిద్దుకుంది. వందకు పైగా దేశాల్లో ఈ రోజున మా ఆశ్రమాలు ఉన్నాయి. కేరళలో ఇంజనీరింగ్, వైద్య విద్యను ప్రామాణికంగా బోధించే కళాశాలలను ఏర్పాటు చేశాము. ప్రస్తుతం ప్రపంచ వ్యాప్తంగా లక్షలాది మంది భక్తులకు ఆధ్యాత్మిక సుగంధాల్ని పంచుతున్నాను.

వందకుపైగా దేశాల్లో ఈ రోజున మా ఆశ్రమాలు వున్నాయి. ఇంజనీరింగ్, వైద్య విద్యను ప్రామాణికంగా బోధించే కళాశాలలను ఏర్పాటు చేశాము.

మన సనాతన భారతీయ సంస్కృతి, విద్యావిధానం, ఆచార సంప్రదాయాలు మహోన్నతమైనవి. అవే మనల్ని ప్రపంచ దేశాల్లో సమున్నతంగా నిలిపాయి. కానీ మనం క్రమంగా వాటికి దూరమవుతున్నాం. ఈ రోజున మన చుట్టూ జరుగుతున్న అనేక దారుణాలకు, మహిళలను చిన్నచూపు చూస్తున్న ధోరణులకు సంస్కృతిని విస్మరించడమే కారణం. సంస్కృతి సంప్రదాయాలను విద్యలో భాగం చేసినప్పుడు, చిన్నతనం నుంచే మన వ్యక్తిత్వంలో మంచి మార్పులు చోటుచేసుకుంటాయి. విలువలు పెంపొందించుకుని, జీవితాన్ని పండించుకునేందుకు మార్గం సుగమం అవుతుంది.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థ పోయిన తరువాత ఎవరికి వారే యమునాతీరే అన్న ధోరణి పెరిగింది. వ్యక్తుల మధ్య అనుబంధాలు సన్నగిలుతున్నాయి. మన, తన అనే ధోరణి పోయింది. నాది నేను అనే వైఖరి పెరిగింది. ప్రస్తుత సమాజం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు ఇదే మూలం. సంస్కృతి, సంప్రదా

యాలతో పాటు ప్రేమ తత్త్వం, సాటి వారి పట్ల ఆత్మీ భావన పెరగాలి. మనం ఇతరుల పట్ల ప్రేమగా ఉంటే, పక్క వారి కష్టాన్ని మన కష్టంగా భావించగలిగితే సమాజంలో చెడు తుడి చిపెట్టుకుపోతుంది. సర్వే జనాః సుఖినో భవంతు.. అంటూ మన మహర్షులు బోధించిన తత్త్వ సారం కూడా ఇదే. అందుకే ప్రేమ తత్త్వాన్ని అందరి గుండెల్లో నింపేందుకు నేను నిరం తరం ప్రయత్నిస్తున్నాను. ప్రేమ భావాన్ని మనసులో నింపు కున్న ఎందరో తమ జీవితాల్లో అద్భుతమైన మార్పుల్ని ఆస్వా దిస్తున్నారు.

**ప్రేమ భావాన్ని మన సులో నింపుకున్న ఎందరో తమ జీవి తాల్లో అద్భుతమైన మార్పుల్ని ఆస్వాదిస్తున్నారు.**

సేవ భారతీయ ధర్మంలో అతి ముఖ్యమైనది. సంస్కృతి, సంప్రదాయాలు పాటించినంత మాత్రాన మనిషి ఉన్నతి సాధించలేడు. పక్కవారు కష్టంలో వుంటే మనం సంతోషంగా ఎలా ఉండగలం? అందుకే సాటి వారిని కష్టంలో ఆదుకోమని చెప్పింది మన ఆర్షధర్మం. మానవ సేవ భగవంతుడి సేవ కంటే గొప్పదని అందుకే చెప్పారు. ఆ స్ఫూర్తితోనే ప్రపంచంలో ఎక్కడ ఎవరు కష్టంలో ఉన్నా వెళ్లి ఆదుకుంటున్నాం. ఉత్తరా ఖండ్ బాధితులకు మఠం తరపున భారీగా సహాయం చేశాం. సునామీ బాధితులకు ఇళ్లు కట్టించాం. హైదరాబాద్, కడపల్లో నిరుపేదలకు ఇళ్లు కట్టించి ఇచ్చాం. ఎయిడ్స్ రోగులను ఆదు కుంటున్నాం. కొచ్చిన్‌లో అమ్మ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ సంస్థను ఏర్పాటు చేసి తక్కువ ధరకు మేలైన వైద్యం అందిస్తున్నాం. ప్రేమగా సాటి మనిషికి శక్తి మేరకు సేవ చేయ డంలోనే దైవత్వం ఉంది. ప్రేమతత్త్వమే నిజమైన దైవత్వం. ప్రస్తుతం మన సమాజం ఎదుర్కొంటున్న రుగ్మతలు రూపు మాసిపోవాలంటే ప్రేమతత్త్వం పెంపొందాలి. సేవాభావం విక సించాలి. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో పురోగమించడంతో పాటు మనదైన సంస్కృతి, సంప్రదాయాలను పదిలంగా కాపాడుకో వాలి. అప్పుడే మన భారత మాత జగన్మాత అవుతుంది.

**ప్రేమగా సాటి మని షికి శక్తి మేరకు సేవ చేయడంలోనే దైవత్వం ఉంది. ప్రేమతత్త్వమే నిజ మైన దైవత్వం.**



**ప్రజల్లో ప్రేమ, మానవతా విలువలను పెంపొందిం చేందుకు ఆధ్యాత్మిక, సేవా మార్గాల ద్వారా దశాబ్దాలుగా కృషి చేస్తున్నారు శ్రీశ్రీ రవిశంకర్. విశ్వకల్యాణమే పర మావధిగా ఆయన ప్రవేశపెట్టిన ఆర్ట్ ఆఫ్ లివింగ్, సుద ర్శన క్రియ కోర్సులు కోట్లాది మంది హృదయాల్లో మార్పునకు నాంది పలికాయి. వేదన లేని హృదయం, నిర్భీతి నిండిన విజ్ఞానాలతోనే విశ్వమానవ కల్యాణం సాధ్యం అంటున్నారు శ్రీశ్రీ రవిశంకర్.**



# విలువలతో జీవిస్తేనే శాశ్వతానందం

మనిషికి ఎదుటి మనిషి మీద నమ్మకం లేకుండా పోయింది. విలువలు లుప్తం అవుతున్నాయి. ప్రతి ఒక్కరిలో అలజడి తీవ్రం కావడానికి ఇదే కారణం. వ్యక్తుల్లో చెలరేగిన అలజడి సమాజం మీద ప్రతిఫలిస్తున్నది. ఫలితంగా సమాజంలో హింస, రక్తపాతం పెరిగిపోతున్నాయి. విశ్వవ్యాప్తంగా హింసాత్మక ధోరణి పెరిగిపోవడానికి వ్యక్తిలో మొదలైన అలజడి, అభద్రతా భావాలే కారణం. వ్యక్తిలో అలజడి తగ్గించడం ఎలా? అనేది చాలా ముఖ్యమైన అంశం. యుగాలుగా మహర్షులు కూడా ఈ ప్రశ్నకు సమాధానం కోసమే నిరంతరం అన్వేషణ సాగించారు. ఆధునిక కాలంలో పతాకస్థాయికి చేరిన అవిశ్వాసం, అలజడిని తగ్గించి, మనుషుల మధ్య పరస్పర విశ్వాసాన్ని అంకురింపజేయడం ఎలా అని తీవ్రంగా ఆలోచించాను. సైన్స్‌లో డిగ్రీ చేసిన తరువాత మహర్షి మహేశ్ యోగి వెంట సంచారం చేశాను. ప్రపంచ వ్యాప్తంగా వేద విశ్వవిద్యాలయాలు, ఆయుర్వేద కేంద్రాలు ఏర్పాటు చేసే యజ్ఞంలో ఆయనకు సహకరించాను. ఆ తరువాత కర్ణాటకలోని షిమోగాలో భద్రా నదీతీరాన పది రోజుల పాటు మౌన దీక్ష చేపట్టాను. ఆ మౌన దీక్ష ద్వారా నేను అనుభవించిన ఆత్మానందాన్ని ప్రపంచానికంతటికీ అందించాలని ఆ క్షణాన నిర్ణయించుకున్నాను.

**హింసాత్మక ధోరణి పెరిగిపోవడానికి వ్యక్తిలో మొదలైన అలజడి, అభద్రతా భావాలే కారణం. వ్యక్తిలో అలజడి తగ్గించడం ఎలా? యుగాలుగా మహర్షులు కూడా ఈ ప్రశ్నకు సమాధానం కోసమే నిరంతరం అన్వేషణ సాగించారు.**

అలజడి అనేది విశ్వవ్యాప్తంగా ఉంది. దాన్ని తగ్గించగలిగినప్పుడే మనిషి ప్రశాంతంగా ఆలోచించగలుగుతాడు. అందుకే

సుదర్శన క్రియ, ఆర్ట్ ఆఫ్ లివింగ్‌కు శ్రీకారం చుట్టాను. శ్వాసను క్రమబద్ధం చేయడం ద్వారా మనలో చెలరేగే అలజ డిని చాలా వరకు అదుపు చేయవచ్చు. అలా శ్వాసను క్రమ బద్ధం చేసే విధానినికి సుదర్శన క్రియ అని పేరుపెట్టాను. ఈ ప్రక్రియకు ప్రపంచవ్యాప్తంగా ప్రజలు నీరాజనాలు పట్టారు. కోట్లాది మంది ప్రజలు సుదర్శన క్రియ ద్వారా అద్భుతమైన ఫలితాలు అందుకుంటున్నారు. ఆర్ట్ ఆఫ్ లివింగ్‌లో సుదర్శన క్రియ ప్రధానమైంది. నేటికీ ప్రపంచంలోనే అనేక దేశాల ప్రజలు సుదర్శన క్రియ ద్వారా సాంత్వన పొందుతున్నారు. మన మనసును శరీరాన్ని శ్వాస అనుసంధానం చేస్తుంది. శ్వాసను నియంత్రించగలిగితే మనసు ప్రశాంతంగా ఉంటుంది. ప్రశాంతంగా ఉన్న మనసు తన గురించి మాత్రమే కాకుండా ఎదుటి వారి సంక్షేమం గురించి కూడా ఆలోచిస్తుంది. ప్రజల్లో ప్రేమ, సౌభ్రాతృత్వాన్ని పెంపొందించి, వసుధైక కుటుంబ భావన కల్పించాలంటే సుదర్శన క్రియను విశ్వ వ్యాప్తం చేయడమే మార్గంగా భావించాను. ఆ ప్రయత్నంలో చాలా వరకు సఫలం అయ్యాను. అయితే విశ్వమానవ కల్యాణా నికి ఇదొక్కటే సరిపోదు. ప్రస్తుతం ప్రపంచమంతా అలజడితో నిండిపోతున్నది. కాశ్మీర్ మొదలుకుని సోమాలి వరకు అంతటా సంక్షోభమే. అకలి, దారిద్ర్యం.. వీటికి తోడు ప్రకృతి విపత్తులు మనిషిని సంక్షోభంలోకి నెడుతున్నాయి. ఇలా బాధపడుతున్న వారికి ఊరట కలిగించాలి. ఆ తరువాతే వారు మనసుకు ప్రశాంతత కలిగించే మార్గాన్ని అనుసరించగలరు. అందుకే ప్రపంచవ్యాప్తంగా సేవా కార్యక్రమాల్ని ప్రారంభించాం. బాధతో కుమిలిపోతున్న మనసుకు రవ్వంత శాంతి కలిగిం చడం కూడా చాలా గొప్ప విషయం అది సేవ ద్వారా మాత్రమే సాధ్యం అవుతుంది.

**ప్రపంచంలోని అనేక దేశాల ప్రజలు సుదర్శన క్రియ ద్వారా సాంత్వన పొందుతున్నారు.**

**బాధతో కుమిలి పోతున్న మనసుకు రవ్వంత శాంతి కలి గించడం కూడా గొప్ప విషయం. అది సేవ ద్వారా మాత్రమే సాధ్యం.**

---

నేను ఎవరు అని ప్రశ్నించి ఆ ప్రశ్నకు పరిష్కారం కోసం అన్వేషించడం ఆధ్యాత్మిక చింతన అవుతుంది. అది ఏమిటి ? అనే ప్రశ్న శాస్త్రీయ స్పృహను పెంపొందిస్తుంది. సమాజంలో శాంతి నిండాలంటే ఈ రెండూ అవసరమే. అందుకే శాస్త్రీయ స్పృహతో పాటు ఆధ్యాత్మిక చింతనను పెంపొందించే ప్రయత్నం చేస్తున్నాం. అవినీతి, హింస పెరిగిపోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో విలువలు, మానవత పట్ల విశ్వాసం ప్రజల్లో సడలి పోతున్నది. వారిలో విశ్వాసాన్ని తిరిగి పెంపొందించాలంటే

> **సనాతన ధర్మంలో, సనాతన విద్యా విధానంలో భాగంగా ఉండేవి. వాటికి దూరం కావడం మన చేసిన మొదటి తప్పిదం.**

ఆధ్యాత్మిక మార్గమే శరణ్యం. మనిషిలో ఆధ్యాత్మిక చింతన పెరిగినప్పుడే పరస్పర విశ్వాసం పెరుగుతుంది. విశ్వశాంతికి అదొక్కటే మార్గం. ప్రపంచ వ్యాప్తంగా ఉన్న ఆర్ట్ ఆఫ్ లివింగ్ శాఖల ద్వారా అదే పని చేస్తున్నాం. నిజానికి మన దేశంలో ఆధ్యాత్మిక విద్యాబోధన సన్నగిల్లడమే చాలా సమస్యలకు మూలం. యోగ, ధ్యానాలు, ఆధ్యాత్మిక చింతన మన సనాతన ధర్మంలో, సనాతన విద్యా విధానంలో భాగంగా ఉండేవి. వాటికి దూరం కావడం మన చేసిన మొదటి తప్పిదం. అధ్యాత్మిక విద్యను ప్రజలకు అందించగలిగితే సమాజం ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు పరిష్కారం కనుగొనే అవకాశం ఉంటుంది. అసలు చాలా సమస్యలు రాకుండా నివారించుకునేందుకు ఆధ్యాత్మిక విద్యా విధానమే మార్గం.

ఆధ్యాత్మిక మార్గం – సేవాభావాల మధ్య విడదీయలేని అనుబంధం ఉంది. భారతీయ సనాతన ధర్మంతో పాటు ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అన్ని ధర్మాలూ సేవాభావాన్ని ప్రబోధించాయి. కష్టంలో ఉన్న వారిని ఆదుకోవాలనే స్పృహ ఈ కాలం యువతలో పెరగడం చాలా సంతోషం కలిగిస్తున్నది. సేవ ద్వారా లభించే గొప్ప సంతృప్తిని యువత ఆస్వాదిస్తున్నది. సత్సంగాల్లో పాల్గొనే యువతను నేను దగ్గరగా గమనిస్తున్నాను. రెండు మూడు దశాబ్దాలుగా యువత ఆలోచనా ధోరణిలో అనూహ్యమైన మార్పు వస్తున్నది. విలువలతో కూడిన జీవితాన్ని సాగించినప్పుడే శాశ్వతానందం పొందే వీలుంటుంది. భారతీయ ధర్మం ఇదే విషయాన్ని యుగాలుగా చెబుతున్నది. కొన్ని దశాబ్దాలుగా ఆ ధర్మానికి మనం దూరమై వ్యక్తివాదం, హింసావాదాల వైపు పయనించాం. సర్వే జనాః సుఖినో భవంతు అని ప్రతిరోజూ సంకల్పం చెప్పుకొనే సంస్కృతి మనది. ఈ కాలం యువతలో ధార్మిక చింతన, విలువల్ని నింపగలిగితే భారతదేశం ప్రపంచ దేశాలకు మళ్లీ ఆదర్శంగా మారుతుందనడం నిస్సందేహం.

> **కష్టంలో ఉన్న వారిని ఆదుకోవాలనే స్పృహ ఈకాలం యువతలో పెరగడం చాలా సంతోషం కలిగిస్తున్నది.**



జ్యోతిష విద్యార్థులు, అభిమానులకు
ఆధునిక జ్యోతిషాన్ని సులభశైలిలో అందించే ఓ చిరు ప్రయత్నం

# నవ్య జ్యోతిషం

సాయన జ్యోతిష సూత్రాలుతో పాటు 30 మంది ప్రముఖుల
జాతకాల విశ్లేషణలతో కూడిన ఈ పుస్తకం విడుదలైంది.
నవ్య వారపత్రికలో రెండు సంవత్సరాల పాటు
ప్రముఖుల జాతకాలను విశ్లేషించిన
**జ్యోతిష పండితులు శ్రీ టి.కె.శాస్త్రి (తిప్పావఝుల కుమార్)**
రచించిన ఈ పుస్తకం కాపీల కోసం ..
తిప్పావఝుల కుమార్
ప్లాట్ నెం. 39, ఇంద్రపురి రైల్వేకాలనీ
వెస్ట్ మారేడ్ పల్లి, సికింద్రాబాద్ –26
**9985442000, 040–27717250**
మరిన్ని జ్యోతిష విశేషాల కోసం
www.astrologyicon.com చూడండి

*This book sponsered by*



శ్రీ కామిరెడ్డి ముని రామిరెడ్డి

శ్రీమతి కామిరెడ్డి ఇందిరమ్మ

నెల్లబల్లి గ్రామం, నెల్లూరు జిల్లా



NIVEDANA



## నా ప్రయాణం..

మంగళగిరి ఓరియంటల్ పాఠశాల, వి.టి.జె.ఎం. డిగ్రీ కళాశాలల్లో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణత. నాగార్జునా విశ్వవిద్యాలయంలో ఎం.బి.ఎ. చేసినా మార్కెటింగ్ ఉద్యోగం మీద మనసు నిలువలేదు. పుస్తక పఠనం అంటే ఆసక్తి. తెలుగు భాషపై మమకారం. ఈ రెండూ నన్ను జర్నలిజం వైపు నడిపించాయి. పాతికేళ్లుగా ఆంధ్రజ్యోతితోనే అనుబంధం. ప్రస్తుతం ఫీచర్స్ విభాగంలో న్యూస్ ఎడిటర్‌గా ఉద్యోగం. వృత్తి రీత్యా ఎందరో ప్రముఖులను కలవడం నా భాగ్యం. 2004 – 2008 సంవత్సరాల మధ్య ఆంధ్రజ్యోతిలో ప్రచురితమైన 'నివేదన' ఫీచర్ బాధ్యతలు నిర్వర్తించడం ఓ దివ్యమైన అనుభవం. ఆ క్రమంలో ప్రముఖుల ఆధ్యాత్మిక అనుభవాలను ఇంటర్వ్యూల రూపంలో సేకరించాను. ఆధ్యాత్మిక, రాజకీయ, వ్యాపార రంగాలకు చెందిన 81 మంది ప్రముఖుల ఆధ్యాత్మిక అనుభవాల సంకలనం ఈ పుస్తకం. సత్సాంగత్యం నేను చేసుకున్న సుకృతం. వారి సాహచర్యంలో హిమాలయాల సౌందర్యాలను, మానస సరోవరాలను, అనంత జలధి అందాలను చూశాను. త్వరలో ఆ అనుభవాలకూ అక్షరరూపం ఇవ్వాలని సంకల్పం.

• **తిప్పావఝుల కుమార్**

